# మరకత మంజూష

శ్రీ బాలాంత్రపు వేంకట్రావు
గారి గ్రంధరచన.

కవిరాజహంస – కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు
గ్రంధసంపాదకులు

పునర్ముద్రణ
1 మార్చి 1956
ముఖచిత్రము
శ్రీ వడ్డాది పాపయ్య
అచ్చు : : : : :
రాజేశ్వరి ప్రెస్,
రాజమండ్రి.

# మరకత మంజూష

## మొదటి ప్రకరణము

ప్రఫుల్లా ! జాగరూకతతో నీతపకరమును బరిగ్రహింపుము. ఈపుష్పమాల నీతని మెడలో వేయుము. సుముహూర్తము దాటిపోవుచున్నది—అయ్యా ! కాంతనాథా ! నీవీమెను ధర్మపత్నిగాఁ బరిగ్రహించుచున్నావా ? ”

“ ఆహా ! మనఃపూర్వకముగా ”

“ ప్రఫుల్లా ! నీవీతనిని పతిగా వరించుచుంటివా ? ”

“ అవును. నేనందులకంగీకరించుచున్నాను—మనము ముందుగ వైద్యునిబిలిపించి చూపించుటమంచిదికాదా ? ”

“ సరియే. ఇప్పుడిఁక నాలసింపరాదు. ఇదియే ముహూర్తము:— “ అయంముహూర్తస్సుముహూర్తోస్తు ”—అని యా నూతనదంపతుల

...

ఆ నిశాసమయమున జరిగిన వివాహమహోత్సవమునందు సౌమ్యస్వరూపుఁడగు చంద్రుఁడు దివ్యసాక్షియగు యజ్ఞేశ్వరుఁడుగా నుండెను—తారలు లాజాక్షతలు—వసంతకాలమునందలి యామోక మామిడిచిగుళ్లు తోరణములు—ఫలభరితములగు రంభాస్తంభములచే నొప్పు ప్రదేశమే మనోహరమంటపము—...లమ్మ...స్వరములే మధురమంగళగానములు—...లతో...కలిగి సుందరముగనుండెను. అఖిలమును శోభా.

కాంత : మనోహారిణీ! ఒక్కముద్దొసంగుము!—అని చెప్పుచుఁ గన్నులుమూసెను.

ప్రభు : అయ్యో ! కాంతనాథుఁడు స్వర్గస్థుఁడు కాలేదుగదా !

శాంతమగు నాయర్ధరాత్రిసమయమున హృదయమును బగుల్చు నీదీనధ్వని బయలుదేరెను. అప్పుడక్కడకుఁ బరుగెత్తుకొని వచ్చుచున్న బండిచప్పుడు, గుఱ్ఱముల కాలిడెక్కలచప్పుడులతోఁ జేరి మఱింతయధిక మగుటచే, నేడ్పుసద్దునిలిచిపోయెను. నదీతీరమునందున్న యాయుద్యాన మునకు శకటము వచ్చినిలిచెను. బండితలుపులను తెఱచిరి. పిమ్మట చంద్రుఁడు మబ్బులమాటునకుఁ బోయి దాఁగికొనియెను. అందువలన వెన్నెలకాంతి మాసిపోయెను. మసకమసకగానుండెను. ఏదియును స్ఫుటముగాఁ గనఁబడుటలేదు. ఇంతలోఁ బుర్యావశమున, రెండునిమిషములకు సుధాకరుఁడు బైటికివచ్చి ప్రకాశింపసాగెను. అశ్వశకటములో ముగ్గురు పురుషులును, ఒక స్త్రీయును జేరియుండిరి. ఆ స్త్రీ లేఁతప్రాయముగలది. ఉత్తమమగు నీలవర్ణపు రేష్మన్ చీరను మిగులసొగసుగాఁ గట్టుకొని యుండెను. ఆమె కోమలకేశపాశము చెదరి [illegible] బడి వ్రేలాడుచుండెను. ముఖకమలమించుక [illegible]మై యుండెను. ఆమె విహ్వలచిత్తయై యొకపురుషవ్యక్తిని జూచుచుండెను. [illegible] పురుషు లిరువురును మొదటిపురుషుని రెండుచేతులను పట్టుకొని యుండిరి. ఆ మొదటివ్యక్తి—ఆయువకుఁడు మరణించుచున్నాఁడను మాట వాస్తవము. ఆయువతి యాతని [illegible] ఆతని [illegible] మంచు[illegible] బడియ[illegible] కన్నుగ్రుడ్లు [illegible] [illegible] పోయెను. మాట లో[illegible] బడి

పొట్టివాఁడు : ఆమె యింపులకొప్పుకొనునా ? లేక మన తోడ నేవత్తునను నేమో ?

పెద్ద : అట్లుకాదు. ఆమె మనమాట నతిక్రమింపఁజాలదు.

ఇప్పు డా బాలికకన్నులు తుడిచి పొట్టివానివైపునకుఁ జూడ సాగెను. అతఁడు తనముఖమును మరియొకవైపునకుఁ ద్రిప్పుకొనియెను. ఆమె మెల్లగ బలమును తెచ్చుకొని మెత్తపైఁ గూర్చుండి కాంతనాథుని చేతివ్రేళ్లను సవరించుచు “ అయ్యో ! కాంతనాథా ! ప్రఫుల్ల నిన్నెం తగాఁ ప్రేమించుచున్నదో ! ” అని యనేకవిధముల నాపోవుచు, నెడమచేతియందు గడ్డమును జేర్చుకొని కన్నీరు విడుచుచు హృదయము పగులునట్లుగా విలపింపసాగెను. ఆమె యేడ్చియేడ్చి తుదకు “ ఇప్పుడు మీ రెక్కడకుఁ బోవుచున్నారు ? ” అనియెను.

పెద్దవాఁడు : నేను దానిని గూర్చియే యోచించుచున్నాఁడను. నీయాక్రోదనమువలన నాకేమియును దోఁచుటలేదు. ప్రస్తుతస్థితి యేమియును బాగుగలేదు. మాయొద్ద శవమున్నది. ఎవ్వరైనను మమ్ములను సమీపించి యడిగినచో మేమేమియును జెప్పఁజాలము...... ఈశవమును మేము మానిలయమునకు దీసికొనిపోయెదము. నీవు నీ యింటికిఁ బొమ్ము. నేనుదయమున వచ్చెదను. అప్పుడు మనము విషయమునుగూర్చి మాటాడుదము.

ప్రఫు : నేను కాంతనాథుని ధర్మపత్నినిగాదా ! [illegible] నైనఁ గన్నార జూచుకొనఁగూడదా ? ఈతనికి [illegible] తెలిసియున్నచో నేనితనిని విడిచియుందునా ?

పెద : ఔనమ్మా ! [illegible] థుని [illegible] కాని, నే [illegible] నుము. [illegible] మేలు [illegible] నాయిష్ట [illegible]

ప్రఫు : మీరు నన్నుఁగూడ మీతోఁ దీసికొనిపొండు. నేనేమియును గందరగోళము చేయఁబోను.

పెద్ద : ఊహు—వద్దు. వద్దు. నీవింటికిఁబొమ్ము. ఓరీ ! బండిని నిలుపకుము !

ఆయశ్వశకట ముద్యానలతామంటపద్వారమునొద్ద నిలిచెను. ఆ పెద్దమనుష్యుఁడు చటాలున నాయబలనెత్తి క్రిందికి దింపివైచి వేగముగ బండితలుపులను మూసికొనియెను. తుదకామె యొక్కమాట చెప్పుటకైన నవకాశ మీయలేదు. అశ్వములు వాయువేగముతో ముందునకుఁ బోయెను.

ఆ బాలిక కొంతసేపటివఱకు విహ్వలచిత్తయై నిశ్చేష్టయై యుండెను. పిమ్మట నించుక ధైర్యము తెచ్చుకొని చూచుసరికి బండి చాలదూరమున నగపడుచుండెను. ఇంకదానిని వెన్నంటిపోవుట వ్యర్థమని యామె తెలిసికొనియెను. ఆహా ! ఏమి క్రూరకృత్యము ! ఎంతపని జరిగినది ! ఇట్టికక్కసమైనఁగలదా ?—అని యనుకొనుచు నామె ముందునకు నడవసాగెను. ఆ తెల్లవాఱుజామునఁ బ్రకృతిశాంతమై యుండెను.

ఆహా ! ప్రఫుల్లా !—కాంతనాథపత్నీ ! వివాహము న్యాయానుమతముగ జరుపుటలో నీవీ మహాసాహస నాటకరంగమునఁ బ్రధాన పాత్రవై ధైర్యవతి ననిపించుకొని యుత్తమ పదవినందితివి !

ఆ స్థలమున కామె యిల్లంత దూరములో లేదు. అదృష్టవశమున నప్పుడెవ్వరును నామెనుజూడలేదు. కాని, మస్తిష్కముడికిపోవుటచే నామెకు నిద్రపట్టలేదు. ఆమెమనస్సు నెట్టి[illegible]లను ? ప్రాణకాంతుని యకాలమరణముచేఁ గలిగిన [illegible]తలఁపులతోఁ [illegible]కాశము నీయలేదు. ఆరాత్రి యామె పాలిటికి [illegible]మైన కాళరాత్రిగా

నుండెను. ఆమెకును సుఖమునకును నడుమ నొకమరణము కాలు వెట్టెను. పాపమామె యేక కాలమునందే పెండ్లికూతురును విధవయునుగూడఁ గావలసివచ్చెను. ఆమెపిచ్చిదానివలె నిటునటుదిరుగుచుఁ జేతులు పిసికికొనసాగెను. చిన్నగదిలోని మేజాపైపునకుఁ జూచునప్పటి కామెకు దానిపై నొక చిన్నపెట్టెయును, ఒక యుత్తరమునగపడెను. ప్రఫుల్ల యా యుత్తరమును విప్పిచూచి "ఆహా! ఇవి కాంతనాథుని హస్తాక్షరములె" యని యా యుత్తరమును వేగముగ నొకసారి చదువుకొని, హృదయమునఁబుట్టిన యావేగముఁ గాపఁజాలక మరల గట్టిగ నిట్లని చదువఁదొడంగెను.

"మోహనాంగీ! ప్రఫుల్లా! నేనుదీనితో నమూల్యమగు నొక మరకతమంజూషను బంపియున్నాఁడను. దీనిలోఁ జాలమహిమ యున్నది. నేను దీనిని పంపుట యెవ్వరికిని దెలియదు. నేను మరణించిన యొక సంవత్సరమునకుఁ బిమ్మట నీ పెట్టెను తెఱవుము.

నీ ప్రాణకాంతుఁడు కాంతనాథుఁడు"

చదువుటను ముగించినపిమ్మటఁ బ్రఫుల్ల చకితయై "ఆహా! ఈ యుత్తరము కాంతనాథుని యొద్దనుండియే వచ్చినది. అతఁడు నాకిం దీనిని పంపించుటకు హేతువేమై యుండవచ్చును? నేనకపాయము సంభవించునని యాతనికి ముందుగనే తెలిసియున్నదా? ఓహో! ఇప్పుడు తెలిసినది! కాంతుని—నా కాంతుని బలవంతముగ హత్య చేసినారు" అనుకొనియెను.

"ఇది భయంకరమైనదే. కాని, నా యూహాయుక్తమైనదియే. ఈ నేరముపట్టు[illegible]నా హత్యాకారులలో నొకఁడును దప్పించుకొనిపోఁజా[illegible]క్యము"—ఉదయమయ్యెను. ఆ విచిత్ర విషాదా[illegible]మా యువపురిలో నొకఁడును లేఁడు.

వారిలో నొక్కని పేరుగూడ నామెకుఁ దెలియదు. వారినివాసస్థలమంతకు మును పేయెఱుంగదు. ఆమెచాల బెదరిపోయెను. తానుమోసపోయితి నని యామెయనుకొనసాగెను. ఇప్పుడీమె కన్యయా ? కాక విధవయా ? వివాహము శాస్త్రోక్తముగా నెఱవేఱినదా ? కాంతనాథుని యునికి తెలియకపోవుటచే నామె యందునుగూర్చి యేమియును విచారింప లేదు. తుదకీవిషయమున నెవ్వరైన నొకయనుభవశాలి చెప్పినట్లు నడచుకొనవలయునని ప్రఫుల్ల నిర్ధారణము చేసికొనియెను. ఆమె సహోదరుఁడగు వారణలాలైన నూరిలో లేఁడు. ఉన్నను నీ విచిత్రవిషయము నాతనికంటె విశేషానుభవశాలురనే యడిగి తెలిసికొనవలయును.

ఆమె యీ విధముగ యోజించుచుండఁగా బరిచారికవచ్చి యెవ్వఁడో యొక వృద్ధుఁడు మిమ్ముఁజూచుటకు వచ్చియున్నాఁడని చెప్పెను. ప్రఫుల్ల మేఁడమీఁదినుండి క్రిందికిదిగివచ్చి పటకుడ్యము వెనుక నిలిచి చూచెను. ఆపురుషుఁడు చాలనున్నతమైనవాఁడు. ఆతనికి మీసములులేవు. ఆతఁడు వెనుకటిదినముననే క్షురకర్మ చేయించుకొనియెను. ఆతనిదృష్టియును చర్యయును మిగులచమత్కారముగనుండెను. ఆతఁడు వృషకాయుఁడు. ఆతఁడొక లాయరువలె నగపడుచుండెను.

పరస్పరోపచారోక్తులు జరిగినపిమ్మట ప్రఫుల్ల యాతనినిగూర్చి విచారింపఁగా నాతఁడు "నాపేరు ఆదివిశలమూర్తి. నన్ను యజమాన విశలుఁడనియును బిలిచెదరు. నేనొక పత్త్రేదారుఁడను" (అపనాధ రహస్య పరిశోధకుఁడను.) అని చెప్పునప్పటికిఁ బ్రఫుల్ల విశలుని రాకకు మిగుల నానందించెను. ఈవిశలమూర్తి మిగుల [illegible]. ఆ ప్రాంతము నందలి యకార్య పరులందఱకును నీతని [illegible] జేసినవాస్వప్నము. ప్రఫుల్ల వినయముతో "అయ్యా ! [illegible] దయచేయుట

కేమికారణము ?" అని యడిగెను. అంతులకు విశలుఁడు కొంత సమీపమునకువచ్చి కనికరముతోఁ బ్రఫుల్ల ముఖమును దిలకించుచు "బిడ్డా ! నీకుఁ బ్రాణాపాయము కలుగునట్లున్నది. నీవు జాగరూకురాలవై యుండవలయునని నిన్ను హెచ్చరించుటకు వచ్చియున్నాను." అనియెను.

## రెండవ ప్రకరణము

విశలమూర్తి మాటలను వినుసరికిఁ బ్రఫుల్లహృదయము పగిలెను. ఆమె రెండునిమిషములవఱకును స్తబ్ధభావముతో నిలుచుండి పిమ్మటనించుక చైతన్యముఁ గొంది వడఁకుచును గద్గద స్వరముతో "అనఁగానేమి ? నన్నెవ్వరైనఁ జంపవలయునని యోజించు చున్నారా ? వారెవ్వరు ? నేనెవ్వరికి నెట్టికీడును జేసియెఱుంగనే ! మీమాటలు వినుటచే నాకు మతిపోయినట్లున్నది." అనియెను.

విశ : అమ్మా ! ప్రఫుల్లా ! ఈ సేమమునుగూర్చి యింకను నాకంతగాఁ దెలియదు. ఇరువురొకచోట మాటాడుకొనుచున్న దానిసంక్షేపముగా నాచెవిలోఁ బడినది. నీయొద్దనమూల్యమగు నొక మరకతమంజూష యున్నమాట నిజమేనా ?

ప్రఫు : అవును. ఉన్నది.

విశ : నిన్నరాత్రి నేనొకనేరమును బట్టుకొనుటకై తిరుగు చుంటిని. అప్పుడిచ్చటకు స్వల్పదూరమునందు యిద్దరుమనుష్యులను జూచితిని. ఒకఁడు [illegible]డగరి. మఱియొకఁడు పొట్టి. వారొండొరు లేకాంతము [illegible]యును ననుకూలించినది. నిదియేమన చేఁజిక్కినది" అని [illegible]నుట సమీపస్థుఁడనగు నాకు బాగుగ

వినఁబడినది. దానిమూలమును గూర్చి తెలిసికొనుటకు నేను మిగులఁ గుతూహలుఁడనైతిని. నేనప్పుడొక కూలివాని వేషమును ధరించి యుంటిని. నేనింకను వారిని సమీపించుసరికి వారి ప్రసంగములో నీపేరు వినఁబడినది. మఱియు, పచ్చపెట్టెను పొందవలెనన్నచో ముందుగఁ బ్రఫుల్లను సంహరింపవలయును" అని వారనుకొనుచుండుటను వింటిని. వారు పెద్దమనుష్యులు ధరించుదుస్తులను ధరించియుండిరి. వారు నాకుఁ గేవలమును గ్రొత్తవారు. నీవలన నిజమైనసంగతి తెలియునని భావించి వచ్చితిని. దీనినిబట్టి యోజింపఁగా నీకు శత్రువు లున్నారనుమాట వాస్తవము. ఆ యిద్దఱిలో నెవ్వరినైన నీ వెఱుఁగుదువా ?

ప్రఫు : విఠలమూర్తీ! వారిద్దఱినెఱుంగుదును. పేరులు మాత్రము నాకుఁ దెలియవు. ఇప్పుడొక యాశ్చర్యకృత్యము జరగినది. నీవు దయయుంచి విన్నచో నాకథనే చెప్పకొనుచున్నాను. నా కష్టములను దీర్చుటకు నీవు సాయపడవలయును.

విఠ : కానిమ్ము. అమ్మా! సంతోషపూర్వకముగ నీకు సాహాయ్యము చేయుదును.

ఇప్పుడు ప్రఫుల్ల శాంతచిత్తయయ్యెను. ఆమె ముఖమించుక కళావిహీనమైయుండెను. ఆమె తనసుందరాలకములను కరాంగుళులతో సవరించుకొనుచుఁ గొంతసేపటివఱకును మౌనముగాఁ గూర్చుండి యుండెను. తుదకామె తనకథ నీ విధముగాఁ జెప్పఁదొడంగెను.

"నాకథ విచిత్రమైనది. నాకు బుద్ధినిగఱపుటకుఁగాని, సాహాయ్యము చేయుటకుఁగాని వెనుక దిక్కు లేదు. బాల్యమునందే తల్లిదండ్రులు స్వర్గస్థులైరి. సహోదరుఁడు తనమిత్రులతోఁ జేరి యూరూరఁ దిరుగుచుండును. ఆ ప్లబంధువులెవ్వరును సమీపమున లేరు.

అన్నిటికిని నేనొక్కతెనే. నీవే నాకాప్తబంధుడవు. గడచినవత్సరమున వసంతకాలమునందు నేను విహారముకొఱకుఁ జైత్రకమను నారోగ్యస్థానమునకుఁ బోయియుంటిని. అక్కడకు లలిత పట్టణమునుండి ప్రసిద్ధుఁడగు చారుచంద్రుని చిన్నికుమారుఁడగు కాంతినాథుఁడును వచ్చియుండెను. అక్కడ నాతనికిని నాకును నాకస్మికముగఁ బరిచయము కలిగెను. క్రమముగ మా కన్యోన్యమును మైత్రియలవడెను. తుదకు మేమిరువురమును బెండ్లి చేసికొనవలయుననియు, నదియును నా చైత్రమాసమునందే జరుగవలయుననియు, నిశ్చయించుకొంటిమి. కాని, కాంతనాథుని కాతనియూరినుండి తంతివార్త వచ్చుటచేత నాకస్మికముగ నాతఁడక్కడకు బయలుదేరిపోవలసిన వాఁడయ్యెను. పిమ్మటఁ జాలదినములవఱకు నాత. డీ ప్రాంతములకు రానేలేదు. కాని, తప్పకుండ నాతప్పుడప్పు డుత్తరములను మాత్రము వ్రాయుచుండెను. తుదియుత్తరమును జూచినప్పుడు మాత్రము నా హృదయము చాల సంక్షోభమునొందెను. ఆతఁడు ప్రబలమగు వ్యాధిచేఁ బీడితుఁడగుచుండెనని దానివలనఁ దెలియవచ్చెను. ఆ మఱునాఁ డున్నతాకారుఁడొకఁడు నా దగ్గరకువచ్చి తాను కాంతనాథుని పరమాప్తుఁడననియు, కాంతనాథుఁ డీనవనగరమునకు వచ్చెననియు నాతఁడు క్షయపీడితుఁడై యున్నాఁడనియు, [illegible] పడుట లేదనియు, నీ కాతనిపై సహజప్రేమమేయున్నచో [illegible]సమయమునందు తిరస్కారభావమునఁ జూడకుండ నాతనిని బెండ్లిచేసికొనవలయుననియు, తానుకాంతనాథుని మిత్రుఁడనేగాక పురోహితుఁడ ననియుఁజెప్పి యొక యుత్తరమును నాచేతికిచ్చెను. ఆ యుత్తరము నా ప్రాణకాంతుఁడగు కాంతనాథుని స్వహస్తలిఖితముగా నగపడుచుండెను. అప్పుడు నేనేమిచేయవలయును ? నేను చాలఁ

దొందరపిల్లను. తుదకు నేను "నిధనమైనను విచారములేదు. ఎట్లయి నను కాంతనాథునిజూచి యాతనికోరిక నీడేర్పవలయును" అని నిశ్చయించుకొని యెక్కడికైనను నెప్పుడువలయునన్న నప్పుడువచ్చి యాతనిని బరిణయముచేసికొందునని వాగ్దానముచేసివైచితిని. నామాట లను విని యానచ్చినయాతఁడు తానును కాంతనాథుఁడును మఱియొక స్నేహితునితోఁగూడి మఱునాఁడు రాత్రి వచ్చెదమనియు, అప్పుడు నేనుకూడ తమతోఁబయలుదేఱవచ్చి యేదైననొక యుద్యానవనమున వివాహము చేసికొనవలయుననియు నిశ్చయపఱచెను. ఆయేర్పాటు ననుసరించి యారాత్రి పండ్రెండుగంటలకుసరిగ మామందిరము నెదుట కొకయశ్వశకటమువచ్చి నిలిచెను. వెనుకటిదినమునవచ్చిన యాతఁడు నేఁడును వచ్చి నన్నుఁ బిలిచెను. నేనాతనితోఁబోయి కాంతనాథునిజూచితిని. అయ్యో!—అతఁడుచాలఁ గృశించియుండెను. ఆతనిముఖమునఁ దొంటికళయే యగపడలేదు. ఇంచుకంతైన శక్తి లేకుండనుండెను. గట్టిగమాటాడుస్థితిలోఁగూడ లేఁడు. ఉచ్ఛ్వాస నిశ్వాసముల యావేగముగ చాలహెచ్చు నుండెను. అయినను నేనాతని మాటాడించిచూచితిని. నేనడిగినవాటికన్నిటికిఁ బ్రత్యుత్తర ముగ నాతఁడు "అంతయును సరిగనేయున్నది. నీపురోహితుఁడు చెప్పినదంతయును వినుము" అని చెప్పెను.

ఈవిధముగాఁ బ్రఫుల్ల తనవివాహవృత్తాంతమును కాంత నాథునిమరణవిషయమును దనకొకతెపేటికవచ్చినవిధమును సవిస్త రముగఁదెలిపి కట్టకడపట "అయ్యా! నాకాంతుని శవము నెచ్చటికిఁ దీసికొనిపోయినదియు, నాయిరువురుపురుషులు నెక్కడ నుండునదియు నాకుఁదెలియదు. నాకు కాంతనాథునితో శాస్త్రోక్త ముగ వివాహమైనట్లు తోఁచుటలేదు. మొత్తముమీఁద నేదో

యొకవిధముగ హత్యజరిగినదనియే తోఁచుచున్నది. నాకుఁ బిచ్చి యెత్తిపోయినది. దీనితత్వమేమో నాకుఁదెలియుటలేదు. అయ్యో! విశలమూర్తీ! నన్నురక్షింపుము" అని యామెగోలపెట్టుచు నాతని పాదములపైఁబడియెను.

మౌనముతో విశలుఁడాకథయంతయునువినుచు నిలిచియుండెను. ఆతనిముఖకమలమునుండి వాత్సల్యరసముతనంతటతానే తొణుకాడు చుండెను. ఆతఁడు ప్రఫుల్లను స్వమానసపుత్రి యనియే భావించుకొని "బిడ్డా! నీవుశంకింపవలదు. నీవుచెప్పినదంతయు నద్భుతముగానున్నది. అయినను, నేను నిన్నునమ్ముచున్నాను. దీనిరహస్యమును దెలిసికొనుట చాలఁగష్టము. కానిమ్ము—ఎట్లయినను పరిశోధించెదను. నీవువిచారింప వలదు. మనశాస్త్రములనుబట్టి పుష్పమాలాసంబంధముచేతనే నీకు వివాహమైనందున నీవు కాంతనాథుని ధర్మపత్నివైయుంటివి. అందులకేమి యును సందేహములేదు. మఱియు నాతనియాస్తికంతకును నీవే యధి కారిణివైతివి. కాని, నీపతియాజ్ఞకు విరోధముగ నీవాపెట్టెను దెఱవరాదు.

ప్రఫు : ఒకవత్సరమువఱకును దెఱవఁగూడదఁట.

విశ : కావచ్చును. కాంతనాథుని యకాలమరణమునుగూర్చి నీ కెవ్వరిమీఁదనైన ననుమానమున్నదా?

ప్ర : ఆసంగతిని జెప్పుట కష్టము. నాకేమియును దెలియదు. వారి గృహమునందలివారివలన దానిని దెలిసికొనవలయును. విశలా! ఈపెట్టె నీయొద్దనుండుట యుత్తమమని తోఁచుచున్నది.

విశ : అమ్మా! నీవు చెప్పినదంతయు నేను చేయుదును. నీవేమో మోసపోయియుంటివి. ఇప్పుడాపురోహితుని, నాతనిమిత్రుని వెదకి కనుఁగొనవలసియున్నది. వారు మాటాడుకొనుచున్నదానిని,

నేనుపొంచియుండినినుట మంచిదేయైనది. బిడ్డా! నీవిప్పుడు మిగుల జాగరూకతతో నుండవలయును. ఒంటిగా వెలుపలకుఁబోవలదు. సదీ! పెట్టెనిమ్ము. నేను బయలుదేరిపోవలయును.

ప్రఫుల్ల మరకతమంజూషను దీసికొనివచ్చి యాతనికిచ్చెను. విఠలుఁడు త్వరలో మరల వచ్చెదనని చెప్పి వెడలిపోయెను. విఠలుఁడు తనయాఫీసునకుఁబోయి యాపెట్టెను బల్లపై నుంచి పైమూఁతనుదీసి లోపలనున్న మరకతమంజూషను (పచ్చలపెట్టె) బైకిఁదీసెను. విఠలుఁడు తనపనులలో సాహాయ్యముచేయుటకుఁగాను ననుభవశాలియగు నరేశుఁడను నొకపత్తేదారునుగూడఁ దనయొద్దనుంచుకొనియెను. ఆతనికించుమించుగ నరువదియైదు సంవత్సరముల వయసుండును. అయినను, ఆతఁడిప్పటికిని మిగులశక్తిమంతుఁడును జాలమేధావియునై యుండెను. ఆతఁడు విశాలదేశవాసుఁడు. తనవయఃకాలమున నాతఁడాదేశమునఁ బత్తేదారుఁడుగానుండి విశేషవిఖ్యాతిని సంపాదించి యుండెను. మఱియు నాతఁడొకసారి యీ భూగోళమంతయును దిరిగి వచ్చినవాఁడు. ఆతఁడు స్వవిషయమునుగూర్చి యెవ్వరిముందును డంబముగ ముచ్చటించువాఁడుగాఁడు. తనయజమానుఁడగు విఠలునకుఁదక్క నిక్కడమఱెవ్వరికినినాతనినిగూర్చి తెలియదు. విఠలుఁడు ప్రతికార్యము నందును నరేశునియభిప్రాయమును దీసికొనకుండ నుండుటలేదు. ఈనాఁడును విఠలుఁడు పచ్చలపెట్టె నాతని ముందుఁ బెట్టెను. నరేశుఁడా పెట్టెను బాగుగఁ బరీక్షించిచూచి భయభ్రాంతుఁడై "ఓహో! నేనిదివఱకే దీనినిచూచియున్నాను. ఇది నీకెక్కడనుండివచ్చినది. అబ్బ! ఇది చాలనద్భుతమైనది. ఇదిమహాభయంకరమగుకపటపేటిక. విఠలా! ఇది యనేకులప్రాణముల నీవఱకే యాహుతిఁగొని యున్నది. నాప్రాణమునకును మృత్యుస్వరూపమైనది. విఠలా! విఠలా! దీనిని నాముందునుండి తీసివేయుము.

విత : ఏమి ! నీవు హాస్యమాడుచున్నావా ?

నటే : లేదు లేదు. వితలా ! ఇది యొకకాలమునందు నావశము నందుఁగూడ నున్నదియే.

విత : నీవు భ్రాంతిని పొందుచున్నావేమో ? ఇట్టి విచిత్రవస్తువొకటి దానిని నీవు చూచియుండవచ్చును.

నటే : అట్లుకాదు. ఇది స్వల్పకాలమునకుముందు మాదేశస్థుఁడగు చారుచంద్రునియొద్ద నుండెను. అప్పుడు దీనికిఁ జాలమంది జనులు బలియైరి.

వితలుఁడు ప్రఫుల్ల వృత్తాంతమును మొదటినుండియును జెప్పి ముగించినపిమ్మట " అయ్యా ! ఇప్పుడు దీనివిషయమున నీకుఁ దెలిసిన దంతయును జెప్పుము. " అనియెను.

నటేశుఁడు సమస్తవృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని " వితలా ! వినుము. ఇప్పటికి నలువదివత్సరముల క్రిందటఁ జారుచంద్రుని ప్రపితామహుఁడు మళయాళమునకుఁబోయి యక్కడ యక్షిణీవిద్య, ఇంద్రజాలము, మహేంద్రజాలము, మొదలగువానిని నేర్చుకొని వచ్చెను. తుదకాతఁడు మనుష్యులను మృగములుగాను, పక్షులుగాను గూడఁ జేయఁగలవాఁడై యుండెను. అప్పుడాతని కెనుబది సంవత్సరముల వయస్సఁట. అయినను ముప్పదిసంవత్సరముల వయసుగల వానివలెఁ గనఁబడుచుండెనఁట. అక్కడనుండి నీలగిరి ప్రాంతములకుఁ బోయి యడవిమనుష్యులతోఁ జాలకాలముండి వారినుండి కూడ ననేకముఖ్యవిషయములను నేర్చికొనుటయేగాక, వారిలో నొక మంత్రగత్తెను వివాహముచేసికొనియెనఁట. ఒకనాఁ డాతఁడాకస్మికముగ నా యడవియెల్లనుదాటి యీవలకువచ్చి చేరెను. అప్పుడాతఁ

డక్కడనుండి తెచ్చిన యమూల్యనిక్షేపమే యీపచ్చలపెట్టె. దీని నొక మునీశ్వరుఁ డాతనికనుగ్రహముతో నొసంగెను. ఆతఁడా విధముగా బయలుదేరి వచ్చినపిమ్మట నాయడవిమనుష్యు లాతని నెల్లదిక్కులను వెదకిరఁట. చారుచంద్రుని ప్రపితామహుఁడు తన గ్రామమునొద్దనున్న యొకవనమునం దాశ్రమమేర్పఱచుకొని యుండెను. ఒకనాఁడాతని నెవ్వరో చంపివైచిరి. ఎంతప్రయత్నించినను వారెవ్వరైనదియును తెలియలేదు. ఆతని కాగితములను పరీక్షించి చూడఁగా నొకకాగితముపై నెఱ్ఱసిరాతో నీ మరకతమంజూషను గూర్చిన వృత్తాంతమంతయును, ఇది యిట్టిస్థలము నందున్నదనునదియు, దీనిమహిమయిట్టిదనియును, విశదముగా వ్రాయఁబడియుండెను. పిమ్మట నాతని పుత్త్రుఁడే దీనికి హక్కుదారుఁడై యుండుటచేత నీ పెట్టె నాతఁడు వశపఱచుకొనియెను. ఇదిచేఁజిక్కిన యాఱుమాసముల లోపలనే యాతఁడును చంపఁబడియెను. పిమ్మట నీ పెట్టె యాతని కుమారుని వశమయ్యెను. ఆతనికిఁగూడ వెనుకటివారిగతియే సంభవించెను. పదింబదిగ వారియింటిసేవకులలో జరుగుచున్నహత్యలెవ్వారి వలనఁ జరుగుచున్నదియుఁ గనిపెట్టుటకొఱకు నేను ప్రయత్నింప సాగితిని. నేనాయుద్యోగమునందుండఁగా నెన్నియో సాహసకృత్యములను జేసితిని. ఎట్లెట్టులో యెక్కడనుండియో, యెన్నియోసమాచారములను తెప్పించుకొంటిని. ఏమిచేసినను, ఆ వృత్తాంతమునందు లేశమైనఁ దెలియలేదు. నేనెక్కడకుఁబోయినను నెవ్వరో నా వెనుక నున్నట్లే తోఁచుచుండెడిది. నేను దేనికిని భయపడలేదు. ఒకనాఁ డా వనమునందే నేను సంచరించుచుండఁగా నెవ్వరో నన్ను జొక్కపట్టుకొని లాగినట్లయ్యెను. వెనుకకుఁ దిరిగిచూడఁగా నక్కడనొక బండఱాయి కదలుచున్నట్లగపడెను. నేనక్కడకుఁబోయి దాని నెత్తి

చూచుసరికి దాని క్రింద నీమరకతమంజూష ప్రకాశించుచుండెను దీనిమీఁద మొదట నెఱ్ఱనిమంటయు, పిమ్మటనీలజ్వాలయు, నాపిమ్మట విస్తారమగు పొగయును బయలుదేరెను. ఆవిశేషములను జూచుసరికి నాకుఁ గాలుసేతులు గడగడ వడఁకసాగెను. నేనప్పుడు స్తబ్ధుఁడనై నిలువఁబడిపోయితిని. అనంతరమీపెట్టెమీఁద స్పష్టమగు సువర్ణాక్షరములు కనఁబడసాగెను. "నాయుపాయమును తప్పించుకొన్నవారికి దీర్ఘాయువును, ఇష్టైశ్వర్యములను నేనొసంగెదను" అని వ్రాయఁబడియుండెను. అప్పుడు నాపాదములయొద్ద నొకయుత్తరము పడియుండెను. దానినివిప్పి చూడఁగా నానియందు "ఈపేటికను బడయువాఁడు ఒక వత్సరమువఱకును బ్రదికియున్నచో, దీనిని తెఱవవచ్చును. పిమ్మట నెట్టియుపాయమునులేదు" అని వ్రాయఁబడియుండెను. పిమ్మట నంతయును శాంతమయ్యెను. నేనాపేటికను జేబునందుంచుకొని తెచ్చితిని. ఇది నాయొద్ద నున్నంతవఱకును నాకొక్కనిమిషమైనను మనస్సు స్థిరముగానుండలేదు. నాకు దినదినగండములు, క్షణక్షణ గండములును సంభవించుచుండెను. వాని నన్నిటిని జూచిచూచి విసిఁగి దీనిని నేను. అప్పుడు మృతుఁడైన వనజుని సోదరునకిచ్చివైచి యీనేరమును బరిశోధించుట మానుకొంటిని. అంతేకాక నేనాదేశమునువిడిచి యెట్టి యీదేశమునకువచ్చివైచితిని. ఇటీవల విచారింపఁగా నాతఁడును మఱియిరువురు హక్కుదారులును వెనుకటివారివలెనే చంపఁబడిరని తెలియవచ్చినది. ప్రకృతమునఁ గాంతనాథుని తండ్రి జీవించియున్నాఁడు. అతఁడు బ్రదికియుండఁగనే యీపేటిక కాంతనాథునియొద్ద కెందులకు వచ్చినదో కారణము తెలియకున్నది. పిమ్మట నాతఁడును బ్రదుకలేదు. దీనిమహిమను జూచితివా ?

ఇట్లు చెప్పుచు నటేశుఁడు గడగడ వడఁకసాగెను. అతని ముఖము భయభ్రాంతమై యెఱ్ఱవాఱెను. అతఁడు కేవలమును విహ్వల

చిత్తుఁడై పోయెను. విఠలుఁడది యంతయును విని, నటేశునిజూచుచుఁ గొంతసేపటివఱకు నేమియునుదోఁచక తుదకాతఁడు దృఢప్రతిజ్ఞతో "నటేశా! ఈపెటిక మంచిదైననుసరియే, చెడ్డదైననుసరియే,—ఈ విషయమున, నేను జరుపఁదలఁచుకొన్న వ్యాపారమంతయును నడిపియే తీరెదను. ఇందువలన నేమైనను జరుగనిమ్ము. ఆయనాథబాలికను కాపాడుటకు నేను కంకణముగట్టుకొంటిని. ఈభయభావములను నామనసున కెక్కనీయను. ఇదియంతయును మూఢభక్తివలనఁగలిగిన బెదరుగాని మఱేమియునుగాదు" అనియెను. పిమ్మట నిఁకనొక భయంకరవ్యాపారము జరిగెను.

## మూఁడవ ప్రకరణము

విశలమూర్తియు నా పేటికపై మూఁతనుదీయుటకుఁ జేయి చాచునంతలో నాపెట్టెలోపలినుండి చట్టనపొగ లెగయసాగెను. ఆపత్తేదారు లిరువురును నేమియును దోఁచక విభ్రాంతులై నిలువఁబడిరి. కొన్నినిమిషములవఱకు నాశీసుకట్టడమంతయుఁ జీఁకటులు గ్రమ్మెను. పిమ్మట నా పెట్టెలోపలినుండి యుత్తమప్రకాశకిరణములు వ్యాపింపఁ దొడఁగెను. దానిమధ్యనుండి యక్షరములు కనఁబడసాగెను. మొదట నవియంతస్ఫుటముగా నగపడలేదు. పిమ్మటఁ జూడఁగఁజూడఁగ "నీవు వెదకుము, నేరము దొరకును." అని కనఁబడియెను. కొంచెసే పటు తరువాత మాయమైపోయెను. పొగయును నిలిచిపోయెను. విశలుఁ డామంజూషను మూసివైచి దాని నినుపపెట్టెలోనుంచెను. ఎట్లో తన సాహసము నగపఱచి దీనితత్వమును గనిపెట్టవలయునని యాతఁడు దృఢప్రతిజ్ఞ చేసికొనియెను. తరువాత నేరమును కనిపెట్టుటకై యాతఁడు ప్రవేశించెను. మొదట నాతఁడు శవవాహకులనందఱను జూచి సంగతులను విచారింపఁదొడంగెను. అవి యెందుకనఁగా :—

ఆ కాంతనాథుని శవమును నవనగరసమీపమున నెక్కడ పూడ్చి పెట్టిరనునది మొదట నాతనికిఁ దెలియవలసియుండెను. ఎట్లును

నది యాతనికిఁ దెలియలేదు. తుదకుఁ గాంతనాథుని తండ్రియైన చారుచంద్రునకుఁ దంతిసమాచారమునంపి తెలిపికొనఁగా నాతఁడు "కాంతనాథుఁడు నవనగరమునందుఁ జనిపోయెననియు, ఆతని శవమును పాలపానియను గ్రామశ్మశానమునందు పూడ్చి పెట్టిరని తనకు వార్త వచ్చినదనియుఁ దెలియఁజేసెను.

పిమ్మట విశాలుఁడు పాలపానియనుగ్రామమునకుఁబోయి యచ్చటి జననమరణపట్టికను పరిశీలించిచూడఁగా, కాంతనాథుఁడు చనిపోయిన దినముననే క్షయరోగముచే నక్కడనొకమరణము కలిగినట్లుగ నానవాలు దొరకెను. కాని, యట్లు చనిపోయినవాఁ డొకవంటపూఁటి ముసలిదానియింటఁ జనిపోయెననియుఁ దెలిసెను. విశాలుఁ డాముసలి దానియొద్దకుఁబోయి విచారింపఁగా నామె తానుపూటకూళ్లయిల్లు పెట్టినప్పటినుండియు నెప్పుడు నెవ్వరును దనయింటికివచ్చి మరణింప లేదని తెలియఁజేసెను. అదియునుగాక యా జననమరణములపట్టిక యందు వైద్యునియొక్కయు, వాహకులయొక్కయు చేవ్రాళ్లన్నియు నొకేవిధముగా నుండుటచేత విశాలుని సంశయము మఱింత వృద్ధ మయ్యెను. విశాలుఁడు పత్తేదారియుద్యోగమునకు వచ్చిన యెనిమిది వత్సరములనుండి యేవ్యాపారమునందును నెప్పుడును నిదర్శనములు దొరకుట కింతటికష్టము కలుగలేదు. అయినను నీతఁడు నిరాశతోఁ గూర్చుండలేదు, అక్కడ గోరీలు త్రవ్వుమందు వానినంద జేని నేకాంతముగా విచారించుచుండఁగా, ఆ శవమును పూడ్చినప్పు డిరువురు పురుషులు వచ్చిరనియు, గోరీత్రవ్వువానికి చేతినిండ దక్షిణదొరకినదనియు, శవమును దీసికొనివచ్చిన పెట్టెతోడనే యా శవమును పూడ్చివైచిరనియు, నప్పటినుండియు నిప్పటివఱకెప్పుడును నా యిరువురు పురుషులును నగపడలేదనియుఁ దెలియఁజేసెను.

ఆపురుషులాపాలపానియందలిజనులను మోహపెట్టి యీకృత్యము నెట్లు చేసిరనువిషయమునుగూర్చి యెంతయోజించినను నేమియును మార్గముదొరకలేదు. తుదకు తనయుక్తిశక్తులనువినియోగించి యాశవమును పైకిఁదీయవచ్చునని సర్కారువారినుండి యాజ్ఞాపత్రమును బొంది విఠలుఁడు ప్రఫుల్లను, నటేశుని నక్కడకుఁ బిలిపించుకొనియెను. ఒకనాఁటి తెల్లవారుజామున నీముప్వురును మిత్రుఁడగు నొకవైద్యునితోఁ బోయి యాగోరినిత్రవ్వించి యందలిపెట్టెను పైకిఁదీయించిరి. ప్రఫుల్ల జాగరూకతతోఁ జూచుచుండెను. విఠలుఁ డామెయొద్ద నిలుచుండి యుండెను. మూఁతనుదీసిరి. ప్రఫుల్ల చట్టుననొకకేకవైచి క్రిందఁబడి మూర్ఛిల్లెను. అందఱకును దిగ్భ్రాంతికలిగెను. విఠలుఁడు పరీక్షించి చూడఁగా నాపెట్టెలో బొమ్మరాళ్లుతక్క నింకేమియును లేకపోయెను. విఠలుఁ డూహించునట్లుగనే యిదంతయును మోసమని విస్పష్టముగఁ దెలిసిపోయెను. పిమ్మట నాపెట్టెను మరలనక్కడనే పాతిపెట్టించి వారందఱును వెడలిపోయిరి.

విఠ : అత్యద్భుతముగ మోసముచేసియున్నారు. ఇదంతయును జూడఁగా వారేవియో ప్రబలాపేక్షలలోనై యీకార్యములను జేయు చున్నారనుట నిశ్చయమగుచున్నది.

ప్రఫు : కాంతుని శరీరము నెచ్చటపూడ్చి పెట్టినారు ?

విఠ : అది తెలిసికొనుటయే కష్టముగానున్నది. ఎక్కడనో పాతిపెట్టియే యుందురు. కానిమ్ము. అందులకై విచారింపనక్కఱలేదు. నేఁడుగాకున్న రేపైనను నే నీనేరమును కనిపెట్టితీరుదును. కాంతనాథుని శవము నీపాలపానియందుఁ బూడ్చలేదని తెలిసినది. వారు బహుశః నవనగరియొద్దనే పాతిపెట్టియుండవచ్చును. వారు చాల బెదరియుందురు. కానిచో మొదటనే యింతటిజాగరూకతతో వారుండఁబోరు.

ప్రఫు : వారిట్లెందులకుఁ జేసిరని మీకుఁదోఁచుచున్నది?

విర : వారు గొప్పవగునొక కపటనాటకము నాడుచున్నా రనియే భావించుచున్నాఁడను. కాంతనాథుని మరణమునుండియే వారేదో విశేషఫలమును పొందవలయునని యాసించుచుండవచ్చును. ఆమరణము స్వాభావికమైనదేయైనచో నాశవమును పూడ్చుటకు వారింతగ నాయాసపడవలసిన యవసరములేదు.

ఈవిధముగ మాటాడుకొనుచు నందఱునుదిరిగి నవనగరమునకు వచ్చిచేరిరి. భయంకరమగు నాప్రదర్శనమును జూచినప్పటి నుండియు నతఁడు——ఇఁకముందు విరలునకేమేమియపాయములు సంభవింపనై యున్నవో గదా యని బెదరుచు వడఁకుచుండెను. ఈమరకతమంజూష సంబంధముననే వెనుక తాను పరిశోధనము చేయుచున్నప్పుడు సంపాదించిన యుత్తరములు మొదలగు వానినన్నిఁటిని పైకిఁదీసి విరలున కుపయోగింపవలయునని యొసంగెను.

ప్రఫుల్ల యింటిసమీపమున బలమైనకావలి యుంచఁబడినెను. విరలుఁడాయిరువురు పురుషులమీఁదను నొకకన్నుంచి తిరుగుచుండెను. విరలుఁడెంతజాగరూకుఁడై యున్నను, ఎట్లో యాతని గుట్టంతయు బట్టబయలగుచున్నసంగతి తుదకాతనికిఁ దెలియవచ్చెను. ఈవిధముగ రెండుమాసములు గడచిపోయినవి. ఎట్టియాచూకియును దొరకలేదు. ఈలోపల విరలుఁడు కొన్ని చిన్నచిన్నసాహసకృత్యములను జేసెను. ఒకనాఁడు విరలుఁడింటియొద్దనుండి ఆఫీసునకు వచ్చుసరికిఁ బ్రఫుల్ల సహోదరుఁడైన వారణలాలీతని యాగమనమున కెదురుచూచుచు నాఫీసులోఁ గూర్చుండియుండెను. అదివఱకు విరలుఁడనేకపర్యాయ ములు తమయింటికివచ్చి తనసహోదరి యగు ప్రఫుల్లతో, మాటాడి

పోవుచున్నను, వారణుఁడ దేమనికాని, యీతఁడెందులకునచ్చుచున్నాఁడని కాని, ఒక్కనాఁడైనఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నింపలేదు. వారణుఁడిరువదియైదువత్సరముల తరుణవయస్కుఁడు. చూచుటకుఁ జాలసుందరుఁడుగా నుండును. ఆతఁడెప్పుడును సొగసైనయుడుపులను ధరించుకొనుచుండును. తాను తిరుగుచున్న సమాజమునం దెప్పుడును నాతఁడు గణనీయుఁడుగా నెన్నఁబడుచుండెను. కాని, యీతఁడుద్యోగము మొదలగు పనులుచేయుట తన ఘనతకుఁ గొఱఁతయని యనుకొనుచుండు వివేకవంతుఁడు. ఆతఁడు స్వభావముచేత శాంతచిత్తుఁడు. కాని, నేఁడుమాత్ర మాతని చిత్తసంక్షోభమునకుఁ బారమే లేకుండెను. విశలుఁడు లోపల కాలు పెట్టినతోడనే వారణుఁడు "విశలా! నీకును నా సహోదరి ప్రఫుల్లకును బాగుగఁ బరిచయమున్నదని భావించుచున్నాను. నేను మా యింటియందే మిమ్ముల ననేకపర్యాయములు చూచియున్నాను" అనియెను.

విశ : అవును. ప్రఫుల్లకొఱకు నే నెన్నియో సాహసకృత్యములను జేయుచున్నాఁడను. ఒక రహస్యవిషయమునం దామెకు సదుపదేశము నొసంగియుంటిని.

వార : ఓ! ధనమును రాజకీయనిధి (సేవింగ్సుబ్యాంకి) యందు వేయువిషయమునుగూర్చియా? మంచిది. విశలా! ఇప్పుడు నేను దానికంటె మిగుల ముఖ్యమగు కార్యముకొఱకు వచ్చియున్నాను. మా ప్రఫుల్ల గృహకృత్యములయం దెప్పుడును సంతోషచిత్తయై యుండు స్వభావముకలది. అందువలన నే నేవిషయమును స్వయముగ విచారించుకొన నక్కఱలేకుండెను. ఆ కారణమున నాకొక్కవిషయమును దెలియదు.

విర : నీకేమియును దెలియదా ?

వార : ఓహో ! మఱచితిని ! మఱచితిని ! నీకును, ఆ సంగతి తెలియదు. తెలసినంతవఱకు నేనే నీకుఁజెప్పవలసియున్నది. ఇప్పుడు ప్రఫుల్ల యెక్కడనో మాయమైనది. ఆమె జాడ తెలియుటలేదు.

విర : ఆఁ—ఏమి ?

విరలుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. పిడుగుమొత్తిన వానివలెఁ గుర్చినుండి ముందునకొఱగి యించుక స్పృహఁదెచ్చుకొని తదేక దృష్టితో వారణునివైపునకుఁ జూచుచు నిలువఁబడియెను.

వార : ప్రఫుల్లపోయి మూఁడుదినములైనదఁట. నేనొక వారమునకుఁ బూర్వమే యితరగ్రామమునకుఁబోయి యిప్పుడేవచ్చితిని. ఇంటికివచ్చి చూడఁగాఁ బ్రఫుల్లయగపడలేదు. గృహపరిచారికను విచారింపఁగా నామె "ప్రఫుల్ల వెడలిపోయి మూఁడుదినములైనదనియు, ఆమె యెక్కడనున్నదియుఁ దనకుఁదెలియదనియుఁ జెప్పినది. ఆమె యొకయుత్తరమైన వ్రాసిపోలేదు. నేను మాకుఁబరిచయముగల స్నేహితులయిండ్లకును, ఇరుగుపొరుగువారి యిండ్లకును బోయి చూచితిని. ఆమెజాడ యేమియునునగపడలేదు. అయ్యో ! ఏమైపోయి నదో—ఏమో ? విరలా ! ఎట్లయిన నామెను వెదకికనిపెట్టఁగలవా ?

విర : అయ్యో ! సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించెదను.

వార : ఆమె కేమైనఁ బ్రాణాపాయము సంభవించునని నీకుఁ దోఁచుచున్నదా ?

విర : చెప్పఁజాలను. పరిచారిక యామెను తుదిసారి చూచిన దెప్పుడు ?

వార : సోమవారమురాత్రి యెనిమిది గంటలప్పుడు.

విర : ఆ పరిచారిక యింకేమైన విశేషసంగతులను జెప్పినదా ?

వార : ఉం. ప్రఫుల్ల దివాన్ ఖానాయందుండగూర్చుండి పుస్తకము జదువుచుండఁగా నెవ్వఁడో యొకఁ డొకయుత్తరమును దెచ్చి యిచ్చెనఁట. ప్రఫుల్లయాయుత్తరమును జదువుకొని చిన్నమొగమును జేసికొన్నదఁట. పిమ్మటనామె మంచిచీరనుగట్టుకొని యిట్టిచోటునకుఁ బోవుచున్నానని చెప్పకయే యెక్కడకోపోయినదఁట. అప్పటినుండి యిప్పటివఱకు నామెసంగతియే తెలియలేదు.

విశ : ఆమె యాయుత్తరమును దనతోఁ దీసికొనిపోయినదా?— ఇదిగాక యింకేమైనను జరిగినదా ?

వార : తీసికొనిపోయినదనియు, ఆమఱునాఁ డాగదియంతయు నెవ్వరో వెదకులాడిరనియు బీరువాతలుపులన్నియు తెఱచి, ఉక్కు పెట్టెలను ( **Trunks** ) బ్రద్దలుకొట్టి, శయ్యలను విప్పివైచి యంతయుఁ జెల్లాచెదరుగఁ జేసినారనియుఁజెప్పుచున్నది.

విశ : ఏమైన నపహరింపఁబడినదా ?

వార : ఆమెచెప్పుదానిని బట్టిచూడఁగా నేమియును పోయినట్లుగ పడదు. ప్రఫుల్ల తనయలంకారములనన్నిఁటిని నినుపపెట్టెలో భద్రపఱచి సర్కారు బ్యాంకిలోనుంచియుంచుట మీకుఁ దెలిసియే యుండవచ్చును.

విశ : నీ చెల్లెలికెవ్వరైన విరోధులుండిరని నీకుఁదెలియునా ?

వార : తెలియదు. నాకేమియును దెలియదు. ఇంతవఱకు నేనితరస్థలములలోనే విశేషముగఁ గాలముగడపుచున్నాను.

వారణలా లిట్లుచెప్పి ముగించుసరికి విశలుఁడు సాధ్యమైనంత వఱకు దీనియాచూకిని గనుఁగొనుటకుఁ బ్రయత్నించెద నని చెప్పి యాతనిని బంపివైచెను. పిమ్మట విశలుఁడు ప్రఫుల్లపరిచారికను దనయొద్దకుఁ బిలిపించుకొని యేమేమో ప్రశ్నలను వైచెను. వారణుఁడు

చెప్పినదానికంటె విశేషాంశమేమియు బయలుపడలేదు. కాని, ప్రఫుల్ల కుత్తరమును దెచ్చియిచ్చినవానిని, మరలనెప్పుడైనఁజూచినచో గుర్తింపఁగలనని యాపరిచారిక చెప్పెను. అదియే విశేషాంశముగా నుండెను. వితలునకిందువలన నించుక దారి దొరకినట్లయ్యెను. ఇందు మూలముననే యెన్నో కార్యములను జేయవచ్చునని యనుకొని యాపరిచారికను దనవెంటఁ బెట్టుకొని తానొకవేషమును వైచుకొని నవనగరమునందుఁ బ్రతివీధికిని దిరుగనారంభించెను. తుదకానాఁడుత్తరమును దీసికొనివచ్చి యిచ్చినపిల్లవాని నామె యానవాలుపట్టి చూపించెను. అతఁడు చాలఁ చిన్నవయస్కుఁడు. చాలఁ జురుకైనవాఁడు. మొదట నాతఁడు వీరితో మాటాడుటకుఁగూడ నిష్టపడలేదు. నిర్బంధించియడుగఁగాఁ దాను బ్రఫుల్లయింటి కుత్తరమును దెచ్చియిచ్చుటయే లేదని బొంకెను. కాని, యాపిల్లవాఁడు జరిగినవృత్తాంతమంతయును జెప్పకుంపట కించుకసందేహించి యుత్తరమును దీసికొని యిచ్చినమాట వాస్తవమని యొప్పుకొనియెను.

విత : నీకాయుత్తరము నిచ్చినవారెవ్వరు ?

పిల్ల : అనంతరాయలవీథియందుండు నొకపెద్దమనుష్యుఁడు.

విత : అది యావీథియందెన్నవయిల్లు ?

ఇప్పు డాపిల్లవానికిఁ జాలచిక్కు తటస్థించెను. ఎట్లును తప్పించుకొనిపోవుటకు వలనుగాకపోయెను. పిమ్మట నాతఁడు “ఇదంతయును దెలిసికొనుటవలన మీ కేమిలాభమున్నది ?” అనియెను.

విత : అదంతయు నీకుఁ జెప్పవలసిన యవసరమేమియున్నది ? ఆయింటినెంబరెంతో మాత్రముచెప్పుము. లేనిచో నేను నీకుఁదగిన దండనము చేయించెదను.

అని యీ విధముగా విఠలుఁడు బెదరించి పలుకఁగా, అందుల కాపిల్లవాఁడు భయభ్రాంతుఁడై వేగముగఁ బ్రత్యుత్తరమును జెప్పుచు "అయ్యా! చెప్పినచో మునిఁగిపోవుదునేమో?" అనియెను.

విఠ : నీకేమియును భయములేదు. నిజముచెప్పినచో నీకించు కంతైన నష్టము కలుగకుండ నేను చూచుకొందును. ఆ భారము నామీఁద నుండనిమ్ము.

పిల్ల : అనంతరాయల వీథియందు నె 41 రు గృహాము— అక్కడ కొల్లూరయ్యవారి పూటకూళ్లయిల్లున్నది. ఈసారి మీకిం బాగుగఁ దెలిసినదా?

విఠ : తెలిసినది. నీకుత్తరమిచ్చిన యాతని నీవు బాగుగఁ జూచియున్నావా?

పిల్ల : నేను పరికించిచూడలేదు. నేను లోపలికిఁ బోయినప్పు డాతఁ డందఱితోడను గూడి పేకయాడుచుండెను. ఆతఁడు నాకొక రూపాయి కూలినిచ్చి యీ యుత్తరము నొసంగెను.

విఠ : మరల నాతనిఁజూచినచో నీవు గుర్తింపఁగలవా?

పిల్ల : సాధ్యమైనంతవఱకు యత్నించిచూచెదను.

విఠ : మంచిది. నీవాతనిఁజూపినచో నీకాతఁడిచ్చిన దానికంటె హెచ్చు బహుమానము నిచ్చెదను. నీవు చూపఁగలవా?

పిల్ల : మీ యాజ్ఞాప్రకారమే నడచుకొందును.

విఠలుఁడు తనతోఁగూడ వచ్చిన పరిచారికను వెనుకకు బంపివైచి, యా పిల్లవానిని దీసికొని యా వీథికిఁబోయి చూడఁగా నాయిల్లు ప్రసిద్ధమగునొకద్యూత గృహముగా నగపడెను. విఠలుఁడాపిల్లవానితోఁ జాలసేపొక రహస్యస్థలముననుండి యా యింటిలోనికి వచ్చుచుఁ బోవుచునున్న వారిని జూచుచుండెను. అంతలో నాపిల్లవాఁ డొకనిని జూపించి "ఈతఁడే" అని చెప్పెను. ఆ మనుష్యుఁడు చాలపొడ

గరిగాచుండెను. ఆతఁ డొకపొట్టివానితో నా గృహమునుండి యప్పుడే యీవలకు వచ్చుచుండెను.

విఠలుఁడు వారిని బాగుగ దృష్టించిచూచి హర్షముతోఁ దనకుఁ గార్యసిద్ధియైనట్లే భావించుకొనుచు వెనుకఁ దాను వారినిజూచిన సంగతి జ్ఞప్తికిఁదెచ్చుకొనియెను. ఇంక నెప్పటికిని వారగుఱుతు మఱవరాదని మరలమరల వారిని బరిశీలనముగఁ జూడసాగెను. తానా రాత్రి యెవ్వరినిజూచియుండెనో, ప్రఫుల్ల తన వివాహసంభ్రమమునఁ దనతోఁగూడ నున్నారని యెవ్వరినిగూర్చి చెప్పినదో, ఆ వ్యక్తులు—ఆ పురుషు లిరువురును వీరే—వీరువిఠలుని మనసున సర్వదా నివసించుచున్న వారే—ఆ యున్నతపురుషుఁడే ప్రఫుల్లయొద్దకు వచ్చి తాను పురోహితుఁడనని చెప్పి యామెకుఁ బెండ్లిచేసినవాఁడు—ఆతని పేరు మాధవుఁడు.

విఠలుఁడాపిల్లవానికిఁ దగిన పారితోషికము నిచ్చి యాతనిని బంపివైచి, తాను మారువేషముతోడనేయుండి, యాయిరువురు పురుషుల ననుసరించి వారి వెనుకనే మరల ద్యూతగృహమున కేగెను.

# నాల్గవ ప్రకరణము

ఆపూటకూళ్ల గృహద్వారమునొద్ద లోపలి కితరులు పోకుండఁ గొందఱు కావలిగాయుచుండిరి. వారు క్రొత్తవారి నెవ్వరిని లోపలికిఁ బోనిచ్చుటలేదు. లోపలికిఁబోఁదగినవా రొకగుఱుతును జూపింపవలసియుండెను. ఇదంతయును సంకేతవిధానము— విఠలుఁడీమర్మముల నన్నిటినెఱింగిన ప్రాఁతకాపగుటచే నాతఁడు తోడనే యాగుఱుతునుజూపి యాలసింపకుండ లోపలికిఁబోయెను. పూటకూళ్ల యజమానుఁడగు కొల్లూరయ్య బహుచతురుఁడు— ఆటమర్మమెఱుంగని క్రొత్తవా రెవ్వరైనవచ్చి యాయూటలోఁ బ్రవేశించి హెచ్చుధనము నాజూదములో నొడ్డినప్పుడుమాత్రము తాను వారికిఁ బ్రతికక్షిగానుండి, ఆటగెలుచుచుండుటయేతక్క— తనకంటెఁ జతురులతోనాడి యొకకాసైన నాతఁడోడిపోయి యెఱుంగఁడు. అదిద్యూతగృహమనిగాని, అచ్చటవిడువకుండ నెప్పుడును జూదము నాడుచుందురనిగాని, అదృష్టవశమునఁ బోలీసువారి కిసుమంతయును తెలియదు. ఆకట్టడమునకు మూఁడవయంతస్తునందీ ద్యూతకార్యము నిరాఘాటముగ నిత్యమును జరుగుచుండెను. నేఁడు నదేరీతిగ నక్కడ బ్రతిదినమును వారందఱును జేరి జూదమాడుచుండిరి. ఇప్పుడక్కడ

గొంతమంది స్త్రీలును, బురుషులును, గూడనుండిరి. ఆట చాలరసవంతముగ జరుగుచుండుటచే నక్కడున్న వారందఱును దానిమీఁదనే దృష్టినుంచి సంభ్రమాసక్తులతోఁ జూచుచుండిరి. ఆ కారణమున మన విఠలమూర్తి నెవ్వరును జూడలేదు. అందఱును నాటగాండ్రచుట్టును జేరి యుత్సాహముతోఁ దొంగితొంగిచూచుచుండిరి. విఠలుఁడుకూడ దానినే చూడవలయునను నుత్సాహముతో మునిగాళ్లపై నిలుచుండి వంగి చూచుచుండెను. అతఁడక్కడ నొకమూర్తినిజూచి పరమాశ్చర్యరససముద్రమున మునిఁగిపోయెను. అది ద్యూతకార్యప్రవిష్టయగు నొక స్త్రీవ్యక్తి. ఆమె చేతియందున్న పేకముక్కలనువిప్పి చూచుచుఁ దన ప్రతికక్షితోఁ గొంచ్చుధనమునకుఁ బ్రశ్నవైఁ బ్రశ్నవైచి మాటాడుచు, నడుమనడుమ విఠలునిముఖమునుగూడఁ జూచుచుండెను. ఆమె మలఁచివైచినచంద్రకాంతశిలాప్రతిమవలెఁ బద్మాసనమువైచుకొని కూర్చుండియుండెను. ఆమె మిగులనేర్పరియగు నాటకర్త్రియనియు, నిప్పుడదృష్టదేవత యామెనే వరించియున్నదనియు, నెల్లరును జెప్పుచుండిరి.

మొట్టమొదట విఠలుఁ డావ్యక్తిని బాగుగఁ బరిశీలించి చూడలేదు. క్రమక్రమముగా దగ్గఱకుఁబోయి చూడఁగాఁ దనకుఁ గేవలమామె పరిచితియైనట్లే యగపడెను. ఆ పిమ్మట విఠలుఁడు తనమనస్సునందే "ఇదేమి ! ప్రఫుల్లయా !" అని యనుకొనియెను. ఆతని కీప్రదర్శనము మహాద్భుతముగానుండెను. ప్రఫుల్లయంతటి మానవతి యీద్యూతగృహమునకు, ఈ యీగుండగొయ్యలతోఁ జేరి జూదమాడుటకు రాఁదగినదా ?" అనికూడ యోజింపనేరకపోయెను. మాధవుఁడును, నాటకనిమిత్తుఁడగు నాపొట్టిమనుష్యుఁడును, నామెయొద్దనిలుచుండి

యా యాటసొగసునుజూచుచుఁ దలనల్లాడించుచుండిరి. కన్నులను ద్రిప్పుచుండిరి. పండ్లికిలించుచుండిరి. అప్పుడు తామేమిచేయుచుండిరో వారికే తెలియుటలేదు. ఇఁకనాటలోనున్న వారి సంగతి చెప్పవలసిన దేమున్నది !

“ఆఠీన్ రాణీయైనచో 5000 రూపాయలబేస్తు” అను ధ్వని యామెనోటినుండి వెలువడియెను. దానిని వినినతోడనే నెఱలుచు “అయ్యో ! ఈ కంఠస్వరము ప్రఫుల్లకంఠస్వరముకాదు !” అని గొణుఁగుకొనుచు నొక నిట్టూర్పునువిడిచెను. ఒకే రూపముగల వారలిరువురుండుటయు నసంభవమే — ఈమెనిజముగఁ బ్రఫుల్లయే యైనచో — నంతటిశీలవతియగు నాయువతి యీ జూదగాండ్రతో నెట్లుచేరియుండఁగలదు! ఈ తుదియంశమే చిరలునిమనస్సునకు సంపూర్ణ సంశయమును గలిగించెను.

ఆమె నోటినుండి యీ మాట వెలువడినతోడనే యెల్లరు నూరకుండిరి. అంతయును సద్దణఁగెను. ఆ పేకముక్క లెట్లుపడునో చూడవలయునని యూపిరి విడువకుండనుండు నంతటి దీక్షతో నందఱును నా వైపునకే మిగులఁగౌతూహలముతోఁ జూచుచుండిరి. కొల్లూరయ్య వైపున నాడుచున్న యాతనిముఖము వాడిపోయెను, ముఖముపై నక్కడక్కడ ముత్యములవలెఁ జమటబిందువులు పొడసూపసాగెను. పేకముక్కలను పంచివైచుటయైనది. త్రిప్పుటయునైనది. ఒక నిమిషములో నా స్త్రీదేవత 5000 రూపాయలను సంపాదించెను. కొల్లూరయ్యముఖము కొఱకచ్చువలె నల్లవడిపోయెను. జనులందఱును “బలె ! శాబాస్ ! స్త్రీయైనను చాలనదృష్టవంతురాలు. మంచి చాతుర్యవతి” అని పొగడఁజొచ్చిరి. ఆ స్త్రీ తనకు గెలుపువచ్చినసొమ్ము నోట్లను దీసికొని వానిలో నూరురూపాయలనోటునొకదానికి జిల్లర

నిమ్మని కొల్లూరయ్యనడిగెను. విఠలుఁడు మరల నా కంఠస్వరమును బాగుగ నాలించెను. కాని, యది ప్రఫుల్లకంఠస్వరమువలె నగపడలేదు. ఆమె కంఠస్వరము మృదుమధుర స్వరమైయుండెను. ఈమె కంఠస్వరమో—కేవలమును గర్కశమై పురుషకంఠస్వరమై యుండెను—ఆ నోటునకు కొల్లూరయ్య చిల్లరఁదెచ్చియిచ్చెను. "మాకింకొక యాట కవకాశమిచ్చినచో మేమును మాచేతిమహిమ చూపింపఁ గలము." అని యా పూటకూళ్ల వాఁడనియెను. అందులకామె "ఓహో! ముఖ్యముగ నట్లేకావచ్చును. మఱియొకనాఁ డెప్పుడైనను వచ్చి యెంతసేపాడిన నాడవచ్చును. ఇప్పటికిఁజాలింతము." అని యీ వగలాడి ప్రత్యుత్తరము చెప్పుచు మాధవుఁడు మొదలగువారివైపునకుఁదిరిగి "ఇఁకరండు పోవుదము." అనిలేచి వారితో వెడలి పోయెను.

మాధ : ప్రఫుల్లా! ఈ దినమున నీదేయదృష్టము.

అని, యా పొట్టివానివైపునకుఁదిరిగి "ఓయీ! భాస్కరా! అవునుగాదా?" అనియెను.

భాస్క : ఆహా! సంశయమేమి? నేఁడు మహాలక్ష్మి యీమెను ప్రసన్నురాలై యున్నది.

మాధ : అట్లుకాదు. ఈమె లక్ష్మీస్వరూపురాలే.

భాస్క : అవును. కాకున్న నీమెకీమహిమ యెక్కడనుండి వచ్చినది?

ఆ స్త్రీ వారి ప్రసంగమున కడ్డమువచ్చి "మీ పొగడికలకేమి లెండు. పోదమురండు." అని తీవ్రముగఁబలికెను.

ముగ్గురునుచేరి బయలుదేరిరి. విఠలుఁడు రహస్యముగా వారి వెనుకనే బయలుదేరి పోవుచుండెను.

"మాధవ భాస్కరులిద్దరును నామెను ప్రఫుల్లయని సంబోధించుచున్నారు ! ఈమెరూపమును, నడవడి మొదలగునవి యన్నియు నచ్చముగఁ బ్రఫుల్లనే పోలియున్నవి. కాని, కంఠస్వరముమాత్రము వేఱువిధముగానున్నది" అని విమలుఁడు వితర్కించుకొనుచుండెను.

వారుముగ్గురును బస్తీదొడ్డియొద్దకుఁబోయి యొకగుఱ్ఱపుబండిని నద్దెకు మాటాడుకొని, దానిలోఁగూర్చుండి బయలుదేరిరి. విమలుఁడు గూడ నొకబండి నద్దెకుమాటాడుకొని దానిలోఁగూర్చుండి, బండివానితో నేమియో యేకాంతముగమాటాడి, జాగ్రతగ బండినితోలుమని హెచ్చరించెను. ఆబండివాఁడును మొదటిబండివెనుకనే తనబండిని గూడఁ బోనిచ్చుచుండెను. రెండవబండివాఁడు ముందుబండివారు తన్ను జూడకుండ నుండుటకొఱకు, ఆగుఱ్ఱపుబండి వెనుకనైపుననున్న కిటికీకిఁ దన వస్త్రమునుగట్టెను. ఆనిశాంధకారమున నారెండుబండ్లును వేగముగఁ బోవుచుండెను. మొదటిగుఱ్ఱపుబండి యిట్టిస్థలమున నిలువవలయునను సూచన తెలియఁగనే, విమలుఁడు తనగుఱ్ఱపుబండిని వెనుకకొంచెము దూరములో నాపివైచి, తాను బండిమీఁదిదిగి రహస్యముగ వారున్న చోటునకుఁబోయెను. ఆముగ్గురును బండిమీఁదిదిగి సమీపమునందున్న యొక గృహములోనికిఁ బోయిరి. విమలునకు నిఁకముందు వారివెనుకనే పోవుట యసాధ్యమయ్యెను. అప్పుడు విమలుఁడింటివెలుపలనొక చాటునఁ గూర్చుండెను. అప్పుడక్కడకు గస్తికివచ్చిన పోలీసధికారిని మెల్లగఁ బిలిచి విమలుఁడు విచారింపఁగా, నాగృహమున ననేకమాసములనుండి యెవ్వరు వాసముచేయుట లేదనియును, ఇప్పటికిఁ గొన్నాళ్లనుండి మాత్ర మెవ్వరోక్రొత్తవారువచ్చి దిగియున్నారనియుఁ దెలియవచ్చెను. ఇంకను విశేషసంగతులను దెలిసికొనవలయునని విమలుఁడు తఱచి తఱచి యాతనిఁ బ్రశ్నింపఁగా, నాపోలీసువాఁడు "ఈయింటియందున్నవారు

విచిత్రమనుష్యులవలె నగపడుచున్నారు. వారెప్పుడును పగటిపూట బయటికివచ్చుటయే లేదు. మఱియు నీగృహమున నేగదియందును గూడ దీపపుఁగాంతి యున్నట్లే యగపడలేదు" అనిచెప్పెను.

విశ : ఇచ్చట స్త్రీలెంతమందియున్నారు ?

పోలీ : ఇరువురు. ఇప్పు డాయిరువురుపురుషులతోడను లోపలకుఁ బోయిన యామెయొకతె. రెండవయామె తఱచుగ నెప్పుడును వెలుపలకువచ్చుటయే లేదు. ఈమెయైనను నిత్యము న రాత్రివేళ నొక్కతెయే వెలుపలకుఁబోవుచున్నది. పోవునప్పు డీయిరువురుపురుషులను దనతోఁ గూడఁ దీసికొనిపోవుచుండును.

విశ : అట్లయినచో, నీవొక్క స్త్రీని, ఇరువురుపురుషులను చూచియున్నావుకాదా ?

పోలీ : అంతేకాదు. కొంతకాలమునకుముందు ఇచ్చటమూఁడవ వాఁడుగూడ నుండెడివాఁడు.

ఈమాటనువిని విశేషకుతూహలుఁడై విశలుఁడు మరల "వీరీగృహము నద్దెకుఁదీసికొనవచ్చినప్పు డాతఁడుకూడ వీరితోనుండెనా ?

పోలీ : అవును. అప్పుడాతఁడు చాల వ్యాధిపీడితుఁడై యుండెను, ఆతని వేషభాషలనుబట్టిచూడఁగాఁ నాతఁడు విశాలదేశస్థునివలె నగపడుచుండెను.

విశలుఁడాతని వేషభాషలను, సుఱుతులను బాగుగవిచారించి తెలిసికొనియెను. పోలీచూచుకొనఁగా నవియన్నియుఁ బ్రష్పుల్ల చెప్పినట్లే, కాంతనాథుని పోలికమొదలగువానితో సరిపోవుచుండెను.

విశ : నీవు వారినిమొట్టమొదటఁజూచి, యించుమించుగ నెన్ని దినములై యుండవచ్చును ?

షోలీ : నాకంత నిష్కర్షగ జ్ఞప్తిలేదు—ఎన్ని యోచినములు కాలేదు. ఒకనాఁటిరాత్రి చాలసేపైనపిమ్మట నిక్కడకొక గుఱ్ఱపు బండి వచ్చినిలిచెను. ఆ యున్నతుఁడును, నా పొట్టివాఁడునుజేరి యీ రోగినెత్తుకొనివచ్చి, బండియందుఁ గూర్చుండఁబెట్టి తాముకూడ నందెక్కి, యెక్కడికో వెడలిపోయిరి. తిరిగి యొకగంటలోపల నా గుఱ్ఱపుబండి వెనుకకువచ్చెను. నేనిబాటనొకగలో నిలిచియుంటిని. ఈ యిరుపురుపురుషులును నా బండియం దన్యోన్యము నెదురుగఁ గూర్చుండి యుండిరి. ఆ రోగిమాత్రమందు లేఁడు. వారు బండిదిగిన వెంటనే బండిలోపలినుండి యేమియోలాగిఁదోడఁగిరి. నాకించుక సంశయము కలుగఁగా, సమీపమునకుఁబోయి నిలుచుంటిని. వారొక మనుష్యదేహమును క్రిందికిదింపుచున్నట్టు తెలియవచ్చెను. నేనా సంగతిని గూర్చి వారలను విచారింపఁగా, ఆ రోగికి వ్యాధిబలమగుటచే, బాధ యధికమై మూర్ఛనొందెనని యీ పురుషులిరువురును నాతోఁ జెప్పిరి. అప్పుడు నేను "వైద్యునిబిలిపింపనా" యని యడుగఁగా, పెద్దవాఁడు, తానే వైద్యుఁడనినియు, ఈ వ్యాధికిఁదగినచికిత్సను జేయఁ గలననియుఁ జెప్పెను. ఆ పిమ్మట నాతనిని లోపలికిఁదీసికొని పోయిరి. జరగిన సంగతిని మా యినస్పెక్టరునకుఁ దెలియఁజేసికొంటిని. కాని, వారు నా మాటలను జెడచెవినిబెట్టుటచేత, మన కెందులకని, నేనుకూడ నూరకుండ వలసినవాఁడనైతిని.

విర : ఆ పిమ్మట నెప్పుడైన నా రోగినినీవు చూచియున్నావా?

షోలీ : లేదు. ఎప్పుడును జూడలేదు. ఒకనాఁటిరాత్రి నేను, ఆతని గతియేమైనదని యీ యున్నతునడిగితిని. అందులకాతఁడు ఆ మను ష్యుఁడు నెమ్మదిగానున్నాఁడనియుఁ దనయూరికిఁ బోయినాఁడనియు నాతోఁజెప్పెను. కాని, పగటిపూట నీవీథినిదిరుగు మాతోడిజవానును

విచారింపఁగా, నీ యింటినుండి యెవ్వరును, నెక్కడికిని ప్రయాణము చేయలేదని తెలియవచ్చినది. అప్పటినుండి యిప్పటివఱకును వీరి విషయమున నేననుమానము గొడనే తిరుగుచుంటిని. ఈ యింటిపై నొక కన్నువై చియుంటిని.

విఠలమూర్తి కప్పుడమూల్యములగు నెన్ని యోసంగతులు తెలియవచ్చెను. ఆతఁడు మొదట నా స్త్రీని జూచి మాటాడవలయునని యనుకొనియెను. ఒకవేళ నామె ప్రఫుల్ల కాదని రుజువైనచోఁ దనముందుదారికి భంగముకలుగునని యోచించి యా ప్రయత్నమును మానుకొనియెను. విఠలుఁ డాయిరువురి చర్యలనుగూర్చియు, కాంత నాథుని మరణమునుగూర్చియు యోచించుచు నక్కడ నిలిచి యుండఁగా, ఆ శవమాయింటియందే పూడ్చియుండవచ్చునను యోచన యాతనికిఁ దోచెను. ఎన్నివిధముల యోచించిచూచినను నాతని కాయభిప్రాయమే స్థిరపడుచుండెను. కాని, యా యింటియందా విషయమునుగూర్చి పరిశోధించుటకుఁ దగినమార్గ మేమియున్నదని యాతఁడు పలుతెఱంగుల తలపోయసాగెను. తుదకాపనిచేయుట యసాధ్యమని నిశ్చయపఱచుకొని విఠలుఁడు తిన్నఁగాఁ దన యింటికిఁ బోయెను.

అయినను విఠలుఁ డూరకుండలేదు. మాధవుఁడు విశాలదేశము వాఁడనియు, భాస్కరుఁడు మార్యదేశమువాఁడనియుఁ గనిపెట్టెను. అంతియేగాక యాతఁడు తన యాఫీసునకు వచ్చుచున్న వర్తమాన పత్రికను జదువుచుండఁగా, విశాలదేశపు తుంటరిగుంపునం దనేక పర్యాయములు కారాగృహమునకుఁ బోయియున్నవారిలో మాధవుఁ డొకఁడని చూపించుట కాధారమైన మాధవుని భావచిత్రము **(Photo)** కూడ నాతనికగపడెను. భాస్కరుని విషయమున మాత్రము

జోలీ : నాకంత నిష్కర్షగ జ్ఞప్తిలేదు—ఎన్నియోదినములు కాలేదు. ఒకనాఁటిరాత్రి చాలసేపైనపిమ్మట నిక్కడకొకగుఱ్ఱపు బండి వచ్చినిలిచెను. ఆ యున్నతుఁడును, నా పొట్టివాఁడును జేరి యీ రోగినెత్తుకొనివచ్చి, బండియందుఁ గూర్చుండఁబెట్టి తాముకూడ నందెక్కి, యెక్కడికో వెడలిపోయిరి. తిరిగి యొకగంటలోపల నా గుఱ్ఱపుబండి వెనుకకువచ్చెను. నేనీబాటమొగలో నిలిచియుంటిని. ఈ యిరువురుపురుషులును నా బండియం దన్యోన్యము నెదురుగఁ గూర్చుండి యుండిరి. ఆ రోగిమాత్రమందు లేఁడు. వారు బండిదిగిన వెంటనే బండిలోపలినుండి యేమియోలాగఁదొడఁగిరి. నాకించుక సంశయము కలుగఁగా, సమీపమునకుఁబోయి నిలుచుంటిని. వారొక మనుష్యదేహమును గ్రిందికిదింపుచున్నట్టు తెలియవచ్చెను. నేనా సంగతిని గూర్చి వారలను విచారింపఁగా, ఆ రోగికి వ్యాధిబలమగుటచే, బాధ యధికమై మూర్ఛనొందెనని యీ పురుషులిరువురును నాతోఁ జెప్పిరి. అప్పుడు నేను "వైద్యునిబిలిపింపనా" యని యడుగఁగా, పెద్దవాఁడు, తానేవైద్యుఁడననియు, ఈ వ్యాధికిఁదగినచికిత్సను జేయఁ గలననియుఁ జెప్పెను. ఆ పిమ్మట నాతనిని లోపలికిఁదీసికొని పోయిరి. జరగిన సంగతిని మా యినస్పెక్టరునకుఁ దెలియఁజేసికొంటిని. కాని, వాఁడు నా మాటలను బెడచెవినిబెట్టుటచేత, మన కెందులకని, నేనుకూడ నూరకుండ వలసినవాఁడనైతిని.

విర : ఆ పిమ్మట నెప్పుడైన నా రోగినినీవు చూచియున్నావా?

జోలీ : లేదు. ఎప్పుడును జూడలేదు. ఒకనాఁటిరాత్రి నేను, ఆతని గతియేమైనదని యీ యున్నతునడిగితిని. అందులకాతఁడా మనుష్యుఁడు నెమ్మదిగానున్నాఁడనియుఁ దనయూరికిఁ బోయినాఁడనియు నాతోఁ జెప్పెను. కాని, పగటిపూట నీవీథినిదిరుగు మాతోడిజహానును

విచారింపఁగా, నీ యింటినుండి యెవ్వరును, నెక్కడికిని బ్రయాణము చేయలేదని తెలియవచ్చినది. అప్పటినుండి యిప్పటివఱకును వీరి విషయమున నేననుమానము కొడనే తిరుగుచుంటిని. ఈ యింటిపై నొక కన్నువైచియుంటిని.

విశాలమూర్తి కెప్పుడమూల్యములగు నెన్నియో సంగతులు తెలియవచ్చెను. ఆతఁడు మొదట నా స్త్రీని జూచి మాటాడవలయునని యనుకొనియెను. ఒకవేళ నామె ప్రఫుల్లకాదని రుజువైనచోఁ దనముందుదారికి భంగముకలుగునని యోచించి యా ప్రయత్నమును మానుకొనియెను. విశాలుఁ డాయిరువురి చర్యలనుగూర్చియు, కాంతనాథుని మరణమునుగూర్చియు యోచించుచు నక్కడ నిలిచి యుండఁగా, ఆ శవమాయింటియందే పూడ్చియుండవచ్చునను యోచన యాతనికిఁ దోఁచెను. ఎన్నివిధముల యోచించిచూచినను నాతని కాయభిప్రాయమే స్థిరపడుచుండెను. కాని, యా యింటియందా విషయమునుగూర్చి పరిశోధించుటకుఁ దగినమార్గ మేమియున్నదని యాతఁడు పలుతెఱంగుల తలపోయసాగెను. తుదకాపనిచేయుట యసాధ్యమని నిశ్చయపఱచుకొని విశాలుఁడు తిన్నఁగాఁ దన యింటికిఁ బోయెను.

అయినను విశాలుఁ డూరకుండలేదు. మాధవుఁడు విశాలదేశము వాఁడనియు, భాస్కరుఁడు మౌర్యదేశమువాఁడనియుఁ గనిపెట్టెను. అంతియేగాక యాతఁడు తన యాఫీసునకు వచ్చుచున్న వర్తమాన పత్రికను జదువుచుండఁగా, విశాలదేశపు తుంటరిగుంపునం దనేక పర్యాయములు కారాగృహమునకుఁ బోయియున్నవారిలో మాధవుఁ డొకఁడని చూపించుట కాధారమైన మాధవుని భావచిత్రము **(Photo)** కూడ నాతనికగపడెను. భాస్కరుని విషయమున మాత్రము

తగినయాధారములేవియును నాతనికి దొరకలేదు. ఒకనాఁడు విఠలుఁడా చిత్రపటములను బరీక్షించుచుండఁగా, వారణాలాలక్కడకువచ్చి "విఠలా! నాసోదరియొద్దనుండి యిప్పుడొకయుత్తరమువచ్చియున్నది. ఆమె తానొకమిత్రుని యింటియందుంటిననియు, తన్ను వెదకుకొన నక్కఱలేదనియు, నాయుత్తరమున వ్రాసియున్నది" అని చెప్పెను.

విఠ : ఆయిల్లెక్కడనున్నది. ఎవ్వరిదైనది, యాయుత్తరమున వ్రాసియున్నదా ?

వార : అవును. వ్రాసియున్నది. ఇట్టివీథియనియు, ఇన్నవ నెంబరుగలయిల్లనియు వ్రాయుటయేగాక నన్నక్కడకు రావలయునని కూడ వ్రాసియున్నది.

ఈమాటలను వినుటతోడనే విఠలుఁడు కుర్చీనుండి చటుక్కున లేచెను. చేతివ్రేళ్లను గఱచుకొనియెను. కొన్నినిమిషములవఱకు నాతఁడేమియును మాటాడలేదు. ఎందులకనఁగా—ఏగృహమునకు మొన్నటిరాత్రి మాధవభాస్కరులుపోవుచుండుటను దాను చూచి యుండెనో, అయింటివిలాసమునే నేఁడు వారణాలాలు చెప్పియుండెను. అందువలన విఠలుఁడు విశేషసంభ్రమాశ్చర్యములకు లోనుగావలసిన వాఁడయ్యెను.

విఠ : ఎక్కడ ? ఆయుత్తరము నొకసారి చూపింపుము చూతము !

వారణాలాలాయుత్తరము నాతనికిచ్చెను. విఠలుఁడాయుత్తరమును జదువుకొని పిమ్మట "అయ్యా! ఈవ్రాతను బోల్చితివా ? ఇది నీసోదరిలేఖనమని నీకు బాగుగఁదెలియునా ?

వార : ఆమె లేఖనమువలెనే కనఁబడుచున్నది.

విఠలుఁడు చాలసేపు యోజించి పిమ్మట ప్రఫుల్లకు రహస్యముగా వివాహమగుటనుగూర్చియు, ఆమె పతిమరణమునుగూర్చియు, ఇంకను జరగిన యితరసంగతులనుగూర్చియు వారణలాలునకుఁ దెలియఁజేసెను. ఆ మాటలనువిని వారణుఁడు నిశ్చేష్టుఁడై యేమియును మాటాడకచూచుచుండెను. అప్పుడు విఠలుఁడు "వారణా! నీవిప్పుడాయింటికినడువుము. నేనుకూడ నీతోవచ్చెదను. సర్కారుపత్తేదారునగు నేను వారింటికివచ్చితినన్నసంగతి వారికిఁదెలియకుండునట్లు మారువేషమునవచ్చెదను. వారు లెక్కలేని సాహసకృత్యములను జేయుచున్నారు. యోజించిచూడఁగా నీకుత్తరము వ్రాసినస్త్రీ నీసహోదరి కాదని నాకుఁ దోఁచుచున్నది. ఈమె మాయాప్రఫుల్ల వేషమును వైచుకొని యీకపటనాటకము నాడుచున్నది. నీవేమియు నెఱుఁగనివానివలె నక్కడ నటింపుము. మఱియు నేను నీమేనమామయగు వాగీశుఁడననియుఁ, గళింగదేశమునుండి వచ్చితిననియు వారితోఁ జెప్పుము. పిమ్మటఁ గార్యానుకూలముగ నాకుఁ దోఁచినరీతిని నేను మాటాడెదను.

వార: ప్రఫుల్ల యక్కడలేకున్నచో మఱెక్కడకుఁ బోయియుండును?

విఠ: మనమావిషయమునుబరిశోధించి కనుఁగొనవలయును.

ఒంటిగంటయైన పిమ్మట నిరువురు బయలుదేరిరి. విఠలుఁడు బ్యాంకివర్తకుని వేషమువైచుకొని వారణలాలుని మేనమామయయ్యెను.

# ఐదవ ప్రకరణము

ఆ గృహకవాటము మూయఁబడియుండెను. విఠలుఁడును వారణలాలు నక్కడకువచ్చి తలుపుతట్టిరి. లోపలినుండి ప్రత్యుత్తరము వచ్చుటకుముందుగనే యెవ్వరో మేడమీఁది గవాక్షమార్గమున వీరిరువురను తొంగితొంగిచూడసాగిరి. ఆ సంగతిని విఠలుఁడు కనిపెట్టెను. కాని, యాతఁడు తానేమియు నెఱుఁగనట్లే నటింపసాగెను. ఇంతలో గృహద్వారము తెఱవఁబడియెను. ఒక నిమిషములోఁ బ్రఫుల్ల—ఛీ! కాదుకాదు—మాయాప్రఫుల్ల యక్కడకువచ్చినిలిచెను. వారణలాలునకుఁ జాలగందరగోళమయ్యెను. ఆతని కేమియును దోఁచలేదు.

స్త్రీ : అన్నయ్యా! నీవిక్కడకు వచ్చుట నాకు మిగుల నానందముగానున్నది.

అనిచెప్పి వారణునకు నమస్కరించి, ఆతనిని విఠలునితోఁ గూడ లోనికిఁ దీసికొనిపోయెను.

స్త్రీ : అన్నా! నీవు నన్నుఁగానక చాలగందరగోళమును పొందియుందువు. నేనువచ్చునప్పు డొకయుత్తరమునైన వ్రాసి

రావలసినది. అందులకైన నవకాశము చిక్కినదికాదు. మంచిది——దానికేమిలే——రండు. ఆ విషయమంతయు సవిస్తరముగఁ జెప్పెదను.

వార : ప్రఫుల్లా! ఇదిగో! ఈతఁడు మనమేనమామయగు వాగీశుఁడు——కళింగదేశమునుండి వచ్చియున్నాఁడు.

ప్రఫు : ఓహో! ఆలాగునా? మామయ్యా! నేను మీచిత్ర పటమును (Photo) మాత్రము చూచియున్నాను. ప్రత్యక్షముగా మిమ్ములను జూచుభాగ్యము నాకిప్పుడు కలిగినది. నేఁడు మీరు వచ్చుట మాకుఁ బండువుగానున్నది.

అని నమస్కారముచేసి "రండు. ఈ కుర్చీలపై గూర్చుండుఁడు" అనియెను.

ఆ చిన్నయిల్లు మిగులమనోహరముగ నలంకరింపఁబడియుండెను. పెద్దపెద్ద నిలువుటద్దములును, వివిధములగు విచిత్రపటములును, అనేకభావచిత్రములును (Photos) పలువెలుంగులగు కుర్చీలును, మేజా, బెంచి, మంచము, సోఫా, హంసతూలికాతల్పము మొదలగు నవియును, రమ్యములగు దీపోపకరణములును, ఆ గదినలంకరించి యుండెను.

వారణవిరలులు కూర్చుండిరి. పిమ్మట నాకాంత వారితో నుచితరీతి సంభాషింపసాగెను.

స్త్రీ : నేనంతతొందరగా గృహమును విడిచివచ్చినసంగతి మీకుఁదెలుపవలసినదే —— భరతమాధవియును నేనును చిన్నప్పటి నుండియుఁ బ్రాణసఖులము. ఆమె విశాలదేశవాసియగు మాధవుఁడను నొక పెద్దమనుష్యుని పెండ్లియాడి కొన్నాళ్లకుఁబూర్వమే యిక్కడకు వచ్చినది. వచ్చినపిమ్మట నామె వ్యాధిపీడితయై మంచము పట్టినది. అట్టిస్థితిలో నామె నన్నుఁజూడవలయునని యపేక్షించి

యొకనాఁడు తొందరగానచ్చి తన్నుఁగలిసికొననలసినదని నాకొక గందరగోళపు టుత్తరమ్ము వ్రాసినది. ఆ యుత్తరము వచ్చినప్పుడు నేను నాయింటికచేరిచావడిలోఁగూర్చుండి పుస్తకమును చదువుచుంటిని. ఆయుత్తరమునుజూచినతోడనే పిడుగుపడినదానివలెనై నాస్నేహితురాలు కేవల మపాయకరమగు వ్యాధిలోఁ జిక్కికొని మరణింపనై యున్నదని భావించుకొని తుదకు దాని ముఖమునైనను జూతునో లేదో కదాయని పరితపించుచు నేనిట్టి తావునకుఁ బోవుచున్నానని యొకరితోఁజెప్పుటకైన మనసుకుదుట లేక చటాలున బయలుదేరి యిక్కడకువచ్చితిని. నేను వచ్చుసరికి భరతమాధవికిఁ జాలజబ్బుగా నుండెను. అప్పటినుండి నిన్నటివఱకును, గృహసమాచారము తెలియక పోవుటచేఁ జాలఁదల్లడిల్లితిని. నీవూరినుండివచ్చితివని నిన్ననే నాకుఁ దెలియుటచేత నీకాయుత్తరమును వ్రాసితిని. ఇప్పుడు మనమామయ్య కూడ వచ్చుట నాకు మఱింతసంతోషముగానున్నది. మఱియు నా పుణ్యవశమున నానెచ్చెలికిఁగూడ సంపూర్ణారోగ్యము కలిగినది. ఇఁక నేమున్నది—నేఁడో రేపో నేనింటికివచ్చుటకు సిద్ధముగానుంటిని.

వార : ఇప్పటివఱకు నీస్నేహితురాండ్రలో నెవ్వరికిని జెంజ్లినైనసంగతి నేను వినియుండలేదు. మంచిది. ఆ నీనెచ్చెలిపేరు మఱి యొకసారిచెప్పుము వినియెదను.

మామా : భరతమాధవి. ఎంతులకన్నయ్యా ! నీవామెను మఱచిపోయితివాయేమి ? ఆమెయును నేనునుకలిసియే పాఠశాలకుఁ బోవుచుండెడివారముకాదా ? మంచిది. ఇంతయెందులకు ? ఇప్పుడే యామెనిక్కడ నేచూతువుగదా! మామయ్యా! అత్తయ్య సౌఖ్యముగా నున్నదా ?

విశ : బిడ్డా! అదియేమి? నీవంతయునునులచిపోయినట్లే తోచుచున్నది. నేను నిత్యబ్రహ్మచారినిగాదా !

ఇప్పు డాప్రఫుల్ల పాతాళమునకుఁ బోయిపడియెను. ఆమెతన యపజయచిహ్నములను పైకిఁగనఁబడనీయకుండఁ జమత్కారముగ నవ్వుచు " అయ్యా ! నేనెంతటిపిచ్చిదానను ! ఈసంగతి నాకుఁ దెలిసియుండియు నేనెందులకిట్లుమాటాడితినో ? అయ్యో ! నామతిమండా ! మొన్నటి వ్యాకులభావమునన్నింకను పీడించుచున్నదికాఁబోలును ! సరిలెండు ! దయయుంచి మీరొక్కక్షణముసేపిక్కడ నుండుఁడు నానెచ్చెలిని దీసికొనివచ్చెదను " అనిచెప్పెను.

ఆమెయీవిధముగమాటాడుచు నొయ్యారముగ ముద్దుముద్దుగ నక్కడనుండి వెడలిపోయెను. ఆమెపోంచివినకుండ నుండునంతటి మూగమేగినపిమ్మట వారిరువురు ఁడతిపుకూహలభావముతో విశలుని చెవిలో " అయ్యో! ఈమె నాచెల్లెలుకాదు మొదటమాప్రఫుల్లయనియే భ్రమించితిని. కాని, యిప్పుడామె నోరుతెఱవఁగనే కాకియని తెలిసిపోయినది. అయ్యో! భగవంతుఁడా! ఇందలిపరమార్థమేమైయుండును? విశలా ! నాకేమియును దోఁచకుండనున్నది. ఇదియేమివిచిత్రము ? లోకములో నింతటియద్భుతము నెప్పుడైన నెవ్వరైన జూచియున్నారా?

విశ : దీనియర్థము మాయాకల్పనము. నీవు గందరగోళపడి మాటజేలిపోకుము. నీవిప్పుడు చాలజాగ్రతగానుండవలయును. ఈమె నీచెల్లెలుకాదని నీవు సంశయపడుచున్నట్లీమెకుఁ దెలియఁగూడదు. ఈమె యత్యద్భుతనటకురాలు—తన నాటకమునాడుచున్నది. నీ వించుక యోపికతోఁ జూచుచుండుము. ఇందలి రహస్యమంతయు నాయూలాగ్రముగ గ్రహించి, తరువాతనీకుఁజెప్పెదను.

వితలుఁ డింతకంటె హెచ్చుగ నింకేమిచెప్పుటకు వలనుగాక పోయెను. ఎందువలననఁగా—అంతలో మేడపైనుండి పదనూపుర ఘల్ ఘలారవము విననయ్యెను. అందువలన నొకస్త్రీ క్రిందికిదిగి వచ్చుచున్నదని వారికిఁ దెలిసిపోయెను. మాయాప్రఫుల్ల తనతోఁ దన నెచ్చెలిని దీసికొని క్రిందికిదిగివచ్చెను.

మాయాప్ర : ఇదిగో! ఈమెయే భరతమాధవి.

వారిరువురు నామెపైపునకుఁజూచి సంతోషమునొందిన వారి వలెనటించిరి. భరతమాధవియు వారిరువురను మర్యాదపూర్వకముగఁ దిలకించెను. ఆమె కోమలకంఠస్వరము సంగీతమువలెనుండెను శ్రావ్య ముగానుండెను. మఱియు నామె చాల గొప్పయింటి యువతివలె నగపడుచుండెను.

భరతమాధవి : వారణా! ప్రఫుల్లను, ఆమె బంధువర్గము వారిని జూచుట నాకుఁ బరమానందముగా నుండును. అందువలన నే స్వతంత్రించి నీసోదరి నిక్కడకుఁ బిలిపించుకొంటిని. ఇందులకై నీవెంత మాత్రము నన్యథాయోజింపవలదు.

వార : ఎంతమాట! ఇందుతప్పేమున్నది?

తన సహోదరియగుప్రఫుల్ల మాయమైపోవుటయు, ఈ యిరు వురుస్త్రీలు నా విషయమునయేమో కృత్రిమవ్యాపారమును జేసియుండు టయు, మొదలగు సంగతులన్నియు బాగుగఁ దెలిసినవాఁడయ్యు వారణుఁడు భరతమాధవిరూపమునకును, ఆమె విలాసమునకును ముగ్ధుఁడై యామెవలలోఁ జిక్కుకొనునట్లుండెను. ఆతనిహృదయ నాడి వడివడిగఁ గొట్టుకొనుచుండెను. ఆతని హృదయక్షేత్రమున మోహ బీజాంకురమయ్యెను. వితలుఁడనేక విలాసవతులనడుమ నెన్నియో సారులు మసలుట తటస్థించినను, ఎప్పుడు నెవ్వారికటాక్షమునకును

లోఁబడినవాఁడు కాఁడు. ఇందుమూలముననే యాతఁడు తన గౌరవమును మఱింత వృద్ధిఁ జేసికొనియెను. అట్టివాఁడిప్పుడు మాధవపత్ని యని చెప్పఁబడుచున్న మాయావతియగు భరతమాధవి కటాక్షవీక్షణములకుఁ గట్టువడిపోయెను. ఈ మోహాంధకారమునఁ జిక్కుకొని యాతఁడు తన్నుఁదానే మఱచిపోయెను.

కాని, విఠలుఁ డనుభవశాలి. లోకజ్ఞానసంపన్నుఁడు. సుధీరుఁడు. భవిష్యదర్థంబు నంతలోఁ దెలిసికొను సామర్థ్యముగలవాఁడు. అట్లగుటచే నాతఁడు భరతమాధవి కటాక్షజాలముల నంతలోఁ ద్రెంపివైచికొని వారణునివైపునకుఁదిరిగి " వారణా! లెమ్ము! పోదము. నాకు మఱియొక తొందరపనియున్నది—బిడ్డా! ప్రఫుల్లా! నేను మీగృహమునందే, వారణునితోడను నీతోడను నింకను గొంత కాలము గడపవలయునని యోజించుచున్నాఁడను." అనియెను.

మాయాప్రఫుల్ల: నేను రేపె మనయింటికి రావలయునని యనుకొనుచుంటిని.

వారణుఁడు భరతమాధవి కటాక్షపాశములకు ముగ్ధుఁడై పోయెననుసంగతి చతురుఁడగు విఠలునకుఁ దెలిసిపోయెను. ఇరువురు నక్కడనుండి బయలుదేరిరి. కొంతదూరము పోయినపిమ్మట విఠలుఁడు వారణునివైపునకుఁదిరిగి " వారణా! ఈ స్త్రీలనడవడులంగూర్చి నేను సంశయముపడుచున్నానని యించుకంతయును వారలకుఁ దెలియఁ గూడదు. ఈ సంగతిని మాత్రము నుఱచిపోకుము. ఈపై నేమిరానై యున్న కోరానిమ్ము. ఇంతియేగాక వారణా! ————" అని యేమో చెప్పఁబోయి వారణుని ముఖమునొకసారి దృష్టించిచూచి యాదరభావముతో " నీ వివేకమువలననే నీ సహోదరి యుద్ధరింపఁ బడవలయును. మఱియు నీవు వీరితో మాటాడునప్పుడు మఱచియైన

నా నిజమైన పేరు చెప్పనని నాకు బాసయిమ్ము. నేను విఠలుండనని వీరికిఁ దెలిసిన చోఁ గార్యము చెడును—" అనియెను.

వారణుఁడు విఠలునిముఖమునుజూచి చేతిలోఁ జేయివైచి "అయ్యా! ఇదిగో! ప్రమాణముచేయుచున్నాఁడను. నేనువారి యెదుట నెన్నఁడును నీ పేరుచ్చరింపఁబోను. నీకు నామీఁద నమ్మకము లేదా!" అనియెను.

విఠ: అయ్యా! నీవు తరుణవయస్కుఁడవు. తప్పుదారినిబడి పోయితివిగదాయని నామనసు కళవళపడుచున్నది. కానిమ్ము. నీవేమియు నన్యథాభావింపఁబోకుము. నేను చాలజాగరూకతతో నుండెదను. నేనిసాయంకాలమున మీయింటికివచ్చి సన్యాసివేషముతో నుండెదను.

వార: అట్లేచేయుము. నేను నీకై నిరీక్షించుచుండెదను.

విఠలుఁడుపోయి మాధవుఁడును భాస్కరుఁడునుండు రహస్యస్థలమునుకని పెట్టుటకై ప్రయత్నింపసాగెను.

వారణలాలు తనగృహమునకుఁబోయెను. ఆతనిమనోభావము లేవిధముగా నున్నవని మేము వ్రాయఁజాలకున్నాము. ఆతని బుద్ధి భ్రమసిపోయినది. ప్రఫుల్లముఖమును, ఆనూతనస్త్రీముఖమును బోల్చి చూచెను. ఆతనిమనసునకు విశ్వాసముకలుగలేదు. అప్పుడాతఁడు తనచెల్లెలుగతి యేమైనదోగదాయని కన్నీరు విడుచుచు విచారింపసాగెను.

"అయ్యో! నేనెంతటి నిర్భాగ్యుఁడను. అంతటి సుశీలయగు సోదరీరత్నమును బోఁగొట్టికొంటినిగదా! ఎంతటిసాత్వికస్వభావ! ఆహా! ప్రఫుల్లా! సోదరీ! నీవెందున్నావు?" అని ప్రలాపించుచు నీకపటతంత్రములెవ్వియు నాసాధుబాలికకుఁ దెలిసియుండవనియు,

ఆమె నెవ్వరో మోసగించి యెత్తుకొనిపోయిరనియు విచారింపసాగెను. ఆమె నిశ్చయముగ దేవకన్యకయేయని భావింపఁదొడంగెను.

పిమ్మట వారణుఁడు విఠలునకొకయుత్తరము వ్రాసెను. దానియందు,

"అయ్యా! నేను కొన్నిదినములవఱకు గ్రామాంతరము పోయియుండెదను. నీవు మా యింటికివచ్చి యందే మా మేనమామవలె నుండవలయును. ఈ సంగతి నా సహోదరి వేషమును వైచుకొనియున్న యా కాంతకుఁ జెప్పుము."

అని వ్రాయఁబడియుండెను.

పిమ్మట వారణుఁడు ప్రయాణమునకు సన్నద్ధుఁడై గృహాంగణమునకు వచ్చునప్పటికెవ్వఁడో యొకఁడు వచ్చి యొకయుత్తరము నాతనికిచ్చెను. అందలి హస్తాక్షరములు మాయయ్యాప్పన్నల హస్తాక్షరములవలె నుండెను. అది యా నూతనప్పన్నల వ్రాసినయుత్తరమే. అందు "ఓ ప్రియసహోదరుఁడా! నా ప్రాణసఖిభర్త యీ రాత్రి మమ్ముల్లను నాటకమునకుఁ దీసికొని పోయెదనని చెప్పియున్నాఁడు. కాని, యాతఁడేదో తొందరపనిమీఁద పోయియుండుటచేత నేఁడింటికి వచ్చుటకు వలనుగాక పోయినదని వర్తమానమంపియున్నాఁడు. అందువలన దయయుంచి నీవును మామయ్యయును వచ్చి మమ్ముల్లను నాటకములోనికిఁ దీసికొనిపోవలయునని ప్రార్థించుచున్నదానను. ఒకవేళ మామగారు వచ్చుటకు వలనుగాక పోయినచో నీవైనను రావలయును. తప్పక రావలయునుసుమా." అని వ్రాయఁబడియుండెను.

వారణుఁడాయుత్తరమును జదువుకొన్నపిమ్మట, దానిని చించి పాఱవేయవలయునని యనుకొనియెను. మరల నించుకయోచించి

దీనిని విటలమూర్తికిఁజూపి యాతఁడు చెప్పినట్లు నడచుకొనుట యుత్తమమని నిశ్చయించుకొనియెను.

వారణుఁడు తిన్నగ విటలుని కార్యాలయమునకు వచ్చి చూడఁగా, ఆతఁడేదో యొకయపరాధశోధనమునకై యెచ్చటికో పోయియుండె ననియు, ఇంకను జాలసేపటివఱకు రాఁడనియు, నచటివాఁడు చెప్పెను. ఇప్పుడు వారణునకేమిచేయుటకును దోఁచలేదు. ఆతఁడు సంధ్యాకాల మాఱుగంటలవఱకును నిరీక్షించినను విటలుఁడు రాలేదు. ఇఁక విటలుఁ డానాఁటికింటికి రాఁడని యూహించుకొని, ఒకసారి యామామయ్యా [illegible] యుత్తరానుసారముగ నక్కడకుఁబోయి వారిని నాటకమునకుఁ దీసికొని పోవుటకును, మఱునాఁడు తానక్కడ నుండియే గ్రామాంతరమునకుఁ బోవుటకును నిశ్చయించుకొని, వారణుఁ డా స్త్రీలున్నయింటికి వెడలఁ బోయి తలుపు తట్టెను. అప్పుడు తరుణవయస్కురాలగు నొకసుందరీ మణివచ్చి తలుపుదీసెను. ఆవిలాసవతిని జూచుటతోడనే వారణునకుఁ గేవలమును మనోవికార ముదయించెను. చాలవఱకాతఁడు ముగ్ధుఁడై పోయెను.

భరతమాషపి : ఓహో ! మామవారబ్బాయా ! నీ వొక్కఁడవే వచ్చితివా ? మామగారు రాలేదా ?

వార : లేదు. ఆతనికేదో తొందరపనియుండి రాలేదు.

భర : చెల్లెలుమేడమీఁదనున్నది. ఇఁకనేమి? ఇదిగోవచ్చుచునే యున్నది. అదిగో ! ఆపెట్టెయందు టిక్కట్టులున్నవి తీసికొనుము. నేనొకసారి లోపలికిఁబోయి వచ్చెదను.

అని చెప్పుచు నూపురము లల్లనల్లన ఘల్లుఘల్లుమనుచుఁ బద విన్యాసమునకనులయనెఱపుచుండ, సవిలాసముగ, ససంభ్రమముగ, సమ్మోహినీదేవతవలె నక్కడనుండి వెడలిపోయెను.

వారణునిమనసు చలించెను. వివేకమాతనిచేయి వీడిపోయెను. మాధవి యొకనిమిషములోనే మాయాప్రపుల్లను దీసికొని క్రిందికి వచ్చెను. కృతికప్రపుల్లయు సొగసైన తెల్లని రేష్మన్‌పూవులచీరను గట్టుకొనియుండెను. నక్షత్రమండలముతోఁ బ్రతిఘటించు వజ్రాల కంకణములును, పుష్యరాగపుముక్కఱయును, కెంపుల జెడపూవును, బంగారపుటొడ్డాణమును, వెండికడియములు నందెలును తక్క మఱి యెట్టియాభరణముల నామె ధరింపలేదు. దీపకాంతిలో నాజీవరత్నములు మిలమిల మెఱసిపోవుచుండెను. ఆమె యప్పుడే స్వర్గమునుండి దిగివచ్చిన దేవతాకన్యకవలె నుండెను. ఆమె వారణుని సమీపించి "అన్నయ్యా! వచ్చితివా? నాకుఁ జాలసంతోషముగా నున్నది. ఈరాత్రి నాటకమును జూచి యానందింతము. పెండ్లియైన యూపరకాంత కూడవచ్చుచున్నదని నీవేమియును సంశయపడవలదు. నేఁడీమె భరతమాధవికాదు. ఈమె పేరు తిలోత్తమ; తిలకసుందరి. ఈమె మంత్రతంత్రముల నెఱింగిన చతుర. ఐగుప్తదేశపు విలాసవతి" అనియెను.

ఈపల్లాసము క్రోతికిఁ గల్లుపోసినట్లయ్యెను. వారణున కుత్తేజనము హెచ్చయ్యెను. అతఁడు మాటిమాటికిని "తిలోత్తమా! తిలకసుందరి!—సుందరి!" అని మాయాదిశక్తినామమంత్రమును జపింపసాగెను. తిలకసుందరి యూతనిఁజూచి యల్లనల్లన నవ్వసాగెను. నిండుచందురునివలె ముద్దులుకు నెమ్మొగంబున వెలునడుచున్న యామెమ్మొలాడి చిఱునవ్వు వెన్నెల లెవ్వరినేమిసేయఁజాలవు? అవి వారణునకు మత్తుమందైపోయెను. అతఁడు మరల "సుందరీ! తిలక సుందరీ!" అనియెను. తిలకసుందరి ముసిముసి నగవుతో మాయాప్రపుల్లవైపునకుఁ జూచెను. ఆ స్త్రీలిరువురును బరస్పర

మోరఁగంట నొంకొరులను జూచికొని నవ్వుకొనసాగెను వారుఁడు తిలకసుందరి వైపునకే చూచుచుండెను. ఆమె కటాక్షవిద్యుల్లతలు మరల నొక్కసారి వారుని మోముపైఁ బ్రసరించెను. ఆతనికన్నులు మిఱుమిట్లు గొనియెను.

ఆ సమయమునకు సరిగ నొకబండిలోఁ గూర్చుండి యొక ముసలివాఁడామార్గమునఁ బోవుచు వీరిని జూచెను. ఆతఁడు సుద శేషుఁడే.

వారుఁడు వేశ్యసనకువచ్చి పోయినపిమ్మట నాతని ప్రవర్తన మనుమానాస్పదముగ నున్నదని భావించి సరేశుఁడాతనిచర్యలను గనిపెట్టవలయునని యీ మార్గమున వచ్చెను. అందులకుఁ దగినట్లుగనే వారుఁడు స్త్రీలతోఁ జేరియుండెను. అందులకు సరేశుఁడు పరమాశ్చర్యము నొందసాగెను. ఈ సంగతులన్నియు విరలునితోఁ జెప్పవలయునని యాతఁడు తలపోయుచుండెను. ఎందువలననఁగా,— వారుఁడు ఋజుమార్గమును వీడి దుర్మార్గమునఁ బడిపోయినట్లాతనికిఁ దోఁచెను. ఇఁక నాతఁడెట్లూరకుండఁగలఁడు ?

## ఆఱవ ప్రకరణము

విఠలునిమనసు మునుపటికంటెఁ గొంచెము స్థిమితపడియెను.

ఇదివఱకు నీ నేరమును గనిపెట్టుట కెట్టిమార్గము నగపడ లేదు. ఇప్పు డందుల కించుకసావకాశము కలిగినది, అతఁడు తన మనసున "ఇది విచిత్రవివాహము—వరుఁ డాముహూర్తముననే మరణించినాఁడు. వధువు మాయమైపోయినది. ఆమె స్థానమున, నామె వేషమును వైచికొని మఱియొకతె నటించుచున్నది. ఇది మిగులఁ జమత్కారమగు ప్రదర్శనముగా నగపడుచున్నది. మఱియొకఁడీనాటకమును జూచి విభ్రాంతుఁడై పోవలసినదే! ఎట్టిసాహసకృత్యములనైనఁ జేసి యీ నేరమును బరిశోధింపవలయును. అట్లు కాకున్న నీ ప్రయత్నములలో మరణింపనైన మరణింపవలయును. ఇంతకుఁ బూర్వ మీ మాయాప్రఫుల్ల తాను కాంతనాథుని బరిణయమైతినని చెప్పినది. ఆహా! దీనిమర్మమంతయు నిప్పుడు తెలియుచున్నది. వీరొకపేరాసకుఁ జిక్కి యీ కృత్రిమనాటకము నాడుచున్నారు కానిమ్ము. ఇది యెన్నాళ్లుసాగునో చూతము!" అని యనుకొనియెను

పిమ్మటఁ గాంతనాథునిజన్మభూమియు విశాలదేశపురాజధానియునగు లలితపట్టణమునందున్న సుమిత్రుండను నొకసత్రీనాయనకు చారుచంద్రుని గృహవిషయములనుగూర్చియు, కాంతనాథమాధవభాస్కరులను గూర్చియు, రహస్యముగా విచారించి తనకు వ్రాయవలయునని యొకయుత్తరమును వ్రాసెను. ఈయపరాధరహస్య పరిశోధకుఁ డాప్రాంతముల విశేషప్రఖ్యాతిని సంపాదించినవాఁడును, విఠలునకుఁ బ్రాణమిత్రుండునై యుండెను. “మాధవభాస్కరులుకూడఁ జారుచంద్రుని కుటుంబమునకు సంబంధించినవారలేమో? కాంతనాథుని నాశనముచేయుటవలన వీరి కేమైన విశేషలాభముండునేమో?” అని విఠలుఁడు విశేషముగ యోజించుకొనుచుండెను. మిత్రునియొద్దనుండి సకాలమునకు వచ్చిన ప్రత్యుత్తరము విఠలున కెంతయో యుత్సాహమును గలిగించెను. ఇఁక వెనుకముందు లాలోచింపనక్కఱలేదనియు, మాధవభాస్కరులను వెదకవలయుననియు, బహుశః వారిరువురును, ఇంగలపు సుందరయ్యపూటకూటియింటియం దుండవచ్చుననియు భావించెను. ఆపూటకూటియిల్లు “జార్జి మార్కెట్టునందలి పోలీసుస్టేషనునకు సమీపమునందేయుండెను. ఆగృహాంగణము చాల మనోహరముగా నుండెను. కాని, లోపలికిఁబోయి చూచినచో నట్లగపడుటలేదు. ఒకమూల పాడైపోయినయొక రాగమాల (**Piano**) యుండెను. దుమ్ము[illegible] మొగముతో దానినొక పురుషుఁడు బాగుచేయుటకెన్నియో విఫలప్రయత్నములను జేయుచుండెను. నడిమిహాలునందును, తక్కినగదులయందును జనులు క్రిక్కిరిసియుండిరి. తంబాకుధూమముయొక్కయు, నాసికాచూర్ణముయొక్కయు వాసనలతో నాప్రదేశము నిండిపోవుచుండెను. ఆపూటకూటియింట స్త్రీలుకూడ దిగుచుండుటకలదు. విఠలుఁడు తలను లోపలికి వంచిచూచెను. అక్కడనున్నవారిలోఁ జాలమంది

తమదుర్మార్గప్రవర్తనముసకుఁగాను విశలునిచేతిలోఁబడి శిక్షను బొందిన వారలే. అందువలనఁ దఱచుగ వారలకందఱకును జెఱసాలయె పుట్టిల్లగుచుండెను. వారందఱును "కేడీ" పట్టికలోఁ దమపేరును జేర్పించుకొన్నవారే. కాని, మాధవభాస్కరులు దొరకకపోవుటచే విశలుఁడు తిరిగితిరిగి వేసారుచుండెను. అంతలో మేడమీఁదనున్న యొకగదిని పరీక్షింపలేదనుచాపల్య ముండుటచే నాతఁడక్కడకుఁ బోయెను. ద్వారమునొద్ద నొకపరిచారకుఁడు కావలియుండుటచే లోపలికిఁ బోవుటకు వలనుగాకపోయెను. అయినను విశలుఁడు సమయమునకై వేచియుండెను. ఆసమయమునకుసరిగ నొక స్త్రీ యక్కడకువచ్చి విశలునిహస్తమును బట్టుకొని "ఇదేమి విశలా! ఇక్కడకువచ్చితివేమి? ఏదైననేరముకు బట్టుకొనుటకు వచ్చితినాయేమి? ఏమైననాచూకీ తెలియవలసియున్నదాయేమి?" అని యడిగెను.

ఆయంగనసామాన్యురాలుకాదు. పోలీసుద్యోగస్థులనందఱను బాగుగ నెఱింగినప్రోఢ. ఏచెఱసాలయు నామెకపరిచయస్థలముకాదు. అందువలననే యామెకెప్పుడును నెట్టిసంకోచమును నెవ్వరిలక్ష్యమును లేకుండెను. పోలీసువారుగూడ నామెపేరువినినంతనే గడగడ వడఁకి పోవుచుందురు.

విశలుఁ డట్లైనిస్సైరపడి "నేనిక్కడకువచ్చియుండుట వీరికిఁ దెలిసినచో నాప్రయత్నమంతయు విఫలమైపోవునుగదా!" అనియనుకొనియెను.

కాని, తనహస్తమునుబట్టుకొన్నవారెవ్వరో తెలిసికొనునంతవఱకే యాతనియాందోళనము — విశలుఁడా స్త్రీముఖము జూచిన

తోడనే ధైర్యమును వహించెను. ఆమెగాక యితరులెవ్వరైనఁ దన్ను గుర్తించినచో నపాయము కలిగియేయుండును. కాని, నళిని తన్ను జూచుట తనకార్యమునకు మఱింతసహాయమని యాతఁడెంచు కొనియెను. ఆమె తనకీసమయమునఁ దప్పక సాయముచేయునని యాతఁడు విశ్వసించెను.

అప్పుడు విఠలుఁడేకాంతముగ "నళినీ! నేను మాఱువేషముతో వచ్చినను నన్నెట్లుగుర్తించితివి?" అనియెను.

నళి : విఠలా! నీ వేషమునుజూచి గ్రహింపలేను. కాని, నీ దక్షిణహస్తముమీఁద నీ గొప్పమచ్చయుండుటను నేను చూచి యుంటిని. దానినిబట్టియే నిన్నుగుర్తించితిని.

నళినిచెప్పినది సత్యమే. ఒకనేరమును గూర్చి పరిశోధించు చున్న సమయమున నొకదురాత్ముఁడు విఠలునిచేతిని దనకత్తితో నరకెను. దైవవశమున నాదెబ్బ దూసికొనిపోయెను. ఆ గాయపు మచ్చనుబట్టియే నళిని యిప్పుడు విఠలుని గుర్తింపఁగలిగెను.

విఠ : నళినీ! ఇఁకముందు మఱింతజాగరూకతతో నుండెదను లెమ్ము—

అని తన చొక్కాయిచేతులను ముంజేతులవఱకును లాగుకొని పిమ్మట "ఓసీ! నళినీ! నీవిక్కడ నేమిచేయుచుంటివే? అనియెను.

నళి : నేనిక్కడ, నొకరికి సేవచేయుచుఁ గాలక్షేపముచేయు చున్నదానను.

విఠ : ఎవ్వరికి?

నళి : అదంతయును రహస్యవిషయము. ప్రేమలతామహిమము శేషునివర్ణింపఁగలను?

విఠ : నీ పక్షమువారు– నీయజమానులు – ఏగదియందున్నారు?

నళి : ఇదిగో ! ఈ యేకాంతగృహమున.

విత : అక్కడ నెవ్వరో చాలమంది యున్నట్టులున్న దే ? ఎవ్వ రెవ్వరున్నారో యెఱుంగుదువా ? వారివారిపోలికలను నీవు చెప్పఁ గలవా ? అట్లుచెప్పినచో నిఃశ్శ నీకుఁదగిన బహుమానము దొరకును.

నళి : ఓహో ! సరియే ! ఈలోపలనలుగురున్నారు. అట్లయినచో నీ కార్యమొక నిమిషములో నెఱవేఱును. ఒకఁడున్నతుఁడు ఆతఁడు విశాలదేశమువాఁడు. లలితపట్టణ వాస్తవ్యుఁడు. ఇంకొకఁడాతని ప్రాణమిత్రుఁడు. ఆతఁడు పొట్టిగనుండును. మిగిలిన యిరువురిలో నొకఁడు నాగేశుఁడు. ఇంకొక తె పూటకూళ్లయజమానుని భార్యయగు నాదిలక్ష్మి. ఆమె తానరుంధతి యపరావతారమనని డంబములు పలుకుచు నెల్లప్పుడును వీరినివిడువక తిరుగుచున్నది. అందువలనసే నేనిప్పు డామెగుట్టును బట్టబయలుసేయవలయునని కనిపెట్టుకొని యున్నాను.

నళినిచెప్పిననలువురిలో నిరువురు తనకుఁగావలసిన మాఘన భాస్కరులనియు, మిగిలినవారు వారిదుష్టోద్యోగమునకు సహాయకు లనియు వితలుఁడూహించి, మాగదిలో వారేమిమాటాడుకొను చున్నారో వినవలయునను తమకముతో "నళినీ ! నీకు ధనము సంపాదించుకొనవలయునను నాశయున్నదా ?" అనియెను.

నళి : అయ్యో ! మీ రేమి యిట్లనుచున్నారు ? నా సంకల్పమే యదిగాదా ? నేనేపనికి వెనుకదీయుచున్నాను ?

విత : అట్లయినచో నేను నిన్ను నమ్మనచ్చునా ?

నళి : ఆహా ! ధారాళముగా నమ్మనచ్చును. ఇప్పుడు నీకేమి కావలయును ?

విత : ఏమియునక్కఱలేదు — లోపల వా రేమిమాటాడు చున్నారో తెలిసికొనవలయును.

నళి : అట్లయినచో నాగది పక్కనున్న చిన్నగది విడిగానున్నది. కాని, దాని కాదిలక్ష్మి తాళమువేసికొనియున్నది. చాలనద్దెనిచ్చినం గాని యదిమనకు లభింపదు. దానిలోపలంగూర్చున్నచో వారుచెప్పుకొను చున్నమాటలన్నియు బాగుగ వినవచ్చును.

విర : అయినచో వెళ్లుము. దానినద్దెకుందీసికొనుము.

నళి : బహుశః దానికామె పదిరూపాయలయద్దె నడుగు నేమో ?

విర : ఇదిగో ! ఈనోటును దీసికొనుము.

నళినివేగముగంబోయి యాగదితాళపుంజెవిని దీసికొనివచ్చెను. ఆమెయును విరలుండును నిశ్శబ్దముగా నాగదిలోనికిఁబోయి తలుపులు వైచుకొని సావధానముగా వారిమాటల నాలకింపుచుం గూర్చుండి యుండిరి. ఈగదికిని మాధవుండు మొదలగువారు మాటాడుచున్నగదికిని నడుమనొకపటభిత్తిక ( screen ) మాత్రమడ్డముగా నుండెను. అందు వలనవారు చెప్పుకొనుచున్నమాటలన్నియు నీగదిలోనికి స్పష్టముగా వినవచ్చుచుండెను.

మాధవుండు నాగేశునితో "నాగేశా ! ఆపిల్లనెట్లయినం దుద ముట్టింపవలయును. అట్లుచేయక యామెనెక్కడదాచియుంచినను మనకపాయమురాకతప్పదు.

విరలుండామాటలనువిని ఈప్రసంగము ప్రఫుల్లనుగూర్చియే జరగుచున్నదనియు, నింతవఱకును దైవకృపవలన నామె ప్రాణములతో నున్నదనియును, నిఁక నామె కపాయమువాంగలదనియును యోజించు కొనియెను.

నాగే : నీవందుఃకుందగినధనమునిచ్చెదవా ?

మాధ : ఆహా ! నీవామెను దుదముట్టించి వచ్చినపిమ్మట నమూల్యమగు సిధలోనున్న యామంజూషయే నీకుదొరకునుగదా !

నాగే : సరి ! బాగుగనేయున్నది. ఆపేటిక యెక్కడనున్నది ? అది యామెయొద్దనేయున్నదా ? అది తనయొద్దలేదని నాతోఁ జెప్పి యున్నదే !

మాధ : ఎప్పుడు చెప్పినది ?

నాగే : ఈదినముననంతయును విస్పష్టముగఁజెప్పినది నేను తనకు సాహాయ్యముచేయుదునని యామెనమ్మియున్నది. పాపమామె సాధుస్వభావముగలది.

మాధ : ఆపేటిక యెక్కడనున్నదని చెప్పినది ?

నాగే : విఠలమూర్తియొద్దనున్నదఁట. ఈ మాటవినుటవలన, గుండెదడదడకొట్టుకొనుచున్నదికాదా ?

మాధ : విఠలునియొద్దరా ? అదియక్కడ కెట్లుపోయినది ? ఈసంగతియంతయు నాతని కెట్లు తెలిసినది ?

నాగే : ఇదేమి ? నీవాతని నెఱుఁగుదువా ?

మాధ : బాగుగనెఱుఁగుదును. కాని, పరిచయములేదు. అతఁడు మిగుల నసాధ్యమనుష్యుఁడు.

నాగే : ఆతఁడు ప్రసిద్ధికొందిన పత్తేదారుఁడు. కాని, యాతఁడీ నేరమునుబట్టుకొనుట కింకను ప్రవేశింపలేదని నిన్నటివఱకును నాకుఁ దెలియును. ఇప్పుడా బాలిక యాపేటికను తానుస్వయముగ నాతని కిచ్చితినని చెప్పుచున్నది.

మాధ : దైవవశమున నీసంగతి మనకుఁదెలియుట మేలైనది. ఇప్పుడామెయిల్లువిడిచి వచ్చినసంగతి యాతనికిఁదెలిసియున్నదా ?

నాగే : లేదు. తెలియలేదు. ఇంతేగాక యామె గోపురున కీ గొడవ యక్కఱలేదు. ఆతఁడు పశుప్రాయుఁడు. ఎప్పుడును నింటి పట్టున నుండుటలేదు. ఆతని కిక్కడనక్కడ తిరుగుటయే గాని మఱి యొకగొడవ యక్కఱలేదు.

మాధ : మనము సౌదామిని నించుక హెచ్చరింపవలయును. ఇప్పుడా మరకతమంజూషను బడయుట బహుసులభము. ఇందులకుఁ దగిన యేర్పాటులను చేయునట్లు సౌదామినితోడను, తిలకసుందరి తోడను జెప్పవలయును. సౌదామిని, తా నిచ్చియున్న మంజూషను దనకుఁ దిరిగి యీయవలసినదనియు, ఇఁక ముందపరాధశోధనమును గూర్చినచర్య లేవియును జరుపనక్కర లేదనియు, విరలునకు వర్తమాన మంపునట్లు చేయవలయును. ఆతఁడు ప్రఫుల్ల నతిపరిశీలనదృష్టితోఁ జూచియుండని కారణమున, ఆమె వేఱనియు, మన సౌదామిని వేఱనియు, భేదదృష్టితో నుండఁజాలఁడు. ఒకవేళ నట్టి భేదదృష్టితో నాతఁడున్నను, సౌదామిని, వారణుని నిజసహోదరునిగఁ జూచికొనుచుఁ బ్రేమించుచున్నది. కావున, నాతఁడుకూడ నేమియును జేయఁజాలఁడు.

భాస్కరుఁడు : నా భార్య సామాన్యురా లనుకొన్నాను సుమా ! ఇందువలన మాయా ప్రఫుల్ల యగు సౌదామిని భాస్కరుని భార్య యని స్పష్టపడియెను. విరలుఁ డా దుర్మార్గుల కృత్రిమ కార్యాలోచనము నందలి సారాంశమును బాగుగ గ్రహించెను. మఱియు, నాగేశుఁడు తనవిషయమున విశేషాంశముల నింతవఱకుఁ దెలియకుండ నుండుట మిగుల క్షేమకరమని భావించుకొనియెను. ఆతఁడు ప్రఫుల్ల నెక్కడనో చెఱలో (నిర్బంధమున) నుంచియున్నాఁడనియు, తా నాతని వెన్నంటి పోయి యీ సంగతి తెలిసికొనవలయుననియు యోజించుకొనియెను.

కొన్ని నిమిషము లైనపిదప మాధవుఁడు "ఎట్లో యీ పెట్టె మాత్రము సౌదామిని యొద్దకు రానిమ్ము. ఆ పిమ్మట నా విఠలుని తల యున్నప్పుడు చూతము——" అనియెను.

నాగే : నేను నా సంగతిని గూర్చియే యోజించుచున్నాను. ఈ ద్రోహి పాలపాని యందలి యీ గోరీని పరీక్షించివచ్చినాఁడు కాదా ? అప్పు డేమైనది ?

మాధ : ఆమె యీ సంగతిని గూడఁ జెప్పినదా ?

నాగే : ఆమెకూడ దానిని చూచియున్నది.

మాధ : అట్లయినచో నా విషయమున నామె యేమేమి చెప్పినదో చెప్పఁగలవా ?

నాగే : నే నీ దినమున బాగుగ నమ్మఁబలికినపిమ్మట నామె పాలపానియొద్ద కాతనితోఁ బోయి యీ గోరీని పరీక్షించిన సంగతుల నన్నిటిని చెప్పినది.

భాస్క : (చప్పటులు గొట్టుచు) అబ్బా ! ఎంతపని చేసినాఁడు!

మాధ : ఓహో ! విఠలున కివియంతయుఁ దెలిసినచో మన కపాయమే సంభవించును. సౌదామిని వేయికన్నులతో నుండి యాతని విషయమున జాగరూకతతోఁ బ్రవర్తింపవలయును. కాంతనాథుని శవము లలిత పట్టణమునకుఁ బంపివైవఁ బడినదని చెప్పుటయేగాక ; పాలపాని యొద్దనున్న గోరీలో శవము లేకపోవుట కేదైన నొక నెపమును గల్పింపవలయును. నాగేశా ! తరువాత నా విఠలుని యమసదనమునకుఁ బంపితీరవలయును. ఇందులకై తాఁపు సౌదామినీ గృహమునకుఁ బోయి యక్కడనే యుండి యాతని నక్కడకుఁ బిలిపింపవలయును. అప్పుడు నే నక్కడనుండి యాతని మట్టు బెట్టవలయును.

నాగే : (మీసములను మెలివైచుచు) నా కాతనిఁజూచుకకెట్టదు. ఆతఁడు నా చేతిలోఁ జిక్కనిమ్ము. మెడలువిఱిచి పడఁగొట్టెదను.

మాధ : సౌదామినియు, తిలకసుందరియును జేరి వారిద్దరిని దమవలలో నైచుకొనిరి. మనకాతని భయమేమియును లేదు. ఆ పేటిక మనచేతిలోఁబడుట—ప్రఫుల్లకును విఠలునకును పరలోకప్రాప్తియగుట—వారణునకు దేశభ్రష్టత్వముకలుగుట—ఇవన్నియును జరిగినపిమ్మట మనము లలితపట్టణమునకుఁబోవచ్చును. అక్కడ సౌదామని ప్రఫుల్లా నామముతోఁ గాంతనాథుని యాస్తికంతకును సభకారిణియై సుఖముగాన వచ్చును. రమ్ము. నేఁటికీప్రసంగము కట్టిపెట్టుదము. రేపు మఱలఁగలిసి కొని మాటాడుకొనవచ్చును.

మాధవభాస్కరులిరువురును బయలుదేరిరి. నాగేశుఁ డాని లక్ష్మితో నక్కడనేయుండెను. ఆదుష్టాత్ములు తమ దురాలోచనముల నన్నిటిని ప్రమాదవశమున మాటాడుకొనుట రోట్టెజారినేతిలోఁ బడినట్లు విఠలునకుఁ జాలననుకూలించెను. విఠలుఁడు మాధవభాస్కరు లను వెన్నాడింపవలసియున్నను నాగేశుఁడు ప్రఫుల్ల నెచ్చటదాచి యుం నదియుఁ దెలిసికొనుట తనకు మిగుల ముఖ్యాంశమగుటచే నాతఁడు వారినివిడిచి నాగేశుని వెన్నంటిపోయెను.

ఆపోవుటకుముందుగనే విఠలుఁడు నళినినిజూచి " నళినీ! మునుపు వీరేమిమాటాడుకొందురో జాగరూకతతో నాలించివచ్చి నాకుఁ జెప్పుము " అనియెను.

అందులకామె సమ్మతించెను. విఠలుఁ డెవ్వరికిని దెలియకుండ బైటికివచ్చి యొకరహస్యప్రదేశమున దాగియుండెను. అప్పుడు నాగేశుఁడొక్కఁడే వెలుపలకువచ్చెను.

# ఏడవ ప్రకరణము

నాగేశుఁడు ఫ్రూటకూటియింటి తలవాకిటనిలిచి యటునిటు తొంగితొంగిచూచెను. తన్నెవ్వరును జూచుటలేదని మనస్సునదృఢపఱచుకొన్న పిమ్మట నాతఁడు ముందునకడుగు వెట్టెను. అప్పుడు చాటునదాగియున్న విఠలుఁడీదుష్టునిచర్యల నన్నిటిని పరీక్షించుచుండెను.

నాగేశుఁ . దానవనగరపూర్వభాగమునందలి పెద్దవీథినిదాటి యడ్డవీథినిజేరి యచ్చట నొకయింటిలోఁ బ్రవేశించెను. ఆయింటి పేరును విన్నతోడనే యాపట్టణవాసులందఱును గడగడవడఁకుచుందురు. అది యన్నిహత్యలు జరగినస్థలము. నభోమండలము మేఘాచ్ఛాదితమైయుండుటచే నక్షత్రకాంతియించుకంతయును లేక యారాత్రిభయంకరముగానుండెను. భూమ్యాకాశములు రెండునేకమై యున్నట్లుండెను. అంధకారము సర్వత్ర తననిరంకుశాధికారమును వ్యాపింపఁజేసెను. జీవకోటులన్నియును నాయంధకారసముద్రములో మునిఁగిపోవుటచేతఁగాఁబోలు నేమూలనుగూడ నెట్టిశబ్దమును

వినవచ్చుటలేదు. నయనానందకారిణియగు ప్రకృతికాంత యప్పుడు మఱుఁగువడిపోయెను. ఆ స్థానమున—ఆ రంగస్థలమున—తుదిమొదలు లేని యొక కాళమూర్తి ప్రళయానుకూలముగ నృత్యమును జేయుచున్నట్లుండెను. ఆమె నీలకటాక్షమాలికలా నీలాకాశములోఁ జేరిపోవుచుండెను. ఆమె మలినవికృతహాస మా యంతరాళములో నైక్యము నొందుచుండెను. అంతయును భీభత్సాకారము—అఖిలమును దన్మయము. అదిలయకాలము గాక యింకేమియును గాదు—అంతయును గాఢాంధకారమయము.

ఆ గాఢాంధకార సమయమున నా గృహ మొక మహాభూతమువలె నుండెను. అక్కడ దీపము లెట్లుండును? అదియొక పాడుగృహము—

నాగేశుఁ డా యింటిలో వాసము చేయుటలేదని విఠలునకు దెలియును. ఇప్పుడీ గృహమున నాగేశుఁ డేమిచేయునో చూడవలయు నని విఠలుఁడు కుతూహలపడుచుండెను. నాగేశుఁ డా గృహద్వారము నొద్దకుఁ బోయి తలుపు తాళముతీయుట నెఱింగి, యతఁ డప్పు డప్పు డీ యింటికి వచ్చుచుండుట కలదని విఠలుఁ డూహించెను. నాగేశుఁడు లోనికిఁబోయిన పదినిమిషము లైనపిమ్మటఁ గూడ నా యింటిలో వెలుతురే కనఁబడలేదు. అప్పుడు విఠలుని యనుమానము మఱింత దృఢపడియెను.

విఠలుఁడు గృహమువెనుకకుఁ బోయి దొడ్డిగోడ నెక్కి నిశ్శబ్దముగా నా యింటిదొడ్డిలోనికి దిగియెను. తుదకుఁ దనకేమి యపాయము వచ్చినను సరియే తప్పకుండ నీయింటిలోపలికిఁ బోయి యిందేమిజరుగుచున్నదో చూడవలయు నని యనుకొనియెను. కాని, ద్వారములన్నియును మూయఁబడి యుండుటచే నా కార్య మసాధ్యముగా గనఁబడెను.

అయినను విఠలుఁడెంతమాత్రమునుజింతింపక తనయొద్దనున్న ఖడ్గసాహాయ్యమున నొకగవాక్షమునందలి యూచలనన్నిటి నూడదీసెను. ఆతనికి ద్వారమినుపసలాకలతో నిర్మింపఁబడియుండినమాత్రమేమిటిక్యము ? తుదకామార్గమున లోపలఁబ్రవేశించెను. ఆతఁడుదిగినప్రదేశము వంట యిల్లుగానుండెను. అప్పుడాతఁడు తనయొద్దనున్న చిన్ని చేతిలాంతరును వెలిగించిచూడఁగా నాయింటిలో జాలదినములనుండి యెవ్వరును గాపురముచేయుట లేనట్లగపడెను.

అక్కడ వాయుసంచారమునకుఁగూడ నవకాశములేనికారణమున విఠలున కూపిరిబిగబట్టినట్లుండెను. అంతియెకాక, దుస్సహమగు నేదోయొకదుర్వాసన యాయింటినావరించి యుండుటచే నాతనికొక్క క్షణమైన నక్కడనుండుటకసాధ్యముగానుండెను. నిర్మలవాయుసేవనమునకై విఠలుఁడు తనతలను గవాక్షమునుండి యీవలికిఁబెట్టుకొనియెను.

"అయ్యో! భగవానుఁడా! ఈ దుర్గంధమును జూడఁగానిక్కడ నేమూలనో మనుష్యదేహము కుళ్లియున్నట్లు తోఁచుచున్నది— అయ్యో! తెలిసినది. ఆదురాత్ములు కాంతనాథునిశవము నిచ్చటనే పాతిపెట్టియుండవచ్చును. ఇదియంతయును సంపూర్ణముగఁ బరిశోధించినఁగాని యీ యింటినివిడిచి పోరాదు" అని నిశ్చయించుకొనియెను.

అందులకై ఆయింటియందన్ని తావులను బాగుగఁ బరీక్షించుచుఁ బోవుచుండఁగా నొకచోట దిబ్బుమనుశబ్దమయ్యెను. అదిభూగృహద్వారము. విఠలుఁడు దానిని తెఱచెను అక్కడ శవముకుళ్లినదుర్గంధము విశేషముగానుండెను. అదిసహించుటకు వలనుగాకుండుటచే నాతఁడు కొన్నినిమిషములకే వెనుకకు రావలసివచ్చెను. ఆతఁడు ముఖమును

జిట్లించుకొనియెను. ఆతని కనుబొమలు ముడివడియెను. ఆతఁ డప్పుడు రెండుచేతులతోడను ముక్కును బిగఁబట్టుకొని, యెట్టులో సహించుకొని మఱలఁ గ్రిందికి దిగియెను. మెట్ల క్రిందిభాగ మఱుగు పైచిన జారుచుండెను. అక్కడ పచ్చగ పాకుడుగట్టిన కొన్నిబల్లలు పడియుండెను. ఈ దుర్గంధ మెక్కడినుండి వచ్చుచున్నదో చూడవల యునని సాహసముతో ముందునకుఁ బోగా నాతనికక్కడ నొక బావి కనఁబడెను. దానిపైని రాతిపలకను మూసియుంచిరి. విశలుఁడు చాలకష్టపడి వానిని పైకమీటి తొలగించెను. శవము కుళ్లిన దుర్గంధ మా బావినుండియే వచ్చుచుండుట యిప్పుడు స్థిరమయ్యెను. పిమ్మట నాతఁడొక చిన్నరాతి నందులోనికి విసరివైచెను. అది లోపలఁ బడిన చప్పుడువలన నూయి చాల లోతుగ నున్నదనియు నడుగున నీరుగూడ నున్నదనియుఁ దెలియవచ్చెను. అయ్యో! కాంతనాథుని శవమునే యిందుఁ బాఱవైచి' రని యాతఁ డనుకొనెను. కాని, దానిని పైకిఁదీసి చూచుటకు మార్గ మేమున్నది? ఈ విషయమును గూర్చియే యాతఁడు మిగులఁ బరితపించెను. లోనికిదిగుట యసాధ్యము. కాక, పైనుండియే లోపలివస్తువును పట్టియెత్తుటకుఁ దగిన సాధన మేమియును లేదు. కాని, యా సమీపముననే కొన్ని వెదురుగడల ముక్కలు పడియుండెను. సమీపమున నొక యినుపకొండి గూడ నుండెను. విశలుఁ డా ముక్కల నొకదానితో నొకటిఁ జేర్చి తన పంచెను చించి యా పేలికలమూలమున వానిని బిగించికట్టి యా యినుపకొండిని దానిచివరఁ గట్టి దానిని బావిలోనికి దింపి యటు నిటు కలఁగఁద్రిప్పగా లోపల నేదో యొక మృదుపదార్థమున్నట్లు గోచరించెను. మఱియు నది యా లోపలఁ దేలియాడుచుండుటచే నా యినుపకొండికిఁ దగుల్కొనియెను. అప్పుడు విశలుఁడు దానిని మీఁదికిఁ

క్రమముగఁ జేరుకొనియెను. ఆ వస్తువు చాలబరువుగ నుండెను. అది సమీపించినకొలఁది నా దుర్గంధ మధికాధిక మగుచుండుటచే నాతఁడందులకు సహింపఁజాలక దానినట్లే పాఱవైచి యీవలకు రావలయు నని యనుకొనియెను. కాని, పూనినకార్యమును నెఱవేర్చుట యుత్తమధర్మమని యెంచి యెట్టులో దానిని పైకిఁదీసెను.

ఆ పిమ్మటఁ జేతిలాంతరును బట్టుకొని పరీక్షించుటకు సమీపించుసరి కాతనికి గుండెలో దడపుట్టునంతటి భయముకలిగెను. ఆతని కాలుసేతులు వడఁకసాగెను. మనసులో జుగుప్స పుట్టెను. దడచే దౌడలు దగ్గరఁబడుచుండెను. శరీరము కంటకిత మయ్యెను. విఠలుఁడు గాక మఱెవ్వరైన నట్టిభీభత్సప్రదర్శనమును జూచుటయే తటస్థించినచో వారలట్లే ప్రాణములను విడిచిపెట్టుదురని మేము నిశ్చయముగఁ జెప్పగలము.

అదియొకతరుణవయస్కుని కళేబరముగా నుండెను. కేవలము సన్నిహితబంధువులుకూడ గుర్తింపలేనంతవఱకు నది చెడిపోయి యుండెను. కంఠమును సగమువఱకుమాత్రముకోసిరి. కట్టుకొనిన బట్టలు విశేషామూల్యములుగ నగపడుచుండెను. కాని, విఠలుఁడు గుర్తించుటకుఁదగిన చిహ్నములెవ్వియు నాకళేబరమున నగపడుట లేదు. ఆతఁడు కొన్నినిముషములవఱకుఁ దనచేతిలాంతరు వెలుఁగున నాశవమును బాగుగఁ బరీక్షించెను.

" ఈనీచముగా హానికిఁగుఱియైనవాఁడెవ్వఁడు ? ఈదేహము కాంతనాథునిదేనా ! బహుశః ఇదియాతని దేహమువలెనే యున్నది. అంతేకాదన్న—ఆదేవయసు—కానిమ్ము. ఇదకాంతనాథుని దేహమైనచో, గొంతుకనుగోయవలసిన యవసరమేమివచ్చినది ? " ఈవిధమగు యోచనలన్నియు విఠలునితలకెక్కి, యొకదానికొకటి సంబంధపడక యుండి యాతని నస్థిమితునిగాఁ జేసివైచెను.

ఏమైనను ? — ఎవ్వరైననేమి ? — హత్య — నరహత్య జరిగినది. విఠలుఁడా సంగతిని గనిపెట్టెను. అది కాంతనాథుని దేహమే కానిమ్ము; మఱియొకనిదే కానిమ్ము; కృత్యమొక్కటియే — ఇప్పుడు విఠలుఁడీ సంగతిని పోలీసువారికిఁ దెలియఁజేయవలయునా ? అక్కటా — అబ్బా ! ఒకవేళ నీనేరమును బయలు పెట్టుట కాముగాత్ముల ను వెన్నంటిపోయి నచో, వారు పాఱిపోవుదురు. అప్పుడు విఠలుఁడు పడినకష్టమంతయు బూడిదలోఁబోసిన పన్నీరువంటిదగును. అదియునుగాక, యీదేహము కాంతనాథునిదేయనియు, వారే నేరముచేసినవారనియు, ఋజువుచేయుటకు విఠలునియొద్ద నెట్టియాధారములును లేవు. అంతియేగాక, "కాంతనాథుఁడు చంపఁబడియెను — కాక, చనిపోయెను" అని స్థిరపఱచుటకుఁ గూడ విఠలునకవకాశము లేదు. ఈవిషయములనుగూర్చి చాలసేపు యోజించి తుదకుఁ దానీవిధముగ శవమునుజూచుటను, బహిరంగము సేయరాదని నిశ్చయించుకొనియెను. ఎందువలననఁగా — విఠలుఁడు ప్రఫుల్లనుద్ధరించుటకీవిధముగఁ బ్రవర్తింపవలసినవాఁడయ్యెను.

. . . . . . . . .

ఆచీఁకటినేలమాళిగయందొక జాఁకయుకాయపెట్టె పడియుండెను. విఠలుఁడా శవమును దానిలోనుంచి బల్లనుమూతవైచి దానిమీఁద నానాతాళిబంధ నెత్తిపెట్టెను. ఇఁకఁగొన్ని దినములవఱకు నక్కడనే యుంచివైచి సరియైనసావకాశము కలిగినప్పుడు దానిని బయటఁబెట్ట వలయునని విఠలుఁడూహించుకొనియెను.

. . . . .

అదియంతయునైనపిమ్మట విఠలుఁడుమీఁదికివచ్చి నేలమాళె గుమ్మమును మునుపటివలె భద్రముగామూసివైచి యడుగులుచప్పుడు గాకుండ మెల్లఁగ మేడమీఁదికెక్కసాగెను. పిమ్మట నక్కడనేమి వినవచ్చునోయని చెవియిచ్చివినుచుండెను. అక్కడిహాలు చాల

విశాలముగానుండెను. ఎన్నియోవత్సరములకుఁబూర్వ మాయింట నొకవర్తకుఁడు వాసముచేయుచున్నప్పుడు విఠలుఁ డీమేడమీఁదికి వచ్చియుండెను. ఆపరిచయమిప్పు డాతనికిఁజాల మేలుకలిగించెను. అతఁడన్నిగదుల నొకదానివెనుకనొకటిగ వెదకసాగెను. దేనియందు నెవ్వరునులేరు. తాను భూగృహమునందున్నప్పుడు నాగేశుఁడింటికిఁ బోయియుండవచ్చునని యూతఁడుతలంచెను. పిమ్మట మూఁడవ యంతస్తునకుఁ బోయిచూడఁగా, నక్కడిహాలును జేరియున్నగదితలుపు సందునుండి సన్ననిదీపపుఁగిరణములు ప్రసరించుచుండుట యగపడెను. విఠలుఁడిప్పుడు మిగులజాగరూకతతో నాద్వారమునొద్దకుఁబోయి స్తంభమువలెనిలుచుండి యించుకతలనోరఁజేసికొని యుండఁగా నాతని క్రిందిసంభాషణము వినవచ్చెను.

నాగే : ఓరమణీరత్నమా ! నేను నిన్నువిశేషముగఁ బ్రేమించు చున్నాఁడను. నీకొఱకెంతటి యపాయములకైన లోనుగాఁగలను. ఎట్టికష్టములనైన ననుభవించుటకు సిద్ధముగానుంటిని. నీవుమాత్రము నాదానవగుము. ఆపిమ్మటనామహిమను జూపించెదను. మనమిరువుర మును లలితపట్టణమునకుఁబోయి యొకనెనుకటిపెనిమిటి యూస్తిననుభ వింతము.

కాంత : అయ్యా ! నేను నీమాటలనువినను,

నాగే : వలదు. అట్లనవలదు. వాగ్దానముచేయుము. నీవు స్వతంత్రురాలవయ్యెదవు.

కాంత : వలదు. వలదు. వాగ్దానమువలన స్వాతంత్ర్య మును బొందవలసిన యూవశ్యకత నాకేమియును లేదు. నీవు నాకాప్తునివలె నటించుచున్నాఁడవు. కాని, నీవు కేవలము కృతఘ్నుఁడవు. దుష్టుఁడవు. మోసగాఁడవు. నీసంగతి నేను బాగుగ

నెఱుఁగుదును. ఏ పాపాత్ములు నా పతినిజంపి నన్నుఁగూడ జంపుటకై యత్నించుచున్నారో అట్టిహత్యకారులకు నీ, వే విషయమునఁ దీసిపోవు వాఁడవు? తొలఁగిపొమ్ము. నా యెదుట నిలువవలదు.

నాగే : ఓ కాంతా ! నీవు నిమ్మకట దీనికొఱకుఁ జాలఁబశ్చాత్తాపపడియెదవు. జూచికొనుము. ఇంకను నొకదిన మవకాశ మిచ్చితిని. నేను ఱేపు వచ్చెదను. అప్పుడైన నొప్పుకొన్నఁ జాలును.

ఇఁక నీ దుష్టుఁడు క్రిందికిఁ బోవునని విశలుఁడు గ్రహించి మెల్లగ నాతఁ డెదుటిగదిలోనికిఁ బోయి ద్వారము మూసికొనియెను. నాగేశుఁడు వెలుపలకువచ్చి, యా కారాగృహద్వారమునకు బీగము వైచి మెల్లమెల్లగ నడుగులనిడుచుఁ గ్రిందికి దిగిపోయెను. కొంచెము సేపటికి వీథిద్వారము మూసినసద్దు వినవచ్చెను. పిమ్మట విశలుఁడా కాంత యున్న గదిగుమ్మముకొద్దకుఁ బోయి తనశక్తినంత నుపయోగించి యా తలుపు నదిమెను. అది ముక్కముక్కలై క్రిందఁ బడిపోయెను. లోపలనున్న యా కాంత గడగడవడఁకుచు నిలువఁబడి యుండెను. పిమ్మట నించుక ధైర్యమును దెచ్చుకొని యామె యా వైపునకుఁ జూచెను. ఎదుట నున్నవాఁడు విశలమూర్తి!---ఆమె యానంద దాటి శోకమున మునిఁగిపోయెను.

విశ : బిడ్డా ! ప్రఫుల్లా ! బ్రదికియుంటివా ? అని చెప్పుచుఁ దన కరవస్త్రముతో ముఖమునిఁదని చెమ్మటలను దుడిచికొనుచు లోపలికివచ్చి, క్రిందఁ దా నొనరించిన సాహసకృత్యముల నన్నిటిని సంగ్రహముగాఁ జెప్పి “ బిడ్డా ! నీ విక్కడ కెట్లువచ్చితివి ? నిన్నెవ్వరు తీసికొనివచ్చిరి ? ” అని యడిగెను.

ప్రఫు : నేను మా యింటి కచేరీచావడిలోఁ గూర్చుండి పుస్తకమును జదువుకొనుచుంటిని. అప్పుడు మా యన్న కేవో యొక

గొప్ప యుపాయము సంభవించినదనియు, ఆతఁడీ గృహమున నున్నాఁడనియు నాకొక యుత్తరము వచ్చెను. నేనా యుత్తరమును జదువుకొని చాల నాందోళనము నొందుచు నేనీ స్థలమునకు వచ్చితిని. నేనీ గృహమునకు వచ్చినపిమ్మట నిరువురుపురుషులు వచ్చి నా నోటికిబట్టను గట్టివైచిరి. నాకుఁ గేకలిడుటకుఁగూడ నవకాశము లేకపోయెను. తరువాత నన్ను, ఈ గదిలోవైచి పైని తాళమువైచిరి. ఆ గందరగోళములో వారెవ్వరైనదియు నేను గుర్తింపలేకపోయితిని. పిమ్మట నీ నాగేశునితక్క మఱెవ్వరిని జూడలేదు. ఈతఁడు ప్రతిదినమును మూఁడుపూటలను వేళకుసరిగా నన్నమును దీసికొనివచ్చి నాకుఁ బెట్టుచున్నాఁడు. మఱియు నన్నుఁ దనకిష్టసఖిగా నుండవలయునని నోటికివచ్చినట్లెల్ల ప్రేలి బ్రతిమాలుకొనుచున్నాఁడు. అదియునుగాక, యిచ్చట నా కనేకరకములగు నపాయములు తటస్థింపనైయున్నవనియు తాను చెప్పినట్లు విని నేను నోరుమూసికొని యూరకున్నచో నెట్టి తొందరయును గలుగఁబోదనియు నన్ను బెదరించుచున్నాఁడు. నేను నేఁటివరకు నాగేశుఁడు పెద్దమనుష్యుఁడనియే భావించియుంటిని. కాని, నేఁటిసంభాషణముమూలమున నాతఁడును తనస్నేహితులను వంచించి ప్రత్యేకప్రయోజనము నొందవలయునను ప్రయత్నమున నున్నట్లు తోఁచుచున్నది. ఎట్లయినఁ గానిమ్ము—ముఖ్యముగా దేవుఁడు దయామయుఁడు. నీవు నన్నుద్ధరించితివి. నేనిఁక నింటికిఁ బోవచ్చునా ?

విత : బిడ్డా ! అట్లుచేయరాదు. ఇంకను గొంతకాలము నిన్ను శత్రువుల కంటఁబడకుండ నిగూఢముగ నుంపవలసియున్నది. కావున నీవు నా జహాగీరుగ్రామమగు క్రొత్తమంగళమునకుఁ బోయి యచ్చట సురక్షితముగా నుండుము.

"ఈవితలుఁడు నాకొఱ కెంతకష్టపడుచున్నాఁడు!" అని యనుకొనుచుఁ బ్రఫుల్ల యాతఁడు చెప్పినదాని కంగీకరించెను. వితలుఁడు చాలసేపు యోజించి యాపిమ్మట నామెముఖమున బాగుగ దృష్టించి చూచి "ప్రఫుల్లా! నేఁ డిట్టి క్రింది భూగృహమునఁ జూచినశవమును జూడఁగల ధైర్యము నీకున్నదా? ఆశవవిషయమున నాకేమో సంశయ మగుచున్నది. నీవు కాంతనాథుని జూచియున్నదానవు" అనియెను.

ఆమాట విన్నతోడనే ప్రఫుల్లకుఁ గాలుసేతులు వడఁకసాగెను. ముఖము కళావిహీనమయ్యెను. పెదవులెండెను. అయినను నామె ధైర్యమును దెచ్చుకొని "వితలా! కానిమ్ము అక్కడకు నడువుము. పోయిచూతము" అనియెను.

వితలుఁడు ప్రఫుల్లహృదయదార్ఢ్యమునకుఁ జాలసంతసించెను. ఆతఁడు చేతిలో లాంతరునుంచుకొని బయలుదేరెను. ప్రఫుల్ల యా దుర్వాసనను సహించుకొనుచు నాతని వెనుకనే వచ్చుచుండెను. వితలుఁ డాపెట్టెయొద్దకుఁబోయి దానిమూఁత నెత్తి యాశవమును బైకిఁదీసి నేలపైనుంచి లాంతరును దానిపై పునకుఁ ద్రిప్పెను. అప్పటి యా ప్రఫుల్లస్థితిని వర్ణించి వ్రాయుటఁ జాలఁగష్టము. ఆమెయెట్టులో యంతయును సహించుకొని యొక్కమాటయైన నాడకుండ కన్నుల నీరువిడుచుచు నాశవమును దానియుడుపులను నిదానముగఁ బరీక్షింపసాగెను.

ప్రఫుల్ల యాశవము నెట్లుపరీక్షించుచున్నదియు వితలుఁడు మౌనముతోఁ జూచుచుండెను. ఆమెనోటినుండి యేమిమాట వెడలునో వినవలయునని మిగుల నాతురుండగుచుండెను. అప్పుడాతని కొకక్షణ మొకయుగముగానుండెను. ఆమెయంతయును గ్రమముగాఁ

బరీక్షించి తుదకు "ఇది కాంతనాథునిశరీరముకాదు. ఆమాటనిశ్చ యము" అనియెను.

జుగుప్సాకరమగు నీజీర్ణదేహమును విడలుచు మరల యథాస్థితియందుంచి మీఁదికివచ్చి ద్వారములనన్నిఁటిని మునుపటివలెనె భద్రముగా మూసివైచి ప్రఫుల్లతో నాగృహమునువీడి వెడలి పోయెను——

# ఎనిమిదవ ప్రకరణము

విఠలుఁడును ప్రఫుల్లయును గృహబహిర్ద్వారము నొద్దకు వచ్చిరి. అంతవఱకును ప్రఫుల్లధైర్యముతోడనే యుండెను. కాని, తరువాత వెనుకటి భయంకరవిషయము లన్నియునువచ్చి యామె స్మృతిపథమున నిలుచుటచే నామె విహ్వలచిత్తయయ్యెను. ఆమె యాకస్మికముగ జ్ఞానవిహీనురాలై క్రిందఁబడిపోయెను. అప్పుడామెను సేదదేర్చుట విఠలునకుఁ జాలకష్టమయ్యెను. తుదకాతఁడామె నొక గుఱ్ఱపుబండియందుంచి తనయింటికిఁ దీసికొనిపోయెను. అక్కడ విఠలుఁడును నటేశుఁడును నాదరపూర్వకముగఁ జేసిన శైత్యోపచారములవలన నామె మూర్ఛ దేరెను.

విఠలుఁడు వారణాలాలుని యుత్తరమును జదువుకొనియెను. అంతియేకాక, వారణుఁ డాయిరువురు స్త్రీలతోడనుగూడి నాటకమునకుఁ బోయినసంగతినిగూడ నటేశునిమూలమున వినియెను. ఈ రెండువిషయముల మూలమున నాతని హృదయము కలఁగిపోయెను. ఇఁకముందు వారణాలాలున కెట్టిరహస్యమును దెలుపరాదనియు, ప్రకృతమునఁ

ప్రఫుల్ల నా దొంగలగుంపుకంటఁ బడకుండఁ గొంతకాలము— అనఁగా—తన రత్నములన్నియు స్థిరించునంతవఱను, భద్రముఁగా దాచియుంచవలయుననియు, నిర్ధారణముచేసికొని, యా విషయమును గూర్చి నరేశునితో నాలోచించి యా దినముననే మొదటి పొగబండి యందే ప్రఫుల్లను నరేశునితో క్రొత్తమంగళమునకుఁ బంపు ప్రయత్నములను జేసెను. ప్రఫుల్ల మొదట నించుక సంశయించెను. కాని, విఠలుఁడు కష్టనష్టములనుగూర్చియు గుణదోషములను గూర్చియు బాగుగ వివరించి చెప్పినపిమ్మట యామె బయలుదేరుటకు సమ్మతించెను.

ప్రఫుల్ల వెడలిన పిమ్మట విఠలుఁడు కొన్ని దినములు విశ్రాంతి సుఖము ననుభవించెను. ఆ పాడింటిలోఁ గుల్లియున్న మనుష్యశరీర మునుగూర్చి విఠలుఁడు మాటిమాటికిని యోజింపసాగెను ఆ యోచనా పరంపరలో మునిఁగియుంచుటచే నాతనికి ముందేమిచేయవలయునో తెలియలేదు.

ఒకనాఁడు కార్యార్థమై విఠలుఁడెచటికో పోవలయునని సిద్ధముగా నున్నసమయమున నెవ్వరో తలుపుఁదట్టిన శబ్దమయ్యెను. చూడఁగా నామె నళిని—ఆమె వేగముగలోపలికివచ్చి తలుపుగొళ్లెము పెట్టుకొనియెను. ఆందోళనముతో వగర్చుచు విఠలునియొద్దకు వచ్చి "విఠలా! నేనిప్పుడే నాగేశునియొద్దనుండి వచ్చితిని. ఆతనినోట మన్నుపడినది. ఆతఁడిప్పుడు పాతాళమునకుఁబోయి పడినాఁడు" అనియెను.

విఠ : అదేమి ?

నళి : ఈ మధ్యాహ్నము నేను నాగేశునియింటికిఁ బోయితిని. పిమ్మట మేఘపురము నానాఁడు నీవు వచ్చిన పూటకూటియింటికిఁ బోయితిమి. అక్కడకు మాధవభాస్కరులు వచ్చిరి. పిమ్మట

నా ముప్పురు నాగదిలోనికిఁబోయి రహస్యముగా మాటాడుకొనిరి. నేను యథాప్రకారముగ నాప్రక్కనున్న చిన్నిగదిలోఁగూర్చుండి యన్ని సంగతులనువింటిని.

విర : ఏమిజరిగినది ?

నళి : నాగేశుఁడు వారిరువురనుజూచి "అపిల్ల నాజలదేవత యొద్దకుఁ బంపివైచితిని ఆమెశరీరమునుండి యెన్నియోచేఁపలకాహారముదొరకినది" అనిచెప్పగా నాదుష్టులత్యుల్లాసముతో నైదునోటుల నాతనికి బహుమానముగానిచ్చిరి

విర : ఆతఁడిట్లుచెప్పినంతనే వారంతధనమునిచ్చిరా ?

నళి : అవును—పిమ్మట నాయిరువురు నక్కడనుండి వెడలిపోయిరి. తరువాత నాగేశుఁడు నాయొద్దకువచ్చి తానువారికొకయెద్దును గొనిపెట్టితిననియు, ఆ ధనమువచ్చినదనియుఁ జెప్పెను. పిమ్మట ప్రఫుల్ల యెట్లుతప్పించుకొనిపోయినదనియు, బహుశః అవిషయమున విరలుఁడామెకుసాహాయ్యముచేసియుండుననియు, అవిషయమును గనిపెట్టి తనకుఁజెప్పినచో నాకుఁదగిన బహుమానమిచ్చెదననియుఁ జెప్పినన్ను మిగుల బ్రతిమాలఁజొచ్చెను. ఇప్పుడాతఁడు మరణావేదన నందుచున్నాఁడు.

విర : ఒకవేళ నాపిల్లదొరకినచో నాగేశుఁడు దేశాంతరమునకుఁ బోవలసివచ్చునుగాదా !—ఆతఁడు మాధవభాస్కరులకంతగా భయపడుచున్నాఁడని తోఁచుచున్నది.

నళి : ఆమాటనిజమే. నేనుపోయి యాతనితో నేదోయొక సంగతిని చెప్పినచో నాతనిప్రాణములు బొందిలోనుండవని తలం

విత : ప్రఫుల్ల చంపఁబడినదనియు, అందులకుఁదా మేమియును భయపడవలసినది లేదనియు మాధవభాస్కరులునమ్మియుందురు, ఇది యునుమంచిదే. మహాబుద్ధిమంతుఁడగు నాగేశుఁడే యీయువతి తప్పించుకొనిపోవుట కవకాశమునిచ్చునట్లుతోఁచుచున్నది. వితలున కీవిషయమేమియును తెలియదని చెప్పము.

నళి : అట్లేచేయుదును.

ముందెట్లుచేయవలసినదియు నళినికిబోధించి వితలుఁడామెను పంపివై చెను. పిమ్మట వితలుఁడు ప్రఫుల్లమేనమామయగు వాగీశుని వేషమునకుఁదగిన దుస్తులనుధరించి వారణలాలు గృహమునకు మామయ్యా ప్రఫుల్లయెుద్దనున్న గృహమునకుఁబోయెను.

ఆయింటిలోపల ముగ్గురునలుగురుచేరి మాటాడుచున్న శబ్దము వినవయ్యెను. ఒకతూలికాసనము ( sofa ) పై వారణుఁడును నాతని ప్రక్క తిలకసుందరియును గూర్చుండియుండిరి. సౌదామిని తిలకసుందరి యొద్ద దీపమునకు సమీపమున నొకకుర్చీబల్లపైఁ గూర్చుండెను. భాస్కరుఁడు రాగమాలికను ( Piano ) వాయించుచుండెను.

వితలుఁడు లోపలఁ బ్రవేశించుటనుజూచినది సౌదామిని. ఆమె యాక్షణమే లేచి "మామయ్యా ! రమ్ము. చాలసంతోషముగా నున్నది. ఇదిగో ! వీరందఱును మనకుఁ బరమాప్తులు. ఈ మధ్యాహ్నమునసే మేమందఱమును నీగృహమునకువచ్చితిమి. ఈతఁడునా నెచ్చెలియగు భరతమాధవి పెనిమిటి—మాధవుఁడు. ఈభాస్కరుఁడీ తనిస్నేహితుఁడు" అనియెను.

ఈవిధముగాఁ జెప్పినపిమ్మట వారందఱును వితలునకును నన్యోన్యగౌరవాచారములునడచెను. కాని, వారందఱును దమమన స్సులలో నీవృద్ధుఁడు రాకున్న చో బాగుగనుండునని యనుకొనిరి. వార లు మోహినీపార్శ్వమును వీడిరాకపోవుటచే నాతనితో నొక

నిమిషమైన రహస్యోక్తులనాడుటకు విశలున కవకాశము లేకపోయెను. మాధవభాస్కరులు ధరించిన చొక్కాలకుఁ దగిలించిన గొత్తముల లోని వజ్రము లావిద్యుద్దీపప్రకాశమున నక్షత్రములవలె మెఱసి పోవుచుండెను. తుదకారాత్రి పండ్రెండుగంటలగుసరికిఁ దిలకసుందరి లేచి "ఇఁక మేము మాగృహమునకుఁ బోవుదుమా!" అని చెప్పెను.

అప్పుడు సౌదామినియడ్డమునచ్చి "వలదు. వలదు. ఇప్పుడు కాదు. ఈ రాత్రి యిక్కడనేయుండుము. ఇక్కడఁ జాగావలసినన్ని గదులున్నవిగదా!" అనియెను.

తిల : ఏమి? కుత్సితచేష్టలను జేయుచున్నానా? అట్టిదేమి యును వలదు. నేనింటికిఁబోవలయును.

సౌదా : ఉండుము. సంకోచపడెదనేమి? ఇప్పుడేపోవలదు. ఈ రాత్రికైన నిక్కడనుండి మఱిపోవలయును.

ఈ విధముగ మాటాడుచు నా యిరువురుస్త్రీలును లోపలకుఁ బోయిరి.

భాస్క : నిద్రవచ్చువఱకైన మనమించుకసేపు పేకాడు కొందమా?

వార :: ఆహా! తప్పకుండ నాడుకొందము.

అనిచెప్పి లోపలికిఁబోయి యొకక్రొత్తపేకను దీసికొనివచ్చెను. అందఱును విశలునియొద్దకు వచ్చికూర్చుండిరి.

విశ : వలదు. నాకీయాట యంతబాగుగరాదు. క్షమింప వలయును. మీరాడుకొనుఁడు. నేను చూచుచుండెదను.

మాధ :: ఓహో! ఇదియేమి? మీరు పెద్దలు. అదిగాక కళింగదేశస్థులు. మీకు పేకచేతగాదనుట వింతగానున్నది.

విఠ : లేదు. నేను చాల సంవత్సరములనుండి యాడుట లేదు.

మాధ : ఏలాగున్ననైన ననుభవజ్ఞు లనుభవజ్ఞులే. ఇప్పుడాడక పోయిననేమి ? — విశేషముగాడబ్బు పెట్టనక్కఱలేదు. వారణా ! గమ్ము. ఆడుకొందము.

విఠలుఁడు తనకాట తెలియదని చెప్పినను తప్పినదికాదు. నిజమునకు విఠలుఁ డీమాటలో నందివేసినచేయి. పేకముక్కలను గలుపుట యందును, వానిని దాచుటయందును, మిగులనేర్పరి. సరిగాఁ గూర్చున్నచో నాతని ముందెవ్వరిచేయియునాడదు.

మాధ : అందఱమును కొంచెముడబ్బు పెట్టి యాడుకొందము.

ఆట ప్రారంభమయ్యెను. కొంచెమించుమించుగ నఱగంట లోపలనే విఠలుఁడందఱియొద్దనున్న డబ్బునంతను గెలుచుకొని " ఇప్పుడందఱికిని నిద్దురవేళయైనది. పోయిపరుందము " అనియెను.

మాధవభాస్కరుల ముఖములు నల్లవడియెను. వారిరువురును పండుకొనుటకు మేడపైకిఁబోవుచు నీక్రిందివిధముగా మాటాడుకొనుచుండుట విఠలుని చెవులఁబడియెను.

" ఆముదిగెద్ద కిందులకుఁ దగినశాస్తి చేయవలయును. ఆతఁడు ముసలినక్కవలెఁ జాలఁగుయుక్తుల నెఱింగిన కుత్సితుఁడు. పల్లెటూరి వారికివలెనె మనకును " టోపీ " వైచి, అంతయును లాగికొని నాఁడురా ! "

ఈ సంభాషణము జరగుచుండఁగా విఠలుఁడు వారణలాలుతోఁ గొన్నిరహస్యముల నేకాంతముగ మాటాడుచుండెను. వారణుఁడు తన సోదరివిషయమేమైనఁ దెలిసినదాయని విఠలునడుగఁగా నందుల కాతఁడు తన కేమియును తెలియలేదని చెప్పివైచెను. మీఁదు

మిక్కిలి వారణునిజూచి "నీవు నాకుత్తరమును వ్రాసినవిషయమేమి?" అని యడిగెను. అప్పుడు వారణుఁడు తనకా మాణిక్యవల్లరమ్మని యుత్తరము వ్రాయుట మొదలగుసంగతులను జెప్పెను. కాని, చిలక సుందరిమోహపాశములలోఁ దానుజిక్కుకొనినసంగతిని మాత్రము చెప్పక మఱుఁగుపఱచెను. పిమ్మట పరుండుటకై యిద్దఱును వేఱు వేఱుస్థలములకుఁ బోయిరి.

## తొమ్మిదవ ప్రకరణము

మేడమీఁద మాధవభాస్కరులు శయనించిన గదిప్రక్క నున్న గదిలో విఠలుఁడు పరుండెను. మాధవభాస్కరులు చాలసేపు గుసగుసలాడుచు నిక్కడనుండి యక్కడకు నక్కడనుండి యిక్కడకుఁ దిరుగుచుండిరి. కాని, వారేమి మాటాడుకొనుచున్నదియు విఠలునకుఁ దెలియుటలేదు. పిమ్మట వారు చటాలునఁ దమ ప్రసంగము నాపివైచి దీపముసుతగ్గించివేయఁగా, వారికి నిద్రపట్టినదని విఠలుఁ డూహించుకొని, తనగదితలుపులను జాగ్రత్తగవైచుకొని నిశ్చింతతోఁ బరుండెను. ఆతనికి గాఢమగు నిద్రపట్టెను.

తనడబ్బుపోవుటకుఁ జాలవిచారించుచు మాధవుఁడు భాస్కరునితో రహస్యముగా "మనమిఁక నీముదిగూబను తఱిమివేయవలయును. ఈతఁడెవ్వరైనదియు నీకుఁ దెలియునా? నాకేమో సంశయముగా నున్నది" అనియెను.

భాస్క : ఈతఁడు వారణుని మేనమామ యని నీకుఁ దెలియదా?

మాధ : ఆతఁడెట్టిమేనమామయో—ఏమో!

భాస్క : వారణాసికు మనమీఁద సందేహమునకలిగె, యాతఁడే పత్తేదారునై నఁ దీసికొనివచ్చియుండఁడుగద !

మాధ : లేదు. లేదు. అతఁడు మన యెడలను సందేహ పడుచున్నాఁడని నేను నమ్మఁజాలను. అతఁడు మన చేతిలోఁబడినప్పుడే, మనవలలోఁగూడఁబడెనని తలంపుము. అతని నామెవంతునకు విడిచిపెట్టుదము—ఆమె యన్నిటిని చక్కఁబెట్టు కొనఁగలదు. ఆమె చేయవలసినదంతయుఁ జేసితీరును.

భాస్క : అట్లయినచో నీ ముసలివాఁడొక పత్తేదారుఁడై యుండి, తాను స్వయముగనే యిక్కడకువచ్చి యుండఁగూడదా ?

మాధ : ఇదివఱకు నేనట్లు భావింపలేదు. మంచిది. ఒకవేళ నీతఁడు యజమానునితలుఁడే యై యుండవచ్చునేమో ?

భాస్క : అతనిని మనమిరువురమును జూడలేదు. మనకెట్లు తెలియును ?

ఇరువురు నూరకుండిరి. మాధవుఁడు చాల గడబిడను లోనయ్యెను. అతని ముఖమువాఁడిపోయెను. భాస్కరుని ముఖము మసిపూసినట్లుండెను.

మాధ : అతఁడు పత్తేదారుఁడేకానిమ్ము. కాక, మఱియొకఁడే కానిమ్ము. మొత్తముమీఁద మనమాతని బలిపుచ్చుకొనవలసినదే. ఎట్లయినను మనముచేయవలసినపని జాగరూకతతోఁ జేసివైచి తప్పించుకొనియుండుట మంచిది.

భాస్క : ఏమిచేయుదము ?

మాధ : ముందుగ దీపమును దీసివేయుము. ఆ పిమ్మట మాతము.

భాస్కరుఁడు దీపమునారిపివైచెను. మాధవుఁ డాచీఁకటిలోనే హాలులోపలికివచ్చి వితలుని గదిగుమ్మమునొద్ద నిలుచుండెను. వితలుఁడు గాఢనిద్రావస్థలోనుండెను. ఆతనిగదిలోనున్న దీపమారి పోయెను. ఇదంతయును దెలిసికొని మాధవుఁడు భాస్కరునియొద్దకు వచ్చి చెవిలో నేకాంతముగ "ఈముదిగొడ్డునకు బాగుగ నిద్రపట్టి నట్లున్నది" అని చెప్పెను.

పిమ్మట మాధవుఁడు తన జేబులోనున్న రబ్బరుగొట్టమును వితలుని గదికిటికీయొద్దనుంచి వెన్నెలలో బాగుగఁ బరీక్షించిచూచెను. ప్రశాంతిమగు నారాత్రి, ఆ చల్లని వెన్నెలవెలుఁగులో, నాతఁ డెట్టి పాపకృత్యమునకైన వెనుదీయుఁడని యాతనిమోము చెప్పకయె చెప్పుచున్నట్లగపడుచుండెను.

భాస్క : దీనితో నేమిచేయుదువు ?

మాధ : ఇదిగో ! వాషింగ్టన్ ల్యాంపును వెలిగించుటకుఁ దెచ్చిన యీ డబ్బాలోనున్న, యింగాలామ్ల (**Corbanic acidgass**) వాయువు నీ గొట్టమునిండ నాతని గదితలుపునకున్న తాళపురంధ్రము గుండ లోపలికివిడిచెదను. ఈగది సరంబీచేయఁబడినదిగదా ! ఈ విష వాయువుచే నాతఁడు సులభముగాఁ బ్రాణములను విడుచును.

భాస్క : ఓహో ! సరియే. ఆతని జంపుటకుఁ దగినంత విషవాయువాగదిలో నిలుచునా ? ఒకవేళ నాప్రక్కకిటికీమార్గము తెఱచియున్న నేమగును ?

మాధ : లేదు. కిటికీతలుపులు వేసియున్నవి.

భాస్క : చటాలున మేలుకొని బాధచే నాతఁడు కేకలు వైచినచో మనగతియేమగును !

మాధ : అప్పుడాతని మీఁదఁబడి చంపివైచెదను.

ఈకార్యము నీచతనమైనదని మేము చెప్పనక్కఱలేదు. మాధవుఁడు తనదురుద్యోగమునఁ బ్రవేశించెను. లోపలినుండి సుఖనిద్రచేఁగలిగిన యుచ్ఛ్వాసనిశ్వాసముల శబ్దము నిరాతంకముగా వినవచ్చుచుండుటను గ్రహించి మాధవుఁడు నవ్వుకొనుచుండెను. విషవాయువు క్రమక్రమముగా నాగదియంతయు నాక్రమించుకొనుచుండెను. విఠలుఁడీసమయమున మేలుకొననిచో నాతనికి దీర్ఘనిద్రయే గతియగును. మాధవుఁడు పిల్లివలె మెల్లగనడుగులిడుచుఁ దనగదిలోనికిఁ బోయి భాస్కరునితో నేకాంతముగా "ఓరీ! ఇఁక నైదునిమిషములు—ఆముదిమ్మృగమునకు శీఘ్రముగాఁ బరలోకప్రయాణము కలుగును" అనియెను.

భాస్క : ఓహో! అదేమిగంధపరిశోధము ?

అని చెప్పుచు భాస్కరుఁడు ముక్కుపట్టుకొనిపోవఁదొడఁగెను.

విఠలునిగదియందగుచున్న సద్దుచే వారిగుండె దడదడకొట్టుకొనసాగెను. విఠలుఁడు మేలుకొనుట—లేచికూర్చుండుట—ముక్కునకుగుడ్డకట్టుకొనుట—లేచి తడవిచూచుకొనుచు ద్వారమునొద్దకు వచ్చుచుండుట మొదలగుసంగతులనన్నిటి నావారిరువురు గ్రహించిరి.

ఇఁక నాలసింపరాదు. ఆలసించినచోఁ దమకృత్రిమవ్యాపారము బట్టబయలైపోవును. అంతవలన నానిమిషముననే మాధవుఁడావలకుఁబోయి యారబ్బరుగొట్టమునుతీసి భాస్కరుని చేతికిచ్చి దాని నెక్కడైనదాచుమని చెప్పెను. తాను జేబులోనున్న నల్లనిరుమాలును దీసిముఖమునకుఁగట్టుకొని ముఖచిహ్నములమార్చి విఠలుని పండుకొనిగుమ్మమునొద్దకువచ్చి నిలుచుండెను. విఠలున కూపిరియాడక గుండెలలో నొప్పిబయలుదేరెను. ఎట్లయినను గదినుండి యావలఁబడవలయునని యాతఁడు ప్రయత్నించెను. విఠలుఁడీదురవస్థలోఁజిక్కుకొని

విషవాయుప్రయోగమున నిట్లయితినని తెలిసికొనలేకపోయెను. తుద కెట్లో కష్టపడి, ద్వారమును దెఱచి యీవలఁబడినంతలో మాధవుఁడు తనముష్టితోఁ దలపై బలముగఁ బొడిచెను. విశాలుఁడాక్షణమె జ్ఞానవిహీనుఁడై క్రిందఁబడిపోయెను. అట్లుపడుచున్నవాఁడార్తధ్వనికూడఁ జేయఁజాలకపోయెను. ఆదెబ్బయంతబలముగాఁ దగిలెను.

మాధ : భాస్కరా ! రమ్ము. రమ్ము. ఈముదుసలియొద్దనున్న మూటయు ముల్లెయుఁ దీసికొనుము. నడువుము. మనము మనగది లోనికిఁబోవుదము.

భాస్క : మనమీతని గడతేర్చిపోవుటమంచిదిగాదా ?

మాధ : ఛీ ! పిచ్చివాఁడా ! పోలీసువారువచ్చి మనలను విచారణలోనికి దింపినచో, మాకేమియును దెలియదనియు, మేము మాగదినుండి యీవలకు రాలేదనియు, ధైర్యముతో వాదించుటకు వలనుగాకపోవును. మనమాపనిచేయవద్దు. నడువుము పోదము.

భాస్క : ఒకయగ్గిపుల్లను గీచి యీతనియవస్థ యేమైనదో చూతమా ?

మాధ : వలదు. వలదు. అది కేవల మపాయకరము.

భాస్క : అట్లయినచో ఈవెన్నెలవెలుఁగే చాలును

మాధవుఁడు విశాలునిగదిలోనికిఁబోయి యాతనిదుస్తులనన్నిటిని బరీక్షించి యాతనిచొక్కాజేబునందున్న ద్రవ్యమును, వస్తువులను నపహరించుకొని యీవలకు వచ్చెను. కాని, యక్కడ నుత్తరములు మొదలగునవేవియును దొరకకపోవుటచే నాతఁడు విశాలమూర్తియని నమ్ముటకుఁ దగినసాధనము లేమియు లేకపోయెను. మాధవుఁడు తీసికొని వచ్చినదంతయు భాస్కరునిచేతికిచ్చి తాను క్రిందికిదిగిపోయి ఆయింటి సింహద్వారమును, పాణీద్వారమును దెఱచివైచి మరల మీఁదికి

భాస్కరునియొద్దకువచ్చెను. ఆ యింటిలో నెవ్వరో దొంగలుపడిరని యందఱు ననుకొనుటకై యాతఁడట్లుచేసెను. మఱియొకనిమిషములోనే యాతఁ డంతకి విఠలునియొద్దకుఁబోయి యాతనిగుండెపైఁ జేయివైచి ప్రాణనాడి యాడుచున్నదో లేదో యని పరీక్షించిచూచెను. అతఁడు చావలేదని దృఢపడిన పిమ్మట నించుక ధైర్యమును వహించి యాతఁడు తనగదిలోనికిఁబోయి, యా డబ్బు, వస్త్రములు మొదలగు వానిని జాగ్రత్తపెట్టుటలో భాస్కరునకు సాహాయ్యముచేసెను. ఆ డబ్బు మొదలగువానిని, దబ్బనుగొట్టమును గూడఁ జేర్చి యొకమూటగఁ గట్టి, యా మూట కొకదారమును బిగించి దాని నొకచీనాకేవుచూరు తొట్టియలో రెండుమూడుమూరల లోపలనుఁ బెట్టి, యా దారమును గదిగోడనున్న యొకమేకునకుఁ గట్టిరి. ఆ యిరువురు నీ పనిచేయునప్పటికి మేడక్రింద గందరగోళము హెచ్చయ్యెను. పిమ్మటవారు తలుపులు మూసికొని పరుండి వెలుపల నేమిజరగుచున్నదియు సావకాశముగా నాలకించుచుండిరి.

ఆ వీథియందు గస్తీతిరుగుచున్న పోలీసువాఁడొకఁడు నీగృహ ద్వార మకాలమునఁ దెఱవఁబడియుండుటనుజూచి, యిక్కడనేమో దొంగతనము జరగియుండునని యూహించి గుమ్మమునొద్దకువచ్చి గట్టిగ కేకవైచిపిలిచెను. వారణాలాలదరిపడిలేచి వేగముగ వీథివైపునకుఁ బరుగెత్తుకొనివచ్చెను. పిమ్మట నాగృహము నొక్కప్రక్కనుండి పరీక్షించుకొనుచురాఁగా, మేడమీఁద ముసలివానిగదిలో దొంగ తనము జరగినదని తెలియవచ్చెను. ప్రక్కగదినిజూడఁగా నది లోపలి గడియవేయఁబడి యుండుటచే, దానిలో జనులున్నారని తేటపడియెను. పోలీసధికారి తనచేతిలాంతరు నా యజమానునివైపునకుఁ ద్రిప్పి "ఓహో! ఈ యింటియందు దొంగతనము మాత్రమే కాదు—

హత్యగూడ జరగినట్లు తోఁచుచున్నది” అని చెప్పుచు వారణుని వైపునకుఁదిరిగి “అయ్యా! ఈ మనుష్యుఁడెవ్వరో నీకుఁ దెలియునా?” అని రహస్యముగా నడిగెను. ఇప్పుడు వారణునకేమి చెప్పుటకును దోఁచలేదు.

పోలీ : అయ్యా! ఈతఁడు సుప్రసిద్ధుఁడగు పత్తేదారు విఠలమూర్తి.

వార : అయ్యా! ఆ పేరును చెప్పకుఁడు. దయయుంచి క్షమించుఁడు.

అని యేకాంతముగఁ జెప్పి పిమ్మట బిగ్గరగా “అయ్యా! మా మేనమామ కీగతిపట్టినది. క్రిందికైనను దింపుదము” అనియెను.

వారణుఁడును పోలీసువాఁడును జేరి విఠలుని క్రిందికిదింపిరి. ఆతని నొకచిన్నగదిలోఁ బరుండఁబెట్టి యుపచారములు చేయఁగాఁ గొంతసేపటి కాతనికించుక జ్ఞానమువచ్చెను. వారణుఁడు విఠలుని చెవిలో నేమోచెప్పి తన యనుమానమునుగూడ విశదీకరించెను.

అందులకాతఁడు “అయ్యా! ఈపని నెవ్వరుచేసిరో నాకుఁ దెలియును. అయినను మనము సభ్యత్వమునే యవలంబింతము. ఎవ్వరో పైవారలేవచ్చి నన్ను హింసించి గృహములోని వస్తువులను దోఁచికొనిపోయిరనియే నేను చెప్పెదను. అయ్యా! రక్షకభటుఁడా! నీవుపోయి నాగదిప్రక్కగదియందుఁ బరుండియున్నవారిని లేపి వారికేమైన సద్దు వినఁబడినదో లేదో తెలిసికొనిరమ్ము. కాని, నీకు వారిపై ననుమానమున్నట్టులు మాత్రము తెలియనీయకుము.

వారణలాలు పత్తేదారుని మారువేషము బయలుపడకుండు నట్లుగ నేర్పాటుచేసికొని లోపలికిఁబోయి సౌదామినీతిలకసుందరు లను లేపి, యింట దొంగలుపడినసంగతి తెలియఁజేసెను.

ఈ దుష్కృత్యమెవ్వరివలన జరిగినదియు వారికిఁ దెలిసియున్నను, వారేమియు నెఱుఁగనట్లు "మామయ్యకెంతటియపాయము సంభవించి నది ! అయ్యో ! పాపము !" అని విచారింపసాగిరి.

ఆయారక్షకభటుఁడు మేడమీఁదిగదియొద్దకుఁ బోయి వారిని కేకవేసి పిలిచినమీఁదట మాధవుఁడు తలుపును తీసి వెలుపలకు వచ్చి యారక్షకభటునిఁ జూచి "అయ్యా ! ఇదేమయ్యా ! ఏమి జరిగినది ?" అని కన్నులను నలుపుకొనుచు నాతనిఁ బ్రశ్నించెను.

రక్ష : వారణులారా ! మీ మేనమామయగు నాగేశు నెవ్వరో కొట్టి ప్రాణావశిష్టునిగ విడిచిపెట్టి యాతనిసొమ్ము నున్నదంతయు దోచుకొనిపోయినారు. మీకేమియును [illegible] మీరు నిద్రించుచున్నారు కాఁబోలును ! ఇంతసమీపమున జరిగిన సంగతులే తెలిసికొనలేకపోయితిరి !

మాధ : అయ్యో ! అయ్యో ! ఎంతపనిజరిగినది ! మాకేమియును దెలియలేదు ! ఓరీ ! భాస్కరా ! వింటివా ? మననాగేశు నెవ్వరో కొట్టి యాతనిసొమ్మును దోచుకొనిపోయినారఁట !

ఈమాటలను విని భాస్కరుఁడు తానేమియు నెఱుఁగనివానివలె నాశ్చర్యపడఁజొచ్చెను. ఆరక్షకభటుఁడు మరలఁ గ్రిందకిఁబోయి చూడఁగా నక్కడ నాముసలివానియొద్ద నాయిరువురు స్త్రీలును గూర్చుండి యాతని కుపచారములు చేయుచుండిరి.

వారణుఁడు రహస్యముగా "అయ్యా ! రక్షకభటుఁడా ! ఈ విషయమునుగూర్చి నీవు నాపై యధికారులకుఁ దెలియఁజేయ నక్కఱలేదని మామామయ్య చెప్పుచున్నాఁడు" అని చెప్పెను. అందులకాతఁడంగీకరించెను.

తరువాత విఠలుండు బహిరంగముగా "అయ్యా! నీవీ నేరమును గూర్చి యీ నిమిషముననే నీ పై యధికారులకుఁ దెలియఁజేయుము. అంతియె కాక దీని యాచూకీని గనిపెట్టుటకై సాధ్యమైనంతవరకుఁ దగిన పత్తేదారుని నియమించున ట్లేర్పాటుచేయుము." అని చెప్పెను.

రక్ష : సుప్రసిద్ధుఁడగు నా విఠలమూర్తి నెందులకు నియమింపరాదు ?

విఠ : అతఁడెవ్వరు ?

రక్ష : ఇదేమి ? ఇట్లనుచున్నారు ? ఆతఁడు జగత్ప్రసిద్ధుఁడగు నపరాధ పరిశోధకుఁడు (**Famous detective**) కాఁడా ?

విఠ : ఓహో! అట్లయిన నాతనికే యీ సంగతులను జెప్పి పంపవచ్చును.

మాధవభాస్కరులు క్రిందికి దిగివచ్చి చాటున నిలుచుండి పై సంభాషణమును వినుచుండిరి. కొంతసేపటికి రక్షకోద్యోగి వెడలి పోయెను.

మా : ప్రస్తుతము మన కేమియు నపాయము లేకుండఁ దప్పి పోయినది. పత్తేదారగు విఠలున కీ సమాచారమును దెలియఁజేసి యాతని నంపులోపలనే మనమిచ్చటనుండి కాలుకొలఁది పాఱిపోవుటయే మంచిది. ఆతఁడు చండశాసనుఁడఁట! మన మాతనికంటెఁ బడరాదు.

భాస్క : అవును. ఆ యనుమాత వచ్చుటకుఁ బూర్వమే మనము పలాయన మంత్రమును బఠించుటయే మేలు! తరువాత వాని పని పట్టుటకుఁ దగిన యుపాయము నాలోచించుకొన వచ్చును.

మాధ : ప్రస్తుత మీతఁడాదివిఠలుఁడు కాఁడని తేలినది. అంతియేకాదు. ఈతఁడు మఱియొక పత్తేదారుఁడునుగాఁడు. ఆ మాట నిశ్చయము. ఆసామ్ముమాట కేమిగతి ?

భాస్క : అది యున్నచోటనే యుండనిమ్ము. [illegible] సౌదామినికొక్కతెకు మాత్రము చెప్పవలదు. నిన్ను మనము గానలసినప్పుడు వచ్చి దానిని తీసికొనిపోవచ్చును.

ప్రాతఃకాలమయ్యెను. సూర్యభగవానుడు [illegible] తూర్పుకొండనుండి మందమందముగ [illegible] గలిగించుచుండెను. ఆ లేతకిరణములు [illegible] భాగములకును, నున్నతవృక్షాగ్రములకును [illegible] బూయుచుండెను. క్రమక్రమముగ నవి లోకమునకంతకును [illegible] చుండెను. శకుంతసంతానములు కలకలారావము చేయుచు తమ తావులనుండి రెక్కలల్లార్చుకొనుచు లేచి వృక్షాగ్రములపై వ్రాలుచుండెను. ఆకాశమున నెగురుచు [illegible] జూపఱకత్యానందమును గూర్చుచుండెను. మందమలయమారుతము లుద్యానవనములందలి పుష్పసౌరభములను మోచుకొనివచ్చి లోకము నానందములోఁ దేల్చుచుండెను.

లోకమిట్టియనిర్వాచనీయానందమున మునిఁగియుండ దివాంధములుమాత్ర మీ సౌభాగ్యమును దిలకింపఁజాలక, యీ తేజమును జూడఁజాలక, యీ యానందము ననుభవింపఁజాలక, యీ ప్రకృతి మాధుర్యమును గ్రహింపఁజాలక, ఏగోడగొందులనో, ఏవృక్షకోటరములనో చేరి యడఁగి మడఁగియుండెను. అవి యచ్చట నూరక కూర్చుండలేదు. పోయిన తమ జీవయాత్రకై, గతించిన తమ సౌభాగ్యమునకై, మఱుఁగువడిన తమ యదృష్టమునకై, కట్టువడిన తమ భోగవిహారములకై, తమయంధకారసామ్రాజ్యమునకై, యెదురు చూచుచుండెను. ఆ దుష్టపతంగములకది స్వభావమని వానినెవ్వరు

తిట్టకుందురు ? ఈ విధముగనే దుష్టుల యాశయములన్నియు గర్భీకృతములై తమయదనునకై నిరీక్షించుచుండుట స్వభావమే కదా ! ధూర్తులగు మాధవభాస్కరు లిరువురును తెలియకుండగనే యెక్కడకో పారిపోయిరి.

విఠలునకు లేచి యిటునటు తిరుగుటకు దగినశక్తి వచ్చెను. ప్రాతస్సంధ్యావందనాదికము నొకమూలకుద్రోసి, కాఫీ, మొదలగు వానిని స్వీకరించుటకు దగినశక్తి గలిగెను. నిరాతంకముగా నా నాగరకాభ్యాసములు నెఱవేర్పఁబడియెను. అదంతయును జరగిన పిమ్మట విఠలుఁడు వెలుపలకుఁ బోవుటకుఁ బ్రయాణమై సౌదామినిని దగ్గఱకుఁబిలిచి " ప్రఫుల్లా ! నేను పత్తేదారుఁడగు ఆదివిఠలమూర్తి కీసమాచారమంతయును జెప్పి యాతనిచే నీనేరమును కనిపెట్టుటకుఁ దగినప్రయత్నములను చేయించెదను " అనియెను.

సౌదామిని యా మాటలకుఁ జకితయై " ఆతని నియమించెదరా? సరియే. ఎవ్వారివల్ల నీ దుష్కృత్యము జరగినదో కనిపెట్టుట కాతఁడు సమర్థుఁడని తోఁచుచున్నది " అనియెను.

విఠ : అందుచేతనే నేనట్లు యోజించితిని.

సౌదా : మంచిది. మామయ్యా ! నీ వెంతసేపటికి వచ్చెదవు ?

విఠ : వేళకుసరిగా రాఁగలనో లేనో చెప్పఁజాలను. వెళ్లిన పని కాకుండునుగదా ! ఆ సంగతి నెట్లుచెప్పఁగలనమ్మా !

విఠలుఁడు పిలోనికిఁబోయి కొన్ని కార్యములను జక్కఁబెట్టుకొని కొంచెము సేపటిలోనే తనమాఱువేషమును వేసికొని నిజమైన పత్తేదారుఁడై మరల సౌదామినియున్న గృహమునకువచ్చెను.

సౌదామిని తొట్రుపాటునొందుచు నాతనితో " విఠలమూర్తీ ! నీవువచ్చుట చాల సంతోషముగానున్నది. నీయొద్ద నొకవిషయమును

విర : నేనేమియును నీతోఁ జెప్పుటకై రాలేదు. నీ మేనమామ విషయమున జరిగిన దోపిడి నేరమును గనిపెట్టుటకై వచ్చితిని. ఆ సంగతులను జెప్పుము.

ఈ మాటలు వినినతోడనే యామె హృదయమునఁ జాల గందరగోళము పుట్టెను. కాని, యామె యించుక ధైర్యమును దెచ్చుకొని కొన్ని సంగతుల నాతనికిఁ దెలియఁజేసెను.

విర : మాధవ భాస్కరు లనువారెవ్వరు ?

సౌదా : మాధవుఁడు నా నెచ్చెలి భర్త. భాస్కరుఁడొక పథికుఁడు. పరదేశమునుండి వచ్చినవాఁడు.

విర : నీవును గాంతనాథుననువాని పెండ్లి చేసినవాఁడీ మాధవుఁడేయని నీ వొకసారి నాతోఁ జెప్పియుంటివి కాదా ?

ఈమాటలను వినుటతోడనే సౌదామిని శరీరము గడగడ వడకసాగెను. ఈపస్త్రీదాయిన విషయమున నెంతవఱకుఁ దెలిసియుండునని తాను భావించుకొనుచున్నదో యంతకంటె విశేషాంశములనే యాతఁడెఱింగియున్నట్లామెకు బోధపడియెను. ఆమె యించుక సంకోచించి యిట్లనెను "విరజా ! మీరు తెలిసికొన్నది తప్పు. నేనాతని పేరు మాధవుఁడని చెప్పలేదుగాదా ! ఆతని పేరు శ్రీపతిమిశ్రుఁడని నేను చెప్పితిని. మఱియు నిప్పటి నేరమునుగూర్చి మాటాడుచున్నప్పుడు నావిషయమున జరిగిన నేరమునుగూర్చి ప్రస్తావించుట కేమియవసరమువచ్చినది ? నాకుఁగావలసిన సంగతులనన్నిటిని నేను తెలిసికొనియే యుంటిని.

విర : ఓహో ! నీవే తెలిసికొంటివా ? ప్రఫుల్లా ! నాకుఁ గావలసిన యంశములింకను నాకుఁ దెలియకపోవుటచే నన్నియు నడుగ

వలసివచ్చుచున్నది. అందువలన నిప్పుడైనఁ గాంతనాథుని శవముగతి యేమైనదో చెప్పుము !

సౌదా : ఓహో! అదెంతమాట! ధారాళముగాఁ జెప్పఁగలను. అది యిప్పుడు విశాలదేశమునందున్నది. ఇఁకఁ గొన్నిదినములలో నేనక్కడకుఁ బోయెదను. అప్పుడు మాయత్తవారింటివారికిని నాకును బరిచయముకలుగును.

విర : నీకానమ్మకమున్నదా ?

సౌదా : ఆహాఁ ! ఏమియును సందేహములేదు. నాకు గట్టి నమ్మకమున్నది.

విర : వారు నిన్నుఁ దమకోడలిగ నొప్పుకొనరని నానమ్మకము.

సౌదా : మంచిది. నీవీవిషయమున నన్నుఁ దొందరపెట్ట నక్కఱలేదు. నీవు దయయుంచి నామరకతమంజూషను నాకుఁ దిరిగి పంపించినఁజాలును—

విర : నీవివాహముసంగతి నీయన్నకుఁ దెలియునా ?

సౌదా : ఇంకను దెలుపలేదు. తరువాతఁ జెప్పెదను—

విర : ఇంకను తరువాతఁజెప్పెదనా ? ఎన్నినెల్లదూరము నకుఁ దరువాత ? కానిమ్ము. నీకు వివాహమైనదని చెప్పుటకు సాక్షు లెవ్వరు ?

సౌదా : శ్రీపతిమిశ్రుఁడు.

విర : ఆపెద్దమనుష్యుని నీవు మరల నెప్పుడుచూచితివి ?

సౌదా : ఆతఁడు కొన్నిదినములకుఁ బూర్వము వచ్చి యున్నాఁడు.

విత : పాలపానిశ్క్ర శానమునందు ...మ్మరాళ్ళకో నిండిన పెట్టెను పూడ్చి పెట్టుటకేమి కారణమో నీవు తెలిసికొంటివా ?

సౌదా : అదంతయు నీతోఁ జెప్పవలసినంతటి యావశ్యకత యేమియును నాకు లేదు.

విత : ఓహో ! మంచిది. నవు విలక్షణమైన స్త్రీవి. నేను మేడమీఁదికిఁబోయి యీ గోపిడి నేరము విషయమున నించుక పరీక్షింపవలసియున్నది.

సౌదా : నేనుకూడ మీతోఁ రావచ్చునా ?

విత : నీకంతకష్ట మెందులకు ?

వితలుఁడు గబగబ మేడమీఁదికిఁ బోయి మాధవభాస్కరులు పరుండియున్న గదిలోనికిఁ బోయెను. ఆ ప్రదేశమంతయు మిగుల జాగరూకతతోఁ బరీక్షించి చూడఁగా గవాక్షసమీపమున గోడపై నున్న యొక మేకున కొకదారము కట్టఁబడియుండెను. ఆ దారపు రెండవచివర పైనున్న చేకుతో గొట్టలోనికిఁ బోయియుండెను. ఆ దారమును లాగి చూడఁగా దానితోఁగూడ నొకపూట ఘూవలి కూడిపడియెను. వితలుఁడామూటను దీసి జేబులోనుంచికొని క్రిందికి దిగివచ్చి మరల సౌదామినితో మాటాడఁదొడంగెను.

# పదియవ ప్రకరణము

విఠలుఁడు మేడనెక్కినపిమ్మట సౌదామిని యాతనికిఁ దెలియకుండ నాతని వెనుకనే మెల్లగ మేడనెక్కెను. ఆ సంగతి విఠలుఁడు కనిపెట్టెను. అప్పుడామె యేమియును మాటాడక వికృతకటాక్షములతో నాతనిఁ జూచుచుండెను.

విఠ : ప్రఫుల్లా ! నీవిక్కడ కెందులకువచ్చితివి ? రాకూడదని నేను చెప్పియుంటినిగాదా ?

సౌదా : నేను నీ నేరమునుగూర్చి తెలిసికొనుటకు రాలేదు. మా మామగారిగదిలో తువాలు నుంచిపోవుదుమని వచ్చితిని.

విఠ : ఈ గదికిఁ దాళమువేసియున్నది కాదా ?

సౌదా : ఇప్పుడే నేను తువాలును లోపల నుంచి, బీగమును వైచి వచ్చితిని.

విఠ : నీయొద్ద దీనితాళపుఁజెవి యున్నదా ?

సౌదామిని దనయొడ్డాణమునకుఁ దగిలించుకొనియున్న తాళపు గుత్తియందున్న యొకతాళముతో నా బీగమును దీసి తలుపు తెఱచి కుర్చీమీఁదనున్న తువాలును జూపించెను.

ఆమెయొద్దఁ దనగది బీగమునకు దొంగతాళముంచుటను గ్రహించి విఠలుఁడు “ఈ సౌదామిని యింతటి టక్కులమారి యగుట చేతనే యందరిని మోసపుచ్చి తానే ప్రఫుల్లనని చెప్పుచు నందఱ కంటను దుమ్ముపోయఁగలుగుచున్నది” అని యాశ్చర్యపడియెను.

విఠ : ప్రఫుల్లా ! ఇఁక నేను పోయెదను. ఈ నేరమున నీవు నాకు సాయముచేసినందులకుఁ జాల నానందముగానున్నది.

సౌదా : (ఉత్కంఠతనై) ఇక్కడ నేమైన నాచూకి దొరికి నదా ?

విఠ : అంత ముఖ్యమైన విషయము దొరకలేదు. ఇంకను గొన్ని దినములు పోయినపిమ్మట నేను మరల రావలసియుండును.

సౌదా : ఈలోఁగైనను దయయుంచి నా మరకతమంజూషను పంపించెదరా ?

విఠ : అది యసాధ్యము. అది యొకటిరెండుదినములలో దొరకునట్లు లేదు.

సౌదా : నేను దాని నుపయోగించుకొనవలసి యుండును గాదా ?

విఠ : నీవుపయోగించుకొనవలయునా ? దానిలో నేమియు న్నది ?

సౌదా : దానియందేమైన నుండనిమ్ము లేకపోనిమ్ము నాకు నీతోఁ జెప్పవలసిన పనియేమున్నది ? తుదకిఁకముందు నావిషయమున జరగిన నేరమునుగూర్చి యెవ్వరితోడను యోజింపరాదని నిశ్చయించుకొనవలసివచ్చుచున్నది.

“ అట్లయినచో నీయిష్టము ” అని చెప్పి విఠలుఁడక్కడనుండి వెడలిపోయెను.

సౌదామిని ముఖము కళావిహీనమయ్యెను. శరీరము కంపించెను. పెదవులదరుచుండెను. విఠలుఁ డాసింహద్వారమును దాటిపోయిన నిమిషముననే యామె మేడమీఁదికి మాధవభాస్కరులు పండుకొను గదిలోనికిఁ బోయి ప్రక్కనున్న యా రేకుతొట్టెను బరీక్షించెను. అచ్చట నామూట యగపడలేదు. ఆమె కేవలము ఖిన్నమనస్కురా లయ్యెను. "దొంగను బిలిచి మూట చేతికిచ్చినట్లయినది." అని యనుకొనియెను.

ఆ క్షణమె యామె "తిలకా!—తిలకా! వచ్చిచూడవే! కొంప మునిఁగిపోయినదే!" అని కేకవైచెను.

తిలకసుందరి భయపడిన యాఁడులేడిపిల్లవలె సాధ్వసభావముతో మేడమీఁది కొకయంగలో వచ్చి పడియెను. ఆ లావణ్యవతి పండువెన్నెలవలెనున్న తెల్లమల్లుచీరను గట్టుకొనియుండెను. అప్పటి యామె విలాసమును జూచి యేపురుషుఁడు చిత్తవికారమునకు లోనుగాకుండఁగలఁడు?

సౌదా : రావే! చూడు! అయ్యో! చెడితిమి!

తిల : (దిగ్భ్రమనొంది) అదేమి? అట్లనుచుంటివేమి?

సౌదా : ఆ చిన్నమూట నిక్కడ దాచియుంచుట నీకును దెలియునుగాదా? దానిని విఠలుఁడెత్తుకొని పోయినాఁడు. అది యా రేకుతొట్టెలో లేదు.

తిల : ఇదేమే యిట్లనుచున్నావు? సర్వనాశనమైనది?

సౌదా : అట్లుగాక మరేమగును? మనము మనవాండ్రకైన నప్పుడు దగ్గరనుంచుకొనవలసినది. ఆ విఠలమూర్తి గుండెలుతీసిన బంటువలె వచ్చి యా మూటను తీసికొనిపోయినాఁడు. ఇఁకఁ జేయ వలసినదేమున్నది?

తిల : విఠలుఁడు నీవిషయమున సంతోషపడినట్లాతని మాటల వలన నేమైనఁ దెలియవచ్చినదా ?

సౌదా : కొంచెమట్లే తోఁచుచున్నది.

తిల : అట్లయినచో నందులకేమైనఁ జేయవలయును. ఇట్టి కను తిరిగియిమ్మనిన నీవడిగితివా ? దానికాతఁడేమని సమాధానము చెప్పినాఁడు.

“ అడిగితిని. అది నాయొద్దనున్నదని చెప్పెను. లేదనియును జెప్పలేదు. ”

తిల : ఆనువిఠలునకు విశేషాంశములే తెలిసియుండవచ్చును. కాని, నీవు ప్రఫుల్లపురకామినిమాత్రము తెలిసియుండదు. అతఁడు మిగులఁ జతురుఁడగుటచేత, నావిషయమునుగూడఁ ద్వరలోఁ దెలిసికొనియే తీరును. అందువలన మనమాతని [illegible]ములలో నమ్మరాదు. సఖీ ! నామాట నమ్ముము. అతఁడు చాలఁగుయుక్తులు నేర్చినవాఁడు. మనల నింక విడిచిపెట్టఁడు.

సౌదా : ఔనుసుమా ! ఇంచుకయు నాలసింపరాదు. [illegible] డామాటలను [illegible] నాకేఁ [illegible] యించుక యోజించిచూడుము !

తిల : అందువలననే విఠలుఁడు నాగేశునిజూచుటకు ముందుగనే మనము జాగ్రతపడవలయును. సర్వనాశనముచేసినఁగాని యీ విఠలుని పొగరణఁగదు.

సౌదా : అది చేయుటయెట్లు ?

తిల : ముందుగ విఠలునివంచించి యెక్కడకైనను బంపివేయవలయును.

సౌదా : ఆకార్యమును జేయఁదగినవారెవ్వరు ?

తిల : మననాగేశుఁడున్నాఁడుగదా !

సౌదా : ఓహో ! అవునవును. మనమూరక కాలయాపనము చేయుచున్నాము. ఈ విశలరాయని నెత్తిమీఁద శఠగోపము పెట్టుట కిఁక నాలసింపరాదు. లెమ్ము లెమ్ము. తిలకా ! లెమ్ము ! సౌదామిని ప్రభావము నీ ముదిగొడ్డున కించుక చవిచూపింతము. మనమీతనికి భయపడవలసిన పనిలేదు. ఎంతపనిచేసినాఁడు ? సౌదామినిని మోస గించుట కితఁ డేపాటివాఁడు ? శీఘ్రమే దానిఫల మనుభవములోనికి వచ్చునని యాతఁ డనుకొనకపూర్వమే మనము తగినశాస్తి చేయ వలయును. రమ్ము పోదము !

సౌదామినీ తిలకసుందరు లిరువురును వెలగల యుడుపులను ధరియించి యొరుల కగపడకుండులాగున మేలిముసుఁగులను వైచుకొని వెంటనే బయలుదేరిరి. వారు రాజమార్గమున కడ్డుదారి యొద్దనున్న యొక సందులోనికిఁ బోయి, యా సందునుండి మఱియొకమార్గమునకు మరలి యక్కడనున్న యొక యేకాంతగృహమునకుఁ బోయి చేరిరి. అప్పటి కక్కడనున్న మాధవభాస్కరు లిరువురును నెక్కడకో పోవుటకుఁ బ్రయాణోన్ముఖులై యుండిరి. ఆ సమయమునకు సరిగ వా రచ్చటకుఁ బోయిరి. సౌదామిని వారితో సమస్తవృత్తాంతమును విశదముగఁ జెప్పివైచెను. ఆ మాటను వినుటతోడనే వా రిరువురును భ్రమగుబడినవారివలెఁ గొంతసేపటివఱకు నేమియు మాటాడలేకపోయిరి. తుదకు వారు లేనిధైర్యమును దెచ్చుకొని యక్కడకు సమీప గృహముననే యున్న నాగేశుని బిలిపించుకొనిరి.

నాగేశుఁడు వచ్చి జరిగినసంగతుల నన్నిఁటిని మాధవునివలనఁ దెలిసికొనియెను. అతఁడు తాను మృత్యులోక మహామార్గమునందు దిప్పుడే యొకటిరెండడుగుల నుంచితినని మనసులో ననుకొనసాగెను; ఆతనిహృదయము వడివడిగఁ గొట్టుకొనసాగెను, శరీరము గడగడ

వడఁకసాగెను. నోటినుండి మాటవచ్చుటయే కష్టముగానుండెను. ఆతని దురవస్థ కిప్పుడు చెప్పినయంశ మేదియును గారణముకాదు. ప్రఫుల్ల చెఱసాలనుండి తప్పించుకొనిపోవుట యొక్కటియే యీ నాగేశునకు గరుడాస్త్రముగానుండెను. తనయవస్థనుగూర్చి యనుకొనుటకుఁగాని, యనుభవించుటకుఁగాని, యాతనికి వలనుగాకుండెను. తుద కాతఁడు మాధవుని దురుపదేశముల నన్నిటిని విని, యీ విధముగా నడచుకొనుట కొప్పుకొని వెడలిపోయెను. ఆతఁడు కొంచెముదూరము పోయినపిమ్మట మాధవుఁ డిట్లనియెను.

"ఈ పిఱికిపంద యేమిచేయుటకును సమర్థుఁడుకాఁడు. ఈతఁడు బిక్కమొగము పెట్టుకొనిపోవుచున్నాఁడు. ఏమైనను మనమేచేయ వలయును. భాస్కరా! ఇప్పుడు మనమేమిచేయవలయునో చెప్పుము నూతము!"

భాస్క : ఎక్కడనైన విరలుఁడువచ్చుచున్న మార్గమున దాగుకొనియుండి యాతనిని మట్టుబెట్టవలయును.

మాధ : నాకొక యోచన తోఁచుచున్నది. [illegible] యొక్క యమూల్యపదార్థము పోయినదనియు, దానినిగూర్చి విచారించుటకై [illegible] నదీతీరమునందున్న సంగీతరంగమును [illegible] చేయవలయుననియు [illegible] త్వరము వ్రాయవలయునని యనుకొనుచున్నాను.

భాస్క : ఉత్తరము వ్రాయువా రెవ్వరని చేవ్రాలు చేసెదవు.

మాధ : శాంతకుమారియని.

భాస్క : ఆ విరలునక్కడ మొదట నెవ్వరు చూడవలయును ?

మాధ : తిలకసుందరి యొకవితంతువువేషముతో నక్కడ నుండి యాతనిని రాఁబట్టుకొనును.

భాస్క : ఆతఁడు తిలకసుందరి నెఱుంగఁడా ?

మాధ : ఆతఁడామెను జూడనిమ్ము — చూడకపోనిమ్ము — ఏమియు వ్యత్యయముండదు. ఆతఁడింటిలోపలఁ గాలుపెట్టి మరల బ్రదికివచ్చినప్పుడుగదా మనము సంకోచింపవలసినది ! ఆతని నక్కడ నుండియే యీ లోకమున కంపివేయుదము — అంతటితోఁ బీడవదలి పోవును. —

భాస్క : అక్కడ నితరులెవ్వరును లేకుండఁ జూచుకొనవలయును.

మాధ : అక్కడ మనుష్యసంచారమే లేదు. నీవందుల కెంత మాత్రమును భయపడనక్కఱ లేదు.

భాస్క : అయిన నిప్పుడే మనమా ప్రయత్నమును జేయుట మంచిది.

మాధ : చేయుటకేమున్నది. ఉత్తరము వ్రాసెదను. దీనితో గాపిట్టి మనవలలోఁ జిక్కుకొనవలసినదే దానినక్కడనే కత్తుక నొక్కి చంపించెదను. చూచుకొనుము నా ప్రజ్ఞ. ఈ దెబ్బతో నీ మొగిలిపాటు దీఁగిపోవును.

మాధవుఁడుత్తరమును వ్రాసెను. ఆ నలువురును జేరి ముందు కార్యముకొఱకు, మంగళతరంగమను నా మందిరమునకు బయలుదేరిరి. ఆ మందిరము చిన్నదైనను చూడసొంపుగ నుండెను. దాని ప్రాంగణము పుష్పలతానికుంజములచేఁ జాలరమ్యముగానుండెను. వేసవికాలము నందలి సాయంసమయములయందా భవనోద్యానమున నమర్పఁబడిన శిలాపీఠములపైఁ గూర్చుండువారల కాహ్లాదకరముగఁ గుముదినీ నదీతరంగమాలికలం దూఁగుచుఁ బరతెంచువాతపోతంబు లాప్యాయన

జీవచ్ఛవముపగిదివలెఁ గళావిహీనమై పల్లఁబడియుండెను. అతఁడా బావి యొద్దకుఁ బోయిచూడఁగా బావిపై మూఁత తెరువఁబడియుండెను. ఆసమీపమునఁ బదచిహ్నములుండుటయే గాక, యాస్థలమంతయు బురదబురదగా నుండెను. ఆబురదజాడనుబట్టిపోగా నక్కడనొక జాజికాయలపెట్టెయగపడెను.

నాగేశుఁడు "అయ్యో! చెడితిని! కొంపమునిఁగినది" అని యనుకొనుచు గుండెబాదుకొనుచుఁబోయి యసహ్యాకరమగు నా భయంకరశవ మాపెట్టెలో నుండుటనుజూచెను. ఆతనిశరీరమున మరణకంపముదయించెను. తుట్టతుదకాతఁడు "అయ్యో! ఇది విశలుని పనియే. ఇఁకనిలువరాదు. ఇఁకనాజీవమునకు నీళ్లువిడుచుకొనవలసినదే" అని గంపరగోళపడఁజొచ్చెను.

అతఁడిప్పుడు జుగుప్సానమగు నొకకార్యమును జేయఁబూనెను. తలపైఁజేయినుంచుకొని "ఇంకేమిగతి?" అని యోజించుచు వ్యర్థముగాఁ గాలహరణముసేయక, యొకగోనెసంచిలో నాశవము నిమిడ్చెను.

ఆహా! ఈకృత్యములను వినినంతనే సాధుశిఖామణుల మృదుహృదయములు కరఁగి వారికన్నులవెంటనీరువచ్చును. ఇఁకఘోరపాతకులహృదయమో!—ఘనీభూతమై శిలావస్థయందేయుండును—ఇట్లిందులకనుచున్నామనఁగా — జుగుప్సాకరమగు నీదుష్కృత్యము నాగేశునికంతగొప్పవిషయముగా నగపడ లేదని చెప్పుటకే — అందుల కాశ్చర్యమేమియున్నది! ఆతఁడు మనుష్యుఁ డనిపించుకొనఁదగిన వాఁడుకాఁడు—పశుప్రాయుఁడు—కానిచో నాహీనకృత్యముల నెట్లు చేయఁగలఁడు?

ఆ విధముగా గోనెసంచిలోఁ బూరిన యీ శవమును—శవపు ముక్కలను—అస్థిపంజరమును, నాగేశుఁడు తన భుజములమీఁద నెత్తుకొని పైకెక్కివచ్చి గభాలున క్రిందికెత్తివైచెను. పిమ్మట నోటికివచ్చినట్లెల్లఁ దిట్టుకొనుచు నా సంచిని కాళ్లతోఁ గుందనవందరగఁ ద్రొక్కి త్రొక్కి గెంటివైచెను.

ఈ ఘోరమానుషకృత్యమునకు — ఈ యమానుష ప్రవర్తనకుఁ గారణమేమియో తెలిసికొనుట మనకనవసరము. పోనిండు — ఈ విధముగాఁ జేసి యొకటిరెండునిమిషములలోఁ గొంచెము నెమ్మదిని వహించి యా గృహగర్భాంగణమునందున్న యొకచిన్న గదితలుపునుదీసి యొక మూల నేలను కొంచెమించుమించుగ నొక యడుగు లోతునఁ దన వ్రేళ్లతోడనే కెక్కరించెను. ఆ యడుగున రెండినుపరేకు లగపడియెను. అతఁడా రేకులను పైకెత్తెను. లోపల వైతరణీనది ప్రవహించుచుండెను.

మనపట్టణములయందలి మురుగునీటికాల్వలే యెంతయో లోతునఁ బ్రవహించుచుండఁగా బదిలక్షలజనుల కావాసమైయున్న యీ నవనగరమున పౌరకార్యనిర్వాహకసమాజము (మ్యునిసిపాలిటి) వారు, అనేక లక్షలరూపాయలను వెచ్చించియేర్పఱచిన మురుగునీటి కాల్వ లెంతటిలోతునఁ బ్రవహించుచున్నదియు వివరించి వ్రాయవలయునా? అవి శాఖోపశాఖలై ప్రవహించుచున్నను, నెంతటి చిన్నకాలువయందైనను నెనిమిదియడుగుల లోతునకుఁ దక్కువనీరు ప్రవహించుటలేదు. ఈ మహాబిలద్వార మా వైతరిణీనదికిఁ బ్రవేశమార్గముగానుండెను. నాగేశుఁ డాసంచి నెడమచేతితో వడివడిగ మోచుకొనిపోయి, దానినిపైకెత్తి "చీచీ! దుష్టపశువా! నశించిపొమ్ము. నేనిఁకనైనను సుఖముగానుండెదను." అనిచెప్పుచు నా కాలువలోఁ బాఱవైచెను. పిమ్మట నాయినుపరేకులు కాలువపైమూసి

వైచి దానిమీఁద మంటిని ద్రోసి, దానిమీఁద దుమ్మునుబోసి, ఆన వాలు తెలియకుండ నాగది నేలతోఁబాటు సరాసరిగఁజేసి, ఇఁక ముందుఁ దన తప్పితమునుబట్టుకొనుటకు వీలైన చిహ్నములేవియు లేకుండఁ బోయినవిగదా యని తనకష్టమునకుఁదానే సంతోషపడుచు నాతఁడన్ని తలుపులను వైచుకొనుచు సీవలకువచ్చెను.

తానుచేసినపని నొరులెవ్వరును జూడలేదని నాగేశుఁడు నమ్మియుండెను. ఇది పిల్లికన్నులుమూసికొని పాలు త్రాగినట్లయినది- నాగేశుఁడాగృహమును విడిచి యొకటిరెండడుగులు వైచెనో లేదో, ఇంతవఱకు ఛాయవలె వెన్నంటి వచ్చుచు, సర్వమును బరిశీలించుచున్న యొకవృద్ధుఁడాతని నట్లే వెంబడించెను. నాగేశుఁడు తనయింటికిఁ బోయి కొన్నిదినములవఱకుఁ దాను గ్రామముననుండనని తనభార్యతోఁ జెప్పి యొకరైలుసంచిని చేతనుంచుకొని వెడలి పోయెను.

ఆతఁడు స్వదేశమునకు బయలుదేరి పోవుచున్నాఁడని యా వృద్ధుఁడగు నటేశుఁడు భావించుకొనియెను. కాని, నాగేశుఁడు రైలు స్టేషనునకుఁ బోయి ఓఢాణికి టిక్కెట్టును దీసికొనియెను. ఇందువలన నాతఁడీదేశముననే యుండునట్లు తేలెను. ఈ సంగతులను దెలిసికొని నటేశుఁడు, ఓఢాణియందున్న తనమిత్రునకొకనికి "ఈ రయిలునందిట్టిమనుష్యుఁడు వచ్చుచున్నాఁడు. ఈతని ప్రవర్తనము మొదలగు వాని నన్నిటిని రహస్యముగాఁ బరీక్షించుచు నీతనిపై మంచికావలి నుంచవలయును." అని తంతివార్తనంపెను. ఇదంతయునైన పిమ్మట, జరగిన సంగతులను గూర్చియు, తానొనర్చిన విషయములనుగూర్చియు, విఠలునితోఁ దెలుపుటకాతఁ డాఫీసునకుఁబోయెను.

ఆఫీసునకుఁ బోయి చూడఁగా నక్కడనున్న పుస్తకములన్నియు చెల్లాచెదరుగ నక్కడక్కడఁ బడియుండెను. బీరువాలు, [illegible] మొదలగునన్నియు వట్టివై యుండెను. కాగితములు మొదలగున వన్నియు గాలిపటములవలె నటునిటు నెగురుచుండెను. [illegible] పుస్తకములును లెక్కలపుస్తకములును [illegible] పొర లాడుచుండెను. లోపల విశాలమూర్తి [illegible] యగపడుచుండెను. నటేశునకు చాల సంశయము కలిగెను. విశాలమూర్తి కేదియో యపాయము సంభవించియుండునని యంతరంగమున చాల విచారించెను. అతఁ డింకకొంతసేపు ముసుఁగున [illegible] యోజించి తుదకు "ఓహో! ఇప్పుడంతయును తెలిసినది." అనియను కొనుచు నా కాగితములు మొదలగువాని నన్నిటిని జాగ్రత్తపెట్టుచు "ఈ పాడుపెట్టె నటనవే యిట్టి యనర్థములు కలుగుచున్నవి." అని మరల గొణుగుకొనియెను. అందులకు "ఏ పెట్టెయేది?" అను ప్రశ్నము వినఁబడియెను. విజనమగు నా స్థలమున వెనుకనుండి వచ్చిన యా ధ్వని నాలకించి, తోడనే నటేశుఁడు నివ్వెఱపడఁ జొచ్చెను. ఆ శబ్దము గంభీరముగను, ఆదరపురస్సరముగ నుండెను. ఇప్పుడు నటేశుఁడు వెనుదిరిగి చూడఁగా నొకవ్యక్తి యగపడియెను. అతని వక్షము విశాలము—అతఁ డాజానుబాహుఁడు. ఆతని సుందరముఖ మాతఁడు సౌమ్యస్వభావుఁడని సూచించుచుండెను.

నటేశుఁ డాశ్చర్యముతో వెనుకకుఁదిరిగి చూచుట నాలోకించి యా వ్యక్తి పకపక నవ్వుచు, నటేశుని బుజముపైఁ జేయివైచి తట్టుచు "ఏమి తాతా! అట్లు చూచుచున్నావేమి? దయ్యమును జూచినట్లుగా బెదరుచున్నావేమి? నీ వింతగా భయపడుదువని నే ననుకోలేదు. నీవు గట్టిగా గొణుగుకొనుచుంటివి. అందులకు నేను ప్రత్యుత్తర మిచ్చితిని. నేను శ్రీమతి యను నోడయజమానుఁడగు పల్లవుఁడను.

నా యోడ యీ ప్రపంచమునందున్న యన్ని సముద్రములమీఁదను ననేకపర్యాయములు విహారము చేసినది ” అనియెను.

నటే : ఓహో !నిన్నుఁ జూచినవిమ్మట నాకుఁ జాల సంతోష మైనది. నీవు బహుశః నన్ను మఱచియుందు వనుకొనియెదను. నా పేరు నటేశుఁడు. నే నొకసారి నిన్ను లలితపట్టణమునఁ జూచి యుంటిని.

పల్ల : ఇదేమి ! నీ పేరు పరంతపుఁడు గాదా ? మన మొండొరు లను జూచికొని యించుమించుగ నిరువదిసంవత్సరము లైనది. అప్పు డా లలితపట్టణమునందు నీవే మహాప్రసిద్ధినొందిన పత్తేదారుఁడవై యుంటివి. ఇరువది సంవత్సరములకు వెనుక వజ్రముల నపహరించిన దొంగలను పట్టుకొన్న కీర్తిశాలివి నీవేకాదా ?

నటేశుఁడు మందహాసముచేయుచు నీ పల్లవుఁ డిక్కడ కెందులకు వచ్చెను జెపుమా యని యోజించుచు “ ఓ నావికశిరోమణీ ! ఇప్పుడు నా వలన నీ కేమి కావలసియున్నది ? ” అనియెను.

పల్ల : ఇక్కడఁ బ్రసిద్ధినందిన పత్తేదారుఁడగు విఠలునితో మాటాడుటకై వచ్చియున్నాఁడను. కాని, నా పూర్వస్నేహితు నీ విధముగాఁ గలిసికొందు నని నేను స్వప్నమందైన ననుకొనలేదు.

నటే : విఠలుఁ డిప్పు డిక్కడ లేఁడు. ఎంతసేపటి కాతఁ డింటికి వచ్చునో యా సంగతియును దెలియుట లేదు. నా వలన నేమైనఁ గావలసియున్న చోఁ జెప్పుము.

పల్ల : అది విచిత్రమగు నేరము. నే నాతనినే స్వయముగఁ జూచి మాటాడవలసియున్నది. అదియొక చిన్న పెట్టెనుగూర్చిన విషయము. నీవు “ పెట్టె ” అని చెప్పినతోడనే యా విషయమై యుండు నని యనుకొన్నాఁడను.

అప్పుడు నరేశుఁడు సందేహగ్రస్తుఁడై యాపాదమస్తకము నాతని దృష్టించిచూచెను. కాని, పల్లవునిముఖమునందు సహజమగు ప్రసన్నతయే యగపడుచుండెను. కాని, యెట్టి కృత్రిమభావమును గనఁబడుటలేదు. అందువలన నాతఁడు విశ్వాసపాత్రుఁడేయని నరేశుఁ డాతని నమ్మవలసివచ్చెను.

నరే : ఆ పేటికవిషయమేమి? నీకేమైనను దెలియునా?

పల్ల : నరేశా! నాకేమియును దెలియదు. కాని, కొన్ని సంగతులున్నవి. ఆ వివరములునీతో మాత్రమే చెప్పఁదగినవని నానమ్మకము. చూడుము! అట్టివిశ్వాసముతో నుండుటయే మంచిదికాదా? ఒకరికొకమాట యిచ్చినచో దానిని పత్రము వ్రాసియిచ్చినదాని కంటె హెచ్చుగ గౌరవింపవలయుననియే నామతము.

నరేశు : నాకొఱకు నీ ప్రతిజ్ఞకును వాగ్దానమునకును విరుద్ధముగా నడవనక్కఱలేదు. కాని, యొకసంగతిమాత్రమున్నది. వివరములఁ దెట్టిరహస్యములైన నాతోఁ జెప్పకుండ నుండఁబోదు. అందు వలన యదియెట్టిపెట్టెయని మాత్రము నిన్ను నేనడిగి తెలిసికొనవచ్చునా?

పల్ల : దానినిగూర్చి చెప్పుటలో నేమియును బాధలేదు. అది యద్భుతమహిమగల మరకతమంజూష. దానిలో నెన్నియోరహస్యము లున్నవని నా నమ్మకము.

నరే : అట్టిదొకపెట్టె మా యజమానుఁడగు నిర్మలమూర్తి యొద్దనున్నది.

పల్ల : అట్లయిన మఱియును మంచిది.

నటే : ఇప్పుడు కాంతనాథుని మరణవిషయమున మావిరలుడు ప్రయత్నము సేయుచున్న నేరమునుగూర్చి నీవేమైనను జెప్పఁదగిన దున్నదా ?

పల్ల : ఎంతయోయున్నది. రమ్ము. నీవును నా కథనువినినచో నీకు నమ్మకముకలుగవచ్చును.

నటే : నావికమహాశయా ! నౌకాప్రయాణమునందుఁ గాల క్షేపమగుటకొఱకు నీవు చెప్పుచుండెడికట్టు కథలనుగాక, మఱేమి చెప్పినను నేను నమ్మదను.

పల్ల : అయ్యో ! అవన్నియుఁ గల్పనాకథలు. వానికి దీనికి సామ్యమెక్కడ ? ఇది పరమాద్భుతమగు విషయము—అవ్వలనేదియో గందరగోళము వచ్చుచున్నట్లున్నది. అదేమిచెపుమా !

పల్లవుఁడు కుర్చీనుండి చటాలునలేచి యొక్కపరుగునఁబోయి తలుపు తెఱచెను. ఆతనికక్కడ నేమియోకనఁబడెను. ఆతఁడు నౌకాధికారియైనను, హృదయమును బదిలపఱచుకొనఁజాలక తొట్రుపాటుతో నొకయడుగు వెనుకకువైచెను. అప్పుడు బాగుగదృష్టించి చూడఁగా నొకవ్యక్తి యాతనికగపడియెను. ఆతని బట్టలన్నియును బురదయై యుండెను. ఆతనిముఖమునుండి రక్తము ప్రవహించుచుండెను. ఆతఁడు వణఁకుచువచ్చి యాఫీసుమధ్య నేలపైఁబడి కాలుసేతులు తపతప కొట్టుకొనసాగెను. నటేశుఁడావయసునందును మిగులఁ జురుకుగఁ బరుగెత్తుకొనిపోయి యొకగాజుకుప్పితో నీటిని, "స్పంజి" యను మృదుపదార్థమును దెచ్చి దొరలుచున్న యావ్యక్తి ముఖమును బాగుగఁగడిగి చూచెను. అదివఱకు నావ్యక్తియెవ్వరైన దియు గుర్తించుటయే చాలఁ గష్టముగానుండెను. ఇప్పుడు కాలువలు గట్టుచున్న రక్తమును గడిగివైచి పరీక్షించిచూడఁగా విరలమూర్తియే యావ్యక్తియని తెలిసిపోయెను. అప్పుడు నటేశున కేకకాలమునందే

హర్షవిషాదము లుదయించెను. పిమ్మట నాతఁడు "విరలా !" అని గట్టిగ నఱచి "అయ్యో ! పాపాత్ములు మావిరలుని జంపనెంచిరిగా ! హత్య చేయఁదలంచిరిగా ! ఆహా ! ఘోరపాతకులకుఁ దగినశాస్తి చేయక విడుతునా ?" అని చెప్పుచుఁ జాలవిచారించెను.

పల్లవుఁడు తనమనంబున "మనము కొండంతకార్యమును నెత్తిపైఁబెట్టుకొని యిక్కడకువచ్చితిమి. ఇక్కడకు వచ్చిచూడఁగా విరలుఁడీయుపాయమునఁబడి స్మృతి తెలియకుండు స్థితిలోనికి వచ్చినాఁడు. నేనీతనితో మాటాడుటయెట్లు ? నాకార్యమెట్లు నెఱవేఱును ? ఛీ ! నేనువచ్చినవేళ మంచిదికాదు. లేకున్న నీయంతరాయము లెందులకు వచ్చును ? మొదటికే మోసమువచ్చునట్లున్నది. ఈతఁడపరాధపరిశోధకులలో నగ్రగణ్యుఁడని యిక్కడకువచ్చితిని. ఆమాటసత్యమే ! నాకార్యముగూడ నీతనివలననే నెఱవేఱవలసియున్నది. ముందేమి జరగునో—మంచికార్యముల కనేకవిఘ్నములనుమాట సార్థకమగుచున్నది" అని యనుకొనసాగెను.

# పదునొకండవ ప్రకరణము

విఠలున కీయాపదయెక్కడసంభవించినది? అదెట్లుసంభవించి నది ? అని యావిషయమునుగూర్చి తెలిసికొనుటకై మా పాఠకులు చాలఁగుతూహాలురై యుందురు. ఎవ్వాని దూరాలోచనముల వలన నీతనికీకష్టపాటుకలిగినదో పాఠకులకుఁ దెలిసియే యుండవచ్చును. అందులకు మంగళతరంగమునకు మాధవుఁడు మొదలగువారు పోయిన సంగతిని జ్ఞప్తికిఁదెచ్చికొనినచో నదియెట్లుజరగినదియును పాఠకులకుఁ దెలియకపోదు.

ఆకుముదినీనదీతీరముననున్న మంగళతరంగమను గృహము నుండి శాంతకుమారి యనునామె విఠలునకొక యుత్తరము వ్రాసెను, ఆయుత్తరమున, ఆగృహమునకు విఠలుని రావలయుననియు, ఆతనితో రహస్యమగు నొకనేరమునుగూర్చి యోజింపవలసియున్న దనియు, వ్రాయఁబడియుండెను. ఆయుత్తరమునందుకొని విఠలుఁ డుత్కంఠకు బయలు దేరిపోయెను. విఠలుఁ డాగృహద్వారమునొద్దకుఁ

బోవుసరి కొక కాంతయక్కడకు వచ్చి తలుపు తెఱచెను. ఆమె వదనాలంకారమునకో, నుదిటియందులకో గాని, ముఖమున మొగివి మెఱుంగు (**Face Powder**) ను పూసికొనినట్లగపడెను. ఆతఁడు లోపలికి నడవలోనికిఁబోవుసరికి ముందుమార్గమంతయుఁ జాలఁజీఁకటిగా నుండెను. అతఁడక్కడ నడుగుపెట్టినతోడనే యిరువురుమనుష్యులు వచ్చి యాతనిమీఁదఁబడిరి. పిమ్మట వారితో విఠలుఁడు కలియఁబడి చాలసేపు మల్లయుద్ధముచేసెను. వారిరువురు. ఈతఁడొంటరిగాఁడు. అందువలన విఠలుని ప్రయత్నములేవియు సాగలేదు. వారిరువురు నీతనినెత్తికొని నదీతీరమునంటియున్న యొక ఱాతిగుట్టమీఁదనుఁబోయిరి. విఠలుఁడు వారిచేతులనుండి విడిపించుకొనవలయునని చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. ఎన్నియో కేకలనువైచెను. అయినను నాతని కెవ్వరును సాయపడరైరి. వారిరువురు నాతనినమానముగా నెత్తికొనిపోయి యాగుట్టమీఁదినుండి నదిలోనికి విసరివైచిరి. ఆ విసరుతో నాతఁడు ఱాళ్లు, గప్పలు మొదలగువానిపైఁబడి తుత్తునియలై పోవలసినదే—కాక, ఎత్తుమీఁదనుండి యానదిలోఁబడి ప్రాణములు విడువవలసినదే. కాని, యదియట్లుజరుగలేదు—జగదీశ్వరుని కృపయున్న వో ఆకాశమునుండిపడినను పూలపాన్పుమీఁద నే పడుట తటస్థించునుగదా! ఆవిధముగాఁ ద్రోయఁబడిన విఠలుఁడు భాగ్యవశమున నొకతెప్పోడ మీఁదఁబడియెను. అందువలన నాతనికించుక దెబ్బతగిలినను ప్రాణములు నిలుచుటకుఁ గారణమైనది. నదిలోఁబడిపోకుండ నాతీవ లాతనికించుక సాయముకూడఁజేసినవి. పైనుండియాఱాతిగుట్ట క్రిందికిఁబడునప్పుడాతని చేతికిమాత్రము బలమైన దెబ్బతగిలినది. అంతేకాక తలకుఁగూడ గాయముతగిలెను. ఆదుష్టాత్ములీతఁడీపాటికి యమలోకమునకుఁ బోయి యుండునని యోజించి మందిరమునకుఁ బోయిరి. విఠలుఁడు మెల్లగ లేచి

వారక్కడనుండి పోయినజాడనుగనిపెట్టి యొక్కపరుగున నాఫీసునకు వచ్చిచేరెను—ఆపాతకు లాక్రూరకార్యమునుచేసి ఇఁకనక్కడనున్నచోఁ దమకేమైన నపాయము వచ్చుననియో, ఎవ్వరైనఁ దమదుష్కృత్యము లనుగనిపెట్టి తమ్ముఁబట్టుకొందురనియో భావించి యాగృహమును విడిచి దానికిఁజేరువనే జనసంచారశూన్యమైయున్న యొకయడవిలోనికిఁ బోయిరి. నారాత్రి రెండుజాములవఱకు నాయడవియందున్న నెదురుపొదలో దాఁగికొనిరి.

ఆ పురుషులిరువురు మాధవభాస్కరులనియు, నా స్త్రీ తిలక సుందరి యనియు మాపాఠకులెఱింగియేయున్నారు. సౌదామిని లోపల నొకగదిలోనుండెను. తిలకసుందరి, విఠలుఁడు లోపలకువచ్చినపిమ్మట సౌదామినియొద్దకుఁ బోయెను. వారిరువురును మాధవభాస్కరులు చేయు క్రూరకృత్యమునుజూచుచు నీవలివైపునుండి యితరులెవ్వరును రాకుండఁ జూచుకొనుచుండిరి—

ఆరాత్రి యీ వెదురుపొదలో నాలుగురును పిశాచములవలెఁ గూర్చుండిరి. వారిహృదయము లప్పుడిట్టిస్థితిలోనున్నవని యెవ్వరు వర్ణించివ్రాయఁగలరు ? తుపానుసమయమునందలి సముద్రమువలె, పెనుగాలిలోని చెట్లయాకులవలె, సంక్షోభతరంగములతో, రెపరెప కొట్టుకొనుచుండెను. దుష్కృత్యమునవలనఁ గలిగిన హృదయావేగమువ వారు కొన్నినిమిషములవఱకు నేమియును మాటాడుకొనలేదు. ఎక్కడేమిచప్పుడైనను, తమ్ముఁవెదకిపట్టుకొనుటకై యెవ్వరోవచ్చు చున్నారనియే భావించుకొని, యదటుగుండెతో వారటునిటు చూచుచుండిరి. దూరమునుండి మనుష్యులు మాటాడుచున్నసద్దుగాని, రాత్రి దిరుగుమృగములయులివుగాని వినినంతనే వారిగుండె గుభిల్లు

మనుచుండెను. అంతయును నంధకారమయముగా నుండెను. అంతయు నిశ్శబ్దమయ్యెను. ఎక్కడను జనసంచారములేదని వారి హృదయమునకు బోధయగుచుండెను. ఆ సమయమున — ఆ యనకాశమున—"ఎంతటి దుష్కృత్యము!" అనుశబ్దము వారికివినవచ్చెను. అది యెక్కడనుండి వచ్చినది? అట్లు మాటాడినవా రెవ్వరు? ఆ విధముగ మందలించుచున్నవా రెవ్వరు? నాయనలు ప్రశ్నలు. ఒకరి మొగమునొకరు చూచుకొనిరి. ఆ చిమ్మచీకటిలో వారి మొగములే వారికగపడుటలేదు. ఇంక నాశబ్ద మెక్కడినుండివచ్చెనో వారికెట్లు తెలియును? ఆ గాఢాంధకార మట్లుచెప్పుచున్నదా? లేక మహాత్మునా యరణ్యమే వచించినదా? లేక భూమియో—లేక యాకాశమో? అట్లుపలికిన దెవ్వరు? ఆ పాదపమే యట్లనుచున్న దేమో? వారికేమియును దెలియలేదు. భయభ్రాంతులై యున్నవారికి దమయంత రాత్మయే యట్లనుచున్నదని, తెలియుట కవకాశమెక్కడనున్నది? ఎంతటిదుష్కృత్యము! మాధవుఁ డంతరాత్మను జయించినవాఁడే— ఆతఁడు భాస్కరునిఁ జూచి "భాస్కరా! మంచిపనిజరిగినది. ఇంక మనము నిష్కంటకముగ మన ప్రయత్నములను జేయవచ్చును. మనలనుపీడించుచున్న యీ ఘోరపిశాచము నేఁటితో నశించిపోయినది." అనియెను.

భాస్కరుఁడు : పిశాచము వదలిపోయినది — మనకా మరకత మంజూష దొరకుమార్గమెట్లు?

మాధ : దానినిగూర్చియే యోజించుచున్నాఁడను.

సౌదామి : ఆ ముదినక్కతోఁ దగినశాస్తి జరగిపోయినది. ఇఁక భయములేదు. ఆ పేటికను సంపాదించుభారము నామీఁద నుంచుఁడు. నేను ప్రఫుల్లనై నప్పుడు నేనిచ్చిన పేటిక నాకు మరల వచ్చుటకేమి యాటంకముండును?

తిలక : వారణుఁ డందులకేమియు నభ్యంతరము చెప్పకుండ నుండునట్లు చేయుటకు నేను సిద్ధముగానుంటిని. ఆ భారము నామీఁద నుంచుఁడు.

భాస్క : తిలకా! నీవాతని నెట్లో వలలోవైచుకొని, యాతని చేతనే యా పేటికను దెప్పించుటకుఁ బ్రయత్నింపుము.

మాధ : ఆ పనిచేయుట యసాధ్యము. ప్రఫుల్లయా స్త్రియందా తనికేమియధికారమున్నది? అది యాతనికెట్లువచ్చును? ఆపని నాతఁడు చేయలేఁడు.

ప్రఫు : ఆ భారము నామీఁద నుంచుఁడు. ఆ ముదిగొడ్డు చచ్చుచు నంతగాఁ గేకలువైచినాఁడేమి? ఎవ్వరైన వత్తురేమో యని నాకుఁ జాల భయముకలిగినది.

తిల : చచ్చునప్పటి సంధిమంత్రములు—ఇట్టిప త్తేదారులందఱు నిట్లే పఠింతురు—

భాస్క : బలె! తిలకసుందరీ! బలె! మంచిమాట చెప్పినావు—అవి సంధిమంత్రములే. ఆ యార్పులు పైకిరాకుండ నేను కొంతసేపాతని కుత్తుక నొక్కినాను, అవి సంధిమంత్రములు కనుక నే పైకి వినఁబడినవి.

మాధ : అవిసరిగసప్పుడు—నీవు తిన్నగఁ జూచలేదు — నేను చూచినాను—ఆ యమకింకరుని శరీర ముంద్రమువలె క్రిందికి దొరలినది. బహు విచిత్రముగా దొరలినది.

భాస్క : అంత బరువున్నాఁడేమిరా?

మాధ : అవునవును. ఆ ముండకొడుకునకు మంచిబలమున్నదిరా! మనచేతిలోఁ బనికివచ్చినదికాదుగాని, మంచిపిండిపుష్టిగల ప్రాణిరా!

# పన్నెండవ ప్రకరణము

ఇఁక మనము విశలునియొద్దకుఁ బోవుదము. నరేశుఁ డాతని కుపచారములు చేసెను. దానివలన నేమగును ? ఇఁక ముం దేమిచేయవలయునో నరేశునకుఁ దెలిసినదికాదు. కాని, సామర్థ్యశాలిఁ డగు పల్లవుఁడు మాత్రము మిగులశాంతభావముతో విశలునినాడిని, గాయములను బాగుగఁ బరీక్షించెను. ప్రాణభయమేమియు లేదని యాతఁడు తెలిసికొనియెను. కాని, ఎడమకంటియొద్దమాత్రము బలమైన గాయము తగిలియుండెను. ఆగాయమును జూచినచోఁ దలచిప్ప నూడఁదీయుటకొక పదునైన యాయుధముతోఁ గోసినట్లుగా నగపడుచుండెను. ఇంతియకాక యెడమమోచేతికిఁ బెద్దదెబ్బతగిలి యుండెను. అదియల్లాడించుటకుఁగూడ నసాధ్యముగానుండెను.

పల్లవుఁ డిదియంతయును బరీక్షించినపిమ్మట "నరేశా ! నీవుపోయి వేగముగ వైద్యునిఁబిలుచుకొనిరమ్ము. విశలుఁ డింకను చావలేదు. ప్రాణభయమురాఁగూడదు. దెబ్బలుమాత్రము బలముగాఁ దగిలినవి" అనియెను.

నటే : ఆపాడుపెట్టె మూలముననే యింతటి యనర్థకములు కలుగుచున్నవి. అని గొణుగుకొనుచుంబోయి యూయుత్తరక్షణము వనే యొక శస్త్రవైద్యుని (A surgeon) బిలుచుకొని వచ్చెను. ఔషధోపచారములతో నాతఁడు విశేషముగ శ్రమపడి పిమ్మట నొక గంటకుసరిగ వితలునకు స్మృతికలిగెను. కాని, తనకేమి సంభవించు నదియు నాతనికిఁ బాగుగఁదెలియలేదు.

వితలుఁడించుక సేదదేరినపిమ్మట పల్లవుఁడు నటేశునిజూచి "అయ్యా! నేను మరల నెప్పుడైననువచ్చి వితలునితోమాటాడెదను." అనిచెప్పి బయలుదేరి పోఁబోయెను.

ఈలోపల వితలునకు స్మృతివచ్చిన పిమ్మట నటేశుఁడు మెల్లగఁ బల్లవు నాతనికిజూపి యాతఁడు వచ్చినకార్యమునుగూర్చి నివేదించెను. అది జరగినపిమ్మటనే పల్లవుఁ డిప్పటికిఁబోయి మరల నొకసారి వచ్చి వితలునిఁజూచెదనని నటేశునితోఁ జెప్పియుండెను. అప్పుడు పల్లవుఁడు మెల్లగ నటేశునితోఁ జెప్పుచున్న మాటలను పాముచెవులుగల వితలుఁడాలకించి పల్లవుని వైపునకుఁదిరిగి "ఓనావిక శిఖామణీ! నీవిప్పుడు బయలుదేరవలదు. నీవు వచ్చినపనియేమో ప్రయయుంచి నాతోఁజెప్పుము" అనియెను.

పల్ల : నీకిందువలన నేమియు నాయాసముకలుగకున్న నొక ముఖ్యముగాఁ జెప్పెదను.

విత : నాకిట్టిదెబ్బలకేమియును లోపములేదు. జనులయోగ క్షేమమునారయుటకై కంకణముకట్టుకొనిన పత్తేదారులు స్వసుఖము నపేక్షించి వెనుదీయవచ్చునా? మనకర్తవ్యమును మనము చేయుటలో నింతకంటెను విశేషముగ నింకను నెట్టియపాయములకు లోనుగావలసి యున్నదో?—ఇప్పుడు నావలనఁ గావలసినదేమున్నది.

పల్ల : నేను సీతోఁదక్క నితరులకాసంగతి చెప్పనని శపథము చేసికొనియుంటినిగాదా!

విత : నేనిట్టిరహస్యమునైనను నటేశునకుఁ దెలుపకుండ నుండుట లేదు.

నటే : మహాశయూ! ఇదిగో! నేను వెలుపలకుఁ బోవుచున్నాను. మీరు మాట్లాడుకొనవచ్చును.

వితలునకుఁ బల్లవునకు రెండుగడియలసేపు సంభాషణము జరిగినపిమ్మటఁ బల్లవుఁడీవలకు వచ్చి "నటేశా! క్షమింపుము. ఇఁక నీవు రావచ్చును." అనియెను.

నటేశుఁడు లోపలకువచ్చెను. వచ్చి వితలునిముఖమును జూడఁగా నాతఁడు మునుపటికంటెను గంభీరభావముతో నేమియో యాలోచించుచున్నట్లాతనికిఁ గనఁబడెను.

విత : నటేశా! నౌకాధికారియగు పల్లవుఁడు హృదయభేదకమగు నొకకథనుజెప్పియున్నాఁడు. అదంతయు నిశ్చయమైనచో, దైవకృపవలన మనకిర్యాదునకుఁ దగినసాధనసంపత్తి (**Evidence**) యంతయుదొరకినట్లే యగును.

నటే : మంచిది. అది చారుచంద్రుని కుటుంబవిషయమేనా?

విత : అవును—కాంతనాథునిదే.

పల్ల : సరి. అట్లయినచో, పెట్టె జాగ్రత్తగనున్నది. బాలికయును సురక్షితముగా నున్నది.

విత : నీవు చెప్పినదంతయు నేను చూచుకొనియెదను. కాని, యీమధ్య నీవు నన్నుఁజూచుట నెవ్వరితోడను జెప్పవలదు.

పల్ల : నీవుచెప్పినట్లునడచుకొనుట నావంతు.

విత : నాప్రస్తుతస్థితిని జూచినచో నేనించుక విశ్రాంతి గైకొనవలసియున్నది.

పల్ల : అట్లుచేయనిచో శరీరము చెడిపోవును.

విశ : అందులకనియే యోజించుచున్నాఁడను.

"మీకుఁ బూర్ణారోగ్యము కలిగినపిదప మరల నొకసారి వచ్చి దర్శనముచేసికొందును" అని చెప్పి పల్లవుఁడు వెడలిపోయెను.

తన ప్రయత్నములకు సాహాయ్యముచేయవచ్చిన పల్లవుఁడు వెడలిపోయినపిమ్మట విశాలుఁడొక యుత్తరమును వ్రాసి, దానిని చేత యందుంచుకొని నటేశునివైపునకు జూచి "అయ్యా! వినుము. కాంతనాథునకొక యన్న యున్నాఁడఁట" అనియెను.

నటే : అవును. అతనిపేరు వనజచంద్రుఁడు. అతఁడు మిగుల తుంటరి. జూదగాఁడు. త్రాగుఁబోతు—వెనుకముందుఁజూడకుండఁ జేతికివచ్చినట్లెల్ల వ్యర్థముగా సొమ్ము వెచ్చించువాఁడు.

విశ : ఇదిగో! ఈకాగితమును జదువుచున్నాఁడను వినుము. ఇది లలితపట్టణమునందున్న నామిత్రుఁడును, సుప్రసిద్ధుఁడునగు నొక పత్తేదారునకుఁ బంపఁదగినది "వనజచంద్రుఁడు న్యాయమగు హక్కు-దారుఁడు కాఁడనియు, కాంతనాథుఁడే సరియైన హక్కు-దారుఁడనియు వినుచున్నాను. ఈవిషయములను బాగుగఁ దెలిసికొని యింకను విశేషాంశములేవైన నున్నచో వానితోఁబాటు విశదముగా నాకొక యుత్తరము వ్రాయఁగోరుచున్నాఁడను" అని యుత్తరమును జదివెను.

నటే : అట్లయినచో కాంతనాథునిహత్యచేయుటకు సరియైన కారణము దొరకినట్లే—

విశ : వనజచంద్రుఁడే యీ దుష్కృత్యములను జేయించుచుండవచ్చును. అందులకు సందేహములేదు. అతఁడే యీ హత్యలకు

మూలకారణుఁడు. చారుచంద్రుఁ డేండ్లు చెల్లిన వృద్ధుఁడు—నేఁడో రేపో యనుచున్నవాఁడు—ఇఁకముందుఁ దండ్రి చనిపోయినపిమ్మట కాంతనాథుఁడు తనపుట్టుపూర్వోత్తరముల నెత్తినచోఁ దనజీవనాధారము చెడిపోవునని యూహించుకొని వనజచంద్రుఁడే యీకాంతనాథుని జంపించుటకై యత్నించియుండవచ్చును.

నటే : ఈసంగతులు పల్లవుఁడు నీతోఁ జెప్పినాఁడా ?

వీర : అవును. అంతేకాదు. ఇంకను ముఖ్యమైనసంగతుల నెన్నిటినో చెప్పియున్నాఁడు. ఇంతకుఁ దేలినసారాంశములలో మొదటిది, పచ్చలపెట్టె యమూల్యమగు శ్రేష్ఠవస్తువనియే దానిని జాగ్రత్తగఁ గాపాడవలయును.

నటే : ఎన్నియోకష్టములను దెచ్చిపెట్టుచున్న యీపాడు వస్తు వెఱకాసువెలయైనఁ జేయదని నానమ్మకము. దాని నేసముద్రములోనైనఁ బాఱవైచినచో మనము క్షేమముగానుండవచ్చును. అప్పుడు నేను తలఁపడవిచూచుకొందును. ఇదినాకిప్పటియనుభవమా!—నడచుచున్నప్పుడు, భోజనముచేయుచున్నప్పుడు, పైదైనఁబనిచేయుచున్నప్పుడును, దేనినైనఁగూర్చి యాలోచించుచున్నప్పుడు, రాత్రి, పగలు, అదినన్ను వేధించుకొని తినివేయుచున్నది. కన్నెత్తిచూచిన నది కనఁబడును. కన్నుమూసికొనిన నది కనఁబడును. దానియందేమి మహిమయున్నదో, యెవ్వరుచెప్పఁగలరు ? అదియెన్ని దారుణహత్యల నెన్నివత్సరములనుండి చేయించుచున్నదో, ఎన్నిప్రాణములనీవఱకు బలిపుచ్చుకొన్నదో నేను లెక్కించిచెప్పఁగలనా ? ఎందులకు ? దానిని వదల్చుకొనుటలో సుఖమున్నదని నాతలంపు—

వీర : నీవు పట్టుపట్టియెల్లప్పుడు దానిని ద్వేషించుచున్నావు. దానియందు ద్వేషముహెచ్చినకొలఁది నదియే నీమనస్సున ననుక్షణ

మునువచ్చి నిలుచుచున్నది. అందేమున్నది ?- కానిమ్ము. నటనా : నా పేరుతో నీటెల్లిగ్రాఫునిచ్చిరమ్ము. ప్రఫుల్లతోఁగొన్ని సంగతులు మాటాడిరావలసియున్నందున నేనీరాత్రియే యూరికిఁబోవుచున్నాను. ఇక్కడనున్న వారిమీఁద నీవెప్పుడు నొకకన్నుంచియుండవలెను. ఎవ్వరడిగినను విఠలుఁడేమయ్యెనో నాకుఁదెలియదని చెప్పుచుండుము. నేను నదిలోఁబడి మరణించితిననియే వారినమ్మకొననిమ్ము.

నటే : అన్నియన్నియును జాగరూకతతోఁ జక్కఁబెట్టు చుండెదను. ఇక్కడి విచారము కేమక్కరలేదు.

అనిచెప్పి నటేశుఁడు టెల్లిగ్రాఫునిచ్చుటకై వెడలిపోయెను. విఠలుఁడు రైలుస్టేషనునకుఁబోయెను. విఠలునకు నేఁడెన్నఁడును లేని సంతుష్టికలిగెను. ఆ సంతుష్టికిని దానివలనఁగలుగుచున్న సంతోషమునకును బల్లవుఁడు తనికిఁదెలిపిన సువార్తయే కారణము. ఇప్పుడొక కొంతకాలము విశ్రాంతిసుఖము ననుభవింపవలయునని విఠలుఁడు యోజించుకొనసాగెను. అతని మేనమామయగు వాగీశుని పేరుతో నీనడుమ వారణాలాలునకొక యుత్తరము వ్రాసియుండెను. అందులో "మేనల్లుఁడా ! నాకుఁగొంతకాలమువఱకు సముద్రపుగాలి సోఁకుట మంచిదని తోఁచుటచేత నేను సముద్రతీరమునకుఁ బోయితినని ప్రఫుల్ల మొదలగువారితోఁ జెప్పుము. నేనుమరలఁ ద్వరలోనే వచ్చెదను." అనుసంగతులనుగూడ వ్రాసెను.

విఠలుఁడు కొన్నిదినములు విశ్రాంతితీసికొని వచ్చినపిమ్మట మరల వారణుని మేనమామవేషముతో నాతనియింటికిఁబోయి సౌదామిని మొదలగువారితో నా గృహముననుండి ముందుఁదన ఫిర్యాదునకు సంబంధించిన సాధనసామగ్రినంతను జాగ్రత్త పెట్టుకొన వలయుననియు, వారు తన్ను గుర్తింపఁ జాలకున్నచో మాధవుఁడు

మొదలగువారిని వెలుపలకు గెంటివేయవచ్చుననియు నుద్దేశించుకొనియెను.

విఠలుఁడు తనజహాగీరు గ్రామమునకు బయలుదేరిపోయెను. ప్రఫుల్ల యత్యుల్లాసముతో విఠలమూర్తి కెదురువచ్చి లోనికిఁ దీసికొనిపోయి యాతనిని నౌరసపుత్రునికంటె నెక్కుడు ప్రేమతో నాదరించెను. ఆతనికీమధ్యసంభవించిన యుపాయములనువిని చాల విచారించెను. విఠలుఁడు క్రొత్తమంగళమునకు వచ్చిన రెండుదినములకుఁ బిమ్మట నొకనాఁటిసాయంకాలమున నొక మడతకుర్చీపైఁ గూర్చుండి యుండెను. ఆ ప్రాంగణమునందే సమీపమునందున్న యొకపనస చెట్టుక్రింద నొకబల్లమీఁదఁ బ్రఫుల్లకూర్చుండి యేదోయొక పుస్తకమును జదువుచుండెను. ఆ పత్తేదారునకప్పుడు వెనుకనుండి యేదయో శబ్దము వినఁబడియెను. ఆతఁడు నలువైపులను బరికించిచూడఁగా సమీపముననున్న కంచెలలోనుండి యొకచిన్నరాయివచ్చి ప్రఫుల్ల కాలునకుఁ దగిలెను. దానిచుట్టు నొకకాగితము చుట్టఁబడియుండెను. ప్రఫుల్లయేమియో మెల్లగననుకొనుచుఁ గ్రిందికివంగి దానిని దీసికొనియెను. ఇఁకనుఁందామె యేమిచేయునో చూడవలయునని విఠలుఁడు కన్నులుమూసికొని నిద్రదనభినయించుచుండెను. ఇంతలో సాయంకాలమైనందునఁ జీఁకటులుమెల్లగ వ్యాపింపసాగెను. ప్రఫుల్లమొదటఁ జాలనధీరయయ్యెను. అయినసది యెవ్వరునుజూడఁజాలరని భావించుకొని యూ రాతికిఁజుట్టియున్న కాగితమును చదువుకొనియెను. చదువునుః జదువుచునుండఁగా యామెముఖము నల్లవడియెను— కాలుసేతులు వడఁకసారంభించెను. ఆ పిమ్మట నా కాగితమునుమణచి తన యొద్దదాచుకొని విఠలుని సమీపమునకుఁబోయి చూచెను కాని, యాతఁడేమియును మాటాడలేదు. ప్రఫుల్లయు నాతనికాయూసము నీయలేదు. ఆమెయిఁకఁ దనకష్టములు గట్టెక్కినవని సూచించు

గంటవఱకు నీవిధముగా నేదియో సంభాషణముజరగుచుండెను. కట్ట కడకుఁ బ్రఫుల్లగట్టిగా "నీవుపోయి యజమానుఁడగు విశలునిజూడుము. చూచెదవా?" అనియెను.

ఆతఁడు : ఇప్పుడెందులకు? ఇంకను గొన్నిదినములు జరుగ నిమ్ము—నామాటనువిశ్వసింపుము. అన్నియును చక్కఁబడును— నేనుపోయెదను—కాని, నన్నీవిధముగా నీవుచూచుట యిప్పుడెవ్వరికిని దెలియఁగూడదు—నీవింటికిఁబొమ్ము—

ప్రఫు : నేను మరల మిమ్ములఁజూచుటెప్పుడు?

ఆతఁడు : ఇఁకఁగొన్నిదినములలోనే నేను మరలి వచ్చెదను.

అని యాతఁ డక్కడనాగిపోయెను. ప్రఫుల్ల గృహాభిముఖ యయ్యెను. ఆపురుషుఁ డత్యౌత్సుక్యముతోఁ జాలసేపాసుందరివైపునకే చూచుచుండెను. ప్రఫుల్ల దృష్టిపథమునుండి దాటిపోవువఱకును దాగికొనియున్న విశలుఁడప్పుడు బాణవేగముతో ముందునకుఁబోయి యానూతనపురుషుని ముందునకు వచ్చినిలిచి గంభీరస్వరముతో "ఎవ గయ్యామీరు? ఈకార్యకరణమేమి? ఇదతగునా?" అనియెను.

మబ్బులేని యాకాశమునుండి పిడుగుపడినట్లయ్యెను. ఆకస్మికా కముగ నిట్లెవ్వరోవచ్చి తనకృత్యమును జూచిరిగదాయని యాతఁడు మిగుల నాందోళనమునొందసాగెను. ఆతఁ డేమియును తోఁచక స్తబ్ధభావముతో నిలువఁబడిపోయెను, తుదకాతఁడు విశలునిముఖము నించుక తీవ్రదృష్టితోఁజూచుచుఁ జేతులను వెనుకనుంచుకొని "ఏమైన నేమి? నీవెవ్వరు?" అనియెను.

విశ : నేనెవ్వరైనదియు నీకెందులకు? నీవెవ్వరైనదియు నాకుఁదెలియుట ముఖ్యము. ఏమియునెఱుఁగని ముగ్ధయగు

మా బాలికను బ్రోత్సాహపఱచి గృహమునుండి యీవలకురప్పించిన యీ ధూర్తునిగూర్చి ముందుగాఁ దెలియవలసియున్నది.

ఆతఁడు : నీవు విఠలమూర్తివా ?

విఠ : అవును.

ఆతఁడు : నీవు నాకుఁ జాలసాంతోషమును దెచ్చిపెట్టితివి. ఇట్లగునని నేననుకొనలేదు. నేను ప్రఫుల్లను జూడవలసిన యవసరము వచ్చినది. చూచుటయైనది.

విఠ : కాని, యీ పరస్త్రీహస్తమును బట్టుకొని ముద్దిడుకొనుటకు నీకు మనసెట్లువచ్చినది ? అది యెట్టియయోగ్యులును జేయని పనిగాదా ?

ఆతఁడు : అట్లయినఁగావచ్చును. కాకపోయినఁ గాకపోవచ్చును. నీవు నేనున్న చోటికివచ్చినచో నేనెవ్వఁడనైనదియు, నాకక్కడ నేమిపనియున్నదియుఁ జెప్పెదను.

విఠ : అట్లయినచో వచ్చెదను.

ఆ యిరువురు నక్కడనుండి బయలుదేరిరి. ఆతఁ డాసమీపమునందున్న తాలూకాముఖ్యపట్టణమునం దొక పూటకూళ్లయింట దిగియుండెను. భోజనమైనపిమ్మట నొకగదిలో నా యిరువురకును జాలసేపు రహస్యసంభాషణము జరగెను. విఠలుఁడు నాయింటికి బయలుదేరి పోయెదనని లేచునప్పటి కర్ధరాత్రిసమయమయ్యెను. ఆ నూతనపురుషుని వాక్యములు విఠలమూర్తికిఁ దృప్తికరముగా నుండెను. బయలుదేరుటకుముందు విఠలుఁ డాతనిఁ జూచి "నీవు పూటకూటియింటియందుండు టుచితముకాదు. నాతోవచ్చి నాజహగీరు గ్రామమునందుండుము. కాని, నీ నడతను నీవు సరిచేసికొనవలయును. ప్రఫుల్ల వివాహితయగు కులవధువని జ్ఞప్తియందుంచుకొనవలయును. నేను రేపువచ్చి నిన్నుఁ దీసికొనిపోయెదను" అనెను.

ఆత : ఆ యడవిలో నేను నిన్నుఁ జూచుటయు, పిమ్మట నీతో మాటాడుటయు మొదలగు సంగతులేవియును బ్రఫుల్లకుఁ దెలియ నీయకుము.

విత : "అట్లు తెలుపుటకింకను గొంతకాలము పోవలయును." అని వితలుఁడు వెడలిపోయెను.

ఉదయమున వితలుఁడు మరల నక్కడకువచ్చి యా యువకుని దీసికొనిపోయెను. వీరిరువురును వచ్చుసరికిఁ బ్రఫుల్ల కచేరిచావడిలోఁ గూర్చుండి వార్తాపత్రికను జదువుకొనుచుండెను. అప్పుడు చటాలున లేచి నిలుచుండి యామె వారివైపునకుఁ జూచెను. ఆ యువకుని జూచుటతోడనే ప్రఫుల్లమనసు ప్రఫుల్లమయ్యెను. అయినను, వివేక శాలినియగుటచే నామె హర్షవిషాదములయందలి యేచిహ్నమును గూడఁ బైకగపడనీయలేదు. ఇదియేకాదా, మనోదార్ఢ్యము! వితలుఁ డేమనునో యని యామెదృష్టి యాతని పెదవులమీఁదనేయుండెను.

విత : ప్రఫుల్లా! ఈతఁడు నా మిత్రుఁడు. ఈతని పేరు కులచంద్రుఁడు.

అని చెప్పి యాతనివైపునకుఁ దిరిగి "అయ్యా! ఈమె చాల మంచిబాలిక." అని చూపెను.

ప్రఫుల్ల లజ్జితయై నిలువఁబడిపోయెను. ఎట్టిప్రత్యుత్తరమును జెప్పలేదు. ఆమె వితలునిముఖమును జూచెను. ఆతనిమోమున గాంభీర్యముతక్క మఱేభావము నగపడలేదు. వితలుఁడు కార్యార్థియై యెక్కడకో వెడలిపోయెను. పిమ్మటఁ బ్రఫుల్ల యా యువకునిఁజూచి "ఆతనికిఁ నిన్ను నేనెన్నఁడెఱిఁగియుండనా?" అనియెను.

యువ : ఆతని కెంతవఱకుఁ దెలియవచ్చునని నిరూపింపనోపుదుంటివో, యంతకంటె హెచ్చుగనే తెలిసినది.

ప్రఫు : నీకు విరలమూర్తి పరిచయమున్నట్టు నీవు నాతోఁ జెప్పలేదు కాదా ?

యువ : లేదు. నిన్నరాత్రియే పరిచయమయ్యెను గాని——

ఇంతలో విరలుఁడు తిరిగివచ్చుటచే నా సంభాషణ ముగిసిపోయెను. విరలుఁ డెక్కడకుఁబోయెనో, యెందులకుఁబోయెనో వారికిఁ దెలియలేదు. అప్పుడు విరలుఁడు ప్రఫుల్లనై పునఃపునఃఁ జూచి " అమ్మా ! ప్రఫుల్లా ! ఇచ్చట నీవు సుఖముగా నుందువనియు, క్షేమముగా నుందువనియుఁ దలంచి నిన్నిక్కడ నుంచినాను. నీ కేమియుఁ గష్టముగా లేదు గదా ! " అనియెను.

ప్రఫు : విరలా ! నాకు స్వగృహమునందున్నట్టులె చాల సౌఖ్యముగ నున్నది. నా క్షేమము నరయుటకు నీకంటె సమర్థులును దగినవారు నీకన్న నాకెవ్వరున్నారు ?

విర : అట్లనఁబోకుము. నీసోదరుఁడు వారియింటనున్నాఁడు గదా !

ప్రఫు : ఆతఁడు మొదటినుండియు నింటిపట్టున నుండకుండుట చేతనే యింతవచ్చినది.

అప్పటికి భోజనమువేళ యయ్యెను. విరలుఁడు భోజనమునకై లేచెను.

# పదుమూఁడవ ప్రకరణము

విఠలుఁడు క్రొత్తమంగళమునకు వెడలిపోయినపిమ్మట నరేశుఁ డిక్కడ నూరకుండలేదు. విఠలుఁడు పరలోకగతుండయ్యెనని యా పాతకులు విశ్వసించుటకుఁ దగిన నిదర్శనములుండు ప్రయత్నములను జేయుచుండెను.

ఒకనాఁడు నరేశుఁ డూరివెలుపలకుఁ బోయి వచ్చుచుండఁగాఁ జీఁకటిపడుచుండెను. అప్పుడొకవ్యక్తి, ఒడలినిండ ముసుఁగువైచుకొని చెట్లనీడనుండి యాతని వెనుకనే వచ్చుచుండెను. నరేశుఁ డేమియో యాలోచించుకొనుచుఁ బరధ్యానముతో నింటివైపునకు నడచుచుండెను. నరేశుఁడు విఠలుని కార్యాలయమును సమీపించినతోడనే వెనుకనున్న యా వ్యక్తి యొక్కయంగలో నాతనిమొదటినుండియే యా కార్యాలయమునకుఁ బోయెను. నరేశుఁ డులికిపడి "ఎవ్వరు చెప్పుమా! ఇది యా పేటికమహాత్మ్యము కాదుగద!" అని యనుకొనుచు లోపలికిఁ బోయెను. ఆ వ్యక్తి యావఱకనేకపర్యాయములు విఠలునియొద్దకు వచ్చుచుండిన నళిని యని నరేశునకుఁ దెలిసిపోయెను.

అప్పుడు నళేశుఁడు "నళినీ! ఈ చీఁకటిలో నిక్కడకువచ్చితివేమి? విశేషములేమైన నున్నవా?" అని యడిగెను.

నళి : విశేషములకేమియున్నది. ఒకదుర్వార్త యీనాఁడు నాచెవులఁ బడినది. నేను చాలచోట్లఁ దెలిసికొంటిని. జనులనేక విధములుగాఁ జెప్పుకొనుచున్నారు,

నళే : (సంభ్రమముతో) ఏమది?

నళి : యజమానవిరలుఁడు... --

నళే : కొలఁదిదినముల క్రిందట నొకనాఁడతఁడో యగత్యకార్యము మీఁద నాతోఁ జెప్పకుండఁగనే యెక్కడికో వెడలిపోయినాఁడు. అప్పటినుండియు నాతనిజాడయే నాకుఁ దెలియుటలేదు.

నళి : ఆనాఁడే మూఁడుజాములరేయి వెలుపలనుండి చీఁకటిలో నడ్చుచుండఁగా నొకబ్రహ్మరాక్షసి యాతని నెత్తికొనిపోయి యేకాంతస్థలముగా సమీపమునందున్న నదిగర్భమునఁ బాఱవైచినదఁట.

నళే : ఆఁ ...... అని యింకేమియు మాటాడకుండ నూరకుండెను.

నళి : అతఁడు మఱలోకప్రాప్తినొందెనని నగరమునఁ జాల చోట్ల చెప్పుకొనుచున్నారు. ఇదియంతయు మరకతమంజూషవలనఁ గలిగినదఁట.

నళే : (ఉలికిపడి) అదియెట్లు?

నళి : అది యెందఱిప్రాణములనో యీవఱకుఁ దీసికొన్నదనియు, నట్లే యీ విరలుని ప్రాణములనుగూడ నపహరించినదనియుఁ జెప్పుకొనుచున్నారు.

నళే : ఆ సంగతి నేనీవఱకే యాతనితోఁ జెప్పియున్నాను. నామాట వినకపోవుటచేఁ దుదకీయుపాయమునకుఁ జిక్కుకొనవలసి వచ్చినది. ఇఁక నేను జేయవలసిన దేమున్నది?

నళి : ఈ సంగతి యెంతవఱకు నిజమో తెలిసికొనిపోవుద మని నీయొద్దకు వచ్చితిని. నిజము నీకుఁ దెలియకుండ నుండదని నా నమ్మకము.

సత్యే : నాకేమి చెప్పుటకును నోరాడకుండనున్నది. ఏమి చేయుటకును జేయాడకుండనున్నది. ఎక్కడకుఁ బోవుటకును గాలాడకుండనున్నది. ఈ రాక్షసకృత్యముల కెవ్వరు సహించి యుండఁగలరు ?

నళి : ఏరాక్షసకృత్యములకు ?

సత్యే : విఠలు నేరాక్షసిచంపినదో, అట్టిదాని కృత్యముల కెవ్వరైన సహింపఁగలరా ?

నళి : అవును. నాయనా ! ఆ మాట తలంచుకొన్నకొలఁది నాగుండె గడగడవడఁకిపోవుచున్నది. ఈ విపరీతకాలములో పుట్టెడు బుద్ధులున్న వారుకూడ బొగ్గులైపోవుచున్నారు. ఆయన వలన నాకెన్నియో బహుమానములు దొరకుచుండెడివి. ఆ యభిమానము నన్నింతగా నేడ్పించుచున్నది. ఆదెక్కడిదో మహారాక్షసియో కాని, యీ పట్టణమే యీ యూరనెందఱినో పొట్టఁబెట్టికొన్నదఁట——

సత్యే : నాగేశుఁడేమయ్యెనో నీకుఁ దెలిసినదా ?

నళి : ఆ రాక్షసికి భయపడియే యాతఁడీయూరు విడిచి పాఱి పోయినాఁడు.

సత్యే : ఎక్కడకుఁ బోయెనో తెలియునా ?

నళి : ఏయూరికిఁబోయెనో చెప్పలేనుగాని, ఆతఁడిప్పుడీయూర లేఁడు.

నటే : అతని స్నేహితులగు సూర్యనభాస్కరు లెచటనున్నారో నీ వెఱుంగుదువా ?

నళి : ఎఱుంగ కేమి ? వారు కొల్లూరయ్య యింటియొద్ద నున్నారు—

నటే : వారక్కడ నేమిచేయుచున్నారు ?

నళి : గుర్రపుగొయ్యల కేమిపని యుండును ?

నటే : జూదమాడుచున్నారా ?

నళి : అంతమాట యేమిటికి ? పేక నాడుకొనుచున్నారు.

నటే : అక్కడ నెవ్వరెవ్వ రున్నదియు నీవు చెప్పఁగలవా ?

నళి : ఆ గుంపులోఁ జాలమంది యున్నారు. నా వంటపటి పేరుల తోను నాకుఁ బని యేమున్నది ?

నటే : పోనిమ్ము. అక్కడ స్త్రీ లెవ్వరైన నున్నారా ?

నళి : లేకేమి ? ఒక యాడగత్తె వారితోఁ జేరియున్నది.

నటే : ఆమె నీ వెన్నఁడేని చూచితివా ?

నళి : [illegible] చూచినట్లు [illegible]యే......ఆమెను [illegible] దెలియు[illegible] [illegible]—ఈ [illegible] చేతి[illegible] [illegible] [illegible]

నటే : (నవ్వుచు) ఇంక వారల కేమున్నది ?

నళి : నెత్తికిఁ జేతులు-వెట్టి మొగము-వారలామె పాదదాసులు [illegible]—

నటే : ఈ రాత్రి యూట యున్నదేమో నీకుఁ దెలియునా ?

నళి : ఈ రాత్రి యున్నదో లేదో నాకుఁ దెలియదు. కాని, రేపటియుదయమున మరల వారందఱును నక్కడఁ జేరుదురు—

నటే : రేపా ! ఉదయముననా ! సరిలెమ్ము.

నళిని యాతనియొద్ద సెలవుదీసికొని వెడలిపోయెను. నరేశున కా రాత్రి తిన్నగ నిద్దుర పట్టలేదు. తఱచుగ నాతనికి మధ్యమధ్య మెలకువ వచ్చుచుండెను. మరలనడికునుకు పట్టుచుండెను. ఆకునుకులోఁ బచ్చలపెట్టె నెవ్వఁడో వచ్చి తీయుచున్నట్లును, అప్పు డా పెట్టెలో నుండి పొగలును, మంటలును బైకివచ్చి వానిని గాల్చివేసినట్లును, ఆ పేటిక మధ్యనుండి యొక బ్రహ్మరాక్షసి పైకివచ్చి యా యింటిని మూలమట్టముతోఁ గ్రిందికిఁ బడగొట్టినట్లును, తన్నా రాక్షసుఁడు మ్రింగఁబోవుచుండఁగా విశలుఁడడ్డమువచ్చినట్లును, అప్పుడా రాక్షసుఁడు తన్నువిడిచి విశలుని మ్రింగివేసినట్లును, అంతలో నొకరాక్షసస్త్రీ వచ్చి "ఓ ప్రియుఁడా! ఈ పెట్టెనెపమున నీవఱకు నీ వెందఱిని చంపి భక్షించినావు? నా కొక్కరినైనఁ బెట్టితివా?" అని యడుగఁగా నందుల కా రాక్షసుఁడు "ఓ ప్రియురాలా! నీవు నాకూడ నుండక పోవుటచే నేను నీకు విందు సేయఁజాలకున్నాను. నీ కిష్టమున్నచో నీ ముదివానిని భక్షింపుము. నేను వీనిని నీ కొఱకు మిగిల్చియున్నాను. ఈతఁడు పూర్వము నా కెన్నియో బాధలు కలిగించినాఁడు. కావున నీవు వీనిని మ్రింగివేసి నీ యాఁకలి దీర్చుకొనుము" అని చెప్పగా నందుల కా రాక్షసి "ఈ ముసలివానికు నా కేమిలకు? నేను వానిని భక్షించెదను. వాఁడు మిగుల రోతవయసువాఁడు" అని చెప్పినట్లును, నందుల కా రాక్షసుఁడు "నీ యిష్టమువచ్చినట్లు చేయుము. అప్పుడు ఈ ముసలివాని నెవ్వరు తిందురు?" అని యా రాక్షసుఁడు తన్నుఁ గొట్టబోయినట్లును, ఆతఁడు స్వప్నములను గాంచుచుండెను.

తెల్లవారుజామునచే శయ్యనుండి లేచి నరేశుఁడు కాల్యములను దీర్చుకొని సెందలకడ భోజనముచేసి తా నొక పారశీకదేశపు వర్తకుని వేషము వైచుకొని రైలుస్టేషనునొద్దకుఁ బోయెను. అప్పుడే యక్కడ "వృత్తాంతపత్రిక" యను వార్తాపత్రికను విక్రయించు

చుండెను. అతఁడా ప్రతికను బుచ్చుకొని చదువుకొనుచుఁ గొల్లూరయ్య గృహమునొద్దకుఁ బోయెను.

అప్పటికి [illegible]లయ్యెను. అప్పుడే యొకగుఱ్ఱపు బండివచ్చి యింటిముందు నిలిచెను. ఆ బండినుండి యొక యువకుఁడును పురుషుఁడును నొక సుందరియును క్రిందికి దిగిరి. ఆ సుందరి యొకవ్యారముగ నడచుచు నా మందిరములోనికి [illegible] పోయెను. ఆ పురుషులలో నొకఁడు [illegible] "[illegible]! నీవేమయ్యారు? ఇన్నాళ్ళ నేమియైతిరి?" [illegible].

నటి : [illegible] ఈ నగరమునకు [illegible] వచ్చితిని.

పురు : ఈ నాటకప్రతిక నట్లు విచిత్రముగాఁ జూచుచున్నా వేమి? అందేమైన విశేషములున్నవా యేమి?

నటి : విశేషములేమియును లేవు.

"ఒక పత్తేదారుని యాత్మహత్య"

యని యిందొకవిచిత్రవ్యాసము వ్రాయఁబడియున్నది. దానినే యద్భుతముగాఁ జూచుచున్నాను.

పురు : (వెలవెలబోవుచు) ఎక్కడి పత్తేదారుఁడు?

నటి : ఇక్కడి పత్తేదారుఁడే. ఈ నగరవాసుఁడే.

పురు : ఈ నగరవాసుఁడా?

నటి : అవును.

పురు : ఆతని పేరు వ్రాయఁబడియున్నదా?

నటి : ఆహా! ఆతని పేరు విఠలమూర్తియఁట.

పురు : (ఆశ్చర్యము నభినయించుచు) విఠలమూర్తి చంపఁబడియెనా? ఏదీ! ఆ పత్రిక నొక్కసారి నన్నుఁ జూడనిచ్చెదరా?

నటే : ఓ ! అందులకభ్యంతరమేమున్నది ?

అని యావర్తక వేషధారి యగు నటేశుఁ డాపత్రిక నాతని చేతికిచ్చెను. ఆతఁ డాపత్రికనందికొని యీ క్రిందివిధముగాఁ జదువఁ దొడంగెను.

" ఒక పత్తేదారుని యాత్మహత్య. "

" నేఁటికి వారముదినముల క్రిందట నర్ధరాత్రిసమయమునఁ గుముదినీనదీతీరమున నేదియోపనిమీఁద నీ నగరమునందుఁ బ్రఖ్యాతిఁ జెందిన పత్తేదారుఁడగు విశలమూర్తియను నాతని నొక బ్రహ్మ రాక్షసి మ్రింగవచ్చినదఁట. అతఁడందులకు భయపడి దానినితప్పించు కొనుటకై సమీపముననున్న యానదిలోఁ బడియెనఁట - అప్పుడే యాతని ప్రాణములు పోయినవి. ఆ రాక్షసి యాతని కళేబరము నాహారముగా నెత్తికొనిపోయినదఁట——ఎంతటిఘోరకృత్యము ! ! "

అది పూర్తిగఁజదువునది కాపురుషునికాలుసేతులు గడగడ వడఁకసాగెను. రెండవపురుషుఁ డప్పు డాతనిఁజూచి " అన్నా ! పాప మెంతటిక్రూరకృత్యము జరగినది ? " అనియెను.

నటేశుఁడు వారి యాకారచేష్టలను గనిపెట్టి మొదటి పురుషునితో " అయ్యా ! మీరీవిశలు నెఱింగియుందురు. పాప మాతఁడు చాలమంచివాఁడు కాఁబోలునేమి ? " అనియెను.

పురు : అట్లేచెప్పుకొందురు. అయ్యా ! ఈ పత్రికనొకసారి యిచ్చెదవా ! ఇప్పుడే యీ లోపలకుఁబోయి మరలఁ దెచ్చి యిచ్చెదను.

నటే : తీసికొనివచ్చును.

అప్పు డాపురుషులిరువురు నా పత్రికను దీసికొని లోపలికిఁ బోయిరి. మరల నటేశుఁడు తనమనంబున " వీరికి గట్టినమ్మకముకలిగి నది. " అని యనుకొనుచుండెను.

కొంతసేపటికి మరల నా మొదటిపురుషుఁడు గృహమునుండి యీవలకు వచ్చి యా వర్తకవేషధారియగు నటేశున కాసనమిచ్చి వైచి "అయ్యా! శ్రమయిచ్చినందులకు క్షమింపుఁడు" అనియెను.

నటే : దానికేమి లెండు. నేను సెలవుపుచ్చుకొనుటకు ముందుగ మీ పేరును, మీ యుద్యోగమును దెలిసికొనవచ్చునా!

పురు : అందులకు సందేహ మేమున్నది! మా దేశమాంధ్రము. నేను వర్తకవ్యాపారము మీఁదనే కుటుంబసహితముగా నిచ్చటికి వచ్చియున్నాను. నా పేరు [illegible].

నటే : అలాగునా! [illegible]. మనమిరువుర మొకేవ్యాపారమునఁ దిరుగువారమే.

అని చెప్పి నటేశుఁడు వెడలిపోయెను. ఆ పురుషులిరువురును మాధవభాస్కరులనియు, లోపలికిఁ బోయిన యా స్త్రీ సౌదామిని యనియు మా పాఠకులీవఱకుఁ దెలిసికొనియే యుందురు. వారు ముగ్గురును మేడమీఁదికిఁ బోయి, ఈ వార్తను బత్రికాముఖమున నెవ్వరు ప్రకటించిరాయని యాలోచింపనాగిరి. "విఠలుఁడు మరణించిన మాట నిజము. కాని, జరిగిన విషయములకును, బ్రకటింపఁబడిన విషయములకును జాల వ్యత్యాసమున్నది" అని వారు చాలసేపు చర్చించుకొనిరి. నటేశుఁడే యీవిధముగఁ జేసెనని వారికెట్లు తెలియును?—

# పదునాల్గవ ప్రకరణము

మిగుల సౌందర్యవతియుఁ జాతుర్యవతియునగు నొక జగన్మోహిని తనవలలోఁ జిక్కిన పురుషుని జంత్రపు బొమ్మవలెఁ దనయిష్టమువచ్చినట్లెల్ల నాడింపఁగలదను సంగతి ప్రస్తుతమున వారణాలాలుని స్థితిగతులవలన బాగుగ గ్రహింపవచ్చును. లావణ్యవతి యగు తిలకసుందరి యాతని సంపూర్ణముగాఁ దన మాయాజాలములచే బంధించివైచెను. ఇప్పుడు వారణుఁడు తన హృదయమున నా జగన్మోహనాంగి చిఱునగవనెడి వెన్నెలవెలుఁగు నిరంతరమును దనమీఁదఁ బ్రసరించుచుండు నంతటి పుణ్యము తన కుండినఁ జాలని భావించుకొనుచుండెను. అందుల కాతఁ డెన్నియో ప్రయత్నములను జేయుచుండెను. ఎన్నియో వేలరూపాయల నందుకొని కాతఁడు గ్రుడ్డిగవ్వలవలె నిర్లక్ష్యభావముతో వెచ్చింపసాగెను. ధనప్రవాహ మాతనిహస్తక్షేత్రముమీఁదుగ నిరంతరమును బ్రవహిం చుచుఁ దిలకసుందరీ మహాసముద్రమునఁ గలసిపోవుచుండెను. ఆతఁడు

నిమిషనిమిషమునకును నామె కనేకవిధములగు ...సమాధానముల నిచ్చుచుండెను. ఆమె యందేదో మాహాత్మ్యమున్నదని ...మాతృ...వా త్సల్యమును భావించుకొనుచుండెను. ఒకదానితో యేదిగాని తెలిపి యిచ్చుచున్న మద్యమునుగూడ నిరాక్షేపణముగ, నిస్సందేహముగ, నమృతస్వరూపముగ భావించి సేవించుచుండెను -ఈ పిసున్నటుల జెప్పరాని యానందమునకు లోనగుచుండెను. ఇప్పుడాతడు స్త్రీదేవతగను, నను దేవతనుగూడ సేవించుచుండుటచే, నాతని కైలోకమును తాను మాయము నంతటి బ్రహ్మానందము గలుగుచుండెను. ఆ యానందమున కవధి లేదు. ఆ విశ్వాసమునకుఁ బారములేదు.

తిలకసుందరియొద్ద మహిమయుండు టెంతమాత్రము నసత్యము కాదు. పారవశ్యమునకుఁ జిక్కిన యా తరుణుఁడు నిత్యమును దినయిచ్చి వచ్చినదెల్లవర్తించుచు ననేకవిధములఁ బలవరించుచుండెను. అంతటి మేధావియగు నా యువకుని నిట్లుచేయుటయే యొక మహిమ కాదా! వారలు నెవ్వరుచూచినను, నాతని కేదో మూలికా ప్రయోగము (మందు) వైనదని సులభముగా నూహించుకొనవచ్చును.

వెనుకఁజెప్పినట్లుగా, విఠలుని కా గ్రాలయమునకుఁ బోయి యచటియంతయు దోపిడిచేసినవాఁడు మాధవుఁడు. పచ్చలపెట్టె నపహ రింపనలయునని యాతని యుద్దేశము. కాని, దురదృష్టవశమున నాపాత్మ్మన కా పేటిక లభింపలేదు.

ఒకనాటిరాత్రి మా మూప్రఫుల్లముగు సౌదామిని వారలని గదిలోనికివచ్చి "అన్నయ్యా" యని పిలుచుచుఁ దాను కాంతనాథుని పెండ్లియాడుట మొదలగుసంగతులను జాలనడఁచువలెనో గహాస్య ముగాఁ దెలియఁజేసెను. ఈ యంశము వారలనకుఁ దెలియకుండ నుండలేదని మేము చెప్పనక్కఱలేదు. అయినను, వారలుఁ డామె

యసత్యములాడి మోసము చేయుచున్నదనిగాని, తనకీవిషయ మీవఱకే తెలియుననిగాని, యామెకుఁ దోఁపఁజేయలేదు—అప్పటి యామెమనోభావమెట్లున్నదియో యూహించుటయు నసాధ్యమే. అయినను, ఈ పాతకులందఱును జేరి, దురాలోచనలొనర్చి దుష్కార్యము లొనర్చుచుండుట తనకుఁదెలియునని నోరువిప్పి చెప్పినచోఁ దిలకసుందరి తన్నెక్కడ విడిచిపోవునో యనుభయమున నాతఁడు కుక్కినపేనువలె నూరకుండెను.

తుట్టతుదకు వారణుఁడు “సోదరీ! నీవు కాంతనాథుని బెండ్లియాడితివనియు, ఆతఁడు స్వర్గస్థుఁడయ్యెననియుఁ జెప్పుచున్నావు. అట్లయినచో లలితపట్టణమునకుఁబోయి యాతని యాస్తికంతకును నధికారిణివై యెందులకుండరాదు?” అని యడిగెను.

సోదా: నా యుద్దేశముకూడ నదియే, అందులకింకను గొంత కాలముపోవలయును. నాయొద్దనుత్తరములు మొదలగు బలమైన నిదర్శనము లనేకములున్నవి. కాని, నాకుఁ గావలసియున్న దొక్క మరకతమంజూషమాత్రమే. నేను దానిని భద్రముగానుంపవలయునని చెప్పి సుప్రసిద్ధుఁడును పత్తేదారుడగు విఠలమూర్తి యనునాతని కప్పగించియున్నాను. అది మనకువచ్చుటయే యాలస్యము.

వార: ఆతఁడొక పత్తేదారుఁడా?

సోదా: అవును. ఆతఁడు జగత్ప్రసిద్ధుఁడు.

వార: దానినాతఁ డెందులకుఁ దిరిగి యీయలేదు?

సోదా: నేనెన్నియోసారులడిగి విసిఁగితిని. ఇప్పుడాతఁ డాత్మహత్యచేసికొనియెనని వర్తమానపత్రికవలనఁ దెలియుచున్నది. అన్నయ్యా! నీవైనను బ్రయత్నించి యా పేటికను దెచ్చిపెట్టవా?

వార: (ఆశ్చర్యముతో) ఆతఁ డాత్మహత్యచేసికొనియెనా? ఎందువలన?

సౌదా : ఎందువలననో తెలియదు. ఒకనాఁటిరాత్రి యొక నేరమును గని పెట్టుటకై కుముద్వతీ నదీతీరమున నుండఁగా నాపాపినొక బ్రహ్మరాక్షసి తఱిమినదఁట. అందులకు భయపడి యూతఁడా నదిలోఁ బడి యాత్మహత్య చేసికొన్నాఁడఁట !

హార : నీ వే పత్రికయందుఁ జూచితివి ?

సౌదా : ఈ నగరమునఁ బ్రకటింపఁబడుచున్న వర్తమానపత్రిక యందు.

వారణుఁడు వీరలుఁ జెక్కుడకుఁబోయెనో యెఱుంగును. అందువలన నిదియంతయు నాతనిమూలముననే ప్రకటింపఁబడినదని యనుకొనియెను. కాని, యూతఁడు పత్రికలకుఁ బ్రకటింపవలసి వచ్చినదో మాత్రము వారణుఁ డూహించుకొనలేకపోయెను.

పిమ్మట నాతఁ డించుకసేపాలోచించి "నీ విప్పుడు చేసిన ప్రయత్నములకంటె విశేషప్రయత్నములను నేనుమాత్ర మేమి చేయఁగలను ?" అనియెను.

వారణుఁ డనేకపర్యాయములు, మాధవభాస్కరులతోఁ జూదమాడి చాలద్రవ్యమును బోఁగొట్టుకొనియెను. ఆతని మధుపానమునకుఁ బారమే లేకుండెను. తిలక యిచ్చుచుండుటయే——వారణుఁడు త్రాగుచుండుటయే. ఈ విషయమున నింతవరకును విసుఁగు కోపింపఁబోయెను. తిలకసుందరి యిప్పుడాతనిచే నే మాటనైన నాడించుటకుఁ దగిన సమర్థురాలయ్యెను. ఆమె చాల టక్కులమారి. వారణుఁడు తన కెంతధనము నిచ్చుచున్నను, నాతఁడు తనతో మైత్రి చేయుచున్న సంగతి మాధవునకుఁ దెలియనీయరాదని వారణుని బెదరించుచుండెను. అంతియే కాక, మాధవభాస్కరు లున్నప్పుడు తన

యొద్దకు వారణుని రానీయకుండెను. ఆతఁడీ కట్టుబాటులన్నిటికి మహా ప్రసాదమని యొప్పుకొని సంచరించుచుండెను. కాని, తాను తిలక సుందరితో సహవాసము చేయుచున్నమాట మాధవుఁ డెఱుంగునను సంగతి వారణునకుఁ దెలియునో తెలియదో చెప్పుట కష్టమే. ఎట్లయిన నేమి యా స్త్రీ యెంతచెడ్డదని తెలియవచ్చినను దానిని మనసునకుఁ దీసికొనక యాతఁ డామెను పరదేవతగా భావించుచున్నాఁడని మనము సంపూర్ణముగా నమ్మవచ్చును. మఱియుఁ దిలకసుందరి తాను యక్షిణి మొదలైన విద్యలయందు నైపుణ్యము గల మంత్రగత్తె నని వారణుని మనస్సునకు నమ్మకము గలిగించుటకై, నిత్యము నెన్నియో హస్త లాఘవములను జేయుచుండెను. అన్నియు నత్యాశ్చర్యకరములుగ నగపడుచుండుటచేత వారణుఁడు మఱింత ముగ్ధుఁడై పోవుట కవకాశము కలుగుచుండెను. అందువలననే యాతఁ డెంతసేపైనఁ బైకిఁ బోవక యే యామె చేయుచున్న పనులన్నిటిని తదేకదృష్టితోఁ జూచు చుండును. ఆతనికొఱకే యామె యుద్దేశపూర్వకముగా నీ హస్త లాఘవాది విద్యలను బ్రదర్శించుచుండె నని చెప్పుట కెంతమాత్రము సంశయము లేదు.

సౌదామినీ మాధవులు తమ యావచ్ఛక్తిని వినియోగించినను వారి కా మరకతమంజూషయున్న స్థలమైన నగపడలేదు. ఈ నడుమ నరేశుఁడు కనఁబడకుండఁ బోయెను. ఆతఁ డెక్కడకుబోయినది తెలిసి కొనుటకు మాధవుఁ డనేక సాహసకృత్యములఁ జేసెను—కాని, యా జాడ యేమియు నాతనికిఁ దెలియలేదు. నరేశుఁడు నాగేశుఁడు పోయియున్న ఓదాణి గ్రామమునకుఁ బోయెనని మాధవున కెట్లు తెలియును ! ఆతఁడు నాగేశుని ప్రవర్తనమునుగూర్చి తెలిసికొనుటకై యా గ్రామమునకు వెళ్ళెను.

ఈ కపటనాటక సన్నివేశములన్నియు [illegible]డంగా నొకనాటి ప్రాతఃకాలమున వారణునకొక తంతివార్త వచ్చెను. అది విఠలునియొద్దనుండి వచ్చినవర్తమానము. దానియందీక్రింది విధముగా నుండెను.

“ నే నీసాయంకాలమునకు వచ్చుచున్నాను.

వాగీశుఁడు. ”

ఏమిచేసినను విఠలుని రాకుండఁజేయలేమని [illegible] యోజించుకొని వారణుఁడు తనకుఁ దన క్రొ[illegible] కాంతకు సాయంకాలమున మామయ్యవచ్చుచున్నాఁడని తెలియఁజేసెను.

సౌదా : ఆతఁడు వచ్చినచో నిక్కముగనే విడిపోవుదుమేమో! పూటకూటియింటికిఁ బోవునట్లు నీవేమైన నొక యుపాయము నాలోచింపఁగలవా?

వార : అదియెట్లు? ఆతఁడెన్నియో దినములుండును. అందు వలన నిక్కముగ నేయు[illegible]నిమ్ము——నేను పోయెదను——

సౌదా : ఇప్పుడు నీ వెక్కడకుఁ బోయెదవు? [illegible] నారాధించుటకా? అయ్యయో! అన్నా! [illegible] యుండుము. లేనిచో, నీ హృదయము తుపాకి[illegible] [illegible] పోవును. ఏసమయముననైన మామయ్య యాకస్మికముగా వచ్చినచో మహాప్రళయము జరగిపోవును.

వార : ( వెక్కిరింపుతో ) సరిసరి! అందులకేమి? నేనందులకుఁ దగిన జాగరూకతతోడనే యుండెదను.

వారణుఁడు గృహమునుండి బయలుదేరి యొకయంజలోఁ దిలకసుందరియొద్దకుఁ బోయెను. ఆతని దూరమునుండి చూచినతోడనే యామె గృహద్వారమునొద్దకువచ్చి యాతని నెదురుకొని లోనికిఁదీసి

కొనిపోయెను. వారణుఁడు స్పర్శసుఖమునకు మైమఱచి యామె నాలింగనము చేసికొనియెను. వారిరువురు సంతోషసాగరమున నోలలాడుచు నీలోకమునే మఱచిపోయిరి. వారీలోకమున లేరు. స్వర్గమునకుఁ బోయిరి. ఆహా! అదెంతటి సశరీర స్వర్గసుఖమోగదా! యథాప్రకారముగ మహామూలికాప్రయుక్తమగు మద్యము మఱింత సుఖమునకు సాహాయ్యమయ్యెను. వారణునకిప్పుడు, గౌరవమర్యాదలను గూర్చినసంగదేహము లేకుండఁబోయినది—ద్రవ్యలక్ష్యము లేకుండఁబోయినది - ప్రజలలోఁ దనస్థితి యేమగునో యను యోచన లేకుండఁ బోయినది-లజ్జ లేకుండఁబోయినది-భయము లేకుండఁబోయినది - ఆతనికి శరీరజ్ఞానమే లేకుండఁబోయినది. "కామాతురాణాం నభయంనలజ్జా" యను నార్యోక్తికింతకంటెను నుత్తమలక్ష్య మేమికావలయును? ఒకవేళ నెవ్వరైననువచ్చి వారణుని చూచి "నీకు మానావమానముల శంకయున్నదా? ద్రవ్యలక్ష్యమున్నదా? ప్రజలలో నీస్థితియెట్లుండునో యూచించుచుంటివా? యని ప్రశ్నించినచో నాతఁడప్పుడు "ప్రేమలతానుడక్క మఱిదేనిని నేను పరగణింపను. అది యీనామోహనాంగినే—ఈ నాప్రాణకాంత—ఈ నాప్రాణాధికయగు తిలకసుందరి సాన్నిధ్యమే నాకు సర్వోత్కృష్టస్వర్గము—" అని ప్రత్యుత్తరంబిచ్చి తీరును—

తిలకసుందరి కొన్ని నిమిషములనఱకు వారణుని కౌఁగిటియందుండి, పిమ్మట నాతని నొకముద్దుబెట్టికొని మందహాసముచేసెను. అది యాతనికిఁ గౌముదికంటెను, వజ్రముల ప్రకాశముకంటెను, విద్యుత్కాంతికంటెను, శ్రేష్ఠముగానగపడియెను. అతఁడప్పుడు "నా తిలోత్తమా! నా తిలకసుందరీ! సుందరీ!" అనుచు నామెను ముద్దుఁబెట్టుకొనియెను. ఆమోహోన్మాదుని వాక్యములతో నాగృహము ప్రతిధ్వనించుచుండెను. అతనికంతయుఁ దిలకసుందరీమయముగానుండెను.

ఆమె వారణునిచేతిని బట్టుకొని మేడనెక్కుచు "ప్రాణేశ్వరా! రమ్ము. మన శృంగారవల్లికచేఁ బరివేష్టింపఁబడిన ప్రేమమండపమునకుఁ బోవుదము. ప్రాణేశ్వరా! రమ్ము.!" అనియెను. పరవశుఁడై యున్న వారణుఁడు పెంపుడుకుక్కవలె నామెను వెన్నాడించెను.

ఆమె తన కటాక్షకాలపాశములఁ బెనవైచి యాతని లాగుకొని పోవుచున్నది. కాకున్న నాతఁ డెందుల కట్లు పోవుచున్నాఁడు?— ఆ గారుడమంత్రమున కీ కృష్ణసర్పము కట్టుపడిపోయినది— ఆమె యాడించుచున్నది—ఈ సర్ప మాడుచున్నది—మాధురీప్రపూర్ణమగు నా నాగస్వరమున కీసర్పము పరవశత్వమునొందిపోవుచున్నది. అహో! మోహమా! నీమహిమ యెవ్వరినేమిసేయఁజాలదు?

ఇరువురును మేడమీఁది గదిలోనికిఁబోయిరి. అప్పుడు తిలకసుందరి యాగదితలుపునకు లోపలిగొళ్లెము పెట్టి, తూగుటుయ్యేలపైఁ బఱచిన హంసతూలికాతల్పముమీఁద, గూరుచుండెను. అనేకవిధములగు మృగములు, పక్షులు, లతలు, ఫలములు, మొదలగు చిత్రములచే నొప్పారు మేలగుచీటిగుడ్డల గలీబులుగల తలగడ లాశయ్యపై నలరారుచుండెను. అచ్చటి కుడ్యములు నిలువుటద్దములచే నెసంగుచుండెను. అక్కడక్కడ సోఫాలుకూడ గలవు. మంచమున కెదుటి పార్శ్వమున కొకవైపున శ్రేష్ఠతమమగు నొకచిత్రాసనము పఱుపఁబడి యుండెను.

తిలకసుందరి మందహాసముఖారవిందయై నిజకటాక్షావలోకనములను వారణునిపైఁ బ్రసరింపఁజేయుచు నాతనిచేయింబట్టుకొని లేవఁదీసి "ప్రాణప్రియా! రమ్ము! నాపార్శ్వమునఁ గూర్చుండుము" అనియెను.

ఆ పిమ్మట నామెలేచి వెనుక గూటిలో నుంచియున్న హుక్కానుదీసికొనివచ్చి క్రిందనుంచి యందగ్నిప్రతిష్ఠాపనముచేసి దానికి మృదువైన దీర్ఘనాళము నమర్చి, యానాళాగ్రము నొకచేతఁ బట్టుకొని "రమ్ము! రమ్ము! హృదయేశ్వరా! రమ్ము! ఇదిగో! చాల నుంచిది. దీనిని దీసికొనుము! పీల్చుము! సొగసైనతంబాకు! ఉత్కృష్టమగు గుడిగుడి." అనిచెప్పుచు ఆతనిచేతి కానాళాగ్రము నందించి మరల "పీల్చుము. పీల్చుము. ఏమున్నను, అనుభవించుట కీనిమిషము మనది! ఱేపేమో? మనమెవ్వరమో? ఇదిగో! ఇప్పుడు నా యాత్మ యన్నిలోకములయందును సంచరించుచున్నది. సర్వశక్తులను పొందియున్నది. నీవు నా ప్రాణప్రియుఁడవు. నామోహనాంగుఁడవు. అడుగుము! నీకేమికావలయునో యడుగుము! నీకుఁ గావలసిన దానిని నేననుగ్రహించుచున్నాను — ప్రాణప్రియా! పీల్చుము. హుక్కాను పీల్చుము!" అనియెను.

వార : (హుక్కాయొక్క నాళాగ్రమును నోటియందునుంచుకొని పీల్చుచు) నా తిలకసుందరీ! నా ప్రాణేశ్వరీ! అనుగ్రహింపుము! సుందరీ! రమ్ము. మనమిరువురమును దీనిని పీల్చుకొందము. రమ్ము.

తిలకసుందరియు హుక్కానుబీల్చెను. కాని, యొకసారికంటె హెచ్చుగ నా పొగను మీఁదికిఁ బీల్చుకొనలేదు. ఆమెయట్లే వెనుక నున్న దిండుపై కొఱగెను. వారణుఁడు పిచ్చివానివలె ననేకపర్యాయము లాపొగను బీల్చి వినోదముగఁ బైకి విడువనారంభించెను. ఆ గది యంతయుఁ జిన్నిచిన్ని మేఘములతోడను మనోహర సౌరభము తోడను నిండిపోయెను. వారణుఁడిప్పుడు తానెక్కడనున్నదియు భావించుకొనలేకుండ నుండెను.

తిలకసుందరి యప్పుడు తారస్వరముతో శ్రుతిమనోహరముగ నమృతమును గురియించు దివ్యగంధర్వగానమును గానముసేయఁ దొడంగెను. ఆయత్యపూర్వమగు సర్వసంపద—అప్సరోంగనలకుఁ గూడ దుర్లభమైనదే. ఆ సుస్వరమాధురీరసము వారణునకే కాదు—ఎంతటి సంగీతవిద్యావిశారదునకైననుఁ భ్రామకమై యుండెను. గానము సేయుచున్నప్పుడామె తనశిరమును వెనుకకును ముందునకు నూపుచు వారణునితలను తనతొడమీఁద నుంచుకొని, ఒకచేతితో నాతనితలపై దువ్వుచు, మఱియొకచేతితో గానానుగుణముగఁ దాళమును వైచుచుండెను.

కొలఁదిసేపటిలో నామె "ఓ మోహనాంగా! ప్రేమ తనంతటఁ దానే పొంగి పొరలుచుండును. ఇదిగో? తెర మాఱిపోవుచున్నది. ఈ యవనిక పడిపోవుచున్నది. చూడుము! బాగుగఁ బరికించి చూడుము! మన ముందుమార్గమున కిప్పుడే వెలుఁగగపడుచున్నది. చూడుము!" అని చెప్పుచు వారణుని శిరమును గ్రిందికిదింపి, తాను లేచి నిలుచుండి, యక్షిణి కఱ్ఱను జేతియందుంచుకొని దానిని పైకెత్తెను. అక్కడ రెండుపళ్ళెరములలో నింపియున్న రంగులపొడిని దీసికొని, ఏమేమో మంత్రముల నొత్తియొత్తి యుచ్చరించుచు నిప్పులో వైచెను, దానిలో నొకవైపునుండి యెఱ్ఱనిపొగయు, మఱియొకవైపు నుండి పచ్చనిపొగయు బయలుదేరి, రెండును నొకటిగఁ జేరి యొక విచిత్రవర్ణముగాఁ బరిణమించెను. ఘిమ్మట తిలకసుందరి దానిపై నొక విధమగు నల్లనిపొడిని జల్లగా, భయంకరమగు నొక యింద్రజాలము జరిగెను. అప్పుడామె వారణుని తట్టి లేపి యీ విచిత్రప్రదర్శనమును జూపించెను. ఆతఁడు సమీపమునకు వచ్చి చూడఁగా నాతని హృదయ మావేగముతోఁ గొట్టుకొన నారంభించెను. ఆతని శరీరము గడగడ వడఁకుచుండెను. ఆతని కప్పుడది మరణకంపమువలె నగపడెను.

ఆ జ్వాలలోఁ దరుణవయస్కుఁడగు తన చిత్రపటము గూడ నుండెను. అంతకుఁబూర్వ మీ తారుణ్యావస్థయందుఁ దనకు సంభవించిన దంతయు నొకటొకటిగా నా చిత్రరూపమునం దగపడఁజొచ్చెను. వారణునకు మాట నిలిచిపోయెను. తిలకసుందరి తన భుజముపైఁ జేతినుంచుకొని నిలుచుండుట యాతనికిఁ దెలియదు. ఆతఁడు చూచుచున్న దంతయు స్వప్నముగా భావించుకొనుచుండెను.

వారణుఁడు తిలకసుందరితో మైత్రి చేయుచున్న చిత్రరూపము గూడఁ గనఁబడియెను. ఇది యైనపిమ్మట నింక నొక చిత్రరూపమును జూచినతోడనే వారణుఁడు విపరీతావస్థకు లోనయ్యెను. అదేమందు రేని—

(1) అనేకులు చేరియున్న యొకగది. వారణుఁడు తిలకసుందరి పార్శ్వమునఁ గూర్చుండియుండుట ; అక్కడకుఁ జటాలున మాధవుఁడు వచ్చుట.

(2) ఇంతలో మఱియొకచిత్ర మగపడియెను. తన పత్నియగు తిలకసుందరి నపహరించినందులకై, మాధవుఁడు వారణునితో జగడమునకు దిగుట, వా రిరువురు నొక మహారణ్యమార్గమునఁ బ్రవహించుచున్న నొక నదీతీరమునందుండుట : ఇరువురి చేతులయందును చిన్ని చేతి ( పిస్తోలు ) తుపాకు లుండుట ; ఇరువురును మందు నంటించుట ; మాధవుఁడు క్రిందఁబడి దొరలుట , వారణుఁడు పాఱిపోవుట ;

(3) ఇంతలో నింకొక చిత్ర మగపడియెను. దానిని జూచుట తోడనే వారణుఁడు దీనస్వరముతో “ అయ్యో ! దేవుఁడా ! ఇట్లెన్నటికిని గాఁగూడదు ” అని యనుకొనియెను.

అప్పుడు మహానందకరమగు నొక ప్రదర్శన మగపడియెను. వారణుఁడు తన మనోహారిణి యగు తిలకసుందరిని విడువఁజాలక,

యూమె చుట్టుచుట్టును దిరుగుచుండ, నామె తన మనోహరకటాక్ష మాలికలచే నాతని బంధించివైచెను. అప్పుడాతఁ డేటువోవుటకును సమర్థుఁడుకాక "సుందరీ! నన్ను నీలోఁ గలుపుకొనుము. నేను నీ కటాక్షకింకరుఁడను. ఈ దాసానదాసుని — నీ పాదసేవకునినన్ను నీ శీతలోపగూహనంబులఁ దనివొందఁజేయుము! సుందరీ! తిలకసుందరీ! నీవు నా ప్రాణేశ్వరివి. నేను నీ హృదయేశ్వరుఁడను. అవునా కాదా ?" అని ప్రశ్నింపఁగా నామె, తన మోహినీరూపముతో వచ్చి యాతని గాఁగిలించుకొనియెను. వారిరువురును బరస్పరోపగూహనంబుల మైమఱచి యాకసంబున కెగసిపోయిరి అక్కడ వారివిలాసమునకు, విహారమునకు, సల్లాపములకు, సరసావలోకనములకు, నెన్నియో నూతన మార్గము లేర్పడియెను. అచ్చట నొకపుష్పవిమానమువచ్చి వారి యెదుట నిలిచెను. వారణుఁడప్పుడు తిలకసుందరివైపునకుఁ జూచి "మనోహారిణీ! స్వర్గమునుండి మనకీపుష్పకమువచ్చినది. మనమిరు వురము నిందుఁ గూర్చుండి, స్వర్గలోకమునకుఁ బోవుదము. అక్కడకు మహాపాపాత్ముఁడగు మాధవుఁడు రాలేఁడు. మనమక్కడ నిరంత రాయముగ సుఖోపభోగముల ననుభవింతము" అనియెను. అందుల కామె "మనకుస్వర్గమునఁ జోటున్నదా?" అని చెప్పుచు నా విమా నమునెక్కెను. ఇరువురు నందుఁ గూర్చుండిరి. విమానము కదలెను. ఇంతలో మాధవుఁడువచ్చి యా విమానమును దల్లకిందుగఁ బడఁ గొట్టెను. అప్పుడు వారణుఁడు క్రిందఁబడుచు "సుందరీ! నన్నుఁ గాఁగిలించుకొనుము" అని కేకవైచినట్లుగానుండెను.

ఈ భయంకర ప్రదర్శనమునకు వారణుఁడు తల్లడిల్లెను. అప్పు డాతని కాలిక్రిందిభూమి జారిపోయినట్లయ్యెను.

తిలకసుందరి కదలక మెదలక శిలావిగ్రహమువలె స్తబ్ధయై నిలుచుండి యీ ప్రదర్శనమును జూచుచుండెను. వారణుడు వెనుకటి చిత్రములనన్నిటినిజూచి సామాన్యముగ భీతిల్లెను. కాని, మఱియొక భయంకరచిత్రమాతని కగపడియెను. ఈ చిత్ర మన్నిటివంటిదికాదు. ఇది యాతనికి హృదయభేదకముగానుండెను. ఈ చిత్రమున దివ్యముగా శృంగారించిన రమణీయమందిరము, అక్కడ తిలకసుందరీవారణులు విహరించుచుండుట, అక్కడ తిలకసుందరీవారణుల చేతులుకలిపి సంకెలలు వేయబడుట—ఇరువురును జచ్చిపడియుండుట—బల్లపై రెండు తెల్లనిసీసాలలో సర్వోత్కృష్ట మగు విషము పూరింపబడి యుండుట—ఇవియగపడెను.

సామాన్యముగా నితరులకు సంబంధించిన యిట్టివిచిత్రములను జూచినప్పుడే మనస్సునకెంతయో భయముగనుండును. అట్టులుండగా స్వవిషయములగు భూతభవిష్యద్వర్తమానముల స్థితిగతులను స్పష్టముగా నగపఱుచునట్టియు, తమ దురాచారములను విశదముగా జెప్పి కన్నులకగపఱచునట్టియు, నిట్టిమాయాచిత్రములను జూచి తిలకసుందరీవారణు లెంతయోభీతిల్లిరని వ్రాయుటయం దాశ్చర్య మేమున్నది? తుదకంతయును మాయమైపోయెను. ఆ ఘో యొక్క గుఱుతుకూడలేదు. తిలక యక్షిణికట్టును క్రిందికిదింపి గప్పున నేలపైబడి మొఱ్ఱోయని యేడువనారంభించెను. వారణాలాలా మెను సమాధాన పెట్టుటకై చేసిన ప్రయత్నములన్నియును వ్యర్థములయ్యెను. స్వవిషయమునుగూర్చి చూచిన చిత్రరూపములను జ్ఞప్తికిదెచ్చుకొని, ఇక నా ముందుగతియేమని యాతడు తలపోయసాగెను—తిలకసుందరి యిట్టి యక్షిణీవిద్యలలో నగ్రేసరురాలై యుండెను.

వార : సుందరీ! రమ్ము! ఈ గదియందుండగూడదు. ఇక నెక్కడకైనను బోవుదము.

యామె చుట్టుచుట్టును దిరుగుచుండ, నామె తన మనోహరకటాక్ష మాలికలచే నాతని బంధించివై చెను. అప్పుడాతఁ డెటుపోవుటకును సమర్థుఁడుకాక "సుందరీ! నన్ను నీలోఁ గలుపుకొనుము. నేను నీ కటాక్షకింకరుఁడను. ఈ దాసానదాసుని — నీ పాదసేవకునినన్ను నీ శీతలోపగూహనంబులఁ దనివొందఁజేయుము! సుందరీ! తిలకసుందరీ! నీవు నా ప్రాణేశ్వరివి. నేను నీ హృదయేశ్వరుఁడను. అవునా కాదా ?" అని ప్రశ్నింపఁగా నామె, తన మోహినీరూపముతోవచ్చి యాతని గౌఁగిలించుకొనియెను. వారిరువురును బరస్పరోపగూహనంబుల మైమఱచి యాకసంబున కెగసిపోయిరి అక్కడ వారివిలాసమునకు, విహారమునకు, సల్లాపములకు, సరసావలోకనములకు, నెన్నియో నూతన మార్గము లేర్పడియెను. అచ్చట నొకపుష్పవిమానమువచ్చి వారి యెదుట నిలిచెను. వారణుఁడప్పుడు తిలకసుందరివైపునకుఁ జూచి "మనోహారిణీ! స్వర్గమునుండి మనకీపుష్పకమువచ్చినది. మనమిరు వురము నిందుఁ గూర్చుండి, స్వర్గలోకమునకుఁ బోవుదము. అక్కడకు మహాపాపాత్ముఁడగు మాధవుఁడు రాలేఁడు. మనమక్కడ నిరంత రాయముగ సుఖోపభోగముల ననుభవింతము" అనియెను. అందుల కామె "మనకుస్వర్గమునఁ జోటున్నదా ?" అని చెప్పుచు నా విమా నమునెక్కెను. ఇరువురు నందుఁ గూర్చుండిరి. విమానము కదలెను. ఇంతలో మాధవుఁడువచ్చి యా విమానమును దల్లకిందుగఁ బడఁ గొట్టెను. అప్పుడు వారణుఁడు క్రిందఁబడుచు "సుందరీ! నన్నుఁ గౌఁగిలించుకొనుము" అని కేకవైచినట్లుగానుండెను.

ఈ భయంకర ప్రదర్శనమునకు వారణుఁడు తల్లడిల్లెను. అప్పు డాతని కాలిక్రిందిభూమి జారిపోయినట్లయ్యెను.

తిలకసుందరి కదలక మెదలక శిలావిగ్రహమువలె స్తబ్ధయై నిలుచుండి యీ ప్రదర్శనమును జూచుచుండెను. వారణుఁడు వెనుకటి చిత్రములనన్నిటినిజూచి సామాన్యముగ భీతిల్లెను. కాని, మఱియొక భయంకరచిత్రమాతని కగపడియెను. ఈ చిత్ర మన్నిటివంటిదికాదు. ఇది యాతనికి హృదయభేదకముగానుండెను. ఈ చిత్రమున దివ్యముగా శృంగారించిన రమణీయమందిరము, అక్కడ తిలకసుందరీవారణులు విహరించుచుండుట, అక్కడ తిలకసుందరీవారణుల చేతులుకలిపి సంకెలలు వేయఁబడుట—ఇరువురును జచ్చిపడియుండుట—బల్లపై రెండు తెల్లనిసీసాలలో సర్వోత్కృష్ట మగు విషము పూరింపఁబడి యుండుట—ఇవియగపడెను.

సామాన్యముగా నితరులకు సంబంధించిన యిట్టివిచిత్రములను జూచినప్పుడే మనస్సునకెంతయో భయముగనుండును. అట్లుండఁగా స్వవిషయములగు భూతభవిష్యద్వర్తమానముల స్థితిగతులను స్పష్టముగా నగపఱుచునట్టియు, తమ దురాచారములను విశదముగఁ జెప్పి కన్నులకగపఱచునట్టియు, నిట్టిమాయాచిత్రములను జూచి తిలకసుందరీవారణు లెంతయోభీతిల్లిరని వ్రాయుటయం దాశ్చర్య మేమున్నది? తుదకంతయును మాయమైపోయెను. ఆ ఘో యొక్క గుఱుతుకూడ లేదు. తిలక యక్షిణికట్టును క్రిందికిదింపి గప్పున నేలపైఁ బడి మొఱ్ఱోయని యేడువనారంభించెను. వారణలాలామెను సమాధాన పెట్టుటకై చేసిన ప్రయత్నములన్నియును వ్యర్థములయ్యెను. స్వవిషయమునుగూర్చి చూచిన చిత్రరూపములను జ్ఞప్తికిఁదెచ్చుకొని, ఇఁక నా ముందుగతియేమని యాతఁడు తలపోయసాగెను—తిలకసుందరి యిట్టి యక్షిణీవిద్యలలో నగ్రేసరురాలై యుండెను.

వార : సుందరీ! రమ్ము! ఈ గదియందుండఁగూడదు. ఇఁక నెక్కడకైనను బోవుదము.

అని యామె నెత్తుకొని యెదుటనున్న మఱియొక గదిలోనికిఁ బోయెను.

తిల : ఆహా ! ఈ విధముగా నింద్రజాలమున నా పరిణామ మగపడునని నాకు మొదటనే తెలిసియున్నచో నే నీ పని నెందులకుఁ జేయుదును ? నా హృదయమును నేనే నాశనముచేసికొంటిని. నాజీవన పరిణామ మింతటిదేనా ? అయ్యో ! భగవానుఁడా ! నన్నిందులకేనా పుట్టించితివి ! నా నుదుటివ్రాత యింతటిలోనిదేనా ?

వార : సుందరీ ! మోహనాంగీ ! భయపడవలదు. ఆ కష్టముల మీఁదికి నీ మనసును బోనీయకుము. మనము బ్రహ్మదేవుని కంట మన్నుఁగొట్టి సుఖముగా నుందము. నీవు బెదరి బెదరి చూడవలదు. ఈ గృహములో నేదో యున్నది-కావున మనమీయింటిని విడిచివైచి, మఱెక్కడకైన బోయి రహస్యముగాఁ గాలయాపనము సేయుదము.

తిల : కాదు. కాదు. అదెట్లగును ? మన మెక్కడకుఁబోయినను విధి మనలను విడువకుండ వెన్నంటియే వచ్చుచుండును. సరి--- బాగుగ నాలోచించి చూచితిని. మనపరిణామ మింతటిలోనిదే— ఈ విధిని మనము దాటలేము.

వార : అట్లయినచోఁ బ్రస్తుతము దానిని మఱచిపోయి బ్రదికి నన్నాళ్ళైన సుఖముగా నుందము—ఈ ప్రదర్శనములన్నియు మాయా మయము లని నీ వెఱుంగవా ? వీనికింతగా నడలెద వేమి ? వీనినన్నిటిని సంపూర్ణముగా మఱచిపొమ్ము. మఱపులోన మహాసౌఖ్య మున్నది. వీనిని నీవు స్మృతికిఁ దెచ్చుకొనకుము. స్మృతిలో సుఖములేదు. స్మృతి దుఃఖప్రదము. మఱపు మహానందకరము. నీవు వీనినన్నిటిని తప్పకుండ మఱచిపొమ్ము. తిలకసుందరీ ! ప్రాణేశ్వరీ ! మాటాడవేమి ?

తిలకసుందరి యించుకసేపూరకుండి పిమ్మట మహాదరభావముతో నాతనిఁజూచుచు "వారుణా! నాయందు నీకుఁ బ్రేమయుండుటనిజమేనా?" అనియెను.

వార : నీకేవిషయమునందైనను సంశయమున్నదా ?

తిల : అట్లయినచో నీ ప్రేమము నేను కోరుదానిననుగ్రహింపఁగలదా ? .

వార : నీకట్టి యనుగ్రహమేమికావలయును ?

తిల : నాకిప్పుడు ద్రవ్యమత్యావశ్యకమైయున్నది.

వార : ఓహో! ఆలాగునా ? ఎంతకావలసియున్నది ?

తిల : ఇప్పుడధమపక్షము పదివేలరూపాయలైనను కావలయును. నీవిచ్చెదనని చెప్పినచో వలయునేని జామీనునైన నిచ్చుటకు సిద్ధముగానున్నాను.

వారణుఁడు కొంచెము వెనుదీసెను. ద్రవ్యమంతయు నింతయును గాదు. పదివేలరూపాయలు. పఱచినచో నవియెంతతావునైన నాక్రమించుకొనవచ్చును. అయిననేమి ? వారణుఁడు తుట్టతుదకుఁ గట్టువడి "తిలకసుందరీ ! కానిమ్ము" అని యొకహుండీని వ్రాసియిచ్చెను.

తిల : ఓహో ! నీవు నన్నుసామాన్యముగాఁ జూచుటలేదని నేను మొదటనే యెఱుంగుదును. నీవే దానకర్ణుఁడవు. నీవే మహాత్ముఁడవు. ఇదిగో ! ఒకముద్దు !—

అని యామె వారణునాదరపూర్వకముగఁ గౌఁగిలించుకొని యొకముద్దుఁ బెట్టుకొనియెను.

వార : హృదయేశ్వరీ ! ఈనీముద్దేచాలదా ముప్పదివేలు చేయుటకు—నేను నీకేమీయఁగలను ? నీవు నాప్రాణేశ్వరివి. నాయీ ప్రాణములనే నిష్కళంకహృదయముతో నీయధీనము చేసితిని. ఇఁక

నేనిచ్చుటయును నీవు పుచ్చుకొనుటయు నెందులకు? నీవు నాకును నా ద్రవ్యమునకును సర్వాధికారిణివి.

తిల : ప్రాణేశ్వరా! నా హృదయ మహానందరసమునఁ దేలిపోవుచున్నది. ఒక్కసారి నన్నుఁ గౌఁగిలించుకొనుము.

అని యాతనిని మరలఁ గౌఁగిలించి ముద్దిడుకొనియెను. వారణుఁడా మోహ ప్రవాహములో మునిఁగిపోయెను. అతఁడు తన మనంబున ముద్దునకు ముప్పదివేలైనఁ జాలవని తలంచుచుండెను. తిలక తన హృదయమున నేమనుకొనుచున్నదో యెవ్వరు చెప్పఁగలరు?

ఈ విధముగా సరససల్లాపములలో మునింగి ముందురాఁబోవు నపాయములను మఱచిపోయిన యా నాయికానాయకులలో వారణుఁడు తన హృదయేశ్వరియొద్ద సెలవంది గృహమునకుఁబోయెను. తిలక సుందరి వీథిలోనికిఁ బోవుట కనుకూలములగు నమూల్యవస్త్రాభరణములను ధరించుకొని, బ్యాంకిలోనికిఁబోయి యా చెక్కును మార్చుకొని దానికిఁ దగిననోట్లుగోఁ దిన్నగ తంతికార్యాలయమునకుఁ బోయెను. ఆమె యక్కడి కార్యనిర్వాహకునితోఁ జాలసేపు మాటాడి బిమ్మట నీవలకువచ్చెను.

తిలక యా యాఫీసులోనికిఁబోవుట నొకవృద్ధుఁడు దృష్టించి చూచుచుండెను. ఆమె వెనుకకుఁదిరిగి పోయినపిమ్మట నా వృద్ధుఁడా కార్యనిర్వాహకుని యొద్దకుఁబోయి, కృత్రిమవేషమునకు సంబంధించిన తనగడ్డమునూడఁదీసి జేబులోనుంచుకొని సమీపమున నిలువఁగా నా కార్యనిర్వాహకుఁడు (**manager**) సులభముగా నా ముసలివానిని గుర్తించి "ఓహో! విఠలమూర్తిగారు కాఁబోలును! అయ్యా! నా వలన మీకేమిపని కావలసియున్నది?" అనియెను.

విరలుఁ డా నాఁటి ప్రాతఃకాలముననే తన జహాంగీరు గ్రామము నుండి తిరిగివచ్చెను. అతఁ డేపో పనిమీఁద నీ దారిని బోవుచుండఁగా నాకస్మికముగాఁ దిలకసుందరి యాతని కన్నులఁ బడియెను. అప్పుడాతఁ డామె వెనుకనే బ్యాంకికిఁ బోయి యక్కడ నామె వారణాలాలుని చెక్కును మార్చి నోట్లను దీసికొనుటను జూచి యా పిమ్మట నామె నెన్నంటి యిక్కడకు వచ్చెను.

విరలుఁడు రహస్యముగా "ఆ స్త్రీ యిక్కడ కెందుకొఱకు వచ్చినదో నాకుఁగావలసివచ్చినది. ఆ సంగతి నించుక చెప్పఁగలరా ?" అని యడిగెను.

కార్యనిర్వాహకుఁడు—ఆ సంగతి మీకు చెప్పకుండరాదు. ఆమె లలితపట్టణమునందున్న తనవారికిఁ దంతిమూలమున ద్రవ్యము నంపుట కిక్కడకు వచ్చినది.

విర : మీ కామె పరిచయమున్నదా ?

కార్య : లేదు. ఇంతకుఁబూర్వ మామెను నేను చూచియే యుండలేదు—

విర : ఎంతసొమ్ము పంపినది ?

కార్య : పదివేల రూపాయలు.

విర : ఎవ్వరికిఁ బంపినది ?

కార్య : చారుచంద్రుని పెద్దకుమారుఁడగు వనజచంద్రునకు.

విర : అతని కింకేమైన సమాచార మంపినదా ?

కార్య : పంపినది.

విర : నేను దానిని జూడవచ్చునా ?

కార్య : అందుల కభ్యంతర మేమి ?

విర : ఆమెపేరు మీకుఁ దెలిసినదా ?

కార్య : ఉహో ! తిలోత్తమ యని దానిక్రిందనే చేవ్రాలు చేసినది.

అని చెప్పి యా తంతివార్తను దీసి యాతఁడు విరలున కొసంగెను.

అందు "ఇది నీకార్యమున కక్కఱకువచ్చును. ఆ ముసలివాని విషయమేమైనది? నీవు వేగముగా నిక్కడకురావలయును. మనము లలితపట్టణమున జరపినదానికంటె ననుకూలముగ నిక్కడనే యన్నియు నేర్పాటుచేసుకొనఁగలము.—త్రిలోకోత్తమ."

విర : అయ్యా! నీసాహాయ్యము నాకమూల్యమైనది.

కార్య : దాని కేమిలెండు. అంతయును సర్కారుపనియే. ఇప్పుడు నేనుచేసిన దేమున్నది?

విర : అట్లుకాదు. మీరుమంచిసాహాయ్యము చేసినారు. ఇంకను జేయవలసియున్నది.

కార్య : అందులకు సిద్ధముగనేయుండెదను.

విర : ఈ తంతివార్తకుఁ బ్రత్యుత్తరమేమివచ్చునో చూచి దాని ప్రతినొకదానిని నాకు దయచేయింపవలయును.

కార్య : అట్లేచేసెదను.

విర : నేనిక్కడకు వచ్చినసంగతి నెవ్వరికిని దెలియనీయకుండు.

ఆతఁడట్లేయని యొప్పుకొనియెను. విరలుఁ డక్కడనుండి వెడలిపోయెను. విరలుఁ డక్కడనుండి బ్యాంకికిఁబోయి వారిచ్చుడు వ్రాసియిచ్చిన చెక్కునుజూచి వచ్చెను. ఆతనికిఁ దంతికార్యాలయమునఁ దెలిసినయంశములవలన నీక్రిందివిధముగ యోజించుకొనియెను.

"తిలకసుందరికిని వనజచంద్రునకును సామాన్యస్నేహమే కాదు. అంతకంటె విశేషానుబంధమే యుండవలయును. ఆ ముసలి వాఁడు వనజచంద్రుఁడేయైయుండును. వానినిగూర్చి యీ దుష్టాత్మ లేదో పత్రికతంత్రములను బన్నుచుండవచ్చును. ఈసొమ్ము తత్సంబంధమగు సుకార్యమున వినియోగించుట కై యుండవచ్చును."

# పదునైదవ ప్రకరణము

వారణుఁడు తిలకసుందరికిఁ బాదదాసుఁడై పోయెను. ఆమె యాతనియొద్దనుండి మాటిమాటికిని ద్రవ్యమును లాగుచుండెను. ఆతనికి వెనుకముందాలోచనము లేకుండఁబోయెను. తనపనులకుఁ దిలకసుందరి నానందించుటయే యాతనికిఁ గావలసినది.

తిలకసుందరినవ్వట్టు యాతనికి వెన్నెలవెలుఁగు—ఆమెకటాక్షావలోకనము లాతనికిఁ బ్రాణసూత్రములు—ఆమెవదనమండల సందర్శనమాతనికిఁ బూర్ణిమాచంద్రబింబదర్శనము — ఆమెవాక్కు లాతని కమృతరసప్రవాహములు. — వేయేల ? ఆతనిజీవితము తిలకసుందరిచేతిలోనుండెను. ఆమెను జూడకుండ నాతఁడొక్కనిమిషమైన నిలువలేకుండెను.

యథాప్రకారముగ వారణుఁడు తనగృహమునుండి బయలుదేరి వేళకుసరిగఁ దిలకసుందరి గృహమునకుఁ బోయెను.

తిల : వారణా ! ప్రాణేశ్వరా ! వచ్చితివా ?

వార : ప్రాణనాయికా ! నీ సంకల్పమునకు నే నన్యథా ప్రవర్తింతునా ? నీ యాజ్ఞానుసారముగ వచ్చి ప్రాలితిని.

తిల : మనోహరా ! నీకు నాపైఁ బ్రేమయున్నచో నేను చెప్పినట్లు చేయుము——.

వార : నీవు చెప్పుము. నే నేమి చేయకున్నాను.

తిల : నీవు నిన్నరాత్రి యిక్కడనుండి వెడలిపోయినపిమ్మట నెక్కడకుఁ బోయితివి ?

వార : గృహమునకుఁ బోలేదు. కాని——

తిల : కాని, యేమి ? ఎక్కడ కేగితివో చెప్పరాదా ?

వార : కొల్లూరయ్య మేడకుఁ బోయితిని.

తిల : అక్కడ కెందులకుఁ బోయితివో చెప్పవా ?

వార : మాధవభాస్కరులు వినోదముగఁ బేకయాడుకొందము రమ్మని బలవంతపెట్టుటచే నక్కడకుఁ బోయితిని.

తిల : అదిగో ! వారితోఁ జేరవలదని నేను చెప్పుటలేదా ? ఆ పొట్టివాఁడు చాల ధూర్తులమారి. ఆయనగూడ నాతనితో సావాసము చేసియే చెడిపోయినాఁడు——ఇఁకనీవా——

వార : భాస్కరుఁడు మిత్రోత్సాహముతో రమ్మనినప్పుడు పోకుండుట మంచిదికాదని నేను తలంచితిని.

తిల : ఆ పొట్టివాఁడు నీ యొద్ద నెంతధనము లాగికొన్నాఁడు ?

వార : ఎంతయో లేదు.

తిల : ఎంతయో లేదా ? నాకుఁ దెలియ లే దనుకొనుచున్నావా?

వార : ఎంతయని తెలిసినది ?

తిల : తెలిసినది. నీ వోడిపోయిన సొమ్మెంతయో నేను చెప్పుకొందునా ?

వార : ఏదీ చెప్పుము చూతము !

తిల : వేయిరూపాయలు కాదా? వేయిరూపాయలు కొంచె మనియే నీ యూహ——కానిమ్ము——

వార : నే నొకరిని సంతోషపెట్టుటలో డబ్బునకు లక్ష్యపెట్టను. ఆ సంగతి నీకుఁ దెలియదా యేమి ?

ఇంకఁ దిలకసుందరి యేమియుమాటాడలేదు. తానుతక్కినితరులు వారణుని లాలించి యాతనియొద్దనున్న ద్రవ్యమును లాగుకొనుట కామె యిష్టపడుటలేదు. అందువలన వారణు నామె యితరులతో పేకయాడుటకై పోనిచ్చుటలేదు. వారణు నెట్లయినఁ దీసికొనిపోయి యాతనియొద్దనున్న సొమ్మును లాగవలయు నని మాధవభాస్కరులు తలంచుచుండిరి. కాని, తిలకసుందరి ముందర వారియాటలు సాగివచ్చుటలేదు. ఆమె యాతని నాటలోనికిఁ రాకుండఁ జేయుచున్న దను కోపమున వా రిరువురైన నామెకుఁ దెలియకుండ వారణు నాట లోనికిఁ దీసికొనిపోవలయునని ప్రయత్నించుచుండిరి. ఆ యాలోచనముల తోడనే మాధవుఁడు భాస్కరునిజూచి యిట్లనియెను.

"మన మెంత ప్రయత్నించినను వారణుఁడు రాకుండ నున్నాఁడు. ఇతని లాగుట కేమి యుపాయమున్నది ?"

భాస్క : ఆతఁ డామెను వదలియుండఁడు. ఆమెవలలోఁ బడి పోయినాఁడు. ఆమె యూహించినట్లెల్ల నాతఁ డాడుచున్నాఁడు.

మాధ : అవునందులకే డబ్బంతయు నామెయే లాగివేయుచున్నది.

భాస్క : మొన్న నేమిపుచ్చుకొన్నదో తెలిసినదా ?

మాధ : ఆ చెక్కుమొత్తమంతయు వనజచంద్రునకుఁ బంపి వైచినదఁట !

భాస్క : మనమింత శ్రమపడుచున్నను మన కేమియు లాభము లేకుండఁ బోవుచున్నది.

మూర్ఖ : మనమిప్పుడు మనలకేదియో యుపాయమాలోచించుకొన వలసియున్నది.

వారిరువురు నీవిధముగ మాటాడుకొనుచుండఁగా వృద్ధుఁడగు నొకభిక్షుకుఁడాదారిని బోవుచు వారిసంభాషణము నాలకించి వెడలి పోయెను. వారాతనిని లక్ష్యభావముతోఁ జూడలేదు.

ఆభిక్షుకవేషధారి మనవిఠలుఁడేయని పాఠకులు తెలిసికొందురు గాక! విఠలుఁడు జహగీరు గ్రామమునుండి వచ్చినపిమ్మటఁ జాలఁ జురుకుగఁ బనిచేయుచుండెను. విఠలుఁడు రెండుమూఁడు సారులు మారువేషములతోఁ దిలకసుందరిగృహమునకుఁ బోయి ఆమె చర్యలను బాగుగఁ బరిశీలించెను. వారణుఁ డెంతగ నామెకు దాసుఁడై యున్నదియుఁ దెలిసికొనియెను.

వారణునివంటి తరుణవయస్కుఁడు నిష్కారణముగ నీయగ్ని జ్వాలలోఁ బడిపోయినందులకు విఠలుఁడు చాల విచారింపసాగెను. ఆ యగ్నిజ్వాలనుండి యాతనిఁ దప్పించుటకేమైన నుపాయమున్నదా? ఆ నిగళబంధముల నెవ్వరు విడఁదీయగలరు? ఆతఁడితరుల ప్రబోధ వాక్యముల నాలకించు స్థితిలోనున్నాఁడా? లేదు—విఠలుఁడీవిధముగ నాలోచించుకొనుచుండెను. ఆతనికేమియు నుపాయమగపడలేదు. ఒకతరుణుఁ డొకనీచస్త్రీకి బలియగుచుండుటను గన్నారఁజూచి యెవ్వరు సహించుకొనియుండఁగలరు?

## పదునాఱవ ప్రకరణము

కళింగదేశప్రవర్తకుఁడగు వాగీశునివేషముతో విశలుఁడు వారణలాలుగృహమునకుఁ బోయెను. సౌదామిని సంతోషము నభినయించుచు "మామయ్యా! వచ్చితివా? క్షేమముగ నుంటివా?" అని అతని కెదురేగి తీసుకొనివచ్చి గౌరవించెను. అప్పటికి వారణలాలింకను గృహమునకురాలేదు. వారణలాలింటికివచ్చుసరికి రాత్రిపండ్రెండుగంటలయ్యెను. అప్పటికాతనితలకు బాగుగమత్తెక్కియుండెను. విశలుఁ డాతనిఁజూచి యిదంతయు మధుపానమహిమయని నిమిషములో గ్రహించుకొనియెను. అప్పటి కాతనితో నేమియును మాటాడలేదు. వారణుఁడు విశలునిజూచెనో లేదో—అతఁడైనను విశలుని బలుకరింపలేదు. ఎట్టులో యారాత్రిగడచిపోయెను. మఱునాఁటి యుదయమున వారణలాలు విశలునితోఁ జాలదూరము వఱకు వాహ్యాళికై బయలుదేఱిపోయెను. కొంతదూర మేగువఱకు నిరువురు నేమియు మాటాడుకొనలేదు. విశలుఁ డేదో ప్రసంగమును దీసికొనివచ్చి

వారణుని చీవాట్లు పెట్టనలయు నని తనమనమున నూహించుకొను చుండెను. తన హృదయమును విప్పి యాతనితో మాటాడుటకుఁ బ్రారంభించినచో నాతఁ డేమనుకొనునో యని చాలసేపావిషయమును గూర్చి చర్చించుకొనియెను. ఈ తరుణవయస్కుఁడు నిష్కారణముగ మారుత్రోవను బట్టి పోవుచుండెనే—ఈతని యంత్యమున కేనా యీ దుష్టస్త్రీతో మైత్రి యొనఁగూడినది ? దీనిని తప్పించుట కుపాయము లేదా? నేనీతని నేమనిమందలింతును? ఎట్లుపోయినఁగార్య మెట్లుపరిణమించునో! ఎట్లైన నిట్లూహించుచు నూరకుండఁ జాలను. ఈతనికిఁ దగినట్లు బుద్ధిచెప్పి యీ ప్రవర్తనమునుండి మరలించుటయే యుత్తమము" అని విరలుఁ డీవిధముగాఁ దర్కించుకొనుచు నాతనితో నడచుచుండెను.

అప్పుడు వారణుఁ డాతనిఁజూచి "ఈమధ్యవృత్తాంతపత్రికలోఁ బడిన సమాచారముచూచితివా ? ఆ సమాచారము నాహృదయమును గూడఁ గొంచె మాందోళనపెట్టినది" అనియెను.

విర : అది నేనుచేయించినదియే. నటేశుఁడట్లు ప్రకటించి నాఁడు.

వార : అందువలన నాదుష్టులు నిర్భయముగాఁ దిరుగు చున్నారు.

విర : నేను మరణించితిననియే వారు నమ్మియున్నారుకాదా ?

వార : అవును. అట్లునమ్ముటచేతనే సౌదామిని మాయింటఁ బాతకాపైనది—

విర : అట్టినమ్మకము వారికేఁగలుగుటకొఱకే యీయుక్తిని బన్నవలసివచ్చినది—

వార : నీ యడ్డు లేదనియే కాఁబోలును. సౌదామిని నామరకత మంజూష నాకిప్పింపుమని నన్నుఁ జాలవేధించినది.

విఠ : నీవేమంటివి ?

వార : నేనేమిచేయఁగలను—నీకింతకుఁబూర్వము విఠలునడిగి తెచ్చికొనకపోయితివా యని యామెతోనంటిని.

విఠ : ఆమె నన్నడిగినది.

వార : అందులకామె, నేనడిగితిని గాని యాపేటిక తనయొద్ద నున్నదనియైన నాతఁడు నాతోఁ జెప్పలేదనియు, నెట్లయిన దానిని దెచ్చి తనకిమ్మనియుఁ గోరినది. అప్పుడు నేను నీకంటె నేనెక్కుడు ప్రయత్నములేమియును జేయఁజాలనని చెప్పివైచితిని.

ఆ మాటవిని వారణుఁడు విచ్చలవిడిగాఁ దిరుగుచున్నను, గార్యభంగమొనర్చు పనులేవియును జేయుటలేదనియు, దనరహస్యము నాతఁడు కాపాడుచున్నాఁడనియు, విఠలుఁడుగ్రహించి "కుమారా ! వారణా ! నీ హృదయము విశ్వాసపాత్రమైనదియే. కాని, నీవు నీస్థితి గతులనుమాత్రము చూచికొనకుండఁ దిరుగుచున్నావు. అది నీ కనిష్ట మును దెచ్చి పెట్టుచున్నదని నేను భయపడుచున్నాఁడను." అనియెను.

ఆ మాటలకు వారణుఁడు వెలవెలపోవుచు "అదేమి యట్లను చున్నావు ?" అనియెను.

అప్పుడు విఠలుఁడు "ఆ స్త్రీ నమ్మఁదగినదికాదు. నీయొద్దనుండి ధనమును దోచుకొనుటయే యామెముఖ్యోద్దేశము. ఆమె నీయోగ క్షేమములనుగూర్చి యోజించునదికాదు" అని యెన్నివిధములనో వారణునకుఁ జెప్పెను.

ఆతఁ డొక్కమాటయును జెవియిచ్చి వినక తనహృదయమును విప్పి చెప్పక యూరకుండెను. విఠలుఁడంతమాత్రమున విడునక "మొన్న నీవు పదివేలరూపాయల నీయలేదా ?" అనియెను.

వారణుఁ డామాటలను విని యాశ్చర్యముతో “ అది నీ కెట్లు తెలిసినది ? ” అనియెను.

విశ : నేను నిన్న చెక్కునేచూచితిని.

వార : ఎక్కడఁ జూచితివి ?

విశ : బ్యాంకియందు.

వార : మంచిదే. సొమ్ము నిచ్చినమాట నిజమే. అంతే— ఇఁక ముందీయఁబోను.

విశ : ఆమె యా ధనమునేమిచేసినదో యెఱుఁగుదువా ?

వార : ఆమె దానినేమైనఁ జేసికొననిమ్ము—అదంతయు నీ కెందులకు ?

విశ : నీవు చేయుచున్నది తప్పుపని. ఆమె నిన్ను నాశనము చేయును.

వార : అలాగునా ? ఆమె నన్ను నాశనమే చేయనిమ్ము.

విశ : ఆమెయు, నిప్పుడు మీయింటిలోఁ బ్రవేశించియున్న స్త్రీయు నేకమై నీసహోదరికి విరోధముగా నేమేమిచేయుచున్నారో నీ వెఱుంగుదువా ?

వార : తిలకసుందరి యీ కృత్రిమకార్యమునఁ జేరియున్నట్లు నీవు దృఢపఱుపఁజాలవు.

విశ : ఆమె నీ సహోదరిని మోసపుచ్చుకార్యమునఁ దక్కిన వారితో సమభాగిమైయున్నది. అంతేకాదు. అంతకంటె ననేకఘోర కార్యములను జేసినదని నేను రుజువుచేయఁగలను. ఆపనులకంతములేదు.

వార : నీచేతనైనచో రుజువుచేయుము చూతము ! అది నీ వలనఁగాదు. “ రుజువుచేయఁగలను. ఇంకను నేమేమో విశేషకార్యములను జేయఁగలను ” అని చెప్పుచు “ అంతయు నేనెఱుంగుదును.

ఎఱుంగుదును " అనుటయే పర్యవసానముగఁ జేయుచున్నావు. నీకా విషయములేవైనఁ గానిమేయున్నచోఁ ప్రఫుల్లనిప్పటికైనఁ గనిపెట్ట గలిగితివా ? ఎందులకీమాటలు ?

విత : వారణా ! నేను ప్రఫుల్లను వెదకి పట్టుకొనియెదను. మఱియును సమయమువచ్చినప్పుడామె నిక్కడకుఁ బిలిపించను బిలిపించెదను. ఈ నీచ స్త్రీని నీవింకనైనను విడిచిపెట్టకున్న నీవు నాశన మగుటనిశ్చయము. నామాటయందులక్ష్యముంచుము.

వార : వితలా ! నీకుఁ దెలియదుకాఁబోలును. ఆ సుందరి యందు నాకపార ప్రేమయున్నది.

విత : వారణా ! నీవామెనువిడిచివేయుము. నామాటవినుము.

వార : నా వలనఁగాదు.

వారణుఁడు మూర్ఖుఁడు. ఆమెను విడువకున్నచోఁ గలుగు ననిష్టములనుగూర్చి సహేతుకముగ, నిదర్శనపూర్వకముగ, సుబోధక ముగ నెంతచెప్పినను వినకపోవుటచే వితలుఁడు దానినిగూర్చి యిఁకఁ జర్చింపకూరకుండెను. ఇరువురును వెనుదిరిగి గృహమునకువచ్చి యొక గదిలోనికిఁబోయిరి. అక్కడ వీథిగవాక్షములో నొకయుత్తరము పడి యుండెను. అది బహుశః అప్పుడే పోష్టాఫీసునుండి వచ్చియుండును. దాని నెవ్వరును నింకను జూడలేదు. వితలుఁడు ముందుగ దానిని జూచెను. ఆయుత్తరము లలితపట్టణమునుండి వచ్చి యుండెను. ఆ క్షణమున యాతఁడు విస్మితుఁడై వ్రేలు కఱచికొనుచు "ఆహాహా ! ఎంతపనిజరగినది !" అనుకొనియెను.

వార : అదేమి ! అంతగనాశ్చర్యపడుచుంటివి ?

విత : ఇదిగో ! లలితపట్టణమునుండి యుత్తరమువచ్చినది. నిన్న రాత్రి చారుచంద్రుఁడు హృద్రోగమునవలన స్వర్గస్థుఁడయ్యెనని

తెలియుచున్నది. వారణా! చారుచంద్రుఁడు హృదయరోగము వలన మరణించుట యసత్యము. ఆతని హత్యచేసినారు. మఱియు, నిన్నుఁ దనవలలో వైచుకొనిన తిలకసుందరికూడ నాహంతకులలో నొక్కతెయని నేను రూఢిగఁ జెప్పుచున్నాను. బహుశః నీపదివేల రూపాయలును, ఆ హత్యకై వినియోగింపఁబడి యుండవచ్చును. చూచితివా ?

వార : దీనికంతకు నీకేమి యాధారమున్నది ?

విర : ఇప్పు డేయాధారమును లేదు. కాని, నాకొకవిషయము తెలియును. తిలకసుందరి వనజచంద్రునకు ధనము నంపినది. ఆ తంతి వార్తలో నామె భరతమాధవియని చేవ్రాలు చేయలేదు. తిలోత్తమ యని వ్రాలుచేసినది. బాగుగ నాలోచించిచూడఁగా నీమె మాధవుని పత్నియని నాకుఁ దోఁచుటలేదు. ఈమె వనజచంద్రుని నాయికయై యుండవచ్చును.

ఆ మాటకు వారణుఁ డించుక యోజించి తలయూచుచు "ఈ మాట నీవు నిశ్చయముగఁ జెప్పఁగలవా ?" అనియెను.

విర : తగిన సమయము వచ్చినప్పుడు నేను నిదర్శనపూర్వకముగ దీనిని ధృవపఱచెదను. ఈ పాపాత్ములందఱును జేరి యేదో యొక యుద్దేశముతోఁ గాంతనాథుని జంపివైచినారు—పిమ్మటఁ జారుచంద్రుని చంపినారు. చూతుముకాదా ! ఇఁక కొలఁదిదినములలోనే యీ వనజచంద్రుఁడును నిక్కడకువచ్చును.

వారణునిమనసు చాలఁ గల్లోలము నందఁజొచ్చెను. ఆతఁడు చేతులను నలుపుకొనుచు లోలోననె చింతింపసాగెను. ఆతనిహృదయము నీరైపోయెను. ఆతనికి మనస్థైర్యము లేకుండఁబోయెను. ఆతఁడు చాల గందరగోళమునొందుచు "ఈ పత్తేదారుఁడింతటి ధైర్యముతోఁ

బలుకుటచూడ నిందులకేదియో ప్రబలకారణమున్నదని తోఁచు చున్నది." అని యనుకొనియెను. అయినను నాతనికిఁ దిలకసుందరి యందున్న యనురాగ మించుకయును తగ్గలేదు. ఇంతియేకాదు. తిలక యింకను బదిమందిని జేతులారఁజంపి రక్తసిక్తములైన హస్తములతోఁ దనయెదుటనిలిచినను వారణుఁ డామెను విడువఁజాలఁడు—

ఓ మోహదేవతా! నీ పాశము లెంతటి దృఢములైనవి! ఇనుప సంకెలల కాఁజాలవు—నీ పాశములంత జిగియైనవి. బంగారుసంకెలల కమూల్యము లేదు—నీ పాశము లమూల్యములైనవి. అమోఘము లైనవి. అట్లుకానిచో నెందఱో తమ వెండిబంగారు నాణెములను ఇక్కడిగదుడిచి వైచుచుండుట యెట్లుతటస్థించును? వారణుఁడు నారందఱికంటెను గొప్పవాఁడా?

వార: విఠలా! నీవీనాఁడు నాతోఁ దిలకసుందరియింటికి వచ్చెదవా?

విఠ: నేనక్కడకువచ్చి చేయునదేమున్నది?

వార: నీవేమియును చేయనక్కరలేదు. ఆమె ముఖచిహ్నములను బాగుగఁ బరీక్షించిచూడవచ్చును. అంతియెకాక, ఏదియో ప్రస్తావమునెత్తి చారుచంద్రుని మరణవార్తనుదెల్పినచో నామె ముఖభావమెట్లుమాఱునో ముఖ్యముగాఁ జూడవచ్చును. అందులకైన నొక్కసారిరమ్ము.

విఠ: నీవిఁకనైనను కన్నులు విప్పిచూచుకొని వివేకవంతుఁ డవై యామెనువిడిచిపెట్టెదనని శపథముచేసినచో నేనక్కడకు వచ్చెదను.

వారణుఁడు విఠలుఁడు నీ విధముగా మాటాడుకొనుచున్నంతలో గదితలుపు చప్పుడయ్యెను. తలుపు తెఱచిచూడఁగా నక్కడ

సౌదామినియుండెను. ఆమె కాఫీయును, రొట్టెయును సిద్ధపఱచి తీసికొని వచ్చుచుండెను. విశలుఁడాపాదమస్తకము నామెనుజూచి "ప్రఫుల్లా! అత్యాశ్చర్యకరమగు నీవివాహవృత్తాంతము నీవారణుఁడు నాకుఁ జెప్పినాఁడు. అంతియెకాక నేఁటివర్తమానమున నీమామకూడ మరణించెనని తెలియుచున్నది" అనియెను.

సౌదామిని ముఖము వాడెను. ఆమె యేమియునుమాటాడకయే చట్టునకొకమూలకుఁబోయి నిలుచుండెను. అక్కడనుండి విశలుని దృష్టించిచూడసాగెను.

విశ : ఈ భయంకరవార్తవలన నేను చాలఁ జింతించుచున్నాను. అయ్యో! పాపము! ఆ చారుచంద్రునిమరణ మేదియో కృత్రిమ వ్యాపారమువలన సంభవించినదని నాకుఁదోఁచుచున్నది. బహుశః ఆతని పెద్దకుమారునిమూలమున నీపాపకృత్యము జరగియుండవచ్చును. ఆహా! ఇప్పుడు సుప్రసిద్ధుఁడగు నావిశలమూర్తియేయున్నచో—

సౌదా : అయ్యో! ఆ విశలుఁడు తిరిగివచ్చునట్లగపడఁడు.

అని నోరుజారిపలికెను.

విశ : అమ్మా! అట్లనవలదు. ఆరాత్రి నాగదిలోనుండి విచిత్రముగా దొంగిలింపఁబడిన సామానులన్నియు నింకను నాతని యొద్దనేయున్నవి. ఇప్పుడాతఁడు దొరకినచో బాగుగనుండును.

సౌదా : నీవాసామానులను తీసుకొనలేదాయేమి?

విశ : ఇంకను లేదు.

సౌదా : అయ్యో! అతఁడాత్మహత్యచేసికొన్నాఁడని వి[illegible]ను. ఇఁకనెక్కడిసామానులు!

విశ : అయ్యో! అలాగా! ఎంతపనిజరగినది? నెట్లు తెలిసినది?

సౌదా : నీకుఁ దెలియలేదా? వర్తమానపత్రికలోఁ బడినదఁట. ఊరందఱును జెప్పకొనుచున్నారు—కాని—

విర : కాని యేమి ?

సౌదా : నేనొకదానికి విచారించుచున్నదానను. నా మరకత మంజూష యాతనియొద్దఁ జిక్కుపడిపోయినది.

విర : అయ్యో ? వెఱ్ఱితల్లీ ! నాసామానులును నీపెట్టెయు నొకచోటనేయున్న వే—ఇఁక నేమిబుద్ధి !

సౌదా : అవి మనకువచ్చుట కేమియు నుపాయములేదా ?

విర : లేకయేమిలే.

సౌదా : మామయ్యా ! మామామ చారుచంద్రునిమరణము కృత్రిమముగ జరగినదని చెప్పచున్నావేమి ? ఆతఁడు చాలదినముల నుండి వ్యాధిగ్రస్తుఁడై యున్నాఁడని వినియున్నానే !

విర : అదేమో ! నాకుఁదెలియదు. నీవు లలితపట్టణమున కెప్పడుబయలుదేరెదవు ?

సౌదా : నేనిప్పడు బయలుదేరునట్లుతోఁచదు. నాభర్తసోదరుఁడగు వనజచంద్రుఁడిఁకఁ గొన్నిదినములలో నీనవనగరమునకు వచ్చెదనని యుత్తరము వ్రాసియున్నాఁడు. అందులకై నిరీక్షింపవలయును. ఆ పిమ్మట బయలుదేరిపోయెదను. ఇప్పడాతఁడే గృహాయజమానుఁడు కాదా !

ఉపాహారములైనపిమ్మట వారణుఁడును, విరలుఁడునుగలిసి తిలకసుందరియింటికిఁబోయిరి. ఆమె మిగుల నాదరభావముతో వారిని గౌరవించెను. వారందఱును మాటాడుచుఁగూర్చున్నప్పడు, విరలుఁడు చారుచంద్రునిమరణవార్త నెఱింగించెను. ఆమాటవిని తిలకసుందరి యెట్టి వికారభావము నగపఱచలేదు.

విర : అది సహజమరణముకాదనియు, ఆతఁడు హత్యచేయఁబడియెననియు, కుమారుఁడగు వనజచంద్రుఁడే యీ దుష్కార్యము చేసినవాఁడనియు, ఇప్పుడాతనిని సర్కారువారు పట్టిబంధించిరని యుఁ బ్రవాదముగనున్నది.

ఇప్పుడు విరలునికోరిక సిద్ధించెను. తిలకసుందరి మొగము నల్లవడియెను. ఆమెమేను కంపింపసాగెను - పెదవు లదరుచుండెను - శరీరమంతయుఁ జెమ్మటలతోఁ దడిసిపోయెను - చూపు విలక్షణ మయ్యెను——

తిల : మామయ్యా ! మా వనజమిత్రుని సర్కారువారుపట్టి బంధించిరని నీకెట్లు తెలిసినది ?

విర : పదియో యొకవర్తమానపత్రికయందుఁ జదివినట్లు జ్ఞప్తియున్నది.

తిల : ఆ పత్రిక నీయొద్దనున్నదా ?

విర : నాయొద్దలేదు. అదేమి ! నీ కంతటి సంభ్రమ మెందులకు ?

తిల : సంభ్రమమా ? నేనొకసారి యాతనిని జూచియుంటిని లెమ్ము.

విర : నీకును, నాతనికి విశేషమైత్రియున్నదని తోఁచుచున్నది. అందువలననే నీవాతనికి ధనమునంపితివి.

తిల : ( బొమముడిపాటుతో ) ఏమి ? ఏమనుచున్నావు ?

తిలకసుందరి వారణుని తేటిపాటఁజూచెను. మేనమామకో నీ ధనముసంగతి నాతఁడే చెప్పియుండునని యామె కనుమానము కలిగెను. అప్పుడు వారణునిపై నెంతయో కోపమువచ్చెను.

విశ : నాకిఁక నేమియును దెలియదు. ఆ వనజచంద్రుఁడు బాల్యమునుండియును వెనుకముందుఁ దెలియకుండ సొమ్మును వెచ్చించినవాఁడు. కనఁబడిన వారియొద్దకెల్లఁబోయి యప్పుతీసికొనుటయే యాతని స్వభావము. అంతియేకాక, ఇచ్చినవారి సొమ్మును మరల నిచ్చుటయే లేదు-ఇఁకమీఁద నట్టితొందరయేమియునులేదు. తండ్రి మరణించుటచేత ముందు జహాగీరు మొదలగు పిత్రార్జితపు సొత్తంతయు నాతనికే చేరును. నీ ఋణమును వేగముగనే తీర్చివేయును. ఏమియును సంశయపడనక్కఱలేదు.

విశలుఁ డీసంగతులను జెప్పుచుండఁగా వినుచునిలుచుండియున్న తిలకసుందరిగుండెలు దడదడఁ గొట్టుకొనసాగెను. ఆమె నిలువున నీరైపోయెను. వీరిరువురును దనయెదుటినుండి లేచిపోయినచోఁ జాల బాగుగనుండునని యామె యనుకొనుచుండెను. అదృష్టవశమున నామె తలంచుకొన్నట్లే విశలవారణులిరువురును వెడలిపోయిరి. వారు దృష్టిపథమునుండి దాటిపోవునందాకఁ గనిపెట్టుకొనియుండి పిమ్మట నొక నిమిషమైన జాలసింపకయే తిలకసుందరి తంతికార్యాలయమునకుఁ బోయి వనజచంద్రునకు మఱియొకతంతివార్త నంపెను.

విశలుఁడు వారణునకుఁ దగినరీతిగ బోధించి గృహమునకుఁ బొమ్మని యాతనిఁ బంపివైచి తానొక్కఁడే తిరుగఁ దిలకసుందరి వెనుకనేపోయెను. ఆమె యాకార్యాలయమునుండి వెడలిపోయిన రెండునిమిషములకే యాతఁడు లోపలకుఁబోయి యామె వ్రాసియిచ్చిన తంతివార్త కొకప్రతి నా కార్యనిర్వాహకుని యొద్దనుండి తీసికొని చూచెను. దానియందు "చారుచంద్రుని మరణము నిజమేనా?" అనుప్రశ్నతప్ప నింకేమియు నగపడలేదు. విశలుఁ డాతనితో మాటాడుచు నక్కడఁగూర్చుండియుండఁగనే యొకయుద్యోగి ప్రక్క గదిలోనుండి యీగదిలోనికివచ్చి యాకార్యనిర్వాహకునిచేతి కొక

తంతివార్తనిచ్చెను. అది వనజచంద్రునియొద్దనుండి తిలకసుందరికి వచ్చిన ప్రత్యుత్తరము. దానియందు "కాంతా! తిలకా! తండ్రి మరణించినాఁడు. అంతయు ననుకూలముగానున్నది. అంచెటికిని సొమ్ముపంచిపెట్టఁబడినది. రేపు కర్మప్రారంభింతును. ఎట్టితొందరయును లేదు. రేపటికి నివారమునకు వచ్చెదను — వనజచంద్రుఁడు —" అని యుండెను.

విరలుఁడధికసంభ్రమముతో దానిని జదువుకొనియెను, పిమ్మట నాతఁడు "నరేశుఁడీవఱకేమైన వర్తమానమును సంగ్రహించియుండునేమో చూతమని రహస్యముగాఁ దనకార్యాలయమునకుఁ బోయెను. అక్కడియుత్తరములనుజూడఁగాఁ, దాను లలితపట్టణమున నియమించిన పత్తేదారునియొద్దనుండి యొకయుత్తరము వచ్చియుండెను. ఆ యుత్తరములో "నీవు వ్రాసినసంగతులనన్నిటిని జాగరూకతతోఁ గనిపెట్టుచున్నాఁడను. శీఘ్రముగ నన్నియును విశదముగ వ్రాసి పంపెదను" అని వ్రాయఁబడియుండెను.

"చారుచంద్రుఁడు చంపఁబడియెను. ఈహత్య బహుశః వనజచంద్రునిమూలముననే జరగియుండును. తాను నిజమైనహక్కుదారుఁడను గాననియుఁ దనతండ్రి మరణించులోపలఁ గాంతనాథుఁడు బ్రదికియున్నచో, ఆ స్తియంతయు నాతనికే చెందుననియు, యోజించి వనజచంద్రుఁడే మొదటఁ గాంతనాథుని, దరువాతఁ జారుచంద్రుని జంపించి యున్నాఁడు. ఈ కృత్యములకు నవనగరియందును గొంతమంది సాహాయ్యము చేసియుండవచ్చును. మఱియుఁ బ్రఫుల్లనెత్తుకొనిపోయి చంపుటయేగాక సాధ్యమైనంతవఱకు నామెసోదరుఁడగు వారణలాలుని సొత్తుకూడ నపహరించి యాతనిని నిరాధారునిగాఁ జేసివైచి యాతనిచే సప్తాక్షరీమంత్రమును (భవతిభిక్షాందేహి) పారాయణము చేయింప

వలయునని యీ దురాత్ముల యుద్దేశమైయుండవచ్చును. అందులకు సందేహములేదు" అని కుశాగ్రబుద్ధియగు విఠలుఁడు తనకుదొరకిన యాధారములనుబట్టి యూహించుకొనియెను.

వారణుఁడు విఠలుని విడిచిపోయినవెంటనే మాధవభాస్కరులనుజూచెను. పిమ్మట వారిరువురు నీతనిని ప్రోత్సహించి యెక్కడికో తీసుకొనిపోవుచుండిరి. వారణున కించుకమిఠాయినిబెట్టి యాతనిపాలిటి మృత్యుస్వరూపమైయున్న వారుణిని యథేష్టముగనిచ్చిరి. వారణున కానిమిషముననే దానిమహిమయగపడుటచే నెవ్వరేమిచెప్పిన నాతఁడట్లు చేయుచుండెను. అప్పుడెల్లరును నెక్కడకైన నొకరహస్యస్థలమునకుఁ బోయి పేకాడుకొందమని నిశ్చయించుకొని వీథినుండిపోవుచుండిరి. ఆకస్మికముగాఁ దిలకసుందరి వారికెదురుపడియెను. ఆమె వారుణీమద విహ్వలుఁడైన వారణుని, మాధవభాస్కరులనుజూచి "ఎక్కడకుఁ బోవుచున్నారు?" అని ప్రశ్నించెను.

మాధ: మే మాడుకొనుటకుఁ బోవుచున్నాము.

తిలకసుందరిస్వభావ మిప్పుడెంతయో మారిపోయెను. ఆమె మిగుల సమాదరభావముతో "మాధవా! మావారణుఁ డీయవస్థయం దుండఁగా మీరీతని మీయిష్టమువచ్చినచోటికిఁ దీసికొనిపోవుట న్యాయముకాదు. బాగుగ యోజించిచూడుము" అనియెను.

మాధ: తిలకా! నీకీధర్మజాడ్యము సంప్రాప్తించి ఎన్నాళ్లైనది?

తిల: అదంతయునడుగుటకు నీకధికారములేదు. వారణుఁడు మీతోరాఁడు. మేమిరువురము నింటికిఁబోయెదము.

మాధ: అదేమి? ఆతఁడు మాతోడనేవచ్చును. అవునా వారణా?

వారణుఁడు తిలకసుందరిని వెనుకకు గెంటి "ఓహో ! నేను మీతోడనే వచ్చెదను. నడువుఁడు." అనియెను.

ఆ మాటలు వినుసరికిఁ దిలకసుందరికి పట్టరానికోపము వచ్చెను. ఆమె మండిపడుచుఁ గన్నులెఱ్ఱచేసికొని "కానిమ్ము ! ఇందులకుఁ దగిన యనుభవముచేసెదను." అని దృఢసంకల్పము చేసికొన్నదా యనునట్లుగ నామె ముఖభావ మగపడుచుండెను. వారణు నీ విధముగ వారికిఁ జిక్కకుండఁ జేయవలయుననియే యామె దృఢసంకల్పము. ఈ విధముగ నిశ్చయించుకొని వారితో నామెయును ద్యూత గృహమునకుఁ బోయెను——

వారణుని విషయమునఁ గేవల మభిమానమును జూపుచున్న యొకవ్యక్తి వారందఱును లోపలకుఁ బోయిన కొలఁదిసేపటిలోనె తానును లోపలఁ బ్రవేశించెను. వారణుని నితరులు లోఁబఱచుకొని పీడింపకుండఁ జేయుటయే యావ్యక్తి యుద్దేశము ; ఆవ్యక్తి మన విశలుఁడే. తిలకసుందరి యక్కడకును వచ్చుచుండుటనుజూచి యిది యేమిటో చూతమని యాతఁడును లోపలికివచ్చెను. మారువేషముతోనున్న విశలుఁ డాజూదపుగదిలో నొకమూలఁగూర్చుండి చూచుచుండెను. ఆ జూదగాండ్రెవ్వరును నాతని గుర్తింపలేదు. ఇంతలోఁ జీకటిపడెను, ఆట ప్రారంభింపఁబడియెను. వారణుఁడు స్వేచ్ఛగ హెచ్చుసొమ్మునే పందెముగనొడ్డుచుండెను. తిలకసుందరి పటకుడ్యము వెనుకనుండి యిదంతయుఁ జూచుచుండెను. ఆట కొంచెమించుమించుగ నొకగడియసేపుజరగెను. వారణుఁ డొడ్డుచున్నదంతయుఁ బోఁగొట్టుకొనుచుండెను. తుదకాతఁడంతయును బోఁగొట్టుకొని వెఱ్ఱిమొగము వైచుకొని వెనుకనున్న స్తంభమునకుఁ జేరగిలఁబడి గ్రుడ్లనీరు గిరగిరఁ ద్రిప్పుచుండెను. నోట్లును, కాసులును, రూపాయలును,——

అన్నియుఁ బోవుటచే నాతని జేబులు వట్టివై పోయెను. ఈ విశేషములను జూచుచున్న తిలకసుందరి "ఇంకేమున్నది! ఏమిచేయుదము ?" అని యోచించుచుండఁగా మూలకూర్చుండియున్న విఠలుఁడు ముందునకువచ్చి వారణుని ఱెక్కఁబట్టుకొని ముందునకులాగి, యక్కడనున్న ధనపుమూట నెడమచేతను, పిస్తోలును కుడిచేతను బట్టుకొని, అట్టహాసముతో గర్జించుచు "మీరందఱును దొంగలు. ఇది మోసము — ఈ మాటయేమోసము — ఏమియు నెఱుంగని యీ వరుణుని తలపగులఁగొట్టి దోఁచుకొనుచున్నారు. ఈ సొమ్ము నాయొద్ద నుండనిండు. మీరు వెనుకకుఁబొండు. లేకున్న నపాయమునకుఁ జిక్కఁ-కొందురు." అనియెను.

గర్వభూయిష్ఠుఁడగు నొకజూదగాఁడా మాటలను సహింపక విఠలునిమీఁదఁబడి యొక్కగుద్దుగుద్దెను. అయిన నాతఁడందులకు లక్ష్యపెట్టక యా జూదగాని నొకతాపుతన్ని దూరముగా గెంటివైచెను. ఆ గృహమంతటను గందరగోళము హెచ్చెను. అన్నివైపులనుండియు హాహాకారములు వెడలెను. వారణుఁడు దిగ్భ్రాంతుఁడై యా దొమ్మి మధ్యనుండి తప్పించుకొని మెల్లగ ద్వారమునొద్దకు వచ్చిపడియెను. తిలకసుందరి యాతనినే యెదురుచూచుచుండుటచే నాతఁడు వచ్చిన తోడనే మంచిమాటలాడి యాతని నక్కడనుండి తీసికొనిపోయెను. సాహాయ్యముచేయుటకై వచ్చిన మనుష్యునిగతి యేమైనదని చూచుటకైన నామె ప్రయత్నింపలేదు. ఆమె వెలుపలకుఁబోయి యొకబండిని కుదుర్చుకొని వారణుని తనయింటికిఁ దీసికొనిపోయెను.

ఇప్పుడు విఠలుఁడు మిగుల దురవస్థలోనయ్యెను. అక్కడి వారందఱును జూదగాండ్రు — పొగరబోతులు — దొంగలు — వ్యభిచారులు — ఇట్టివారిమధ్య నీతఁ డొక్కఁడేమిచేయఁగలఁడు ?

ఏమిచేయుటకును వలనుగాదు—కాని, విఠలుఁడు మిగులఁ జాతుర్యము కలవాఁడు. ఆతఁడు సొమ్ముమూటను జేబులోనుంచుకొని బైటికి వచ్చుటకై ప్రయత్నించెను. అంతలో భాస్కరుఁ డాతనిపైఁబడి కొట్ట వలయునని యెంతయో కష్టపడియెను. తనశక్తినంత నుపయోగించి యాతఁడు మీఁదికిఁజేయినెత్తివిసరెను. కాని, గురితప్పిపోవుటచే నావిసరునకాతఁడే ముందునకుఁబడిపోయెను.

అదేసమయముగఁ జూచుకొని విఠలుఁడు తనపిస్తోలుత్రిప్పి దానితో బలముగ నాతనితలపైఁ గొట్టెను. ఆదెబ్బ కాతఁడు మూర్ఛఁబడిపోయెను. ఈతఁడు విఠలుఁడని యెవ్వరికిని దెలియలేదు. ఇంతమందినెదిరించి యీవిధముగాఁ జెల్లాచెదరుచేయు సాహసైర్యశాలి యెవ్వరైయుండవచ్చునని యందఱును దలపోయఁజొచ్చిరి. ఆలోపున నెవ్వఁడోయొకఁడు కుర్చీనొకదానినిఁ దెచ్చి విఠలునిపైకి విసరెను. అప్పుడు విఠలుఁడు బెబ్బులివలె గర్జించుచు రౌద్రావేశముతోఁ దన పిస్తోలును బారుచేసెను. అంతలో నాగుంపంతయు విడిపోయెను.

విఠలుఁడా తెరపిలో వేగముగ వీథిలోనికి వచ్చి గట్టిగా పోలీసు వారిని బిలువసాగెను. అందువలన నాజూదగాండ్రందఱును భయపడి పాఱిపోవనారంభించిరి. అనేకులు పెరటిగుమ్మమునుండి పాఱిపోయిరి. ఆ సమయమునకుఁ బోలీసువారును వచ్చిరి. వారువచ్చునసరికందఱును బాఱిపోవుటచే నొక్కరును దొరకలేదు. అనేకవిధములగు పేకముక్క లును, కొన్ని ప్రాంసిబుల్లును, కొన్ని నశ్యపుఁబట్టీలుతక్క నక్కడ నేమియును దొరకలేదు.

## పదునేడవ ప్రకరణము

తిలకసుందరి వారణునుపాయాంతరముచే నింటికిఁ గొని పోయిన దనుసంగతి మనకుఁ దెలిసియేయున్నది. ఆమె గృహమున నొకగదిలో నిరువురును గూర్చుండియుండిరి. అదనఱకె వారణునకించుక మత్తు దిగియుండెను. తిలకసుందరి యొకవిధమైనపొడిని నీటిలోఁబోసి దానిని పానకముగఁ జేసి వారణునిచేఁ ద్రావించెను. పిమ్మట నాతనికి గాఢనిద్ర వచ్చెను.

తిలకసుందరి మాటిమాటికిని వారణునకీవిధమగు మైకమును గలిగించుచుండుటకుఁ గారణమును మాపాఠకులు గ్రహించియున్నారా?- అతఁ డొరులతో స్వేచ్ఛగ విహరింపకుండఁ జేయుటకే యామె యట్లు చేయుచుండెను. ఆమె తన హృదయమున "నా వారణుని నా యిష్టముచొప్పున నాతో నుంచుకొనియెదను. నా యిష్టము లేకుండ నాతనిని దీసికొనిపోవుట కితరుల కధికార మేమున్నది ? నా వారణునితో మాటాడుటకు వారెవ్వరు ? నా వారణునిద్రవ్యమును

దినుటకు వారెవ్వరు ? సర్వాధికారిణినగు నేనిచ్చుటనుండఁగా వారెవ్వ రాతనిని దీసికొనిపోవుటకు ? నా వారఁనకు నేను మధువు నీయ వలయును. అతనికి మధువునిచ్చుట కితరులేపాటివారు ? ఆ జూద గాండ్రీతని ద్యూతగృహమునకుఁ దీసికొనిపోయి యాతని ద్రవ్యము నపహరించుట కేనోర్తునా ? వీరియాటలు నాయొద్దసాగవు——నేనిచ్చిన తిని బ్రదుకుఁ బురుషపుంగవులు, నేఁడెట్లు మిడిసిపడుచున్నారు ? కానీ ! వీరికిఁ దగినశాస్తి చేయుదును—" అని యనుకొనుచుండెను.

ఆ సమయమునకు సరిగ మాధవభాస్కరులామందిరమునకుఁ వచ్చిరి. తిలకసుందరి యా జాడ గ్రహించి మేడమీఁదినుండి క్రిందికి దిగివచ్చెను.

మాధ : తిలకా ! ఏమిపనిచేసితివి ? నీ యుద్దేశమేమి ?

తిల : నా యుద్దేశమా ?—మీ రికమీఁద వారఁనుని దీసికొని పోయి యందఱిముందు నాతనినోఁచుకొని తినఁగూడదు. ఇందుమూల మున మీకే యపాయము కలుగును. ఇదిగో ! చూడుఁడు ! మీరు మమ్ముల క్షోభపెట్టరాదు. నాకుఁ గావలసినచోటికి నేనాతనిని దీసికొనిపోవుదును. నేనాతని వశపఱచుకొనఁగలను. అంతియేకాక, మీకుఁగావలసినధన మాతనియొద్దనుండి తీసికొని నేనే మీకీయఁగలను. అట్లుచేసినచో నాతనికిఁగూడ నేమియు ననుమానముకలుగదు. అట్లు కాక, నేఁడు మీరొనర్చినట్లుగ నికముందుఁగూడ నొనర్చినచో నాతఁడు నిశ్చయముగ సంశయపడకమానఁడు. మీకీ శ్రమయెందులకు? మీకుఁగావలసినది నేనే యిచ్చుచుండెదనుగాదా !

మాధ : ఓహో ! అవును. అంతయును నీవే మ్రింగవలయును గాఁబోలును ! పాపము !

తిల : నేనేమియు నట్లుచేయుటలేదు.

మాధ : నీవట్లుచేయుటకుఁ దగినదానవే !

తిల : నీవసత్యములాడుచున్నావు.

మాధ : తిలోత్తమా ! నేనసత్యవాదినని చెప్పఁబోకుము. ఇదిగో ! నీ గ్రహచారము వక్రించియున్నది. చూడుము !

అని చెప్పుచు, నోటికివచ్చినట్లెల్ల నామెను దిట్టసాగెను. ఆతని కంతటితోఁ గోపము తీరలేదు. ఆతఁడెప్పుడు తిలకసుందరియొద్దకుఁ బోయి యామె కుత్తుకను బలముగనొక్కెను.

తిలకసుందరి యిఁక సైరింపలేక పోయెను. ఆమె మహాగ్రహముతోఁ గాళరాత్రివలెలేచి హుంకరించుచు మాధవునిపట్టునుండి విడిపించుకొని ఘోరాకారముతోఁ దనజాకట్టునందున్న చిన్నకటారి నట్టె పైకిఁదీసి దానితో నాతని నొక్కపోటు పొడిచెను. కాని, భాగ్యవశమున గురితప్పుటచే నా పాపాత్ముఁడు బ్రదికిపోయెను.

గురితప్పిన యాడుసింగమువలె నామె మరల గర్జించుచు మాధవునిపైకిదూకెను. ఆతఁడు మరల నామె వ్రేటునుండి తప్పించుకొని యామెను బట్టుకొనుటకై ప్రయత్నించెను.

ఆ మహాపాపాత్ములీవిధముగాఁ గ్రుమ్ములాడుచుండు సమయమున వీధితలుపునెవ్వరోతట్టిన సద్దయ్యెను. తలుపు నీవఁజకే మాధవ భాస్కరులు లోపలకు వచ్చినప్పుడు లోపలిగొళ్లెమును బెట్టియుండిరి. ఆ యంతరాయమువలన నాకస్మికముగ లోపలజరగుచున్న క్రుమ్ములాట శాంతింపవలసివచ్చెను.

భాస్కరుఁడు భయముతో గుండెలుకొట్టుకొనుచు " అయ్యో! ఎవ్వరో వచ్చినారు చూడుఁడు ! " అనియెను.

మాధవుఁడును విభ్రాంతుఁడయ్యెను. తిలకసుందరియును కటారిని వెనుకకుఁ దీసికొని జాకట్టులోఁ జేర్చికొని వేవేగముగఁబోయి

తలుపు తెఱచెను. అక్కడ నామె, యాజానుబాహువగు నొక వ్యక్తిఁ జూచి "అయ్యో! అప్పా!" అని యొక్క కేక వైచెను.

ఆ మూర్తి లోపలకు వచ్చెను. ఆతఁడు చాల దీర్ఘకాయుఁడు. వారు లోపలకు వచ్చునప్పుడు వీధితలుపు వేయకుండ వచ్చిరి.

లోపలకు వచ్చిన పిమ్మట నాతఁడు "ఏమే! నేను దేశమునకు వచ్చెదనని నీవనుకొనలేదా?" అనియెను.

మాధవభాస్కరు లక్కడకువచ్చి చూచిరి. మాధవునిదృష్టి యంతయు నా నూతనవ్యక్తిమీఁదనే యుండెను. ఆతఁడు గడగడ వడఁకుచు "అయ్యో! పల్లవుఁడు! శ్రీమతి యజమానుఁడు!" అనియెను.

పల్ల: ఓ ద్రోహులారా! మీరిక్కడకును వచ్చితిరా? అవు నవును. ఒక జాతివా రొక్కచోటఁ జేరుచుండుట స్వాభావికము. ఒక వృత్తిగల వారందఱును నొక గుంపుగాఁ జేరుటయును స్వాభావిక మే— మీతో వనజచంద్ర సౌదామినులు చేరిన నో—పంచమహాపాతకు లొక్కచోఁ జేరినట్లగును. మీతో వారు చేర లేదేమి?" అనియెను.

తిలకసుందరి యించుక ధైర్యమును దెచ్చుకొని "అప్పా! లోపలికిరమ్ము!" అనియెను.

పల్ల: ఏమే కులఘాతిని! నీవీ నగరమున కెందులకు వచ్చితివే?

అని పిడుగులు పడినట్లుగ గర్జించుచు బొమముడిపాటుతో బండ్లు పటపట గొఱుకనారంభించెను. అతని కన్నులనుండి యగ్నికణములు రాలుచుండెను.

మాధ: పల్లవా! అదంతయును నడుగవలసిన యావశ్యకత నీకేమియును లేదు.

పల్ల : అయ్యో ! నేను నిన్నడుగలేదు. ( తిలక వైపునకుఁదిరిగి ) ఏమే నీచురాలా ! చెప్పవేమి ? " అని క్రోధావేశముతో నామె చెక్కనుబట్టుకొని గుంజగా, నామెకాళ్లకామెయే శరణాగతయైనట్లయి యొక్క కేకవైచెను. తిలకసుందరి తన జీవితకాలమునం దింతగా నెప్పుడును భయపడలేదు.

పల్ల : ఛీఛీ నీవు నాగౌరవమును బోఁగొట్టుటయే చాలును. ఇఁక ముందేమియును వలదు. ఈ మీ ముగ్గురను గుండుతో నొక్క వేటున మట్టిపాలు చేసిననో నాకోపము చల్లారును. అందువలన నా కించుకంతయును విచారము కలుగఁబోదు. మిమ్ములనిప్పుడే పోలీసు వారి కొప్పగింపవలయునని తలంచు చున్నాఁడను. మీరీలోకమునం దుండుటకంటె నశించిపోవుటయే మేలు. మీరొక జూదగానితో ద్యూత గృహమునుండి వచ్చుచున్నారు కాదా ? ఆతనిని దోఁచుకొని తిన్నారు కాఁబోలును ! మాటాడవేమి ? మీపాపము పండిపోయినది——మీరు నా చేతిలోఁ జిక్కుకొంటిరి.

తిల : అప్పా ! నామాటలు నాలకింపుము.

పల్ల : ఓ దుష్టాత్మురాలా! నన్ను "అప్పా" యని పిలువకుము. నేను నీకుఁ దండ్రినిగాను. నీ తల్లి మరణించినప్పుడు పసిపిల్లవై యున్న నిన్ను నాభార్య పోషించినది. ఆమె చనిపోయినపిమ్మట—ఆ యభిమానమును వీడఁజాలక, అప్పటినుండియు నెంతయో కష్టపడి నిన్ను నాప్రాణములతో సమానముగాఁ జూచుకొని పెంచితిని. నాముప్పు గాలమున కించుక గంజయైన పోసికాపాడెదవని నమ్మి నిన్నింత దానిగాఁ జేసితిని. నేను పోయిన దేశములకన్నిటికి నిన్నుఁ దీసికొనిపోయితిని. యోగ్యమగు పద్ధతిని నీకు విద్యాభ్యాసము చేయించితిని. కాని, నీవు నీచుఁడగు నా వనజచంద్రుని వలలోఁ జిక్కుకొని భ్రష్టవై పాడిపోయితివి. అప్పటినుండియు లజ్జావిహీనురాలవై, చెడిపవై, కులహీనురాలవై,

తుచ్ఛముగ జీవించుచుంటివి - ఛీ! పాపాత్మురాలా! నీ మొగమున జూచినచో నాకుఁగూడ నా మహాపాపములు చుట్టుఁబెట్టుకొనును.

పల్లవుని పెంపుడుకూఁతురగు తిలకసుందరి జీవనచరిత్రమిదియే. ఇందు లేశమైనను వ్యత్యాసము లేదు-తిలోత్తమ లలితపట్టణమందు వనజచంద్రునితో నున్నప్పుడు తన పుట్టింటివిషయమై చిత్రచిత్రములగు కులగోత్రములను, అద్భుతమహిమలను గల్పించిచెప్పి యందఱను భ్రమింపఁ జేయుచుండెడిది — ఆ టక్కులాడి మాటలకందఱును లోఁబడిపోవుచుండిరి.

నౌకాధికారియగు పల్లవుఁ డొకసారి హిందూమహాసముద్రమున శ్రీమతియను తననౌకను నడపించెను. ఒకమహాపట్టణమో యనునట్లున్న యానావయం దన్నిదేశములవారును బ్రయాణము చేయుచుండిరి. కోటీశ్వరులగు వర్తకులును, జహాగీరుదారులును మొదటితరగతియందుండిరి. వారిలో లలితపట్టణమువారే చాలఁగ నుండిరి. అప్పుడేదోయొక ప్రస్తావవశమునఁ జారుచంద్రుని గృహసంబంధమైన ప్రసంగమువచ్చెను, దానిఫలితార్థ మీక్రిందివిధముగా నుండెను.

“చారుచంద్రుఁ డొక వేశ్యనుంచుకొనియెను. వనజచంద్రుఁడు చారుచంద్రునకుఁ బూర్వముంచుకొనిన దానివలన నా వేశ్యకుఁ బుట్టెనఁట—కొంతకాలము జరగినపిమ్మట నా వేశ్య యాబిడ్డను చారుచంద్రుని యొద్దవిడిచిపెట్టి మఱియొకనిని మోహించి యాతనితో నెడలిపోయెను. పిమ్మట నామె చారుచంద్రునియొద్ద కెప్పుడును రాలేదు. అప్పటికిఁ జారుచంద్రుని ధర్మపత్నికింకను సంతానము కలుగలేదు. ఆ కారణమున సాధ్వీమణియగు నామె యాబిడ్డ నౌరసపుత్రునికంటె హెచ్చుప్రేమతోఁ బెంచుచుండెను. ఆమె యందఱి

తోడను నా బాలుఁడు తనపుత్రుఁడనియే చెప్పుచునచ్చెను. చారుచంద్రుఁడుకూడ నట్లేచెప్పుచుండెను. కొంతకాలము పోయినపిమ్మటఁ జారుచంద్రుని ధర్మపత్నికి కాంతనాథుఁడు జన్మించెను—వనజచంద్రుని తల్లియగు వారాంగన దేశాంతరమున క్షయరోగగ్రస్తయై బాధపడుచుఁ దనకుమారుని జ్ఞప్తికిఁదెచ్చుకొని యాతనికై కన్నీరు విడుచుచు నాతని పోషణవిషయమునఁ జారుచంద్రునకీక్రిందివిధముగా నొకయుత్తరము వ్రాసెను.

"పూర్వప్రియా!

నన్నుఁ గృతఘ్నగా నెంచవలదు. నా కులవృత్తియే యిది. కాని, నేను నిన్నువిడిచివచ్చినను నీకును నాకును గలసంబంధమువీడిపోలేదు. అదెన్నటికిని వీడునదికాదని నా నమ్మకము — ఎందువలన ననఁగా—నేను నా ప్రతిబింబస్వరూపుఁడగు వనజుని నీకప్పగించితిని, జన్మముచేఁగాకున్నను, క్రియారూపమున నాతఁడు నీసొత్తు. అందువలన నీయొద్దనేయున్నాఁడు. ఇటీవల నీ ధర్మపత్నియందు నీకుఁ బుత్రోత్పత్తియైనదని ప్రవాదముగా వినియుంటిని. ఆ వినికియే నన్ను హర్షవిషాదములలో ముంచి పీడించుచున్నది. ఎట్లును వనజుని విడిచిపెట్టరాదని నేను ప్రార్థించుచున్నదానను. ఇదే నా కడసారివందన మందుకొనుము!"

ఈ యుత్తరమువచ్చినప్పుడు చారుచంద్రుఁ డింటలేనికారణమున వనజచంద్రుఁడే దీనిని తీసికొనియెను. వనజచంద్రుఁ డప్పటికే యౌవనవంతుఁడై యుండెను. అతఁడు పుట్టుకనుండియు ధూర్తుఁడే యగుటచేతఁ దండ్రి యాజ్ఞలేనిదే యా యుత్తరమునుజంపి చదువుకొనియెను. అప్పు డాతనిగుండెలు బ్రద్దలై పోయెను. అదివఱకును దానును, గాంతనాథుఁడు నొకతల్లిబిడ్డలమేయని యాతఁడు నమ్మి

యుండెను. ఇప్పుడాతఁ డెవ్వఁడు ? ఈయుత్తరమువలనఁ దానొక వేశ్యాపుత్త్రుఁడనని యాతనికిఁ దెలియవచ్చెను. అందువలన ముందేమి జరిగునోయను భయమునఁ బాతాళ లోకమునకుఁ బడిపోయినవాఁడయ్యు ధైర్యము తెచ్చుకొని దురాలోచనలకుఁ బ్రారంభించెను. తుదకాతఁ డాయుత్తరమును దండ్రికిఁ జూపింపలేదు. ఇఁకముందుఁ దాను చంద్రుని నమ్మలేకపోయెను. దాయాదియగు కాంతనాథుని మొదటఁ దొలఁగింప వలయుననియుఁ బిమ్మట వృద్ధుఁడగు నా పాలకజనకుని సంహరింప వలయుననియు, యోచించి, యందులకుఁదగిన దురాత్ములను జేర్చుకొని పనిచేయఁ బ్రారంభించెను.

ఈకథ యంతయు నౌకలోఁ బల్లవునకుఁ బాగుగఁ దెలియవచ్చెను. వనజచంద్రుండు తనకూఁతును మోహించి తీసికొని పోవుటచేత హృదయము లోపలనే పల్లవున కాకోపము రాజుచుండెను. ఆ కోపాగ్నికిప్పు డాజ్యాహుతి యైనట్లయ్యెను. అయినను పల్లవుఁడు వివేకవంతుఁ డగుటచేతఁ దగిన కాలమునకై యెదురు చూచుచుండెను. ఒకసారి పల్లవుఁడు లలిత పట్టణమునకుఁ బోయెను. అతఁడచ్చట వనజచంద్రుఁ డొనరించిన కుత్సిత వ్యాపారముల నన్నిటిని దెలిసికొనియెను.

అతఁడు కాంతనాథుని జంపుటకుఁ బ్రయత్నించుటయు, నికముందావిషయమున జరుగవలసిన ఘోరకృత్యములకు నవనగరమునందనేకులొకటిగాఁ జేరుటయు, మరకతమంజూషను గూర్చిన చరిత్రమును బాగుగఁ దెలిసికొనియెను. నవనగరమునఁ బ్రసిద్ధిఁ జెందిన పత్తేదారగు విఠలమూర్తి నీకార్యమున నియమింపవలయునని పల్లవునిమిత్రులాతని కుపదేశించిరి. పల్లవుఁడు నవనగరమునకు వచ్చినప్పటికీ సంగతి జ్ఞప్తికివచ్చెను. ఆక్షణమే యాతఁడు విఠలమూర్తి కార్యాలయమునకుఁ బోయి యానాఁడు చాలసేపాతనితో మాటాడెను. ఆ సంగతి

మా పాఠకులకుఁ దెలిసియే యున్నది. అదిమొదలు చాలదినముల వఱకును విశలుని నాతఁడు చూడలేదు. ఎందువల ననఁగా—— ఆ విశలుఁ డెక్కడకుఁ బోయినదియుఁగూడఁ బల్లవునకుఁ దెలియ లేదు. లలిత పట్టణమునుండి తనకు వచ్చినయుత్తరములవలనఁ జారుచంద్రుఁడు కూడ మరణించెనని తెలియవచ్చెను. ఈ రెండవహత్యకూడ ననజ చంద్రునివలననే జరుపఁబడినదని పల్లవుఁ డూహించుకొనియెను. పల్లవుఁడు, నవనగరవీథియందు వారణునితో వచ్చుచున్న తనపెంపుడు కూఁతురగు శైలోత్తమను జూచువఱకు నామె యీ పురమునం దున్నట్టులే యాతనికిఁ దెలియదు ఇది పూర్వవృత్తాంతము——

తిలకసుందరి తన పెంపుడుతండ్రిని జూచినంతనే గడగడవడఁకి పోయెను. తనమిత్రులయొక్కయుఁ దనయొక్కయు యోగ్యత నాతఁడు బాగుగ నెఱుంగుననియు, తమయేర్పాటులనన్నిటిని బట్టబయలుచేసి తమ్ముకనాశనముచేయుట కాతఁడు ప్రయత్నించుననియు నామెకుఁ దోఁచెను. ఆమె యగ్నిలోఁబడిన మిడుతవలెఁ గొట్టుకొనసాగెను. పల్లవునిచూచినతోడనే మాధవుఁడు నోటికివచ్చినట్లు దూషించి మాటాడెను. ఆ దురుక్తులచేఁ బల్లవుఁడు ప్రసన్నభావము నంద లేక పోయెను. మాధవునకు మహానౌకాధ్యక్షుఁడగు పల్లవుని ఘనత గోచరముకా లేదు.

ఆతఁడు మరల దుడుకుదనముతో "పల్లవా! ఇట్లువ్యర్థముగా గందరగోళము చేయుటవలన లాభమేమియును లేదు. మేమేమైననిచ్చి నీ మనసునకు సంతుష్టిగలిగింపవలయునని యాలోచించుచున్నాము. నీవు మమ్మేమియుఁ జేయకుండ వదలివైచినచో నిరువదివేల రూపాయ లను నీకు రహస్యముగాఁ దెచ్చియిచ్చెదను" అనియెను.

పల్ల : ఛీ! ఛీ! ఓరీ! నీచా! నీకుఁదగినమాటనే చెప్పు చున్నావు! నేనెవ్వఁడనో నీకుఁదెలియలేదు కాఁబోలును! నేను శ్రీమతియనునొక కధిపతినని నీకుఁదెలియదా యేమి? నీ నోటినుండి యెట్టితుచ్ఛపు మాటవచ్చినది! శివశివా! ఓరీ! నీవు పరమద్రోహివి. అక్కఱలేదు—అయ్యా! నీవు లంచమునిచ్చి నన్నుఁ ద్రిప్పఁబోఁ నక్కఱలేదు. లక్షరూపాయలును, ఒకగడ్డిపోచయు నాకు నొక్కటియే యని నీ వూహింపఁజాలనైతివి. ఎంతనీచపుమాట!

అని చెప్పుచుఁ బల్లవుఁడు మాధవునిపైఁబడి కొట్టఁబోయెను.

అంతలోఁ దిలకసుందరి యాతనికడ్డమువచ్చి యాతని కాళ్లపైఁబడి కన్నుల నీరునింపుచు "తండ్రీ! నేను చెప్పఁబోవు మాటలను దయతో నాలింపవలయును" అనియెను.

పల్ల : ఇఁక నన్ను "తండ్రీ!" యని పిలువవలదు. ఇదిగో! నేను వెడలిపోవుచున్నాఁడను. నేను నీకుఁ దండ్రినా! నీవు నాకుఁ దనయవా?—నేనుపోయెదను.

తిల : వలదు. వలదు. తండ్రీ! పోవలదు.

అప్పు డానావికేంద్రుఁడు గంభీరభావముతో నిలుచుండి కాళ్లమీఁదఁబడియున్న తిలోత్తమనుజూచి "తిలకా! కాంతనాథుని మరణమునుగూర్చియు, నాతనికిని బ్రఫుల్లకును జరగిన వివాహమును గూర్చియు, నీవేమైన నెఱుంగుదువా?" అనియెను.

తిలకసుందరియు, మాధవభాస్కరులు నొండొరుల మొగములను జూచికొనిరి.

తిల : ఎఱుఁగను. ఆ సంగతి నా కేమియును దెలియదు.

పల్ల : ఎఱుఁగ కేమి? నీవసత్యములాడుచున్నావు. నీకంతయును దెలియును. అంతేకాదు. ఆతనిహత్యలో నీవుకూడఁ జేరియుంటివనియే నా నమ్మకము. మాటాడవేమి?

పల్లవుఁడుగాక మఱెవ్వరైన నిట్లు మాటాడియున్నచో మాధవభాస్కరులాతని నా క్షణమునసే యమసదనమునకుఁ బంపించి యుందురు. పల్లవుఁడు నెట్టివాఁడైనను మొదలగువారి కధిపతి—అను భవశాలి—అట్టి పురుషసింహములు నిట్టి వారిమాట లేమిసాగి వచ్చును? అనుసరింపు వారిరువురును నెట్టిమొగములు వైచుకొని యాతని వైపునకుఁ జూచుచు నూరకుండిరి. పల్లవుఁడు కాలసర్పమువలె నా ముగ్గురను గ్రూరదృష్టితోఁ జూచుచుండెను.

తిలకసుందరికి భరింపశక్యముకాని యవమానము కలిగెను. ఆమె మెల్లగఁ దండ్రికాళ్లనువిడిచి లేచినిలుచుండి, కరుణాక్రందనస్వరముతో "జనకా! నన్నుఁ గరుణింపుము!" అని ప్రార్థించెను.

కాని, దృఢచిత్తుఁడగు పల్లవునిహృదయము శిలాసదృశమై పోయెను. ఆతఁడికముందుఁ దానేమిచేయవలసినదియు, యోజించుకొనుచు నొక్కక్షణమువఱకును దిలకముఖమును జూడకుండ నాసాగ్రన్యస్తలోచనుఁడై యుండెను.

అప్పుడు తిలకకన్నులనుండి ప్రళయకాలాగ్నికణములు పిడుగుల వలె రాలుచున్నట్లుండెను. ఆమె మెల్లగఁ దనవిలజేతిని జాకెట్టులోనికిఁ బోనిచ్చి యందున్నకటారిని బైకిఁదీసికొనియెను. ఏమ్మరట నామె రోజుచు నొకటిరెండడుగులు వెనుకకువైచి నిలుచుండి నా యాయుధమును దలపై కెత్తి తన శక్తినంతయు నుపయోగించి యాతని వక్షముపైఁ బొడిచెను.

హరహరా! ఈమె యేకాదాసుపుత్రి! ఛీ! ఛీ! ఈమె యాతని యౌరసపుత్రి యేయైనచో నిమెకట్టి దుర్బుద్ధిపుట్టియుండునా? ఈమె యేక్రూరాత్మునితనయయో! ఈమె బాల్యమునం దనాథ యైనను బూర్వపుణ్య మింకఁ జూచి యుండుటచే నీ పల్లవునకుఁ బెంపుడు

కూంతురై నది. అయిననేమి ? కృతఘ్నచిత్తయగు నీపాపాత్ము రాలికవి యన్నియు నేలజ్ఞప్తికినచ్చును !

పల్లవుండు ఆర్తస్వరముతో గుభాలున క్రిందికిఁబడిపోయెను. రక్తప్రవాహముచే నక్కడిజంఖానాయంతయుఁ దడిసిపోయెను. రక్తసిక్తమైన తనకఠారిని మరలఁ బ్రయోగింపనలయునని యామెసన్నద్ధయగునంతలో నర్ధోన్మత్తుఁడగు వారణుఁడు మేడనుండి క్రిందికి దిగివచ్చి తిలకసుందరి రౌద్రాకారమును, ఆమెచేతియందున్న ఘోరశస్త్రమును, సమీపమునఁబడియున్న కళేబరమును జూచి భయభ్రాంతుఁడై యాప్రదర్శనము నికఁజూడఁజాలక కన్నులు మూసికొని " రామరామ! ఇదేమి ? ఈ భయంకరకృత్యమేమి ? ఇట్లుచేయఁదగునా ? తిలకా ! నరహత్యచేసితివా ? శ్రీహరీ ! నేను స్వప్నమును గనుచుంటినా ? నాతలతిరిగిపోయినదా మేమి ? ఈ ప్రదర్శనమేమి ?—" అని తప్పతప్ప మాటలనాడుచు వచ్చి తిలకసుందరికిని బల్లవునకును నడుమ కూలఁబడియెను. మరల నాతనికి మత్తెక్కెను.

తిల : ( వారణునికొంచెమీవలకులాగి ) అయ్యో ! అయ్యో ! ఇదేమి ? ఇప్పుడె జాగరూకతతో సేతనిని మీఁదికెత్తుకొనిపోయి పరుండఁబెట్టి యాతనివస్త్రములఁదీసివైచి నెత్తురుకట్టులుపోవునందాక పులిమివేయుఁడు. ఈతని కింకనుగొంచెముసేపటివఱకు మెలకువరాదు. లేచినపిమ్మట నీసంగతులనన్నిటినడుగును. అప్పు " డిదియంతయు నీకువచ్చినస్వప్నముకాని జరగినదికాదు. నీవు భ్రాంతినొందుచున్నావు " అనిచెప్పుడిము.

మాధవభాస్కరులు వారణుని మీఁదికిఁ దీసికొనిపోయిరి. మాధవుఁడు వేగముగదిగివచ్చెను. పల్లవుని దేహము శవసదృశముగాఁ బడియుండెను.

మాధ : ఇప్పుడీశరీరము నేమిచేయుదము ?

తిల : ఎక్కడకైన నలాగిపాఱవేయుఁడు.

ఓ తిలకసుందరీ ! ఎంతమాటాడితివి ! నీపాలకజనకుని నీవిట్లు చేయవలసినదే ! ఇట్లుమాటాడవలసినదే !—ఆహా ! నీకుఁ గృతజ్ఞత యనుమాటయే లేదాయేమి ? నీవు మనుష్యజన్మము నెత్తితి వను మాటయే మఱచిపోయితివా ? నీతండ్రిని నీచేతులారఁజంపుటయే నీకుఁ బరమానందమైనదా ! ఆ విషయమున నీకుఁ బశ్చాత్తాపమే కలుగ లేదు—ఆహా ! నిశ్చయముగ నీవు మహారాక్షసివి. నీకు హృదయము లేదు. ఇఁకఁ బశ్చాత్తాపమెక్కడనుండివచ్చును ? నీచేతులతో నెంత మందినిట్లు కడతేర్చితివో—రాక్షసీ ! నీపేరుస్మరించుటయును మహా పాపమే—

మాధ : దీని నెక్కడకుఁ దీసికొనిపోవలయును ?

తిల : వెనుకటి యనుభవములన్నియుఁ జచ్చిపోయినవాయేమి? ఏమిచేయవలయునో నీకుఁదెలియదా ?

మాధ : సరియే. అట్లేచేసెదను. ఇప్పటికంటె నర్ధరాత్రిసమయ మనుకూలము. ప్రస్తుత మీకళేబరము నీగదిలో దాచియుంచుదము.

తిలకసుందరి యందులకొప్పుకొనియెను. ఇరువురు నాదేహము నెత్తికొనివచ్చి యొకచిన్నగదిలోనుంచి, క్రిందిజంఖానాను మేడ మీఁదికిఁ దీసికొనిపోయి దానిని వారణునిబట్టలను పులుముటకందఱును గూర్చుండిరి. కాని, గ్రహచారవశమున వీధితలుపు వేసియున్నదో లేదో యెవ్వరును బరీక్షింపలేదు.

విఠలుఁడు ద్యూతగృహమునుండి యీవలకి వచ్చుటకుముందే వారణుఁడు తప్పించుకొని వెలుపలికివచ్చెనుగాఁబా! ఆతఁడు తప్ప కుండఁ దిలకసుందరి గృహముననుండుననియే విఠలునినమ్మకము. అందువలన నీనాఁడిక్కడకువచ్చెను. అప్పటికి సందెచీఁకటిగానుండెను. వచ్చి వీథివైపుననున్న వసారాయొద్దకుఁబోయి గవాక్షమార్గమున లోపలకుఁ దొంగిచూచెను. అప్పుడు తిలకసుందరి మాధవులొక మనుష్యదేహము నొకగదిలోనికి మోచుకొని పోవుచుండుట యాతని కగపడెను. కాని, యదియెవ్వరి దేహమైనదియు విఠలునకు గురుతునకు రాలేదు. ఆతఁడు తేనెలోఁబడిన యీఁగవలెఁ జాలసేపు కొట్టుకొనియెను. లోపలికెట్లుపోవలయునో యాతనికి గోచరింపలేదు.

తిలకసుందరియు మాధవుఁడును మేడమీఁదికిఁబోయి యెంత సేపటికిని గ్రిందికిరాలేదు. విఠలుఁడాసమయముననే తలుపుగెంటెను. లోపలిగడియ వేయనికారణమున సులభముగ నాతఁడా తలుపునుదీసి లోపలకుఁబోయి, యా చిన్నగదిచెంత కరిగిచూచెను. ఆ దేహ మెవ్వరిదైనదియు నాతనికిఁ దెలియలేదు. గాఢాంధకారముగా నుండెను. జేబులోనున్న యగ్గిపుడకను వెలిగించిచూడఁగా నది పల్లవుని శరీరమని తెలిసిపోయెను. విఠలుఁడు వేగముగ నొకమహాసాహసమును జేసెను. ఆ క్షణమె యాతనిని తనబుజములమీఁది కెత్తుకొని నిశ్శబ్దముగా నీవలకు వచ్చెను. ఆ గృహమున కెదుట విశాలమగు నొక మైదానముండెను. అక్కడఁ బ్రయత్నపూర్వకముగ ననేక వృక్షజాతులను వైచి పెంచినతోఁటయుండెను. విఠలుఁ డాకృతక వనమునకు వచ్చి, పల్లవునక్కడదింపి యతనిప్రతినాడిని బరీక్షించి చూడసాగెను. వక్షమునందలి యొకయెముకకు మాత్రము బలమైన దెబ్బతగిలెను. కాని, యా కత్తి వక్షములోపలికిఁ బోలేదు. మఱియు దెబ్బతగిలి చాలసేపగుటచేతను, ఆ సంధ్యాసమీరణము హితవుగ

వీచుచుండుట చేతను, పల్లవుని దేహమునందప్పుడు ప్రాణప్రవాహము మెల్లమెల్లగఁ బ్రవహించునుగదా యని విశలునకు ధైర్యముకలిగెను. ఆ యాశతోడనే విశలుఁ డాదేహము నక్కడ నేయుంచి కూర్చుండెను. ఇఁకమీఁదనైన బలమైనచికిత్స చేయించినచోఁ బల్లవుఁడు బ్రదుకునని యాతనికి ధైర్యము కలిగెను. విశలుఁడు మరల నా దేహము నెత్తికొని బండున్న ప్రదేశమునకుఁబోయి యొకగుఱ్ఱపుబండిని గుదుర్చుకొని, దానినందులోనుంచుకొని, యాతఁ డొకయుపచారశాలకుఁ దీసికొని పోయెను. అక్కడ నించుమించుగ నొకగంటకాల ముపచారములు జరగినమీఁదటఁ బల్లవునకు స్మృతికలిగెను. ఈ విధముగాఁ గాల క్రమమున నాతనికిఁ దగినంతగుణమగపడియెను.

ఆ రాత్రి పండ్రెండుగంటలకుఁ దిలకసుందరికి బుద్ధిచాంచల్యము కలిగెను. ఆమె మాధవభాస్కరులనుజూచి "అయ్యా! ఇఁకమీరు పొండు. ఆ శవమును బరిష్కారముచేసికొనిరండు. నేను మరల నీ ముఖమునుజూడఁజాలను. నా మనసెట్లో చెదరిపోవుచున్నది" అనియెను.

మాధవభాస్కరులు క్రిందికిదిగివచ్చి చూచిరి. ఆ గదిలో వారికి శవమగపడలేదు. ఈ సంగతి తిలకసుందరికిఁ దెలుపవలయునా, అక్కఱలేదా యని వారలు యోజించుకొని, తెలిపినచో నొక పెద్ద గందరగోళముజరగునని భయపడి యట్లుచేయుట మానివైచిరి. అదియునుగాక, మరల నామెయేమైనదని యడిగినచో, "నీ యాజ్ఞాప్రకారముగా నాపని చేసివైచితి" మని చెప్పుదమని వారు నిశ్చయించుకొనిరి. వారు మరల మేడమీఁదికిఁబోలేదు. ఎక్కడకో వెడలిపోయిరి.

పల్లవునకు గాయము బాగుగకుదిరినపిమ్మట విశలుఁ డాతనిని క్రొత్తనుంగళమునకుఁ దీసికొనిపోయెను. ఈ కపటనాటకమునందలి తుదియంకము ప్రదర్శింపఁబడునప్పు డాతని యక్కఱయుండునని

తలంచి యంతవఱకు నాతఁ డాయూర నేయుండునట్లుగఁ దగినయేర్పాటులను గావించెను. అతఁడక్కడ విశ్రాంతిసుఖము ననుభవించుటకీయకొనియెను. ఆ సమయముననె పల్లవుఁడు విఠలునితోఁ దనకును తిలకసుందరికిని జరగిన సంభాషణాదివిషయముల నన్నిటిని సవిస్తరముగఁ దెలియఁజేయుటయేకాక, తిలకయొక్క పూర్వవృత్తాంతమంతయు వినిపించెను.

విఠలుఁడు మరల నవనగరమునకుఁ దిరిగివచ్చి, ఈ ఫిర్యాదునకు సంబంధించిన విశేషవిషయములను తెలిసికొనుటకై ప్రయత్నించి వానిని జాలవఱకుసాధించెను. ఆ పాపాత్ములందరిని గొలఁదిదినములలోఁ బట్టుకొనవలయుననియు, వారిమీఁద, ఫిర్యాదుతీసుకొనిరావలయుననియు యోజించుకొనుచుండెను. మధ్యమధ్య నాతఁడు వారణుని మేనమామవేషముతో సౌదామినిగృహమున వాసముచేయుచుండెను. కొన్నివేళలఁ దానూరికిఁ బోయెదనని యామెతోఁజెప్పి వెలుపలకువచ్చి, రహస్యముగా నితరస్థలములలో వాసముచేయుచుండెను. తఱచుగ సౌదామిని మొదలగువారియెదుట విఠలుఁడు పగటిపూటఁ దిరుగుటయే మానివైచెను.

# పదునెనిమిదవ ప్రకరణము

పినతండ్రిని జంపిననాఁటిరాత్రి తిలకసుందరి మాధవభాస్కరులు వెడలిపోయినపిమ్మట వారణుని ప్రక్కఁ గూరుచుండి యాతని ముఖమునుజూచుచు నేమేమియో యాలోచించుకొనుచుండెను. గదిలోపలిదీపము మసకువారి కాంతివిహీనముగానుండెను. ఏవైపునఁజూచిన నంతయు శూన్యముగా నగపడుచుండెను. గోడలకుఁ గట్టిన చిత్రపటము లామెకన్నుల కగపడుటలేదు. నిత్యోపయోగములగు గదిలోనివస్తువులెవ్వియు నామెదృష్టులలోఁబడుటలేదు. సౌధోపరి భాగమువచ్చి యాకస్మికముగాఁ దన తలమీఁదఁగూలుచున్నట్టు లామె యనుకొనుచుండెను. ఆమె యొక్కొక్కసారి యదరిపడి యిటునటుచూచి హృదయమునఁ జేయివైచుకొని "తిలకసుందరీ ! ఇంతమాత్రమున నీవు నీహృదయమును బాడుచేసికొనకుము ! ఈవఱకెన్నినరహత్యలు నీచేతిమీఁదుగ జరుగలేదు ? ఇది యంతకంటె

నెక్కువయైనదా? నీవంతగానడలెదవేమి?" అని తనకుఁదానే మాటాడుకొని ధైర్యమును దెచ్చుకొనుచుండెను. కాని, యాధైర్య మెంతయో సేపు నిలుచుటలేదు.

ఒకసారి యామె వారణుని మొగముపైపునకుఁజూచి "పాఁమింగంగఁగోవు వలయునప్పుడెల్ల కడవలకొలఁదిగ క్షీరమునిచ్చుచున్నది. నాకేమిలోపము చేయుచున్నది? కటికవానిని నమ్మినగొఱ్ఱెవలె నీతఁడు నన్నుప్రేమించి తనప్రాణమానధనములను నా యధీనము చేసియున్నాఁడు. నేనితని నెందులకుఁ జంపవలయును? ఇంతకంటెను నన్యాయకృత్యమేమియున్నది? ఈ కోమలహృదయుఁడు నాకుఁ దనహృదయము నర్పించియున్నాఁడు—అయ్యో! వనజచంద్రునేమి చేయవలయును?—ఆతని నియోగమును మంటిపాలు చేయవలసినదేనా? ఈ యసందర్భావస్థలో నుండుటకంటె నేను ప్రాణములు విడుచుటయే మేలుకాదా!" అని యోజించుకొని మరల "అయ్యో! దైవమా! నా కీరాక్షసిజన్మము నేలకలిగించితివి? నా పరిణామ మింతటిదేనా? నేనీవిధముగ నశించిపోవలసినదేనా? ఈ సుందర పుష్పమును విషపూరితముగ నేలచేసివైచితివి? ఈ కుసుమముపై వ్రాలి యెన్నిమధుకరములు మరణించినవో లెక్కించువారెవ్వరు?—హా! నానుదుట నీ ఘోరపరిణామముల నెందులకు వ్రాసితివి?—హా! తండ్రీ! నా చేతులలో నీకు మృత్యువున్నది" అని యనుకొనియెను.

ఇంతలో "పాతకీ! జనకఘ్ని!" అనియెవ్వరో తన్ను నిందించుచున్నట్లు లామెకువినవచ్చెను. తనయంతరాత్మయే యట్లు చీవాట్లు పెట్టుచున్నదని యామెకు బోధపడలేదు. ఈవఱకామె యెన్నియో నరహత్యలనుజేసినది. కాని, యెప్పుడును నామె యంతరాత్మ

యందులకామెను నిందింపలేదు. అప్పుడది యస్తమించియుండబోలును! నేఁ డే ప్రకృతిసంబంధముననో యది యించుకతలయెత్తి తిలకసుందరి హృదయమును దహించుచుండెను. అందువలన నామెకు స్థిరభావము పోయెను. పిచ్చియెత్తిన దానివలె నామె యనేకవిధములఁ దన మనమునఁ జింతించుచుండెను.

ఇంతలో వారణుఁ డించుక కదలెను. ఆతనికి మెలకువవచ్చి లేచునేమో యనుభయమున నామె ప్రక్క శయ్యమీఁదికిఁబోయి మేనువాల్చెను. కాని, యామెకు నిద్దురపట్టుట కవకాశ మెక్కడ నున్నది? ఆమె కన్నుమూసికొనియెను. అంతలోఁ దనతండ్రియెదుట నిలువఁబడి "ఛీ! పాపాత్మురాలా! ఇఁక నీకు నెమ్మదిలేదు." అని యనుచున్నట్లుగఁ దోఁచెను. ఆమె యదరిపడి మరలఁ గన్నులు తెఱచి చూచెను. ఎదుట నెవ్వరునులేరు. ఎదుటిశయ్యపై వారణుఁడు గుఱక వెట్టి నిద్రించుచుండెను. ఈ విధముగఁ గన్నుమూసినప్పుడెల్ల నామె కేదోయొక యదటేకలుగుచుండుటచే నామె యిఁక నొంటిగ నాశయ్యపైఁ బరుండఁజాలకపోయెను. అప్పుడామె తనశయ్యనుండి లేచి మెల్లగ వారణునిశయ్యయొద్దకు నడచిపోయెను. తనవెనుక నెవ్వరో తన్ననుసరించి వచ్చుచున్నట్లామెకు గోచరించుటచే నులికిపడి వెనుదిరిగిచూచెను. కాని, యచట నెవ్వరు నగపడలేదు.

అంతలో వారణుఁడు "సుందరీ! ఆ కటారితో నాహృదయమును జీల్చిచూడుము. నేను నిన్నెంతగఁ బ్రేమించితినో విస్పష్టముగఁ దెలియఁగలదు." అని పలవరించెను.

ఆ మాటలకుఁ దిలకసుందరి యదరిపడి "ఈతఁడిట్లుపలుకుచున్నాఁడేమి చెపుమా! ఇందాక నన్నీతఁడు చూచి, యిట్లుపలుకుచున్నాఁడాయేమి? లేక పలవరించుచున్నాఁడా?" అని యనుకొనుచు

దగ్గరకుఁబోయి ముఖమున ముఖముంచి మిగులజాగరూకతతో దృష్టించి చూచెను. ఆతఁడు కదలక మెదలక జీవచ్ఛవమువలెఁ బడియుండెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములు సమగతితో నడచుచుండెను. అప్పుడామె "నిజముగ నీతఁడు పలవరించినాఁడు. ఆహా! ఈ తరుణుని నేనేల వంచింపవలయును? ఈ నిష్కల్మషహృదయుని నేనెందులకుఁ బాధ చేయవలయును? ఈతనిజీవనప్రవాహమునకు నేనడ్డుకట్టనేల కావలయును?—అయ్యో! తిలోత్తమా! నీక్రూరాయుధమును నిర్మూలనముచేసివేయుము! ఏవేళనైన నీకది కాలసర్పముకాఁగలదు—వలదు—వలదు—నీదుష్టచరిత్రములను దలంచుకొని భయపడవలదు—వానిని సంపూర్ణముగ మఱచిపోయి — ఈ తరుణుని సుఖపెట్టుము. నీకును సుఖముకలుగును. నీవెనుకటిచర్యలను మఱచిపొమ్ము—ఆ యవతారమును జాలింపుము! ఆ భయంకరపరిణామముల నిఁక నీయొద్దకు రానీయకుము! హా! హృదయమా! నీకీయావేగ మెందులకు? నీకీయాతనయెప్పుడు ప్రారంభమైనది? ఒకముహూర్తమునకు ముందు కఠినశిలాసదృశమై, విషపూరితమైయున్న నీవు—నన్నిప్పుడింతగా వణకించుచున్నావేమి? నీధైర్యమంతయు నెక్కడకుఁబోయినది? నీ యనుభవము నీకగుచున్నదాయేమి? ఆహా! వారణా! నీవలె నిశ్చలహృదయముతో నేనెప్పుడు నిద్రింపఁగలుగుదును? నాకాసౌఖ్యము కలుగదాయేమి? ఆశాపిశాచము నావలకుఁ ద్రోసివైచి పాపపుదలంపులను పాఱఁదోలి—ఎవ్వరు సుఖింపఁగలరు?—పేడలోఁబుట్టినపురుగు పేడలోనే నశించిపోవలయునాయేమి?—దానికిఁగత్యంతరములేదా?—లేనేలేదా?—" అని యనేకవిధములఁ దలపోయుచు, నాసుందరి వారణునిపార్శ్వమున మేనుజేర్చెను. అంతలో నామెకించుకనిద్దుర వచ్చెను. ఆ నిద్దురలో నారాత్రి యంతయు నామె దుస్స్వప్నములను గాంచుచునేయుండెను.

కొంతసేపటికి వారుణుఁడు లేచి కూర్చుండి కన్నులు నలుపుకొనుచు నిటునటు చూచెను. ప్రక్కను తిలకసుందరి శయనించి నిదురించుచుండుట యాతనికగపడెను. అప్పుడాతఁడు తనమనంబున "నేను స్వప్నమునేగంటిని. ఈ సుందరి యంతపనిచేయునా ? నేను నిజముగ రక్తప్రవాహములోఁ బడుటయే తటస్థించినచో నాదుస్తులన్నియు రక్తసిక్తములుకావా ? నేను నాశయ్యయందేపరుండియుండగా, నారక్తవాహిని యెక్కడనుండి వచ్చినది ? ఇదియంతయును స్వప్నమే. ఈ కోమలి సుప్రసన్నభావముతో నిదురించుచున్నది" అని యనుకొనుచు మరల శయ్యాపై కొఱగెను. ఆతనికించుకమత్తుతగ్గినది. కాని, పూర్తిగవిడువలేదు. ఆ కారణమున నాతఁడు మరలఁ గన్నులుమూసికొనియెను, అంతలో నాగదిలోని దీపమారిపోయెను.

ఆ నిశాసమయమున నా సౌధాంతరాళమునందలి యగాధాంధకారములో వారిరువురును గన్నులనుమూసికొనియేయుండిరి—అంతయు నంధకారపూరితమే——

# పందొమ్మిదవ ప్రకరణము

విఠలుఁడు నవనగరమునకు వచ్చినపిమ్మట నొకవారము వఱకును నాతనికెట్టి క్రొత్తసంగతియును దెలియలేదు. సౌదామిని తనకుఁ గృతకమాతులుఁడగు నీకళింగుని విశేషగౌరవముతో నాదరించుచుండెను.

వారణలాలును ద్యూతమునకుఁ దీసికొనిపోవు విషయమునఁ గలికసుందరికిని మాధవభాస్కరులకును గలిగినమనస్తాపము, పల్లవుని మరణముతో నంతరించిపోయెను. ఆనాఁడాతఁ డడ్డమేరాకపోయిన చోఁ గలికసుందరీ మాధవులలో నొకరు పరమపదమునకుఁ బోయియే యుందురు. ఆ యనిష్టమంతయుఁ బల్లవుని గొట్టుకొనిపోయినదని మాధవభాస్కరులానందించు చుండిరి. కాని, వారి నొకభయము మాత్రము పీడించుచుండెను. పల్లవుని శరీరమేమైనది? ఆతఁడు జీవములతో లేచి పాఱిపోయెనా? కాక, యెవ్వరైన నాతనిదేహము నెత్తికొనిపోయినారా?—ఈ విషయము వారికేమియును బోధ కాలేదు. ఒకవేళ పల్లవుఁడు జీవించియేయున్నచో నాతఁడు మరల

నెక్కడనో యొకప్పుడు తమకడ్డము రాఁదగినవాఁడే—తమదుష్కృత్యములనన్నిటిని బయటఁ బెట్టఁదగినవాఁడే — మాధవభాస్కరులీ విధముగా నాలోచించుకొనుచుండిరి. పల్లవునిశరీరమునుగూర్చి తిలకసుందరి తమ్ముఁ బ్రశ్నించినచో నప్పటికేదియో సమాధానము చెప్ప వచ్చునని వారు నిశ్చయించుకొని యుండిరి.

వారణుఁడు తనకృతకమాతులుఁడగు విఠలుని కంటఁబడకుండఁ దిరుగనారంభించెను. ఒకవేళ నాకస్మికముగఁ జూచినను సిగ్గువడి తలనువంచుకొని తప్పించుకొనిపోవుచుండెను. ఆనాఁటిరాత్రి ద్యూత గృహమున తనకొఱకుఁ బోట్లాడి తన ద్రవ్యమును దీసికొని పోయిన వాఁడీవిఠలమూర్తియే యైయుండవచ్చునని వారణుఁడు యోజించుకొనియెను. అందువలనఁ దానాతని నేమొగము పెట్టుకొని చూడఁ గలఁడు? తనమనసు తన స్వాధీనములో లేకపోవుటచే నాతఁ డీవిధముగా నోడుగవలసివాఁడయ్యెను. తనప్రవర్తనము కేవలము మాఱిపోయినదని యాతనికిఁదెలియును. తనవిషయమున విఠలుఁడు చాలఁ గష్టపడుచున్నాఁడని తెలియును. కాకున్న నానాఁడు తన్నా ద్యూత గృహమున వెనుకనే చూచుకొని వచ్చి యా ధనమును జాగ్రత్తపెట్టుటకాతనికంతటి పట్టుదల యెందులకు? కాని, యా విషయమై, విఠలునితో మాటాడుటకుఁగాని, యా ధనమునిమ్మని యాతని నడుగుటకుఁగాని, వారణునకు మొగముచెల్లుటలేదు. తన్ను తప్పించుకొని తిరుగుచుండుటచే విఠలుఁడుగూడ వారణునియొద్ద నా గోడవనెత్తలేదు. వారణుఁడు పాతాళమునఁ బడిపోవుచున్నాఁడని విఠలునకుఁదెలియును. కాని, తానాతనివిషయమునఁ గఠినముగఁ బ్రవర్తించినచోఁ దన ముందు కార్యమునకు భంగమువచ్చునని యాతఁ డాలోచించు

కొనుచుండెను. విఠలుని సద్బోధనములను వినుటయే కలిగినచో వారణుఁడీవఱకే తిలకసుందరిని విడిచిపెట్టియుండును. మధుపానము వదలియుండును. ద్యూతాసక్తిని వీడియుండును—ఇవి యొకరిబోధన ములమూలమున విడిచిపోవునవియా ? "బుద్ధిఃకర్మానుసారిణి" యను నార్యోక్తి యాతనియెడ సార్థకమయ్యెను.

పల్లవునివిషయమున ఘోరకృత్యము జరగిననాఁటిరాత్రి తెల్ల వారుజామున బాగుగఁ దెలివివచ్చి వారణుఁడు లేచుసరి కాతని పార్శ్వమునఁ గూరుచుండి తిలకసుందరి యాతనికి వీవనతో విసరుచు నుపచారములు చేయుచుండెను. అప్పుడు వారణునకుఁ దాను క్రిందికి దిగివచ్చినప్పుడు తిలకసుందరిచేయుచున్న యా ఘోరనరహత్యను గూర్చినప్రదర్శనము మరల జ్ఞప్తికివచ్చెను. అప్పుడాతనిశరీరము రోమాంచమయ్యెను. ఆతఁడు గడగడవడంకెను. ఇట్లగుటకుఁ గారణ మేమని తిలకసుందరి వారణునడిగెను. అందులకు వారణుఁడు తాను జూచిన ప్రదర్శనమునుగూర్చి మాటాడెను. అందులకుఁ దిలకసుందరి,

"ఈ గృహమున కెవ్వరునురాలేదు. నీవు శయ్యమీఁదినుండి లేచిదిగిరాలేదు" అనియెను.

వార : నేను దిగివచ్చి నా కన్నులారఁ జూచితిని. ఆ రక్త ప్రవాహములోఁ బడిపోయితిని.

తిల : అదంతయును స్వప్నము. కాకున్న నీదుస్తులన్నియును రక్తసిక్తములుకావా ?

వార : ఆమాటనిజమే — అందుమూలముననే నాకనుమాన ముగనున్నది.

తిల : అనుమానమేలేదు. దుస్స్వప్నమేదియో నీకు వచ్చియుండును. నేను నీ సేవ చేయుచు నీయొద్దనేయుంటిని. మనము క్రిందికే పోలేదు.

ఆమాటల నాతఁడు విశ్వసించెను. తాను క్రిందికిదిగివచ్చి యారక్తప్రవాహములోఁ బడినచో నా చిహ్నములేవైననుండవా ? కావున, నిది నిజముగ దుస్స్వప్నమేమైయుండవచ్చును. అని యాతఁడను కొనియెను.

వారణునిజూచి ప్రసంగమునచ్చినప్పుడు తిలకసుందరి "ఆనాఁడు మీ తోటగృహమునుండి యా మనుష్యుఁడు తీసికొనిపోయిన ధనము తిరిగి నీకుఁ జేరినదా ?" అని యడుగుచుండెను.

అందులకాతఁడు "ఆ ధనము నాకూరాలేదు. ఆ మనుష్యుఁ డెవ్వఁడో కూడ నాకుఁదెలియలేదు" అని ప్రత్యుత్తర మిచ్చుచుండెను.

సౌదామినీమాధవభాస్కరులు వారణుని గొడవయే యెత్తుట మానివైచిరి. క్రమముగ నాతనికిని వీరికిని పరిచయము తక్కువ కాఁజొచ్చెను. వారణుఁడు తిలకసుందరినే బలముగనమ్మియుండెను. ముందు తనపరిణామమేమగునో యనుసంగతి తెలిసికొనియుండియు నాతఁడు తనమార్గమును విడువఁజాలఁడయ్యెను.

తిలకసుందరియే యాతనిమోహనదేవత—ఆమెయే యాతని శక్తి — ఆతని సర్వస్వమునామెయే — ఆమె నొక్కనిమిషము విడిచియున్నచో నాతనికిఁ బ్రాణములు కొట్టుకొనుచుండెను. ఆమె యిచ్చిన మధురస మాతని కమృతరసము—ఆతఁడు తన మనంబున ." ఈ దేవతాకన్యక నాకై భూలోకమునకు దిగివచ్చినది. నాకీయమృతరసము నిచ్చుచున్నది. అమృతరసము స్వర్గములోనిదే—కాకున్న దీనిని సేవించినతోడనే నాకంతటి స్వర్గసుఖ మేల

కలుగుచున్నది ? ఓ సుందరీ ! సురసుందరీ ! నీ హస్తములతో నాకమృతమును పోయుము. నేను నీకుదాసుఁడను. నా ప్రాణాధనము లను నీ యధీనము చేసితిని. నీవు నన్నెడఁబాసి యుండకుము. అమృత మయములగు నీ కటాక్షావలోకనముల వలన — అమృతమయమగు నీ యధరబింబము వలన—నిజముగ నీవమృతదేవతవని నేను తలంచు చున్నాను. అందువలననే నా కీయమృతరసము నిచ్చుచున్నావు" అని భావించుకొనుచుండెను.

తిలకసుందరి హృదయ మాకస్మికముగాఁ దిరిగిపోయెను. ఆ సంగతి వారిణునకుఁగూడఁ దెలిసి "నీవిట్లస్వస్థతగానుండుటకు గారణమేమి ?" అని యెన్నివిధములనడిగినను నామె యేమియును సమాధానము చెప్పలేదు. ఆమె విగతబుద్ధియయ్యెను. ఆమె భయ భ్రాంతయై, గాలిచేఁ దరుపత్రములు గలగలచప్పుడైనసరే— చట్టున నులికిపడి కేకవేయుచుండెను. అనేకఘటికలవఱకు నొంటిగా గదిలో చెక్కిలిపైఁ జేయి జేర్చుకొని కూర్చుండి కన్నీరు విడుచు చుండును. గవాక్షము వెంటఁ జెట్లనీడ లోనికిఁ బ్రవేశించి నట్టింట్లో ప్రసరించుట నాకస్మికముగఁజూచి యెవ్వరిదో మనుష్యచ్ఛాయయని యులికిపడును. పల్లవుఁడు దుఃఖసూచకమగు ముఖముతో సర్వదా తన యెదుటికివచ్చి నిలుచున్నట్లే యామెకుఁ దోఁచుచుండెను. ఇంటిలోను దొరకనట్టియేయున్నప్పు డక్కడినుండి యిక్కడకును, ఇక్కడనుండి యక్కడకును బిచ్చిదానివలెఁ దిరుగుచుఁ జేతులు పిసికికొనుచు దీన ధ్వనితో నఱచుచుండును. ఇఁకనొకసారియైన నిజముగఁ బల్లవుఁ డెదుటికివచ్చి నిలిచినచోఁ దిలకసుందరి నిష్కల్మషహృదయముతోఁ దనయపరాధముల నన్నిటి నొప్పికొని క్షమింపవలయునని యాతని వేడుకొనుననుమాట నిశ్చయము. ఇదంతయును జూచి

తిలకసుందరికింకనైన సన్మార్గప్రవర్తనము కలుగునని యెవ్వరైన నొకవేళ భావించెదరేమో ! కాని, యా రాక్షసి యందులకుమారుగఁ దన జతగాండ్రతోఁ జేరి యింకను హేయకృత్యములను జేయుటకుఁ దగిన యోచనల నొనర్చుచునేయుండెను.

ఎట్లో వారణుని విషయమున నామె స్వభావము మాఱిపోయెను. ఇంతటిసుబుద్ధి యామె జన్మకాలమునందు మున్నెప్పుడును గలుగలేదు. ఇఁకమీఁదనైన వారణుని యోగక్షేమములను జాగరూకతతోఁ జూచుకొనుచుండవలయునను నభిమానముకలిగెను. ఈ నడుమఁ దాను వనజునిపక్షమునఁ జేరినదాననుగానా యని యాలోచించుకొనియెను—మరల—"చీ ! నాకు నాతనికిని శాస్త్రోక్తమగు వివాహము కాలేదు. అట్లగుటచే నాతనికి నామీఁద నేమియధికారమున్నది ! నేను నిశ్చయముగ వారణునిపత్నినే. ఈ వఱకుఁ జేసినట్లుగ నిఁకముందాతనికి మత్తుపదార్థములనిచ్చి మతిచెఱచి యాతఁ డున్మత్తావస్థలో నున్నప్పు డేమియు నాతనియొద్ద లాగుకొనఁగూడదు. ఆతనికి విషప్రయోగమునఁ జంపఁబోను. గుండగొయ్యలగు నా జూదగాండ్రచేతుల కాతని నప్పగింపను. ఇంతటినుండి సాధ్యమైనంతవఱకు నాతనికి మేలునే చేయుటకుఁ బ్రయత్నించెదను. నిజముగ నాతఁడు నాకుఁ దనహృదయము నిచ్చి యున్నాఁడు. నాకేమిలోపము చేయుచున్నాఁడు ? నే నేమడిగిన నిచ్చుటలేదు ! ఇఁక నాతని నేనెందులకుఁ బీడింపవలయును ? నా సకలార్థములు నాతనివలన సిద్ధిఁబొందుచున్నవి. ఇఁక వాని నెందులకు వంచింపవలయును ? ఆ ప్రేమైకహృదయునితో నేనెందులకుఁ గలసిపోరాదు ?— వనజునియం దేమివిశేషములున్నవి ! ఏమిసుగుణములున్నవి ? ఆతఁడు నరకలోకమువంటివాఁడు. ఈతఁడో నిత్యానంద స్వరూపుఁడు. స్వర్గలోక మీతని కాలిగోరులోనున్నది కాదా ? ఈ స్వర్గమునకును,

ఆ నరకమునకు నంతరమెక్కడ ?—వారణా ! నీవు నా హృదయేశ్వరుండవు—నేను నీ హృదయేశ్వరిని—" అని యనుకొనుచుండెను.

వారణుడు తిలకసుందరిని విశేషముగాఁ బ్రేమించుచుండెను. ఆతనివలె నకృత్రిమప్రేమను జూపునా పురుషు నామె యెక్కడను జూడలేదు. నరహత్యలలో మునుఁగుటయే స్వభావముగనున్న ఘోరస్త్రీయగు తిలకసుందరి కంత్యకాలమున నట్టిసుబుద్ధి కలుగుటః జాల విపరీతముగనే యున్నది. "వినాశకాలే విపరీతబుద్ధిః" అను నార్యోక్తి నిశ్చయముగ నీమెయందు సార్థకమగుచున్నది. ఆమె మనోవేదన మాత్రము దేనివలనను నుపశమింపలేదు. ఆమెహృదయయాతన నతితీవ్రముగ ననుభవించుచుండెను. ఆ యాతనచే నామె భస్మీపటలమై పోవుచుండెను.

ఒకనాఁటిరాత్రి సౌదామిని, మాధవుఁడు, భాస్కరుఁడు, తిలకసుందరి, వీరనలువురును జేరి ముందుఁ జేయవలసినదానినిగూర్చి యోజించుచుఁ గూర్చుండియుండిరి. వనజచంద్రుఁడు లలితపట్టణమునుండి యింక నొకటిరెండుదినములలో వచ్చునని వారెదురుచూచుచుండిరి. ఇప్పుడు తిలకహృదయమెట్లున్నదో యెవ్వరు చెప్పఁగలరు ?—కాని, యామె యాతనిరాకనుగూర్చి వారితో నేమియునుననలేదు—

భాస్కరునకు వారణుని మేనమామయగు వాగీశుని పేరు విన్నంతనే యొడలుకంపించుచుండును. ఆతనికి వాగీశునిఁజూచిన గిట్టకుండనుండెను. అప్పుడు భాస్కరుఁడు "ఏయుపాయముచేనైన వాగీశుని యమసదనమునకుఁ బంపివేయవలయును" అనిచెప్పెను.

మాధ : ఓహో ! అవును. నిశ్చయముగ వానిని మట్టుపెట్టవలసినదే. ఆ కళింగుఁ డన్నిటికిని దగుదునని తానేవచ్చుచుండును. రాఁగూడనివేళలఁగూడవచ్చి మన కాందోళనము కలిగించుచున్నాఁడు.

ఈతని ప్రతిబంధకము మనకుఁ జాలఁగనున్నది—ఆతనికి మనమీఁద నేదయో యనుమానమున్నట్లు తోఁచుచున్నది.

సౌదా : ఆతనిని మట్టుబెట్టుట కేమియుపాయ మాలోచించి నావు ?

మాధ : తిలక కాలాంతకరసము నించుకనిచ్చును. నీవొకటి రెండుచుక్కలను చెవిలోఁబోసినచో నాతఁడు వేగముగఁ బ్రాణములను విడుచును. దానితో మనకాతనియడ్డము తీరిపోవును.

తిలకసుందరికామాట లింపుగ లేకుండెను. ఆమె మాధవుని వైపునకుఁ గన్నులెఱ్ఱచేసి చూచెను.

ఇఁకముందు వీరందఱకు నేదియో గంధరగోళము జరగునని యూహించి యాకలహమునడంచు నూహతో సౌదామిని యామాట లను మరపించుటకై "ఆ నాగేశునిగతి యేమైనదో ? తెలియలేదు గదా !" అనియెను.

భాస్క : ఆతనిగతి యేమైనదో యెవ్వరు చెప్పఁగలరు ? ఆతఁడు చాలదినములనుండి యెక్కడనగపడుటలేదు. బహుశః మనకు భయపడి యూతఁ డెక్కడకో పాఱిపోయియుండవచ్చును. మనతో నాతని కేమి ప్రయోజనమున్నది? ఆతఁడు మరల నిక్కడకు రాకుండుట మే శ్రేయమైనది.

అందఱునుజేరి ప్రోత్సహించినమీఁదటఁ దిలోత్తమ తన యొద్దనున్న కాలాంతకరసమును సౌదామినిచేతికిచ్చెను. ఆరాత్రి విశలుఁ డింటికిరాలేదు, ఆ కారణమున నాతనిఁజంపుట కవకాశము దొరకినదికాదు.

విశలుఁడు తాసీవఱకు నేలమాళెయందలి నూతినుండి శవమును బైకిఁ దీసియుండెనుగాదా ? ఆతఁడు మరల నా గృహమున

కొంకసారిపోయి యక్కడివిషయములను గొన్నిటినిగ్రహించి తిన్నగ సీవలకు వచ్చినపిమ్మట నటేశున క్రిందివిధముగ నొకతంతివార్త నంపెను,

“ నాగేశునిపట్టి బంధింపవలయును. ఆతఁడెట్లును పాఱిపోకుండఁ జూచుకొనవలయును. ఆతఁడెవ్వరితోడను మాటాడకుండులాగునఁ జేయవలయును. ఈ పనులన్నియుఁ జాగరూకతతో నెఱవేర్ప వలయును ”

అందులకుఁ బ్రత్యుత్తరముగా నటేశునియొద్దనుండి యొక తంతివార్తవచ్చెను.

“ నాగేశుని పట్టిబంధించితిని. ఇఁక నేమిచేయవలయునో తెలుప వలయును. ”

మఱునాఁటి యుదయమునకు నేను వచ్చుచున్నానని మరల నొకతంతివార్తనంపి విశలుఁ డారాత్రి రైలుమీఁదనే ఓదాణికి బయలుదేరిపోయెను, ఉదయమున కందఱునుగలిసికొనిరి. విశల నటేశులు స్నానపానభోజనాది కృత్యములనుదీర్చికొని, పిమ్మట నాగేశుని చెఱయుంచుంచియున్న పోలీసుస్టేషనునకుఁబోయిరి.

నాగేశుఁడు విశలునిమొగమును జూచినతోడనే భయభ్రాంతుఁడై పిచ్చివానివలె నటునిటు తిరుగసాగెను. ఆతఁడు సమీపమునకు రాఁగానే యేడువఁదొడంగెను. తనకీ దుర్దశను దప్పింపవలయునని విశలుని కాలుసేతులు బట్టుకొని దీనవదనముతోఁ బ్రార్థింప సాగెను,

నాగే : అయ్యో ! నన్నేమియునుజేయవలదు. నా యాస్తి నంతయు నిచ్చివేసెదను. నన్నూరక విడిచిపెట్టవలయును.

విర : అదెప్పటికిని జరగదు. నీవు హంతకుఁడవు. మహాపాత కివి—చోరుఁడవు. పరమనీచుఁడవు. నీ వనేకపురుషులను, ప్రఫుల్ల యను స్త్రీని చంపితివని నేను రుజువుచేయఁగలను.

నాగే : లేదు. లేదు. నేను ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నేను ప్రఫుల్లను జంపలేదు. ఆమె నాగృహమునుండి తప్పించుకొని పాఱిపోయినది.

విర : ఓహో ! అలాగా ! నీవామెను నీ యింటియందు నిర్బంధావాసమున నుంచితివా ?

నాగే : అవును. నేనట్లుచేసినమాట వాస్తవమే.

విర : నీవొక తరుణవయస్కుని జంపి యాతని శవమును నేలమాళిగలో నుంచితివికాదా ?

ఆ పలుకులు వినఁగానే నాగేశునకు మాటనిలిచిపోయెను. అతఁడు విస్మితుఁడై యూరక చూచుచు నిలుచఁబడిపోయెను. నాగేశుఁడు మొదటఁ దానేమియు నెఱుఁగనివాఁడనని చాలసేపు వాదించెను. కాని, విరలుఁ డాతనివిషయమునఁ గనికరముజూపకుండ గంభీరస్వరముతో "సత్యము నొప్పుకొననిచో నీవు కఠినదండనము నొందుదువు. ఈ నేరము నా మూలాగ్రముగఁ బరిశోధించి యపరాధులను నేను కఠినశిక్షకు గుఱిసేయించెదను. ఈ మాట నిశ్చయము. నీ గ్రహచారము వక్రముగనున్నది. కానిచో, నీవీవిధముగ నన్నృతము లాడవు. నీకు శూలారోపణశిక్షయగును" అనిచెప్పెను.

అప్పుడు నాగేశుఁడు తానుచేసినదంతయు యథార్థముగఁ జెప్పి యొప్పుకొన్నచో విరలున కించుక కనికరముపుట్టి తన్నాతఁ డురిశిక్షనుండి తప్పించుననియు, తనకు ద్వీపాంతరవాసశిక్షయైనచో జీవములతో బ్రదికియుండి యెప్పటికైన నీవలకు రావచ్చుననియు నూహించుకొని యీవిధముగాఁ జెప్పఁదొడంగెను.

## ఇరువదియవ ప్రకరణము

నాగే : నేను సత్యమునుజెప్పినచో నీవు నన్నురిశిక్షకుఁ బాత్రునిగఁ జేయవుగద !

విర : నీకేమిచేయవలయునో యదంతయు నాకుఁ దెలియును.

నాగేశుఁడు విరలుని వాక్యార్థమును సరిగ గ్రహింపఁజాలక యాతఁడు తన కభయహస్తమును నిచ్చుచున్నాఁడని భావించుకొని యీక్రిందివిధముగఁ దనవృత్తాంతమును జెప్పసాగెను.

విర : నీవు పుట్టినప్పటినుండియుఁ జేసిన యపరాధములనన్నిఁటి నిప్పుడు చెప్పనక్కఱలేదు. నేనడిగినవిషయమునకు సంబంధించినది మాత్రము చెప్పుము.

నాగే : చిత్తము. మీ యాజ్ఞాప్రకార మట్లేచేసెదను.

విర : మాధవునకును నీకును బరిచయమెప్పుడైనది ?

నాగే : ఆతనిని లలితపట్టణమునం దెఱుంగుదును. ఆతఁడు సృష్టిపత్రములు వ్రాయుటలోఁ బ్రసిద్ధుఁడు. భాస్కరుఁడాసమీప

దేశమువాఁడు. కన్నము వేయుట, దొంగతనము చేయుట మొదలగు దుష్కృత్యములలో మాధవునకుఁ దోఁడుపడుచుండెడివాఁడు.

విక : నీవు నవనగరమునం దాతని నెప్పుడు చూచితివి ?

నాగే : ఇప్పటికి రెండు నెలలకుఁబూర్వము.

విక ఆతఁడు నీతో నేమి చెప్పినాఁడు ?

నాగే : విశేషధనలాభము కలుగు నొక కార్యమున్నదనియు నందులకునన్ను సాహాయ్యముఁ జేయవలయుననియు వేడికొనియెను.

విక : ఓహో ! అలాగా ! నీవు ముఖ్యముగా నందులకొప్పు కొనియుంటివి కాదా ?

నాగే : అవును. ఒప్పుకొనియుంటిని.

విక : ఏమిసాహాయ్యముచేయవలయునని నిన్న డిగినాఁడు ?

నాగే : తనకొకమిత్రుఁడుండెననియు, నాతఁడు వేశ్యాగర్భమునఁ బుట్టుటచేఁ దండ్రియాస్తికి హక్కుదారుఁడు కాఁడనియు, నట్టి హక్కును పొందవలసివచ్చినచో, న్యాయముగా హక్కుదారుఁడైన తమ్మునితోఁబాటు తండ్రిని గడతేర్పవలయుననియు, నీఘనకార్యమును జేయఁబూనుకొన్నచో లక్షలకొలఁది రూపాయలు సంపాదింపవచ్చుననియు నాకుఁ దెలియఁజేసెను.

విక : ఈపనుల నెట్లు చేయవలసియుండునో నీకుఁ దెలియఁ జేసినాఁడా ?

నాగే : తెలియఁజేసినాఁడు. విషప్రయోగముచేత—

విక : వారినామములను జెప్పినాఁడా ?

నాగే : లేదు. "ఆతనితమ్ముఁడు మాయొద్దనే యున్నాఁడు. ఆతఁడు మరణించుటకు సిద్ధముగానున్నాఁడు. ఆతఁడు నవనగరము నందున్న యొకకోటీశ్వరుని పుత్రికను మోహించియున్నాఁడు. ఆమె

యచ్చముగా భాస్కరుని భార్యను బోలియున్నది. వారిరువురకు నేవిషయమునందును నెట్టిభేదమును లేదు. ఆ యువకుఁడగు తిమ్మరుసు మరణించుటకుముందె యా కన్యను బెండ్లిచేసికొనవలయునని యిష్టపడుచున్నాఁడు. ఆతని యిష్టానుసారముగ శాస్త్రప్రకారముగ బెండ్లిచేయుదుము. పిమ్మట నాపిల్లను గడతేర్చి యామె స్థానమున నామెకు బదులుగా భాస్కరునిభార్య నుంచెదము. ఆమె నవనగరమున నా కన్యకయైయుండును. పిమ్మట నామెను లలితపట్టణమునకుఁ దీసికొనిపోయెదము. మేమీవిధముగా యోజించియున్నాము." అని యాతఁడు చెప్పినాఁడు.

విర : వారియోజన కనుకూలముగ నన్నియును నెరవేర్చి కొన్నారుగదా ?

నాగే : అవును. వారు కాంతానాథుని—కాదు. కాదు—మొన్ననె నాకాపేరు తెలిసినది—క్షమింపవలయు—విషప్రయోగముచేఁ జంపివైచిరి. ఆతనిశవము నొకయింటివెనుకఁ బ్రవహించు కాలువలోఁ బాఱవైచిరి. పిమ్మట నా ప్రఫుల్లయనుబాలిక నెత్తికొని పోవుటకు నేను సాహాయ్యముచేసితిని. తరువాత నాబాలికను, నిన్నుఁ (విరలుని) జంపవలయునని మాధవుఁడు నాకుఁ జెప్పినాఁడు. నేను నట్లే చేసెదనని వారికి మాటయిచ్చితిని. నేనామె నొకయింటియుం దుంచి పైని దాళమువైచితిని. ఆమెముఖమును జూచుటతోడనే నా కామెను జంపుటకు మనసురాలేదు. నాకామెపై నెంతయో ప్రేమ కలిగెను. మఱియొకనాఁడు నేనాగృహమునకుఁబోయి చూడఁగా నక్కడ నామె నాకగపడలేదు.

విర : అప్పుడు నీకెంతయో తొట్రుపాటు కలిగినదికాదా?

నాగే : అవును. నా హృదయము విదీర్ణమై పోయినది. ఆమె తనయింటికిఁ బోయియుండుననియు, నేనామెను జంపలేదనుసంగతి మాధవునకుఁ దెలిసిపోయినచో నాగతి యేమగునో యనియు, చాల భయపడితిని. భూగృహమునందలి బావిలో వైచినశవము జాజికాయ పెట్టెయందుండుటను జూచితిని—ప్రఫుల్లనె త్తికొనిపోవుట, శవమును మార్చుట — ఈ రెండుపనులను నీవే చేసితివని నేను భావించు కొంటిని.

విత : ఆ నేలమాళిగలోనున్న శవ మెవ్వరిది ?

నాగే : అది కాంతనాథుని సేవకుఁడగు హనుమంతునిది. ఆతఁడు వీథినుండి పోవుచుండఁగా మాధవభాస్కరులాతనిఁ బ్రోత్స హించి యా పాడింటికిఁ దీసికొనివచ్చిరి.

విత : వారాతనిని దీసికొనివచ్చినప్పుడు నీ వక్కడనేయుంటివి కాదా ?

నాగే : అక్కడనేయుంటిని. భాస్కరుఁ డాయువకుని కంఠ మును కత్తితోఁ గోసెను. మాధవుఁ డాతనితలకుఁ దుపాకిగుండె పెట్టి కొట్టెను. ఆతఁడు చనిపోయినపిమ్మట నా శవము నక్కడఁ బాఱ వైచిరి.

విత : నీవు వారికిసాహాయ్యము చేసితివికాదా ?

నాగే : లేదు. ఊరకచూచుచుంటిని.

నటే : జాజికాయ పెట్టెలోనున్న యా శవమునుదీసి నీ వా యింటిక్రింది నీటికాలువలోఁ బాఱవైచితివికాదా ?

నాగే : ( తెల్లఁబోయి ) పాఱవైచితిని.

నటే : నీవాశవమును సంచిలోనైచి మేడమీఁదికిఁ దీసికొని పోయి కాళ్లతోఁ ద్రొక్కితివికాదా ?

నాగే : చిత్తము.

నటే : ఆ శవము నట్లుచేయుట కేమివచ్చినది ? నీవేమియుఁ జేయక యూరకచూచుచున్నప్పుడు నీకాయువకునిపై నంతటి క్రోధ మెందులకుఁ గలిగినది ——

నాగే : ఆ పాడింటఁ బ్రవేశించునప్పుడు నేనాతని జేయిపట్టు కొనిలాగితిని. అప్పు డాతఁడు నన్నొకతాపుఁదన్నెను.

నటే : ఓహో ! ఆ క్రోధమున నీవట్లుచేసితివా ?

నాగేశుఁ డేమియును మాటాడలేదు.

విత : నీవేమియు నెఱుఁగవా ? కానిమ్ము—నీ వెఱిఁగియున్న దంతియేనా ?

నాగే : ఇంకను గొంచెము తెలియును—తిలక విషకన్యక—— ఆమె కనేకవిధములగు విషములు తెలియును. ఏదియో యిచ్చి నన్నుఁ జంపవలయునని యామె ప్రయత్నించుచున్నది.

నాగేశునకుఁ దెలిసిన విషయమింతియే. వితలుఁ డీసంగతుల నన్నిటిని వ్రాసికొనియెను. నాగేశుఁడు తానుచెప్పినదంతయు సత్యమని ప్రమాణముచేసి యీ వాఙ్మూలముక్రిందఁ దనచేవ్రాలు చేసెను. నటేశవితలులును, అక్కడనున్న యాంతరంగికారక్షకోద్యోగులును దానిక్రిందఁ దమసంతకముల నుంచిరి.

వితలుఁ డాపిమ్మటఁగూడఁ జాలసేపు నాగేశునితో మాటాడెను. కాని, విశేషాంశములేవియు నాతనివలనఁ దెలియలేదు. పిమ్మట వితల నటేశు లిరువురు నచ్చటినుండి బయలుదేరిరి.

విత : నటేశా ! నీ ప్రయత్నము బాగుగ ఫలించినది. ఇంక నెంత మచిరకాలములోనే యీ దురాత్ములను బట్టుకొని బంధింప వచ్చును—నే నాత్మహత్య చేసికొంటినని నీవు వృత్తాంతపత్రికలోఁ బ్రకటించుటఁ జాలమేలైనది.

నటే : అట్లుచేయుటచేతనే యీ దుష్టులు నీవు మరణించితివని నమ్మియున్నారు.

విర : నన్నుఁ జంపినవారలు వారలే—ఆ నేరము తమమీఁదఁ బడకుండఁ దప్పిపోవుటచే వారి విశ్వాసము మరింతదృఢమైనది.

నటే : అవును.

విర : నీవొక్కపత్రికలో మాత్రమే ప్రకటించుటఁగూడ మేలైనది.

నటే : నిజమే—అందుల కాపత్రికాధిపతికి నూరురూపాయల నిచ్చితిని.

విర : దానికేమి ? లోకులలో నీ యసత్యవార్త ప్రసరింపకూడదు. మంచిపనియే జరగినది—

ఈ విధముగ వారు మాటాడుకొనుచు వెడలిపోయిరి.

విరలుఁడు నవనగరమునకు వచ్చినపిమ్మటఁ గొన్నిసమయములలో రాత్రివేళమాత్రము వాగీశునివేషముతో సౌదామిని యింటికిఁ బోవుచుండెను. తక్కినసమయములయందుఁ దనరహస్య స్థానములలో వాసము చేయుచుండెను.

తిలకసుందరి యొకనాఁడు తనకోమలబాహులతలతో వారణుని గౌఁగిలించుకొని " వారణా ! నేను నీ సహవాసమువలన నెంతయో సుఖపడుచున్నదానను. ఒకవేళ నేను నిన్ను వీడిపోవుటయే తటస్థించినచో నా గతియేమగును ? నీవు నా వృత్తాంతము నామూలాగ్రముగ విన్నచో నన్నుఁగొట్టి యిక్కడనుండి గెంటివేయుదువు " అనియెను.

అంతలో " పితృహత్యఁజేసిన పాపస్త్రీని నీవు పెండ్లియాడెదవా ? " అని వెలుపలనెవ్వరో యనినట్లు సద్దయ్యెను. అది చాల

గంభీరముగనుండెను—పల్లవుని కంఠస్వరమువలె నుండెను. ఆ గర్జనము తిలకసుందరి చెవిలోఁబడినతోడనే యామె భయంకరముగ నొక కేకవైచి రెండుచేతులతోడను ముఖమునుమూసికొని యేడ్చుచు వారణుని కాళ్లపైఁబడి "హృదయేశ్వరా! నన్ను విడిచిపెట్టవలదు." అని దీనముగఁ బ్రార్థింపసాగెను.

వార : నేను నిన్ను విడిచిపెట్టఁబోను.

తిల : అయ్యో! ఇక్కడ కెవ్వరును రాలేదు. ఇది యమానుష చర్యగానున్నది—ఇది యుత్పాతము!

మరల నింకొకవైపునుండి "నేనకృత్యమును జేసితినని యొప్పి కొనుము—అట్లయినచో—" అని వినఁబడియెను.

తిలకసుందరి బాగుగ నాలోచించుకొనియెను. ఆ కంఠస్వరము తనతండ్రిదేయని యామెకు నిస్సంశయముగఁ దోఁచెను. అందుచే నామెకు స్మృతితప్పిపోయెను. ఈ సారిగర్జనము మిగులఁ బ్రబలముగను మహోగ్రముగనుండెను.

తిలకసుందరి "నేను మహాపాతకమును జేసితిని నేను పరమ నీచురాలను" అని యొప్పుకొనియెను.

వార : తిలకా! నీ వాయపరాధముల నొప్పుకొనవలసిన యగత్యములేదు.

అని సమాధానముచెప్పుచు నామెను లేవఁదీసి సోఫామీఁదఁ గూర్చుండఁబెట్టి "ఆ ధ్వని యెక్కడనుండి వచ్చుచున్నదో నేను చూచెదను. నీవు ధైర్యముతోనుండుము" అని చెప్పి వెలుపలకుఁ బోయి యందందు వెదకెదను. అక్కడ నెవ్వరునులేరు. లోపలనన్ని గదులను సందుగొందులను దుదకు మంచముక్రిందనుగూడఁ బరీక్షించి చూచెను. కాని, వారణునకేమియు నగపడలేదు.

వారణుఁడు తిలకసుందరినెత్తి సోఫాపైఁ బరుండఁబెట్టు సమయమున నొకవ్యక్తి యింటివెనుకటి చావడినుండి వెడలి గవాక్షమార్గమున వెలుపలకుదుమికి, దొడ్డిలోఁ బ్రవేశించి యావరణమును దాటి వీధిలోనికిఁ బాఱిపోయెను.—

ఆ వ్యక్తి మనవిశలమూర్తియే—ఆతని కితరులవేషములను వైచుకొను నేర్పుండుటయేకాక, యేకంఠస్వరముతోనైన మాటాడు శక్తిగూడనుండెను ఇప్పుడు తిలకసుందరి నడలఁగొట్టునుద్దేశమునఁ బల్లవునికంఠస్వరముతో నాతఁడు మాటాడెను.

వారణుఁడు గృహమువెలుపలను, లోపలను వెదకి యెవ్వరిని గానక వెనుదిరిగివచ్చెను.

తిల : వారణా ! ఎవ్వరైన నగపడినారా ?

వార : లేదు—ఎవ్వరు నగపడలేదు. నీవు మాటిమాటికి నా విషయమునుగూర్చి యాలోచింపకుము. సుఖముగానుండుము.

తిల : ఇఁక నాకు సుఖమెక్కడనుండి వచ్చును ? అంతయు నైపోయినది—సుఖము ,స్వప్నమునందుఁగూడ దుర్లభమే—అయ్యో ! నే నీరాత్రి యీ యింటిలో నుండఁజాలను—

వార : అట్లయినచో మనయింటికేఁ బోవుదమురమ్మ—మా సోదరితో నుండువుగాని—

తిలకసుందరి యందుల కొప్పుకొనియెను. ఆమె చప్పుడు చేయకుండ వారణుని ప్రక్కనే మెల్లగ బయలుదేరెను. పిమ్మట నామె వారణుని ముఖమునుజూచి “ వారణా ! నేను నా తండ్రిని జంపితినని తెలిసినపిమ్మటఁగూడ నీవు నన్నుఁ బ్రేమింతువా ? ” అనియెను.

వార : నీ వేమైనఁజేయుము. నేను నిన్నుఁ బ్రేమించుటయే నిశ్చయము. కాని, నీవు నీతండ్రిని జంపలేదని నేనెఱుంగుదును.

తిల : వారణా ! ఇంకను కొన్నిదినములు పోనిమ్ము. నేను నాకథనంతయు నీకుఁ దెల్పెదను. కొన్ని దినములుమాత్రము——

తిలకసుందరీవారణు లాపమయమున వచ్చుటను జూచి సౌదామిని చకితయయ్యెను. తిలకసుందరి యారాత్రికిమాత్ర మక్కడ నుండునని వారణుఁడు సౌదామినికి రహస్యముగాఁ దెలియఁజేసెను. ఆమె యేమియుననకుండ నూరకుండెను. తిలకసుందరి యేమాటయును జెప్పకుండఁగనే తిన్నగ సౌదామిని చిన్నగదికిఁబోయి లోపలఁ దలుపు గొళ్లెము పెట్టుకొనియెను. ఆ లోపల నామె నిద్రవోవుచున్నదా ?—— లేదు——ఒకసారి శయ్యపైఁ బరుండును. పనిలేనిదే చటాలునలేచును. పిచ్చిదానివలె నటునిటుతిరుగుచు విభీతనేత్రములతో నలుకెలంకులఁ జూచును——ఆమె తనమనంబున " ఓహో ! నాకంత్యకాలము సమీపించినది. ఈ లోకమున వారణుఁ డొక్కఁడుదక్క " అయ్యో ! పాపము " అని నన్నుఁజూచి కనికరింపఁదగినవారు నాకెవ్వరున్నారు?- ఎవ్వరును లేరు. నాచుట్టు నున్నవారందఱును గపటాత్ములు——వంచకులు——అందులకు సందేహ మేమియున్నది ? అందువలన నేను మరణించుటకు ముందుగనే యీ నీచులగుట్టు బట్టబయలుచేసి నిశ్చింతగాఁ బ్రాణములను విడిచెదను " అని యనుకొనియెను.

సౌదామిని వచ్చి పిలువఁగాఁ దిలకసుందరి తలుపుతీసెను. పిదప వారిరువురకుఁ గొంచెముసేపు సంభాషణము జరగెను. తిలక వారణుఁ డెక్కడనున్నాఁడని సౌదామిని నడిగి యాతఁడు తన గదిలో నున్నాఁడనుసంగతి తెలిసికొనియెను. తిలకసుందరి వేగముగ నాతని గదిలోనికిఁ బోయెను. ఆమె నాతఁడు చూచి యాశ్చర్యము నొందసాగెను. అప్పుడు తిలోత్తమ వెక్కివెక్కియేడ్చుచు

"వారణా! ఈరాత్రి యమూల్యమగు నొకదివ్యరహస్యలేఖ (Confidential Letter) ను నీకిచ్చి నిన్ను మరలనొకసారి—ఒక్కసారి చూచిపోవలయునని నీగదిలోనికి వచ్చితిని. నీవు దీనిని బోఁగొట్టుకొనరాదు—మఱియు మనకిరువురకు వియోగము కలుగునంతవఱకు దీనినివిప్పి చూడనుగూడదు. హృదయేశ్వరా! నీప్రేమైకదృక్కుల నన్నొక్కసారి వీక్షింపుము! అందువలన నా హృదయభారము శమించును" అనియెను.

వారణుఁ డాశ్చర్యవిషాదములతో "సుందరీ! తిలోత్తమా! నీవాయాలోచనమును విడిచిపెట్టుము. మనకు వియోగ మెట్లుసంభవించును?—ఆ భయమును విడిచిపెట్టుము" అనియెను.

తిల: వారణా! విడుచుటకే ప్రయత్నించుచున్నాను. కాని, నేనిప్పుడుకోరినట్లు నడచుకొనియెదనని వాగ్దానముచేయుము—మఱియు, నీవు నాయుత్తరమును జూచినతోడనే, దానియందున్నరీతిగా నడచుకొనవలయునుజుమా!

వార: ఇదిగో! శపథముచేయుచున్నాఁడను.

తిల: హృదయేశ్వరా! ఇదిగో! నా తుదివందనము నందుకొనుము.

అని కన్నులనీరునించుచు వారణునకు వందనముచేసెను.

వార: (తొట్రుపాటుతో) ఇదేమి? ఇట్లనుచున్నావేమి?

తిల: కాదు—వారణా! కాదు. ఊరక నీకు నమస్కారము చేయుచున్నాను.

ఇఁకఁ దిలక మాటాడలేకపోయెను. ఆమె నేత్రాంబుజముల నుండి యశ్రుధార లవిచ్ఛిన్నముగాఁగురియుచుండెను. ఆమె వారణుని గట్టిగఁ గౌఁగిలించుకొని, యొకసారి మనసార ముద్దుఁబెట్టుకొని, వేగముగ నావలకు వెడలిపోయెను.

వారణుఁడు ముద్ర (లకోటా) వైచిన యామె యుత్తరమును బల్లపై నుంచుకొని "ఇదేమాశ్చర్యము? నేను నా చరిత్రమునంతను వ్రాయుచున్నప్పుడే, ఆమెకూడ నేమియో వ్రాసి తెచ్చియిచ్చిన దేమి? ఇప్పుడీ రెండింటి నొకటిగాఁ జేర్చి ముద్రవైచెదను—ఆమె వ్రాసిన దానిని నేను చూడరాదు. ఈ రెండుకవరల నేమిచేయుదును?—కాల్చివేయుదునా? చీ! అట్లుచేయరాదు. ముద్రవైచియుంచుటయే యుక్తము. ఇట్టిసంగతులనన్నిటిని విఠలునకుఁ దెలుపుటయే మేలు—అయ్యో! నా హృదయమింత తీవ్రముగఁ గొట్టుకొనుచున్న దేమి? ఈ యావేదనమున కేమికారణము? దీనిని నే నెట్లుభరింపఁగలను? తిలకా! హృదయేశ్వరీ! నీవు నన్ను మాయలోఁద్రోచివైచి యెక్కడకుఁ బోయెదవు? నీవు మరణించినచో, నేను నీ వెనుక నే వచ్చెదను! అందులకు వెనుదీయఁబోను—కానిమ్ము—ఇది విఠలునకు నివేదించెదను—"అనుకొనియెను.

వారణుఁ డాందోళనాయత్తచిత్తముతో నా నిశీథమునందుఁ గాలీడ్చుకొనుచు విఠలుని యాఫీసునకుఁబోయెను. కాని, విఠలుఁ డక్కడలేఁడు. ఆతఁడు నటేశునిఁజూచి ముద్రవైచిన యా కవరనిచ్చి "అయ్యా! దయయుంచి నాకొఱకు దీనిని భద్రముగానునుంచి విఠలమూర్తి వచ్చినపిమ్మట నాతనికీయవలయును." అని వేఁడికొనియెను.

నటేశుఁ డట్లేచేయుదునని యాతనికి ధైర్యముచెప్పి దానిని తీసికొనియెను. వారణుఁ డింటికిఁ దిరిగివచ్చుసరికి రాత్రిమూఁడు గంటలయ్యెను. వచ్చినతోడనే యాతఁడు వేగముగఁ దిలకయున్న గదిలోనికిఁ బోయెను. అక్కడకుఁబోయి చూచుసరికిఁ గొట్టుకొనుచున్న వారణుని హృదయము నిలిచిపోయినట్లయ్యెను. తిలకసుందరి మరణవేదనాధీనయై దీర్ఘనిశ్వాసములను విడుచుచు నేలమీఁదఁ బడియుండెను. ఇఁక నేమున్నది? వారణునిగుండె నీరైపోయెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

వారణుఁడు మెల్లఁగఁ దిలకసుందరిని తనచేతులమీఁది కెత్తుకొని "ప్రాణప్రియా! ఒక్కసారి మాటాడుము—ఒక్క మాట— హృదయేశ్వరీ! తిలకా!" అని వేడికొనియెను.

తిలకసుందరి మెల్లఁగఁ గన్నులను దెఱచి తనకాంతునిఁ జూచుచుండెను. మాటాడుటకు విశేషకష్టముతోఁ బ్రయత్నించుచుండెను. అప్పు డామె మరణవేదన నందుచున్నదనియు నీలోకమును—తన్ను వీడిపోవుననియు నాతనికిఁ దెలిసిపోయెను. ఇఁక నాతఁ డూరకుండఁ జాలకపోయెను.

వార : అయ్యో! హృదయేశ్వరీ! నీ వేమితీసుకొంటివి? చెప్పవా?—వైద్యుని తీసికొనివచ్చి యౌషధమునిప్పించెదను. ప్రాణాధికప్రియా!—ఒక్కమాట చెప్పుము.

తిల : ( అధికకష్టముతో ) ఇ—ప్పు—డే—మి—ఫ—లము ! నే—ను—పో—వు—చుంటి—ని—ప్రా—ణే—శా —నమ—స్కా—ర—ము !

వార : అయ్యో ! నా హృదయేశ్వరీ ! తిలకా ! నీవు మరణింపఁగూడదు—ఎందులకు మరణింపవలయును ?

తిల : నే—ను—మ—ర—ణిం—చి—న—చో—నీ—కు—సు—ఖ—ము—

ఆమె కంఠనాళములు బిగఁదన్నుకొని పోవుచుండెను. కన్నులు మాత్రము వారణుని వైపునకే తిరిగియుండెను.

వారణుఁ డేకమాటాడలేకపోయెను. ఆతనికి భూమ్యాకాశములు రెండును గలిసికొనిపోవుచున్నట్లగపడెను. ఆతఁడు విభ్రాంతుఁడై పోయెను. శోకావేగమున నిశ్చేష్టితుఁడై కొయ్యబొమ్మవలె నామె వైపునకుఁ జూచుచుండెను. శోకపూరితమగు నింతటి భయంకర ప్రదర్శనము నెప్పుడు నాతఁడు చూచి యెఱుంగఁడు. మృత్యుదేవత నాతఁడు తనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని యచేతనుఁడై పోయెను.

తిలకసుందరికిఁ గాలుసేతులు కొయ్యవారుచుండెను. ఆమె మరల “న—మ—స్కా—ర” అని చెప్పుచు మరణసూచకమగు శోకహీనస్వరమును వెలార్చెను. ఆమె కన్నులుమూసికొని పోయెను. చేతులు వారణునిమీఁదఁబడియెను, పిమ్మట నామె దేహము శాంతి నందెను.

వారణునకుఁ జిత్తస్వాస్థ్యము తప్పిపోయెను. ఏకాంతాకటాక్షమాలికలచే నిత్యమును దా నలంకరింపఁబడుచుండెనో — ఏ యువతీ గాఢోపగూహనంబులఁ దనహృదయము చల్లఁబడుచుండెనో ఏవనివతా

వదన చంద్రబింబలావణ్యామృతమునఁ దనప్రాణము నిలువఁబడు చుండెనో—ఆకాంతను—అట్టికాంతను వీడి వారణుఁ డొక్కనిమిష మైన జీవింపఁగలఁడా ? ఆతఁడు "హా ! హృదయేశ్వరీ ! ఈ ప్రపంచ రంగమును వీడి మనమిరువురమును బోవుదము. నీ వొక్కతె వెక్కడకుఁ బోయెదవు ? నిన్నువీడి యొక్కనిమిషమైన వేగింపఁజాలనని నీవెఱుంగవా ? ప్రాణప్రియా ! నీ ప్రాణములతో నా ప్రాణములను గలిపికొని నుతింపుము. ఎల్లవేళల నీవేలోకముగానున్న నాకు— నీవులేని యీ లోకమునందుఁ బ్రయోజన మేమియున్నది ? హా ! తిలకా ! తిలకసుందరీ ! ఆనందమయంబగు నీమోము—లావణ్య ప్రపూర్ణంబగు నీ వదనము—నేఁడిట్టుల కళావిహీనమై, యంధకారా వృతమై యుండుట నేనెట్లుచూడఁగలను ? ఎఱుఁగఁబడనియాతన ననుభవించుచు శోకాకులచిత్తుఁడనై యిఁక నీ లోకమున నొకనిమిష మైన నిలువఁజాలను—ప్రాణేశ్వరీ ! పరుగెత్తుకొనిపోవక యుంచుకొనుము. నేను నీ తోడనేవచ్చుచున్నాఁడను" అని యనేకవిధములఁ బలవింప సాగెను. ఆతఁడు చాలసే పాయువతిశవముపైఁబడి రోదనముచేసెను. పిమ్మట "ఈ యమూల్యజీవరత్నము పోయినపిమ్మట నేను బ్రదుకఁ జాలను. నా హృదయ మంధకారపూరితమై పోయినది. ఇఁక నాకు ముందాశ యేమున్నది ? ఈ యాత్ర నింతటితో ముగించెదను" అని యనుకొనుచు దృఢబుద్ధితో నతివేగముగ లేచి మేజాయొద్దకుఁ బోయి దానిపై నున్న గాజుగిన్నెనుదీసికొని దానిలోఁ గొంచెము నీటినిబోసి ఖిద్యప నొకవిధమగు చూర్ణము నందులోనైచి యిట్లనుచు కలఁచెను.

అయ్యో ! పాప మీ సమయమున నెవ్వరైనఁ బుణ్యాత్ములు వచ్చి సాధుప్రాణియగు నీ తరుణునిచేతినుండి యా గిన్నె నూడ్చఁ

వేసికొని యాతని ప్రాణములను గాపాడిన బాగుగనుండును! అదెట్లు జరగును! కర్మానుసారముగఁ బ్రవర్తించుబుద్ధికిఁ బ్రతికూలసన్నివేశము లెప్పటికిని గలుగఁజాలవు.

తరుణవయస్కుఁడా! వారణా! ఆ కార్యము మంచిదికాదని యెవ్వరైనఁజెప్పినచో నిప్పుడుమాత్రము నీవు వినఁబడునా? ఈవిషజ్వాల నీకు సుఖమునీయఁజాలునుగాఁబోలును!

విషమునుగలుపుట పూర్తియయ్యెను. ఆగిన్నెనాతఁడు చేతఁబుచ్చుకొని యా విషమును ద్రాగుటకు సిద్ధముగానుండెను. అంతలో నాగదిగుమ్మము గొళ్లెము కదలినట్లు చప్పుడయ్యెను. అతనికి వెనుదీయుట కవకాశము కలుగలేదు. అప్పటికే సగమువిషము గొంతుకలోనికిఁబోయెను. తుదకాతఁడంతయు మ్రింగివైచెను. విద్యుచ్ఛక్తి సోకినట్లుగనే యాతనికంతలో శూల ముదయించెను. తలతిరిగిపోయెను. ఆతని కాగదియంతయు గాఢాంధకారపూరితమై నట్లగపడియెను. కన్నులుగానరాని యా యంధకారావస్థలోఁగూడ వారణుఁడు తడవుకొనుచుఁ బోయి తిలకసుందరి శరీరమునొద్దకుఁ జేరెను. ఆతఁడు రెండుచేతులతోడ నాశవమును గట్టిగఁగౌఁగిలించుకొని యొకనిట్టూర్పుతోఁ బ్రాణములను విడిచెను.

కొలఁదిసేపటిలోనే మూవురుపురుషు లాగదిలోనికి వచ్చి చూచిరి. చూచినవెంటనే యొకనిమిషమైన నక్కడనుండక వెనుకకుఁ బోయిరి. వారిలో మాధవభాస్కరులిరువురు. మూఁడవవాఁడు నల్లని ముఖముగలవాఁడు. పొడవైన తలవెండ్రుకలుగలవాఁడు. క్రూరావలోకనములుగలవాఁడు — ఆతనిముఖమును జూచినచో నేదియో యొకవిధమగు వియోగచిహ్నమగపడుచుండెను. ఆతఁడు వెలగల యుడుపులను ధరించికొనియుండెను. ఆతనిచేతిలో నందమగు నొక బెత్తముండెను.

క్రొత్తవాఁడు : ఇదేమి సమాచారము ?

మాధ : ఇదేమంటిరా ? వినుఁడు — తిలకసుందరియు, నామెను ప్రేమించినవాఁడును చేరి యాత్మహత్యఁ జేసికొన్నారు.

ఆ నూతనపురుషుఁడే వనజచంద్రుఁడు. ఆ నిర్భాగ్యస్త్రీయగు తిలకసుందరికి మొదటియజమానుఁడు. అతఁ డిప్పుడే పడవమీఁద లలితపట్టణమునుండి వచ్చియుండెను. మాధవభాస్కరు లాతని కెదురుగఁబోయి తీసికొనివచ్చిరి. ఆతనికిఁ గొంతదూర మెదురుపోవుట చేతనే రాత్రి వారిక్కడ నగపడరైరి.

వనజుఁడు తిలకసుందరి మరణమున కేమియును విచారింపక యె " ఆమె యీ లోకమునందుండుటకంటెఁ బోవుటయే మేలు. ఆమె మనకు సాహాయ్యమేమో చేసినది. కాని, అనయము నామెకు మనము భయపడవలసివచ్చుచుండెడిది. ఈ రెండవప్రాణి యెవ్వరు ? " అనియెను.

మాధ : కాంతనాథునిఁ బెండ్లియాడి మనవలన సద్గతినందిన యా ప్రఫుల్ల సహోదరుఁడు.

వన : ఈతఁడా కోటీశ్వరుఁడే. సరె ! అట్లయినచో సౌదామినియే ప్రఫుల్లయని యందఱు నమ్మియుండుటచే నీతనియాస్తికిఁగూడ నామెయే యధికారిణి కానచ్చును. కావున, మనమంతయు సరిచేసికొనువఱకు నీ సంగతిని బయటఁ బెట్టరాదు. ఇఁక మన కెవ్వరితొందరయును లేదు.

మాధ : అట్లనవలదు. ఇఁక నొకమృత్యువున్నది. ఆ మృత్యు స్వరూపుఁడే ప్రఫుల్ల మేనమామ. అతఁ డప్పుడప్పుడు వచ్చి యీ యింటియందే వాసముచేయుచుండును. మన మామునలివానినిగూర్చి కేవలమును సంశయింపవలసినదే.

వన : బాగుగ నాలోచించి యాతని నొకరహస్యస్థలమునకుఁ దీసికొనిపోయి స్వర్గారోహణము చేయించుటయే మనకు క్షేమము. ఆ ప్రయత్నమునుగూడఁ ద్వరలోఁ జేయనిచో మనకు నెమ్మది లేదు. ఇఁక నాతనియడ్డులేకున్న సర్వమును మనము నెమ్మదిగాఁ జూచికొన వచ్చును.

మాధ : అవును—ఇప్పు డీశవముల నేమిచేయుదము? ఆవలఁ బారవేయవలయును. కాని, యీ కార్యమున మనమెవ్వరిని నమ్మరాదు.

భాస్క : ఇందుల కితరులను బిలుచుట యెందులకు? మనమే చేయుట మంచిదికాదా?

మాధ : మనము చేయుటయెట్లు?

భాస్క : ఒక పెట్టెలో నీ శవములను భద్రపఱచి యొకబండిని గుదుర్చుకొని దానిలో దీనినుంచుకొని తీసికొనిపోవుదము. కాటి కాపరి కడిగినంతధనమిచ్చి యాతనిని వశపఱచుకొని యా పెట్టె నాతనికిచ్చివత్తము.

మాధ : ఇదెవ్వరైనఁ జూచినచో మనమే వీరిని హత్యచేసి నట్లుగ ననుమానింపరా?

భాస్క : అట్లు చూడకుండ నే నీకార్యమును జక్కఁబెట్టెదను.

వన : దీని కించుమించుగ నెంతధనము కావలయును?

భాస్క : అధమపక్ష మైదువందలరూపాయలైనను గావల యును.

వన : అయ్యో! ఇప్పు డేమిచేయుదును? నాయొద్ద నేఁబది రూపాయలుమాత్ర మున్నవి. నేనిక్కడఁ దిలకసుందరిమూలమున నెంతధనమైన సంపాదింపవచ్చునని యూహించుకొని వచ్చితిని.

మాధ : నాయొద్ద నొకకాసైనను లేదు. భాస్కరుఁడు గ్రుడ్డి గవ్వయైనను లేనివాఁడేగదా!

వీరికిప్పుడు గొప్ప పీకులాటవచ్చెను. ఇదివఱకును దమకు ద్రవ్యముకావలసి వచ్చినప్పుడెల్లఁ దిలకసుందరిని బ్రోత్సహించి, యామె వారణునకు బూడిదఁబూసి సంపాదించి తెచ్చినదానిని చల్లగ గ్రహించి వాడుకొనుచువచ్చిరి. పాపము! బంగారుగ్రుడ్లను బెట్టుచున్న పెట్టకోడి యిప్పుడు చచ్చిపోయినది. ఇఁకఁ జేయవలసినదేమి యున్నది? ఇఁక వీరియాట లెక్కడ సాగివచ్చును?

మాధ : వనజా! నీయొద్ద ధనములేనిచో నెక్కడనైన నప్పు దీసికొనరాదా?

వన : అయ్యో! అదియెట్లు? ఆ పనియింకను సాగదు——

మాధ : కాంతనాథుని ద్రవ్యము నేమిచేసితివి?

వన : అది బ్యాంకియందున్నది. వారసుసర్టిఫికట్టు లేనిదే యా ధనమును మనకీయరు.

మాధ : మీతండ్రి మరణకాలమునం దాతనియొద్ద నున్నధన మేమియును దొరకలేదా?

వన : లేదు. అది చేఁజిక్కినదికాదు. ఆతఁడు తనధనమంత యును దీసికొనిపోయి యొక న్యాయవాదియొద్ద నుంచినాఁడు. ఆతని యొద్దకుఁబోయి నేనడిగితిని. నీ కాగితములనన్నిటిని చూచినఁగాని నీ కీధనము నిచ్చుటకు వలనుగాదని యా న్యాయవాది చెప్పివైచినాఁడు.

మాధ : అదేమి? అట్లు చెప్పుటకుఁ గారణమేమి?

వన : మరియేమియునులేదు. చారుచంద్రుఁ డేదైన మరణ శాసనము వ్రాసియున్నాఁడేమో యది చూడనలయునని యాతని

యభిప్రాయము. న్యాయవాదుల కుచేష్ట లింతియే కాదా ? ఈ విషయ మున నా జాగరూకతలో నే నుండిమే యుంటిని.

మాధ : సరి. మన మెంతసేపుమాటాడినను ప్రకృతకార్యము నకు ఘనమురాదు. ఇంక నిప్పుడేమిచేయవలయును ?

వన : సౌదామినియే ప్రఫుల్లయై యున్నది కాదా ? ఇప్పుడా ప్రఫుల్లధనము నీమె పుచ్చుకొనుట కభ్యంతర మేమియున్నది ?

మాధ : సౌదామినికిఁ బ్రఫుల్ల చేవ్రాలు తెలియదు. అందు వలన నెక్కడకునుగూడ హుండీనిబంపించుటకు వీలులేదు.

వన : అట్లయినచో నామె యెక్కడనైన నప్పుదీసికొని రావల యును.

మాధ : మంచిది. ఆమె కాపనియైన సాధ్యమగునేమో కను గొందము.

అప్పుడామువ్వురునుబోయి సౌదామిని కాయంశమునుగూర్చి వివరముగఁ దెలియఁజేసిరి. ఆమె మిగుల నానందో యనముఁజెంది యిప్పుడు మనకెట్లును ద్రవ్యము కావలయును. కాని, దాని నెట్లు సంపాదింప వలయునో నాకుఁ దెలియకుండనున్నది. అంతియేకాక యేపనిచేయుట కును నాకు ధైర్యముచాలదు. ఎదురుఇొమ్ము మీద కుంపటివలె నింకను వాగీశుఁ డున్నాఁడు. నిత్యము నాతని దర్శనము తప్పుటలేదు. అన్నింటికి నాతఁ డడ్డముగా నున్నాఁడు. ఆతనివలన మనకేమియును భయములే దనునమ్మకమున్నచో నాతనినైన నడుగవచ్చును ” అనియెను.

వన : ఆతనియొద్ద నేమైన ధనమున్నదా ?

సౌదా : కొన్నివేళల నాతనియొద్ద విశేషధనమే యున్నట్లుగ పడుచున్నది. కాని, మనకు దొరకుటకష్టము. అతఁగు కల్గింగుచు,

అని చెప్పి వారలను గదిలోనికిఁ బోయి యందంము వెదకి కొన్ని బంగారపు వస్తువులను దీసికొనివచ్చి భాస్కరునిచేతి కిచ్చి "ప్రస్తుతము వీని నక్కఱకైనఁ దాకట్టుంచి ధనమును దీసికొనిరండు. విశేషధనమును సంపాదించుటకు మఱియొక సాహసకార్య మేమైనఁ జేయవలయును" అనియెను.

తిలకసుందరి గతించిపోయినదను సంగతి సౌదామినికి విచారమును గలిగింపలేదు. సౌదామినికి ధనదాహమే విశేషముగా నుండెను. కాని, యా మహోదాహము నడంచుకొనుట కేమిచేయవలయునో యామెకు బోధపడలేదు. మఱునాఁడంతయును యోజించుకొని యొకమార్గమును ద్రొక్కుటకు నిశ్చయించుకొనియెను. ప్రఫుల్ల గృహమునకుఁ బూర్వమునుండియుఁ బరిచయుఁడై యున్న యొకన్యాయవాదిని గృహమునకుఁ బిలిపించుకొని యాతనితో నామె "అచ్యుతరాయా! ఇప్పుడు నాకించుకధన మత్యావశ్యకముగఁ గావలసియున్నది" అనియెను.

అచ్యుతరాయలు న్యాయవాదిత్వమునకు వచ్చినప్పటినుండియుఁ బ్రఫుల్ల పుట్టినింటివ్యాపారములను బాగుగఁ జూచుచున్న వృద్ధుఁడు. ఈ మాటలను విన్నతోడనే యాతనికిఁ బరమాశ్చర్యము కలిగెను. ఎందువలననఁగా—ప్రఫుల్ల పేరుతో బ్యాంకియం దొకలక్షరూపాయలవఱకు నున్నవని యాతనికిఁ దెలియును.

అచ్యు : ఓహో ! ఇదేమి ! బిడ్డా ! నీ ధనమంతయును కర్చుపడిపోయినదా ?

సౌదా : అవును. అంతయును గర్చుపడిపోయినది.

అచ్యు : అంతధనము నేమిచేసితివి ? ఇంచుమించుగ నొక లక్షరూపాయలు నీపేరుతో బ్యాంకిలోనుండెడివి కావా ?

సౌదా : అవును. ఉన్నమాట నిజమే. ఇప్పుడంతయును గర్భుపడిపోయినది.

అచ్యు : అట్లయిన నిప్పుడెక్కడనుండి తీసికొనిరమ్మని చెప్పు చున్నావు ?

సౌదా : మా తలిదండ్రులు మీయొద్దనుంచియున్న నగనాణె ములమీఁదను, ఇతరమగు నా స్త్రిమీఁదను, అప్పుతీసికొనవలయునని తలంచుచున్నాను. అవియన్నియుఁ జాల వెలగలవికావా ?

అచ్యు : అవును.

సౌదా : అట్లయినచోఁ బ్రయత్నించెదరా ?

అచ్యు : నీవిష్టపడినచో నట్లే చేయవచ్చును.

సౌదా : కావలయునని నేనే చెప్పుచున్నానుగాదా !

అచ్యు : ఈ ధనమెందులకుఁ గావలయును ?

సౌదా : నేనాసంగతి నిప్పుడు చెప్పఁజాలను. అంతయును రహస్యము——

అచ్యు : ఓహో ! మంచిది. అట్లేకానిమ్ము. స్త్రీలు విచిత్ర స్వభావముకలవారు——ఇప్పుడెంతధనము కావలయును ?

సౌదా : ఇరువదియైదువేల రూపాయలు.

అచ్యు : ( ఆశ్చర్యముతో ) ఎంత ?

సౌదా : ఇరువదియైదువేలరూపాయలు.

అచ్యు : నీకేమియును ధనమువిలువ తెలిసినట్లేయగపడుట లేదు !

సౌదా : తెలియకేమి ? తెలిసియే యడుగుచున్నాను. నాకు ఱేపే ధనముకావలయును.

అచ్యు : మొదట నాకు దొరకవలయునుగదా !

సోదా : మీకు దొరకకేమి ?

అచ్యుతుఁడు విస్మితుఁడై మఱునాఁడు ధనమును దెచ్చి యిచ్చెదనని చెప్పి తనగృహమునకు వెడలిపోయెను. ఆతఁడు ప్రఫుల్ల సుశీల యని బాగుగ నెఱుంగును. ఆమెయం దాతని కెంతయో వాత్సల్యము కలదు.

పిమ్మట నాతఁడు బ్యాంకికిఁబోయి ప్రఫుల్ల లెక్కలను దీయించి చూడఁగాఁ గొన్నిమాసములనుండియు నామె యొకకాసైనఁ దీసి కొనుటలేదనియు, ఆమె తనతో నసత్యముచెప్పినదనియు నాతనికిఁ దెలియవచ్చెను. ఆమె యిట్లుచేయుట కేమికారణముండునని యాతఁ డెంతయో యోజించుకొనియెను. కాని, యాతని కేమియును గోచరింప లేదు తుదకాతఁడు "ఓహో! ఇదంతయును మోసముగా నగపడు చున్నది. ఈమె తన పేర బ్యాంకిలోనున్న ద్రవ్యమును దీసికొనకుండ నష్టుచేయుటయెందులకు ? ఇది బాగుగ నాలోచింపఁగా నీమె యేదుష్టులతోడనో చేరి లేచిపోవలయునని యూహించుకొన్నట్లు తోఁచుచున్నది. కానిమ్ము. నేను న్యాయముగ నధికారమును బొందిన వకీలునగుటచే "నిష్పడీధనమెందుల" కని యడుగునధికారము నాకున్నది" అని యాలోచించుచుఁ దనగృహమునకువచ్చి యా నిమిః షమునందే తనకుఁ బ్రాణమిత్రుఁడగు విఠలమూర్తి నొకసారి రమ్మని వర్తమానమంపెను.

పిలుచుటకుఁబోయిన మనుష్యుఁడు విఠలుని యాఫీసునకుఁబోయి చూచుసరి కక్కడ నటేశుఁడు కూర్చుండియుండెను. విఠలుఁ డెవ్వరికిని దెలియకుండ నింకను లోపల నేకూర్చుండియుండెను. ఎందుం కనఁగా–ఆ దుష్టాత్ములు తాను బ్రదికియున్నట్లు గ్రహింపకుండుటయే యాతని ముఖ్యోద్దేశము. ఆ నరహంతకు లెక్కడఁజూచిపోవుదురో యను సందేహముతో నాతఁడట్లు చేయుచుండెను.

విఠలున కచ్యుతునితోఁ గేవలమైత్రియుండుటచేఁ దోడనే సూతఁ డచ్యుతునిగృహమునకుఁ బోయెను. విఠలుఁడు రెండుదినముల నుండి యీ ఫిర్యాదునకు సంబంధించిన సాధనసామగ్రి ( Evidence ) నంతనొకచోఁజేర్చి చూచుకొనుచుండెను. అందువలన వనజచంద్రుఁడు వచ్చినసంగతికూడ నాతనికిఁదెలియలేదు. అచ్యుతుఁడు విఠలునితోఁ బ్రఫుల్లయడిగిన ధనమునుగూర్చియుఁ దానుచేసినపనిని గూర్చియు సవిస్తరముగఁ దెలియఁజేసెను. విఠలుఁ డంతయు నాలకించి "అచ్యుతా! ఆమె ప్రఫుల్ల కాదు" అనియెను.

అచ్యు : ఆమె ప్రఫుల్లయే. నీవట్లనుచున్నావేమి ?

అని యాశ్చర్యపడసాగెను.

విఠ : కాదుకాదు. ఆమె లలితపట్టణ స్త్రీ. అతిసాహసిక.

అనిచెప్పి పూర్వవృత్తాంతమంతయు రహస్యముగా నచ్యుతున కెఱింగించెను—

అచ్యుతరాయలు సంభ్రమాశ్చర్యములతో "ఎంతటికృత్రిమ వ్యాపారము! విఠలా! నీవిదియంతయు సరిగాశోధించితివా ? సరియే— ప్రఫుల్ల కాంతనాథునిఁబెండ్లియాడుటచే, వనజచంద్రుని గృహమునను నప్రఫుల్లయే రాణియగును" అనియెను.

విఠ : అవును. అందులకు సంశయములేదు. నేనన్నిటిని బరిశోధించి సేకరించుచున్నాఁడను. ఇప్పుడు నేను వనజచంద్రుఁ డిక్కడకు వచ్చుటకొఱకును, లలితపట్టణమునుండి నాస్నేహితునియొద్దనుండి చారుచంద్రుని మరణవిషయమైన యుత్తరమువచ్చుటకొఱకును నిరీక్షించుచున్నాఁడను.

అచ్యు : ఆ మరకతమంజూషలో నేమున్నదో తెలిసికొంటివా?

విఠ : నాకేమియును దెలియదు. సమయమువచ్చినప్పుడు తెఱచిచూచి తెలిసికొనవలసియున్నది. మొత్తముమీఁద దానిలో నేదియో యొకవిశేష ముండియుండవచ్చును.

అచ్యు : ఆ ద్రోహులలో నొక్కతె విషకన్యకగాదా ? ఆమె నా పురాతనమిత్రుఁడగు పల్లవుని పెంపుడుకూఁతురఁట. ఆమెకేమైన మరణదండనమైనచో నాతఁడు చాలవిచారించును.

విఠ : ఆతఁడామెయెట్లయిన నీభూమినుండి విలుప్తయైపోవుటయే మంచిదని తలంచుచున్నాఁడు. ఆమెకు శిక్షయైనచో నాతఁడువిచారింపఁడు.

అచ్యు : (ఇంచుకయోజించి) ఇప్పుడామాయావతి యడుగుచున్న ధనమునకై యీమెతో నేనేమిచెప్పవలయునో చెప్పెదవా ?

విఠ : రేపు మూఁడువందలు లేక నాలుగువందల రూపాయలనుమాత్రమిచ్చి యింకను గొన్నిదినములవఱకుఁ దక్కినసొమ్ము దొరకదనిచెప్పుము. ఆలోపలనే నేనీఘోర్యాదునకు సంబంధించిన సమస్త సాధనములను సిద్ధపఱచికొని భయంకరమగు నీనాటకమునందలి తుది యంకమును బ్రదర్శింపఁజేయుదును.

అచ్యు : ఈ యప్పుసంగతి వారణలాలునకుఁ దెలియదు కాఁబోలును !

విఠ : నాకే తెలియదు? ఆతనికెట్లు తెలియును !

అనిచెప్పి విఠలుఁ డాఫీసునకుఁబోయి నటేశునితో సమస్త విషయములను మాటాడెను. చాలదినములనుండి లలితపట్టణపు పత్తేదారునియొద్దనుండి యెట్టిసమాచారమును వచ్చుటలేదు. విఠలుఁ డందునుగూర్చి చాలఁ దొందరపడుచుండెను. నటేశుఁ డేమియో జ్ఞప్తికిఁదెచ్చుకొని—

"విఠలా ! నేనొకవిషయమును మఱచిపోయితిని. వారణుఁడు ముద్రవైచిన యొకకవరునుదెచ్చి నీకిమ్మనియు, నీవు వచ్చువఱకు దానినిజాగరూకతతోఁగాపాడవలయుననియుఁజెప్పినాకిచ్చియున్నాఁడు" అనిచెప్పుచు దానిని విఠలున కొసంగెను.

విరలుఁ డాకవరను దీసికొని "నటేశా! ఇదేమి? దీనిపై "నేను మరణించువఱకు దీనిని తెఱవఁగూడదు." అని వ్రాసి యున్న దేమి? నటేశా! ఈ యుత్తరముఁ దీసికొని వచ్చినప్పుడు వారణుఁడు కేవలమును భయభ్రాంతుఁడై యున్నట్లగపడలేదా?" అనియెను.

నటే: అది యసమయము. ఇంచుమించుగ మూఁడుగంటల రాత్రివేళ నాతఁడు వచ్చినాఁడు. ఆతని ముఖమును నేను సరిగాఁ జూడలేదు.

విర: అయ్యో! పాపము! ఆ యువకుఁ డేమో తొందరపడి నట్లే తోఁచుచున్నది.

నటే: ఆతఁడు తన ప్రాణములను బోఁగొట్టుకొనుటకు సాహసించునంతటి ధీరుఁడని నేను నమ్మఁజాలను.

విర: ఆతని కట్టిసీచగతియే సంభవించియుండును. కానిమ్ము. నేనుపోయి యాతని సమాచారమును దెలిసికొనియెదను.

నటే: అట్లు చేయఁజాలఁడు. ఆతనికిఁ దిలకసుందరి యొక్కతె యున్నచోఁ జాలును. ఆమెనువిడిచి యాతఁడు మరణింపఁగలఁడా?

విర: ఆమె యాత్మహత్య చేసికొనియుండఁగూడదా యేమి?

నటే: ఆమె యట్లుచేయఁజాలదు.

విర: నేను నమ్మఁజాలను. ఆమె, తానొనర్చిన నరహత్యలను, తనతండ్రిని దనజేతులారఁ జంపుటయును జ్ఞప్తికిఁదెచ్చుకొని మన స్థైర్యమునువీడి నిస్పృహతో నాత్మహత్యజేసికొనుట కేందులకుఁ బ్రయత్నింపరాదు? ఇప్పుడు నేనక్కడకుఁబోయి యా సమాచార మంతయుఁ గనుఁగొనియెదను.

నటే: ఇందునకుఁ బ్రయత్నించుట వృథా కాలహరణమని నాకుఁ దోఁచుచున్నది.

విశ : ప్రయత్నమునకుఁ గాలహరణ మేమియున్నది ? అక్కడకుఁబోయినచో సన్నియను జూచికొనవచ్చును.

నకే : అట్లయిన వెంటనేపోవుట మంచిది.

విశలుఁడు వెడలిపోయెను. ఆతఁడు వారణునియింటికి సమీపమునందున్న యొక శృంగాటకమున నిలుచుండి చూచుసరి కాగృహద్వారమునొద్ద నొకబండివచ్చి నిలుచుండెను. ఎవ్వరో ముప్వురు మనుష్యులు వేగముగ నా యింటిలోనికిఁబోయిరి. వారిలో నిరువురు మాధవభాస్కరులని వారణునకుఁ దెలియవచ్చెను. మూఁడవవాఁడు వనజచంద్రుఁడగుట విశలునకుఁ దెలియలేదు. లోపలినుండి యొక పెట్టెనుదెచ్చి యా బండిలోనుంచుకొని యా మూవురును బయలుదేరిరి. విశలుఁ డదియేమియో చూడవలయునని సమ్మోహనాస్త్రప్రాయమగు తన ఛద్మవేషమునువైచుకొని చాటుగ వారివెనుకనే బయలుదేరెను. బండి కుముద్వతీనదివడ్డకును బోయెను. దారిపొడుగునను పోలీసువారనేకులుండిరి. వారిలోనెవ్వరు నా బండినిగూర్చి యిదేమని యడుగలేదు. బండి యొకవంతెన మీఁదినుండి యావలకుఁ బోవచ్చునని యూహించి విశలుఁడొకనోనెమీఁద నా నదినిదాఁటి యా బండివచ్చుటకు ముందుగనే వారి నిర్ణీతస్థలమగు స్మశానమునొద్దకుఁబోయి యొక చెట్టుచాటునఁగూర్చుండి చూచుచుండెను. ఆ స్మశానపు దిబ్బమీఁదికి బండికూడ వచ్చినిలిచెను. వారక్కడనున్న కావలివానిని జూచి యాతనితో రహస్యముగామాటాడి యా పెట్టెను బండిలోనుండిదింపి యొక మందిరమునందుంచి వెడలిపోయిరి. విశలుఁడు మాత్ర మక్కడనే కూర్చుండియుండెను.

# ఇరువదిరెండవ ప్రకరణము

మాధవుఁడు మొదలగువారు వెడలిపోయిన పిమ్మట విఠలుఁడు కాటికాపరియొద్దకుఁబోయి “ అయ్యా ! ఇప్పుడు వచ్చినవార లీమందిరమునందుంచిపోయిన దేమి ? ” అనియడిగెను.

ఆ మాటలను విన్నతోడనే యాకాటికాపరి కాలుసేతులు గడగడవడంకెను. ఆతఁడు రాక్షసునివలె దీర్ఘదేహియు, క్రూరాకారుఁడును, దుర్ముఖుఁడునై యుండెను. ఆ పెట్టెవిషయమునఁ దనమనసు దీరినంతధన మాతనికి లభించెను. అందువలన నా రహస్యము నొక యాగంతకునకుఁ దెలియఁజేయుట కాతని మనసొప్పినదికాదు. అందువలన నాతఁడు బొమముడిపాటుతో “ ఈ విషయమునుగూర్చి యడుగు నధికారము నీకు లేదు. వెలుపలకుఁబొమ్ము ” అని గద్దించిపలుకుచుఁ గుడిచేతితో విఠలుని ఱెక్కఁబట్టుకొని యెడమచేతితో నాతనికుత్తు కర్ధచంద్రప్రయోగముఁజేసి యామందిరమునుండి యావలకుఁ గెంటివేయఁబోయెను. అంతలోననే విఠలుఁ డాపట్టును జటాలున విడిపించుకొని తనజేబులోనున్న పిస్తోలును దీసి యా మనుష్యునకుఁజూపుచు “ నీవు చాల మంచివానివలె నగపడుచున్నావు. నీ కీరహస్యమంతయును దెలియును. ఇప్పుడు నేనడుగు ప్రశ్నల కుత్తరమిచ్చెదవా ? లేదా ? ” అనియెను.

కాటి : నేనుచెప్పను.

విఠలుఁడు తనజేబులోనున్న యినుపసంకెళ్లను పైకిఁదీసి యాతనిచేతులకుఁ దొడుగుటకై ప్రయత్నించెను.

కాటి : ( వడఁకుచు ) స్వామీ ! మీరెవ్వరు ?

విర : గుర్తు తెలియదా ? నేనొకయధికారిని. (Officer) ఇప్పుడు నా ప్రశ్నలకు నీవు తగినసమాధానములు చెప్పకున్నచో నిన్నిక్కడను బంధించి చెఱసాలలో నుంపించెదను.

కాటి : ఇప్పుడు మీరు నాయొద్దఁ దెలిసికొనవలసినదేమి యున్నది ?

విర : ఆ మనుష్యు లెవ్వరు ?

కాటి : వారెవ్వరో నాకుఁదెలియదు.

విర : ఇంతకుఁబూర్వము నీవు వారినెప్పుడును జూడలేదా ?

కాటి : వారిలోనొక్కని నీ మధ్యాహ్నముననె చూచితిని.

విర : వారికి నీతో నేమిపనియున్నది ?

కాటి : అతఁ డీరాత్రి యొక పెట్టెను, శవమునుదెచ్చి యిక్కడ నుంచెదననియు, నన్ను దానిని పూడ్చవలసినదనియు, అందులకై నాకుఁ గావలసినంతద్రవ్యము నిచ్చెదననియుఁ జెప్పినాఁడు.

విర : అట్లే చేసెదనని నీవొప్పుకొనియున్నావా ?

కాటి : అవును. ఒప్పుకొంటిని. కాని, దానివలన నేమియు నపాయములేదని నేను నమ్మియుంటిని.

విర : ఎవ్వరిశవమునో, సన్నిహితులుకానివారు రహస్యముగాఁ బూడ్చుట న్యాయవిరుద్ధమని నీకుఁ దోఁచలేదా ?

కాటి : లేదు. ఇంతేకాక యది యొక సాంక్రామికరోగము (Contagions) వలనఁ గలిగిన మరణమని నేనూహించితిని.

విర : ఆ శవము నెక్కడనుండి తీసికొనివచ్చినారు ?

కాటి : నాకుఁదెలియదు.

విర : నే నాపెట్టెలోనున్నదానిని జూడవలసియున్నది. నడువుము. ఆ పెట్టెయున్నగది తెలుపుము.

ఆ పెట్టె యొకచిన్నగదిలో భద్రపఱుపఁబడి యుండెను. ఆ గృహము పెద్ద సత్రమువలె విశాలముగనుండెను. దానిలో నెన్నియో గదులుండెను. ప్రేతకర్మాదులను జేయుటకును, శవముతో

వచ్చినవారికి గాలి, వాన, యెండ మొదలగుబాధలు కలుగకుండుటకును, అనుకూలముగ నుండులాగున నెవ్వరో పుణ్యాత్ములు వేలకొలఁది రూపాయలను వెచ్చించి దానిని గట్టించియుండిరి. కావలివాఁడు గదితలుపును దీయుటకుఁ బోయెను. అతఁడు విఠలుఁడు చెప్పినపని నతివినయభావముతోఁ జేయువానివలె నగపడియెను. తలుపు తీయుట తోడనే వేగముగ విఠలుఁ డాచిన్నగదిలోనికిఁ బోయెను. విఠలుఁ డాపెట్టెను బరీక్షింపవలయునను సంభ్రమములో మునిఁగి తాను లోపలనుండుటననియు, కాటికాపరి వెలుపలనుండెననియు, నాతనివలన దనకేదైన నపాయము రావచ్చుననియుఁగూడ దలంపనేరఁడయ్యెను. పెట్టెకుబిగించిన మేకులను మెల్లగ నూడఁదీయుచుండెను. అంతలో నాగదితలుపు మూయఁబడి పైని తాళమువేయఁబడిన చప్పుడయ్యెను. విఠలుఁ డాచప్పుడును విని వెనుకకుఁ దిరిగి చూచెను. అది సామాన్యపుఁ దలుపుకాదు. యంత్రిబల్లచేఁ జేయఁబడినదగుటచేఁ గొడ్డలిచేఁగూడ బద్దలుకొట్టుట కసాధ్యమైనంత బింకముగా నుండెను. అదిగాక విఠలునియొద్ద నెట్టియాయుధమును లేదు. అంతేకాక యాతలుపున కినుపరేకు కూర్పఁబడియుండెను.

విఠలుఁ డిప్పుడు కృత్రిముఁడగు నా కావలివానిచేఁ దనకుఁ గలిగిన దురవస్థను దెలిసికొనియెను. ఎన్నియోసారులు కేకలువైచెను. ఆ గదికి గవాక్షములు లేనికారణమును, గోడలు దళముగ నుండుట చేతను, అతనికంఠధ్వని యందే యడఁగిపోవుచుండెనుగాని పైకివినఁ బడుటలేదు. ఇప్పుడా కావలివాఁ డెక్కడకో పాఱిపోయి వుండవచ్చును. మరల నాగదితలుపు తీయుట యేకాలముననో!—అంతవఱకు నందే యున్నచో విఠలునిగతి యేమగును? ఇప్పుడాతనికి నేలను ద్రవ్వి పైకివచ్చు నుపాయమొక్కటియే యున్నది. కాని, యానేలమీఁద ఱాతిపలకలు పఱుపఁబడియుండుటచే నందులకుఁగూడ నావకాశము కలుగలేదు.

విశాలునకిప్పుడు ప్రాణాపాయచింతసంభవించెను. అతని కేమి యును తోఁచలేదు. తనజీవనాంత్యాధ్యాయమున కిదియే సమాప్తి మంగళమని గ్రహించి యాతఁడక్కడనే తలమీఁదఁ జేతులుంచుకొని చింతింపసాగెను. కొంచెపుసేపటికి మరల నించుక ధైర్యమును దెచ్చుకొని "కానిమ్ము. నేనిక్కడకు వచ్చినకార్యమును బూర్తిచేసికొనియెదను. పెట్టెలోనున్నశవ మెవ్వరిదైనదియుఁ జూచినపిమ్మట వెలుపలకుఁ బోవుట కేమైన నుపాయమున్నదేమో యాలోచించెదను" అని యనుకొని తనయొద్దనున్న చేతిలాంతరును వెలిగించి యక్కడఁబడి యున్న యొకకత్తిసాహాయ్యమునను, తనయొద్దనున్న చురియమూలమునను జాలఁగష్టముతో నాపెట్టెమూతను దెఱచెను. దానిలోపలకు లాంతరునుంచి చూచునరికి—అతిభయంకర ప్రదర్శనము ! అతిసంతాపకర ప్రదర్శనము —— అతనికన్నులఁబడియెను. వారణాతిలకసుందరుల దేహము లాతని కగపడియెను.

ఆ పాపాత్ముఁ డీశవములను పెట్టెయందుంచి తీసికొనిపోవుచుండుటను మన విశాలమూర్తి చూడకున్నచోఁ దిలకసుందరీవారణులకే మైనదియుఁగూడ నెవ్వరికిని దెలిసియుండకయే పోవును—విశాలుఁ డాశవములవైపునకుఁజూచి "ఓహో ! ఇదేమి ! రెండుహత్యలా ? కాక, రెండును ఆత్మహత్యలేనా ?" అని తనలోఁదానే యనుకొనుచుఁ జాల సేపటివఱకునా దేహములను బాగుగఁ బరీక్షించిచూచెను. తుదకది జంటగాజరిగిన యాత్మహత్యయేయని నిశ్చయించుకొనియెను. పిమ్మట, "ఇది భయంకరవ్యాపారమే ! అయినను నౌకాధ్యక్షుఁడగు పల్లవుని కష్టము తొలఁగిపోయినది. ఆమె యింకను బ్రదికియున్నచో, పెద్ద మనుష్యుఁడగు పల్లవుని పెంపుడుకూఁతు రిట్టిదని యందఱకును దెలియ వలసివచ్చును. అయ్యో ! ఆమె తానుచేసిన యపరాధముల నన్నిటి నొప్పుకొనియున్నచో నెంతబాగుగ నుండును ! కాక వారణునిముం దేమైన నొప్పుకొన్నదేమో ! బహుశః ముద్రవైచిన యాకవరలో నా సంగతులేవైన నుండియుండునేమో !" అని యనుకొనుచు మరల

నాపెట్టె నెప్పటియట్ల మూసివైచి పిమ్మటఁ దాను వెలుపలకుఁ బడుట కేమైన నవకాశ మున్నదాయని యాగదియంతయు నటునిటు తిరుగ నారంభించెను. ఆ చేతిలాంతరుతో మూలమూలలఁ బరీక్షించిచూచెను. ఆగది వెనుకభాగమున నొకపెద్దఱాతిబండ యుండుటయును, దానిని జేరి, యొక్కరైలుబాటయుండుటయును వితలునకుఁ జ్ఞప్తికివచ్చెను. ఏవిధముగఁజూచినను వెలుపలకువచ్చుటఁ జాల నసాధ్యముగా నగపడుచుండెను. తుదకక్కడనున్న కఱ్ఱతో నేలమీఁదఁబఱచిన ఱాతిపలకల నొకవైపునుండి మీఁదికిఁ బెల్లగించి చూచుచుండఁగా నొకమూల గోడక్రింద నేల గుల్లదేరినట్లుగ ఓటిచప్పుడువినఁబడియెను. కాని, యక్కడఁబఱుపఁబడిన ఱాతిబండ చాలఁ బెద్దదిగానుండెను. మఱియు దానిమూలలనదికిన సిమెంటు బహుభద్రముగా బిగిసికట్టివారియుండెను. అందువలన నాఱాతి నెత్తుట కెట్టియుపాయము నగపడలేదు. అయినను, తాలిమిలోనసే పుట్టిపెఱిఁగినవితలుఁడు తనచురియతో నాఱాతి కొక పలకవైపున సందులకంటించియున్న సిమెంటును కొంచెముకొంచెముగాఁ బెకలించి తీయుచుఁ దుదకు దానిని పెద్దసందుచేసెను. సులభముగాఁ, గట్టిమైన ప్రవేశించుట కనుకూలముగానుండెను. అప్పుడాకట్టిమైన సాహాయ్యమున నించుమించుగ రెండంగుళములలోతువఱకు నామూలను బెల్లగించెను, పిమ్మటఁ దనయావచ్ఛక్తిని వినియోగించి చేతులతో బలముగాఁబట్టి యాఱాతిబండను బైకెత్తి "సెబాస్ ! ఈశ్వరకృపయెట్లున్నదో ! నేను బ్రదికెదనో, చచ్చెదనో యిప్పుడు తెలియవలయును" అని యాతఁడనుకొనుచు మనసునించుక దృఢపఱచుకొనియెను. పిమ్మట నాలోపలకు జాగరూకతతోఁజూడఁగాఁ నచ్చట చౌకమగు నొకగోయియగపడియెను. ఆ లోపలికొకచిన్నఱాతిని విసరి చూడఁగా నది పదియడుగులలోతుగలదానివలెఁ దోఁచెను. లాంతరును లోపలికిఁద్రిప్పిచూడఁగాఁ గ్రిందనేరగపడలేదు. విస్తారముగా

బొమ్మ తోఁచుండెను. అందువలననది బావికాదని యాతఁడు విశ్వసించెను. దీపపు వెల్తురున దానిపార్శ్వములను జూచెను. రైలుబాటవైపున నున్న యొడ్డుమాత్ర మించుక మూసికొనిపోయియుండెను. ఆ చూపాతనికి మిగులఁ బ్రోత్సాహకరముగానుండెను. పిమ్మట నాతఁడాగోతిలోనికి దిగి మట్టితో దిగఁబడిన యా భాగమును దనకత్రమొనతోఁ ద్రవ్వుచుఁ జేతులతో నా మట్టిని పాయఁద్రోయుచుఁ బనిచేయసాగెను. ఈ పిమ్మట నొకనిశరీరము పట్టునంతటి వెడల్పున నొకకాలువదారి యేర్పడియెను. విశలుఁడు బహుప్రయాసతోఁ ద్రొక్కుకొనుచు బలవంతముగ నందుఁ బ్రవేశించెను. ఆ కాలువ యేటవాలుగ నుండుటచే భయపడి మరల లాంతరు నుపయోగించుకొనియెను. అట్టి తాతికాలువ నుండి యొకమనుష్యుఁడు దూరిపోవుట సులభమైనపనికాదు. మీఁదను గ్రిందను, పార్శ్వములనుగూడ సూదులవలెనున్న తాళ్లుండెను. అందువలన విశలుని బట్టలు చిరిగిపోవుటయేగాక యక్కడక్కడ నాతనిశరీరము గీచుకొనిపోవుటచే రక్తము చిమ్ముచుండెను. అధిక పరిశ్రమచే నాతనిదేహ మలసిపోయెను.

ఈ విధముగా శ్రమనొందుచు నించుమించుగఁ బదిమూరల దూరమువఱకు నాతఁడు డేకుచుఁబోయెను. అంతలోఁబిడుగుపడినట్లు లేనోయొక పెద్దచప్పుడయ్యెను. ఒక పెద్దబండతాయి జారివచ్చి తల మీఁదఁ బడుచున్నట్లయ్యెను. అప్పుడేమి చేయుటకేమున్నది? ముందు వైపున పదియేనుగులపెట్టున నొకబండతాయియుండెను. వచ్చుచున్న దారి యిరుకుగనుండుటచే వెనుకకుఁ దిరిగిపోవుటకుఁగూడ నసాధ్యముగా నుండెను. ఇంతలోఁ దలపై శిలాపాతము! అయ్యో! ఎంతకష్టము!

అయినను విశలుఁడు ధైర్యమునువీడక చేతియందున్న కత్తితోఁ దలమీఁద జారిపడుచున్న యా తాతిని క్రిందికిఁబడునట్లుగా నెంకెను. ఆతఁడు తన యావచ్ఛక్తిని వినియోగించి యా తాతి నావల

ప్రక్కకుఁ జిమ్మివైచుటకై ప్రయత్నించెను. దైవకృపవలన నా ఱాతిపై మఱెట్టిభారమును లేకపోవుటచేతను, అదియే గుట్టకుఁ బైభాగమగుటచేతను, ఆ ఱాయి పల్లపునేలకు దొర్లుకొనిపోయెను. అప్పుడు భూమి బీటలువారి క్రిందికి జారుచున్నట్లగపడియెను. ఆఱాయి ముందునకుఁ బడినప్పుడు పైనుండి చిన్నఱాళ్లతోఁగూడినమట్టి ఝల్లున క్రిందికిఁబడియెను. ఆ సమయమున విఠలుఁడు కన్నులుమూసికొనియెను. కొన్నినిమిషములైన పిమ్మట నాతఁడు కన్నులు తెఱచి తలయెత్తి చూచునరి కొకమూరవెడల్పున నాకాశమును, దానిపై నైదాఱు నక్షత్రములును నాతనికగపడియెను. అప్పు డాతని యానందమునకు మేరయుండునా ?

అప్పుడు తాను మరలఁ దల్లిగర్భమునుండి జనించితినని యను కొనుచు విఠలుఁ డాభూదేవిగర్భమునుండి యీవలఁబడియెను. అతఁడు నేలమీఁదఁ గూర్చుండి పావుగంటసేపటివఱకు జగదీశ్వరుని గూర్చి ధ్యానింపసాగెను. తాను కూర్చుండియున్న స్థలమునకు సమీపముననే రైలుబాటయుండెను. విఠలుఁ డక్కడనుండి లేచి యొక కాలిబాటను బట్టి బయలుదేరెను.

ఇఁక ముందానరహంతకులను బట్టి బంధించువఱకును తిలకసుందరీవారణులశవము లక్కడనే యుంచవచ్చునని యాతఁ డనుకొనియెను. తన్నాగదిలోనుంచి తాళమువైచిపోయిన యా కావలివాఁడు మాధవాదుల కీసమాచారము చెప్పుటకై ప్రయత్నింపఁజాలఁ డనియుఁ, దాను బ్రదికియున్నఁ జాలునని యాతఁడు దేశాంతరమునకుఁ బాఱిపోయి యుండుననియు నూహించుకొని యా విషయమున నిశ్చింతుఁడై యుదయ మాఱుగంటలవేళకుసరిగ విఠలుఁడు తన యాఫీసునకు వచ్చి చేరెను.

# ఇరువదిమూఁడవ ప్రకరణము

విశలుఁడు తన కార్యాలయమునకు వచ్చినంతోడనే వారుణుఁ డిచ్చిపోయిన కవరను విప్పి చూచుకొనియెను. దానియందు వారుణుఁడు తన పాపకృత్యములనన్నిటి నొప్పుకొని వ్రాసియుంచిన కాగితముండెను. చాలఁ గౌతూహలముతో విశలుఁడు దానిని జదువు కొనియెను. ఆ కవరయందే యా నిర్భాగ్యస్త్రీ తానుచేసిన నరహత్యలు మొదలగు పాపకృత్యములను, వనజచంద్రునకుఁ దానుంపుడుకత్తెయై జీవించుచున్న రహస్యమును, వివరముగా వ్రాసియుంచెను. కాని, కాంతనాథుని హత్యవిషయమై యేమి వ్రాయఁ బడియున్నదో తెలిసికొనవలయునని విశలున కాశ కలిగెను. విశలుఁడు నరేశుని వైపునకుఁ దిరిగి "నరేశా! నేను జన్మమెత్తినదాదిగ నెప్పుడు నెక్కడఁ జూడని ఘోరకృత్యములను గావించిన మహాపతివ్రతా శిరోమణియగు నా తిలకసుందరి తన నేరముల నొప్పుకొని వ్రాసిన యుత్తరమేయిది——" అనియెను.

నరే : అందేమి వ్రాయఁబడియున్నది?

విశ : ఆ యుత్తరమునే చదివినచో మేలుకాదా?

నరే : అట్లేచేయుఁడు.

విశ : చదివెదవినుము.

"ఇంతకుఁబూర్వము రెండువత్సరములవఱకు, నాకు భర్తగా నున్న వనజుఁడు తన తండ్రియగు చారుచంద్రునకుఁ బ్రేమపాత్రుఁడై యుండెడివాఁడు. అప్పుడెవ్వరును నన్ను లక్ష్యముచేసెడివారు కారు. నేను శాస్త్రోక్తముగాఁ బెండ్లియాడినదానను గాని కారణమున వారు నన్ను నీచముగాఁ జూచుచుండిరి. తుదకుఁ జారుచంద్రునకు వనజ చంద్రునిమీఁదనున్న ప్రేమ క్షీణింపఁజొచ్చెను. క్రమముగఁ జారు చంద్రుఁడు తన చిన్నకుమారుఁడగు కాంతనాథుని విశేషముగాఁ

ప్రేమింపనారంభించెను. ఆ కాంతనాథుఁడు తన తాతగారి వాత్సల్యమును సంపూర్ణముగా సంపాదించుకొన్న కారణమునఁ దాతగారి యొద్దనుండి యొక మరకతమంజూషను బుచ్చుకొనియెను. అది విశేషామూల్యమైన పేటిక—దానియం దనేకాద్భుత మహిమలును, ఇంకను గొన్నివిశేషములు నున్నవని లోకము చెప్పుకొనుచుండెను. కాని, యది యెవరియొద్దనుండునో, వారినే బలిగా గ్రహించితీరునని యొక ప్రతీతికూడనుండెను. ఆ మంజూషను దాను సంపాదించుకొన వలయునని వనజున కాశకలుగుటచే నాతఁడు కాంతనాథుని ద్వేషించుచుండెను. కాని, కాంతనాథుఁడు మాత్రము వనజునిపై నెట్టియసూయాభావమును బెట్టుకొనలేదు. అంతియెకాదు — వనజున కెంతటి యాపత్కాలముననైనవచ్చి యడ్డుపడుచుండెడివాఁడు.

నేను నా యౌవనమదమునకుఁ బరవశనై వేగిరపాటున జనకుని ప్రేమరత్నమును గోల్పోయి యాతని యాగ్రహమునకుఁ బాత్రురాలనైతిని అందువలన నాకాతఁ డపకారమునే చేయుచుండెను. వనజచంద్రునితల్లి పరదేశమునుండి చారుచంద్రునకొక యుత్తరము వ్రాసెను. ఆ యుత్తరమును వనజుఁడే చింపిచూచికొనియెను. అది తన ప్రాణమునకే మృత్యుస్వరూపమైనదగుట వనజుఁ డాయుత్తరమును జారుచంద్రునకుఁ జూపించుటమానివైచెను. పిదపనాతఁడు కాంతనాథ చారుచంద్రులను జంపింపవలయునని ప్రయత్నించెను. ఆ విషయమున నాతనికి నేనుగూడఁ దగినయుపాయములను జెప్పి యీ రహస్యము బయటపడకుండఁ జూచుకొనవలసినదని పలుమాఱు బోధించితిని. నా కనేకవిషముల స్వరూపములును, వానిని బ్రయోగించు విధానములును బాగుగఁ దెలియును. మఱియు మళయాళమంత్రములయందును, హస్తలాఘువాదివిద్యలయందును నేను కేవల మనుభవశాలిని. వీనివలన నే నెందఱినో మాడ్చివైచితిని-

కాంతనాథుఁడు నవనగరమునకుఁ బోయినప్పు డొకకోటీశ్వరుని కుమార్తెయు నత్యంతరూపవతియు నగు నొకకన్యకను గలిసికొనుట

సంభవించెను. అప్పుడాకన్యక నాతఁడు ప్రేమించి నిన్నునేను పెండ్లి చేసికొందునని యామెకు మాటయిచ్చెను. తనతండ్రి యొక్కయు, సోదరునియొక్కయు ననుమతికొఱకు కాతఁడా కన్యక ఛాయాచిత్రమునకై (Photo) నొక యుత్తరమును వ్రాసి యింటికంపెను. అనాఁడే వనజుని తల్లి తన మరణకాలమునఁ జారుచంద్రునకు వ్రాసిన యుత్తరముకూడ వచ్చియుండెను.

కాంతనాథుఁడు పెండ్లియాడ నిశ్చయించుకొన్న యా కన్యకను దానెచ్చటనో చూచినట్టుగా నున్నదని వనజుఁడు నాతోఁ జెప్పెను. ఛాయ చిత్రమును జూచునపు కాకన్యక వనజునకుఁ బరమాప్తుఁడైన భాస్కరునిభార్య యగు సౌదామిని నిచ్చముగాఁ బోలియున్నట్లగ పడియెను. సౌదామిని సహోదరుఁడగు మాధవుఁడు మాగుంపులో ముఖ్యుఁడుగా నుండెను. వీరందఱును ద్రవ్యాపేక్షకులోఁబడి మమ్ముఁజేరినవారే— ధనముదొరికినచో నెట్టి నీచకార్యములనైనఁ జేయుటకు వెనుదీయని కార్యశూరులు—అట్టి మేమందఱము నొక్కచోఁ జేరితిమి—

కాంతనాథుని జూడవలయునని యాతనితల్లి యుత్తరము వ్రాయుటచేఁ గాంతనాథుఁడు లలిత పట్టణమునకు వెనుదిరిగి వచ్చుచుండెను. ఆతఁడింటికినచ్చిన పిమ్మట, సావకాశముగఁ జంపువిషమును బ్రయోగించి మరల నాతని నవనగరమునకుఁ దీసికొనిపోయి, యక్కడ నాతని యిష్టానుసారముగఁ బెండ్లి చేయవలయు ననియు, పిమ్మట నా కన్యకను జంపివైచి యాస్థానమున నామెపోలియున్న సౌదామినిని బ్రవేశ పెట్టవలయుననియు, తరువాత నా కన్యక తండ్రియాస్తి కంతె కును సౌదామినియే యధికారిణి యగునట్లు చేయవలయుననియు మేము యోజించుకొంటిమి.

కాంతనాథుఁడు లలితపట్టణమునకు వచ్చెను. నేను సౌదామిని మాధవభాస్కరులతోఁ జేరి యాలోచించితిని. నేనా కాంత నాథునకును

జారుచంద్రునకును విషమును సిద్ధముచేసి యిచ్చితిని. కాంతనాథుఁడు క్రమముగ నానాఁటికానాఁడు కృశత్వము నందుచుండెను. ఆతనికి ఘనవైద్యులే చికిత్సఁజేసిరి కాని, యేమియును బ్రయోజనములేక పోయెను. మాధవ భాస్కరులు కాంతనాథునకుఁ బ్రాణసమానులుగ మసలఁజొచ్చిరి. క్రమముగ వారి కాతనితో మైత్రి దృఢమయ్యెను. ఆతనికి వారిపై మిగులవిశ్వాసము కలిగెను. అందువలన నాతఁడు తన హృదయమునువిప్పి వారికిఁ జెప్పఁచువచ్చెను. ఆతఁడు కొన్ని కార్యములలో వారి యిష్టానుసారముగ ,నడచుకొనఁజొచ్చెను. ఆలోపున నాతనికి రోగము వృద్ధియగుటచే సముద్రయానము చేసినచో నా రోగము శమించుననియు, ఇందులకై నవనగరమునకుఁ బోవుట మంచిదనియు మాధవ భాస్కరు లాతనికి బోధించిరి.

కాంతనాథుఁడప్పుడు నన్నుగాని సౌదామినినిగాని మూచియుండ లేదు. ఆతని కెట్టిసంశయమును గలుగలేదు. కాని, మాధవుఁడు నిత్యము నాతనికిఁ దప్పకుండ విషము నిచ్చుచునేయుండెను. తనగతి యీ విధముగా నున్నదని కాంతనాథుఁడు తాను ప్రేమించిన కన్యక కెఱింగింపలేదు. కాంతనాథమాధవభాస్కరులును, కాంతనాథుని సేవకుఁడైన హనుమంతుఁడును పడవలో నవనగరమునకు బయలుదేరిరి. నేనును సౌదామినియు మఱియొకపడవలో బయలుదేరితిమి. చారుచంద్రునిజంపుటకై వనజునిలలితపట్టణమునందే యుంచి వచ్చితిమి. కాంతనాథునియొద్ద మరకతమంజూషయుండెను. దానినాతఁడెప్పుడును దనయొద్దనేయుంచుకొని జాగరూకతతోఁ జూచుకొనుచుండెను. మాధవుఁడు కాంతనాథునకుఁ బ్రాణప్రియుఁడగు ముఖ్యమంత్రి యాయెను. నవనగరమునకు వచ్చినపిమ్మట వారొకగృహము నద్దెకుఁ

దీసికొనిరి. కాంతనాథుఁడు మాధవునిమూలమునఁ బ్రఫుల్లయొద్దకు వర్తమానమంపెను. తన్ను శీఘ్రముగాఁ బెండ్లిచేసుకొనవలయునని యామెను ప్రార్థించెను. అందులకామె యొప్పుకొనియెను.

అప్పుడు కాంతనాథునిశరీరమున శక్తి యేమియును లేదు. ఆతఁడు బలహీనుఁడై పోయెను. ఆనాఁడికిఁ గొన్నిగంటలకంటెఁ దానెక్కుడుకాలము జీవింపఁజాలనని యాతఁడు తెలిసికొనియెను. మాధవభాస్కరు లెక్కడకో పోయియున్నసమయమునఁ గాంతనాథుఁడు తన సేవకుఁడగు హనుమంతునిచేతికొకయుత్తరమును, మరకతమంజూషయు నిచ్చి యా ప్రఫుల్లయొద్దకుఁ బంపించెను. ఈసంగతి యాతఁడు గతించినపిమ్మట మాకుఁ దెలియవచ్చినది. ఆనాఁడు చీఁకటిపడెను. ఆతండంతదుర్బలుఁడై యున్నను మాధవభాస్కరులతో గుఱ్ఱపుబండిలోఁ బోయి ప్రఫుల్లను బెండ్లిచేసుకొనియెను. ఇంచుమించుగ నొంటిగంటకు లోపలనే ప్రఫుల్లతక్క నందఱును వెనుదిరిగివచ్చిరి. వచ్చునప్పుడు త్రోవలో బండియందే కాంతనాథుఁడు మరణించెను.

అంతవఱకు నేనును సౌదామినియు మఱియొకగృహమున నుంటిమి. అప్పుడు మమ్ములను మాధవభాస్కరులు తాామున్నయింటికిఁ బిలిపించుకొనిరి. కాంతనాథునిశవము గృహమునకు వచ్చినప్పుడు మేమునక్కడకువచ్చితిమి-కాంతనాథునిదేహమప్పటికించుక వెచ్చగ నుండెను. నాడికూడ మిగులదుర్భరముగా నగపడుచుండెను. ఆ గృహమునకుదొడ్డివైపున లోతగుకాలువయొకటియుండెను. ఆకాలువ నుండి యెల్లప్పుడును నీరు ప్రవహించుచుండెను. కాంతనాథునిదేహము నందులోఁ బాఱవైచినచో నది సముద్రములోనికిఁ గొట్టుకొనిపోవునని భాస్కరుఁ డాలోచనఁజెప్పెను. ఆ ప్రకారముగనే యాతనిదేహము నా కాలువలోఁ బాఱవైచితిమి."

ఆ యుత్తరమునం దింకను దిలకసుందరి తానొనర్చిన యితర హత్యలతోఁబాటు వారణలాలుని జంపువిషయమునఁ దాను మాట యిచ్చుటయు, తానాతని బ్రేమించునట్లుగ నటించి యాతని వలపించుటయు, తనతండ్రి డియగు పల్లవుని జంపుటయు, ఆతని శవమును బాఱ వేయుటకై తాను మాధవభాస్కరుల నియోగించుటయు మొదలగు సంగతులు విశదముగ వ్రాసియుండెను.

వారణుని యుత్తరమున విశేషాంశము లేవియును లేవు. ఆతఁడు తానంతకుఁ బూర్వము చేసిన కార్యములనుగూర్చి వ్రాసి ముందెప్పుడైనఁ దనసోదరి యగపడినచోఁ దనయాస్తియంతయు నామెకుఁజెందునట్లు చేయవలయునని విశలమూర్తిని బ్రార్థించియుండెను.

నాగేశునివాఙ్మూలమున, వనజచంద్రుఁడు న్యాయమైన వారసుఁడని వచ్చినయుత్తరములు, ఇంక నితరసాధనములు నిష్పాపుఁడని విశలుని ప్రయత్నములకుఁ జాల సాహాయ్యముగనుండెను. వానినన్నిటిని విశలుఁడు జాగ్రతపెట్టి లలితపట్టణముననున్న పత్తేదారుని యుత్తరమునకై యెదురుచూచుచుండెను.

ఇంతలో వనజచంద్రుఁడు నవనగరమునకు వచ్చెనని విశలునకుఁ దెలిసెను. అప్పుడాతనికిఁ గలిగినసంతోషమునకుఁ బారమే లేకుండెను.

విశ : నటేశా ! ఇప్పు డేమిచెప్పెదవు ? నే నీనేరమును విడిచిపెట్టకుండ సాధించుట మేలైనదికాదా ? చూడుము ! ఈ వఱకు నా ప్రాణమున కేమియు నపాయము సంభవింపలేదుగదా ?

నటే : విశలా ! ఈ మాత్రమునకే సంతోషింపకుము. ఆపాడు పెట్టె యింకను నీయొద్దనే యున్నది—ముందేమి జరుగనున్నదో యెవ్వరెఱుఁగు ? ఏమైననుసరే—ఆ పెట్టెను నీవు నీయొద్దనుంచుకొనఁ గూడదని నేను చెప్పుచున్నాను—

ఇట్లు మాట్లాడుచుండఁగా నొకసేవకుఁడు వచ్చి యొక తంతి వార్త నిచ్చెను. విశలుఁడు దానినందుకొని విప్పి చూచి "ఓ విశల మూర్తి! వనజచంద్రుఁడును, ఆతనిప్రియురాలును, సౌదామినీమాధవ భాస్కరులును, అక్కడనే చేరియున్నారు-చారుచంద్రుని హత్య విషయమున నాద్రోహులనందఱను బట్టి బంధింపవలయును. వారు విషప్రయోగము చేసి చారుచంద్రునిఁ జంపిరని చెప్పుటకుఁ దగిన నిదర్శనములు సిద్ధముగా నున్నవి-సుశీలుఁడు." అని చదివెను.

విశలుఁ డత్యానందముతోఁ గుర్చీనుండి లేచి యిటునటు తిరుగుచు "ఇఁక మనము ముందున కడుగిడవచ్చును. ఇప్పుడీ నాటకము నకుఁ దుదియంకము ప్రారంభమైనది. ఆ దురాత్ములందఱును మన వలలోఁ జిక్కికొనిరి. నాకుఁ గావలసినవన్నియు సిద్ధముగా నున్నవి. ఇఁక వారినిఁబట్టి బంధించెదను," అనియెను.

వజే : ఎట్లు?

విశ : సౌదామిని రేపు చారుచంద్రుని మరణమునకై వైకుంఠ సమారాధనము చేయింపఁబోవుచున్నది-పదివిధములగు భక్ష్యములు సిద్ధముచేయించునఁట! ఈ పట్టణమునందున్న పెద్దమనుష్యులకందఱకును, ప్రఫుల్ల స్నేహితురాండ్రకును, ఆహ్వానపత్రికలను వ్రాయించి పంపించియున్నది-మేనమామనగు నాకును, పత్తేదారుడనగు నీకును మాత్ర మా విందున కాహ్వానపత్రిక రాదు. అక్కడకు గొప్ప యుద్యోగస్థు లనేకులు వచ్చెదరు. సామాన్యముగా వైకుంఠ సమారాధనమునందట్టివారు భోజనమునకు వచ్చుటయరుదే-కాని, వారణలాలుని గృహమున నెట్టిసమారాధనము జరగినను, ఆ గృహ మర్యాద ననుసరించి పట్టణమునందలి గొప్పవారందఱును దప్పక విచ్చేయుదురు. ఇంతియె కాక ప్రఫుల్ల మహాగుణాఢ్య యనియు, సుశీల యనియు లోకమందఱు నెఱింగినవిషయమే-ఈ సమారాధన మామెయే చేయించుచున్నదని జనులు భావించుచున్నారు. కావున నందఱును వచ్చితీరుదురు.

నటే : అప్పుడు నీ వా దురాత్ములను బట్టి బంధించెదవా ?

విర : అవును. అంతియెకాదు. మరణించినవారు మరల బ్రదికి వచ్చిరను నాశ్చర్య మూ యతిథులకుఁ గలిగించి యా వ్యక్తులను వారికిఁ బ్రత్యక్షముగాఁ జూపించెదను. అప్పు డా పాపాత్ము లన్యాయముగా హత్యచేసిరని చెప్పి యా పెద్దమనుష్యులయెదుట నీసంగతుల నొప్పించెదను.

నటే : ఇది నాకుఁ జాలభయంకరముగా నగపడుచున్నది.

విర : ఆ రంగస్థలమున నెట్లుజరుగునో యూహించుకొనుటకుఁ గూడ శరీరము వడఁకుచుండును—కానిమ్ము. నేను కొలఁదికాలములో మా యూరికిఁ బోయివచ్చెదను. నీవువారిని బంధించుటకుఁ దగిన సన్నాహములోనుండుము. అందులకుఁ గావలసిన యేర్పాటుల నన్నిటిని గావింపుము.

అని చెప్పి పదునాలేండ్లబాలునికంటెను జురుకుగనడచి రైలు స్టేషనునకుఁబోయి యక్కడనుండి విరలుఁడు తన జమాగీబుగ్రామమున కేగెను.

నౌకాధ్యక్షుఁడగు పల్లవునకు సంపూర్ణారోగ్యము కలిగెను. ఆతఁడును, ప్రఫుల్లయు, విరలుఁడును, ఆనాఁడు తాలూకాగ్రామము నుండి విరలుని యింటికివచ్చిన యా నూతనతరుణుఁడును నత్యుల్లాసముతోఁ గాలక్షేపము చేయుచుండిరి. పల్లవునకు నా తరుణునకు విశేషమైత్రికలిగెను. అక్కడ వారు మొదట నొకరికొకరు చూచి కొన్నప్పుడుకూడఁ బరస్పరము క్రొత్తవారివలె నగపడలేదు. ఆ యువకుఁడు తనహృదయమును బ్రఫుల్ల యధీనముచేసివైచెను. ఆమె దానినెంతయో జాగరూకతతోఁ జూచుకొనుచుండెను.

విరలుఁ డక్కడనుండిపోయి చాలదినము లయ్యెను. ఆతని యొద్దనుండి విశేషాంశములెవ్వియైనఁ దెలిసికొనవలయునని యా

ముప్వురకును గౌతూహలముగానుండెను. భోజనములైనపిమ్మట విశలుఁడు వారందఱితోడ నొకగదిలోఁ గూర్చుండి జరగినసంగతులతోఁ బాటు తిలకసుందరీవారణుల మాత్మహత్యలనుగూడ వివరముగఁ దెలియఁజేసెను. పిమ్మట "రేపు మీరందఱును నవనగరమునకు రావలయును. అక్కడ నటేశుఁడు చెప్పినచొప్పున నడచుకొన వలసియున్నది. నేనెప్పటివలె వాగీశునివేషముతోఁబోయి వారి యింటి యొద్దనుండెదను. నటేశుఁడు మిమ్ముల నక్కడకుఁ దీసికొనివచ్చును. సమయమునచ్చినప్పుడు మీ రెవ్వరైనదియు నేను ప్రకటించెదను" అనిచెప్పెను.

ప్రఫుల్ల తనసహోదరుఁడగు వారణలాలుని దుర్మరణమునకై చాలదుఃఖించెను. పల్లవుఁడు తనపెంపుడుకూఁతురు మరణమును గూర్చి విన్నంతనే "జగదీశ్వరుఁ డింతవఱకు నన్ననుగ్రహించినాఁడు. ఆ పాపాత్మురాలి నీ లోకమునుండి తీసికొనిపోయి నా హృదయమునకు నెమ్మదిగూర్చినాఁడు—" అని సంతోషించుచుఁ బరమాత్మున కనేకవందనముల నాచరించెను. విశలుఁడు చెప్పుచున్నదంతయు నా తరుణుఁడు శాంతభావముతో వినుచుండెను. విశలుఁ డాయువకుని పేరు కులచంద్రుఁడని యీవఱ కందఱియెదుటను జెప్పుచున్నాఁడను సంగతి మా పాఠకు లెఱింగియేయున్నారు. ఇప్పు డాకులచంద్రుఁడు విశలుని చేతులను బట్టుకొని "అయ్యా! నీవు మా కొఱకింతకష్టపడి చేసిన యీ ఘనకార్యమునకు — ఈ యుపకారమునకు మేమెన్ని జన్మములు మీ సేవకులమైనను నీ ఋణముతీరదు" అనియెను.

విశ: మీరేమియు నాకీయనక్కఱలేదు. మీ కృతజ్ఞతయు, అన్యాయమునడంచి న్యాయమును బాలింపఁగలిగితినను నా విశ్వాస మును—ఈ రెండును నాకుఁ దృప్తియను నమూల్యబహుమానము నీయఁగలవు—నాకంతకంటె నేమికావలయును!

ప్రఫు : విశలా ! నేను నా జనకునెఱుంగను. నీవే నా జనకుఁడవు——

విశ : బిడ్డా ! అట్లేకానిమ్ము. ఇదివఱకు మీ మేనమామ వేషమును ధరించియుంటిని. ఇప్పుడు నీ జనకునిగానవలె ననుచున్నావా ?

అని చెప్పి నవ్వుచు విశలుఁడామెను సంతోషపఱచెను. పిమ్మట "నేను ముందుగ నవనగరమునకుఁబోయెదను. మీరందఱును నా కార్యాలయమునకుఁబోయి నేనుచెప్పినట్లు నడచుకొనుఁడు" అని చెప్పెను.

విశలుఁడు నవనగరమునకు బయలుదేరిపోయెను. ప్రఫుల్ల తనసోదరుని జ్ఞప్తికిఁదెచ్చుకొని మరల దుఃఖింపసాగెను. అప్పుడు కుఱుచంద్రుఁ డామెనూఱడించి యామెకు సంతోషముగనుండు మాటలను జెప్పసాగెను.

# ఇరువదినాలుగవ ప్రకరణము

సౌదామిని—చారుచంద్రుని మరణమునకై — కాదు. కాదు, వనజచంద్రుఁడు లలితపట్టణమునుండి వచ్చినందులకై యేర్పఱచిన సంతర్పణమే యిదియని నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఇదియే యామె హృదయాశయము. సమారాధనము చేయుదినము బహునిర్మలముగానుండెను—నిశ్చయముగ నది సుదినమే—

విశలుఁడు సరియైనవేళకుఁ బిడుగువలె నక్కడకు వాగీశుని వేషముతో వచ్చి వ్రాలెను. ఆతని ముఖమునుజూచినతోడనే మాధవభాస్కరుల కనిర్వచనీయమగు సంతాపముదయించెను—అనుకొనుటకును, అనుభవించుటకును వలనుగాని యాతన—వాగీశుని మొగము చూచుటతోడనే వారలకింత కష్టమెందులకో ? సౌదామినీ మాధవులు వచ్చి వాగీశునిఁ గపటోపచారములచే సంతసింపఁజేసిరి. పిమ్మట మాధవుఁ డొకపరిచారకునిఁజూచి మాటాడుచుండుటను విశలుఁడు కనిపెట్టెను. ఆ పరిచారకుఁడు తమిళదేశస్థుఁడు.

మాధవుఁ డాతని చెవిలో రహస్యముగా నేమియో చెప్పి యొక కాగితపుఁబొట్లము నాతని చేతికిచ్చి తాను మఱియొక గదిలోనికి వెడలిపోయెను. విఠలుఁడు పుణ్యవశమున నా రహస్యమును గనిపెట్టెను. పరిచారకుఁ డాకాగితపుఁబొట్లములోని పొడినిదీసి కొంచెము నీటితోఁ జేర్చి యొక గిన్నెలోఁబోసి కలుపుచుండుటను వంటయింటి గవాక్షము గుండ కనుఁగొని యెవ్వరికో విషప్రయోగము జరుగుచున్నదని విఠలుఁడు గ్రహించెను. దీని నెవ్వరికిచ్చెదరో చూడవలయునని యోజించుచుండఁగనే యా పరిచారకుఁడువచ్చి "స్వామీ! ఎండలో నలసివచ్చినారు. చల్లని యీ పానకమును గ్రహింపుఁడు" అనియెను.

విఠ : ఓరీ! తమిళా! నీ దుర్విద్య నాకుఁ దెలియును. నాయొద్ద నీకుయుక్తులుసాగునా?

మేధావియగు నా తమిళుఁడు కొంతకాలము విఠలునియొద్దఁ బరిచారకుఁడై యుండుటచేత నా కంఠస్వరమును వినినంతనే చేతిలోని గిన్నె నక్కడనే యెత్తివైచి "అయ్యో! ఇంకేమిగతి! ఈతఁడు విఠలమూర్తి!" అని యేడ్చుచుఁ బరువెత్తసాగెను.

విఠ : ఓరీ! ఎక్కడకుఁబోయెదవు? నిలువుము. నీవు నావెను వెంటనేరావలయును.

తమి : అయ్యో! నన్నేమిచేసెదరు?

విఠ : రమ్ము. ఒకచోటికిఁ బోవలసియున్నది. రమ్ము.

తమి : నే నాపెద్దమనుష్యునితో నొకనిమిషము మాటాడి రావచ్చునా?

విఠ : ఎవ్వరితోడను మాటాడఁగూడదు.

తమి : మీ యాజ్ఞాప్రకారమే వచ్చెదను.

విఠలుఁడు పెరటిగుమ్మమునొద్దనుండి వానిని దీసికొనిపోయి యొకయుద్యోగస్థున కొప్పగించి జాగ్రత్తగఁ జూచుచుండుమని చెప్పెను.

నటేశుఁడు శ్లాఘాపాత్రముగ నన్నియు నేర్పాటుగావించెను. గృహమునకు లోపలను, వెలుపలను, అధికారులు భోజనమునకు వచ్చిన యతిథులవలె వేషములను వైచుకొని నిండియుండుటచే నా ప్రదేశములలో నొక్కరైనఁ దప్పించుకొనిపోవుట కవకాశము లేకుండ నుండెను. విందునకు వచ్చువారందఱును మనోహరములగు వస్త్రాలంకారములతోఁ దండతండములుగ నా గృహమునకు వచ్చుచుండిరి.

సౌదామినియు సొంపుగ్రుంతెఁగవలె నటునిటు దిరుగుచు "ఇత్తి మీఁదఁ గన్ను-అంగడిమీఁదఁజూపు" అనుసామెతగఁ బురుషులపై గటాక్షమాలికలఁ బ్రసరింపఁజేయుచుండెను : స్త్రీలతోఁ బయ్యాగ మాటాడుచుండెను ; మాధవభాస్కరుల రహస్యాలోచనములకుఁ జెవియొగ్గుచుండెను. ఈ విధముగ నామె సమ్మోహనాస్త్రమువలె నాయింటఁ గ్రుమ్మఱుచుండెను. ఇఁక నొకగడియలోఁ దమగతి యేమి కానున్నదోయని యా ముప్పురిలో నొక్కరును దలంపనేరరైరి.

అతిథులందఱును వచ్చినపిమ్మట నటేశుఁడు విఠలునకొక చీటిమూలమున "రావలసినవారందఱును వచ్చిరి. మరకతమంజూషతో సాక్షినిదర్శనములు సిద్ధముగానున్నవి" అని తెలియఁజేసెను. విఠలుఁ డాచీటిని దెచ్చినవానినిజూచి "అయ్యా! ప్రతిద్వారమునందును బలమైన కావలినుంచవలయుననియు, నేను వర్తమానమంపిన తోడనే యా జనులను లోపలకుఁ దీసికొనిరావలయుననియు నటేశునితోఁ జెప్పుము." అని మరలఁ బ్రత్యుత్తరమునంపెను.

విఠలుఁడు వెనుకవైపుగదియందు శిలావిగ్రహమువలె నిశ్చలుఁడై నిలుచుండి నటేశునియుత్తరమునకై నిరీక్షించుచుండెను. ఆ చీటికూడవచ్చెను. వెలుపలఁ బ్రఫుల్లమొదలగువార లంగరక్షకులతో నుండిరని విఠలునకుఁ దెలియవచ్చెను. విఠలుఁడు తనకృత్రిమవేషమునకై గట్టుకొనియున్న గడ్డముమొదలగువానిని దీసివైచి ద్వారము

నై పునకుఁదిరిగి చేసన్నఁజేసి ప్రఫుల్లనుబిలిచెను. ప్రఫుల్ల తనతో నున్నజనులతో లోపలఁబ్రవేశించెను. అప్పుడు విశలుఁడు వారితో నడిమిహాలునకుఁ బోయి నిలుచుండి సింహగంభీరగర్జనములతో "మహాత్ములరగు నోస్త్రీపురుషులారా! ఇప్పుడు మీకు మహా సాహసికప్రవర్తకులును, నరహత్యాపాతకులునగు దొంగలగుంపునకుఁ జిక్కుకొంటిరి. ఇదిగో! చూడుఁడు! మీ యాజ్ఞయైనచో లలిత పట్టణధనికుఁడగు చారుచంద్రుని యారపకుమారుని, ఆతని ధర్మపత్నిని మీకుఁ జూపించెదను—" అనియెను.

ఆ మాటనాలకించి విందునకు వచ్చినవారందఱు నాశ్చర్యపడ సాగిరి! "మరణించిన కాంతనాథుఁడు మరల బ్రదికి వచ్చుట యెట్లు? ఈ గృహమున విందుచేయుచున్న దాతని ధర్మపత్నికాదా!" యని వారు పలు తెఱంగుల మాటాడుకొనసాగిరి. అప్పటి స్థితిగతులను వర్ణించి వ్రాయుట యెట్టివారికినసాధ్యము. సౌదామినికూడఁ దన పోలికనేయున్న స్త్రీవ్యక్తినిజూచెను. వనజచంద్రమాధవభాస్కరులు కూడ నా పురుషమూర్తులను, స్త్రీమూర్తినిజూచి కాతరస్వరముతో "అయ్యో! భగవానుఁడా! విశలుఁడు చావనేలేదా? కాంతినాథుఁడు మరణింపనేలేదా? ప్రఫుల్ల యెక్కడనుండి వచ్చినది?" అని నిట్టూర్పులువిడువసాగిరి.

నారూహించినదె సత్యమే. కాంతనాథుఁడు మరణింపలేదు. ఆ పాపాత్ములాతని దేహమును గాలువలోఁ బాఱవైచిరిగదా! అప్పు డాదేహము కాలువనుండి సముద్రములోనికిఁ గొట్టుకొనిపోయెను. ఆ సమయమునకు సరిగ శ్రీమతీసౌకాధ్యక్షుఁడగు పల్లవుఁడొడ్డునుండి యొకపడవలోఁ దననౌకయొద్దకుఁ బోవుచుండెను. ఆతఁ డాకళేబరమును జూచి దానిని తన పడవమీఁదికెత్తుకొనియెను. అప్పుడా దేహమునం దింకను బ్రాణవాయు వతిసూక్ష్మముగా సంచరించుచున్నదని యాతఁడు కనిపెట్టెను. పల్లవుఁ డనేకవిధములగు విషములను,

వానికిఁ దగిన ప్రతీకారములను బాగుగ నెఱింగినవాఁడగుట, విష ప్రయోగముచేత నీతఁ డిట్లయియుండునని యూహించి, యందుల కనుకూలచికిత్సలను గావించెను. ఆ చికిత్సచేతఁ గాంతనాథుని శరీరము నందలి ప్రాణాగ్ని మరలఁ బురికొని ప్రజ్వలింప నారంభించెను. పల్లవుఁడప్పుడు తన శ్రమ సార్థకమైనదని మిగుల సంతోషమునందెను. కాంతనాథునకు మాటాడుశక్తి వచ్చిన పిమ్మట నాతఁడు తన చరిత్రమునంతయుఁ బల్లవునకు సవిస్తరముగ వినిపించెను. పల్లవుఁడాతనిఁ జారుచంద్రుని కుమారునిగఁ దెలిసికొనినపిమ్మట మఱియు విశేషానందము నొందెను.

కాంతనాథుఁడింకను దుర్బలుఁడై యుండెను. ఆతఁడు పల్లవునిఁ జూచి "నీవు నవనగరమ్మునందలి సుప్రసిద్ధాపరాధ రహస్యపరిశోధకుఁ డగు విఠలుసిపాయొద్దకుఁబోయి యీ సంగతులను జెప్పవలయును. నా ప్రాణేశ్వరియగు ప్రఫుల్లను, నామరకతమంజూషను జాగరూకతతోఁ జూచుచుండవలయుననియు, ఈ ఫిర్యాదు విచారణలోనికి వచ్చుటకుఁ దగిన సాధనసంపత్తిని సేకరింపవలయుననియు నామారుగ నాతనిఁ బ్రార్థింపుము" అని వేడికొనియెను.

పల్లవునిమూలమునఁ దెలిసికొనిన యీ రహస్యమును విఠలుఁ డిన్నాళ్ళవఱకు నతిశయప్రయత్నము దెలుపక గోప్యముగానుంచెను. నేఁడు ప్రత్యక్షముగ నీతఁడే కాంతనాథుఁడని యందఱకు జూపించిన పిమ్మట నీ రహస్యమును వెల్లడించెను.

ఆనాటిసాయంకాల మరణ్యామధ్యమున విఠలుఁడుచూచిన తరుణుఁడే కాంతనాథుఁడు. అంతకుబూర్వ మాతనిని విఠలుఁ డప్పుడును జూచియుండలేదు. ప్రఫుల్ల విఠలుని సంరక్షణమున సురక్షితయైయుండుటను గాంతనాథుఁడు రహస్యముగా దెలిసికొని యొకనాఁడు విఠలుఁడు లేకున్నప్పు డాపల్లెకుబోయి ప్రఫుల్లనుజూచి జరగినసమాచారమంతయు నామె కెఱింగించెను. పతి బ్రదికి

యున్నందులకుఁ బరమానందమునందుచుఁ బ్రఫుల్ల తనసౌభాగ్యమును గొనియాడుకొనసాగెను. ఈ రహస్యము విరలునకుఁ దెలుపఁగూడదని యా దంపతులు నిశ్చయించుకొనిరి. సూక్ష్మగ్రాహియగు విరలుఁ డీరహస్యమునుగూడ నిమిషములో భేదింపఁగలిగెను. విరలుఁ డాయువకు నకును ప్రఫుల్లకును బరిచయముసేయుసందర్భమునఁ బ్రఫుల్లతో "ఈతఁడు కులచంద్రుఁడ" ని చెప్పియుండెనుగాదా! అందుచే నాతని కాయువకుఁ డెవ్వరైనదియుఁ దెలియదనియు, అది తమకుఁ బ్రతిబంధకముకాదనియుఁ బ్రఫుల్ల భ్రాంతినందియుండెను. కాంతనాథుఁడు తనజనకుని దుర్మరణమునువిని మిగులవిచారించెను.

ప్రఫుల్లా కాంతనాథులకును, విరలునకును వెనుకనిలుచుండి యున్న పల్లవుని, శృంఖాలాబద్ధుఁడై యొకయుద్యోగస్థునివశమునం దున్న నాగేశుని, నాపాపాత్ములు చూచిరో యేమో! అప్పుడామాధవ ప్రభృతులు పాఱిపోవుటకై ప్రయత్నించిరి. కాని, వారు నిలిచియున్న స్థలమునుండి యడుగునకొక్కఁడువంతున నెందఱో యారక్షకులు, శృంఖములఁ జేతఁబట్టుకొని కాచియుండిరి. ఇఁక నాపాపాత్ములెక్కడకుఁ బాఱిపోఁగలరు?

విరలుఁడు స్వయముగ నినుపసంకెలలను దీసికొని వనజచంద్రుని యొద్దకుఁబోయి యాతనిని బంధింపఁబోయెను. అప్పుడాతఁడు కాతర స్వరమున "ఇదియేమిషని?" అనియెను.

విర : ఏమనుచున్నావు? నీవు చారుచంద్రుని హత్యగావించి నందులకై నేను నిన్ను బంధించుచున్నాఁడను.

అనిచెప్పి యాతని శృంఖలాబద్ధునిగావించెను. మాధవభాస్కరులకుఁగూడ నట్టిమర్యాదయేజరగెను. విరలుఁడు వారినిఁజూచి తిరస్కార భావముతో "మీరు నరహత్యామహాకార్యములలో నీమెకు సహాయులుగానుంటిరి. అదియేకాదు—కాంతనాథుని సేవకుఁడగు హనుమంతుని జంపితిరి. అందులకై మిమ్ము బంధించితిని. ఈ మహాపాతకము మి మ్మురిశిక్షకు గుఱిచేసితీరును" అనెను.

సౌదామిని ధైర్యముతో నిలిచియుండెను. ధైర్యమునఁ బురుషులకంటె నామెయే మేలుచేయిగానుండెను. విఠలుఁడు మాటాడుచున్నప్పుడామె తనవిలక్షణభావమునగపఱుపక, మందహాసముచేయుచుఁ గేవలము ప్రసన్నతనే ప్రకటించుచుండెను. విఠలుఁడూరకున్నపిమ్మట సౌదామిని జనమండలివైపునకుఁదిరిగి ముక్తకంఠయై “ నేనొక మహా ఫలాపేక్షకుఁ లోఁబడి యీ కార్యమును జేసితిని. కాని, యిదితప్పి పోయినది. ఇప్పుడెట్టిశిక్షకైనను సిద్ధముగానుంటిని ” అనియెను.

ఆ బందాకోరులనందఱను వెలుపలకుఁదీసికొనిపోయిరి. పిమ్మట విఠలుఁడు నటేశునిఁజూచి “ అయ్యా ! ఆ మరకతమంజూష నందఱి యెదుటికిని దెచ్చిచూపుము ” అనియెను.

నటేశుఁడు గడగడవడఁకుచు, నొక కఱ్ఱపెట్టెనక్కడకుఁ దెచ్చి దానితాళంను దీసి లోపలున్న యీ మరకతమంజూషను బైకిఁదీసెను.

విఠ : ఇప్పుడు చారుచంద్రమన కౌరసకుమారుఁడగు కాంతనాథుఁ డీమహాద్భుతపేటికను దెఱచును. అందఱును జూడుఁడు ! దీనిలో నేదోరహస్యమున్నదని చాలఁగాలమునుండి యొకప్రతీతికలదు. ఇప్పుడు మనము పరీక్షింపవచ్చును.

అనిచెప్పి విఠలుఁ డాపేటికావృత్తాంతమంతయు నాముూగ్రముగ నా మహాజనుల కెఱింగించెను. మఱియు నొకనాఁడు తామా పెట్టెను దెఱచుటకుఁ బ్రయత్నించినప్పుడు చూచిన స్వతంత్ర విషయములను గూడ వారికిఁ దెలియఁజేసెను.

కాంతనాథుఁ డా పెట్టెను దెఱచుటకై సమీపించెను. అప్పుడు ప్రఫుల్ల గడగడవడఁకుచు నాతని వెనుకనే నిలుచుండెను. ఆతఁడా పెట్టెకుఁబైమూతను దెఱచెను. ఆ మంజూషకన్నివైపులనుండియుఁ బొగలెగయసాగెను. అందఱు నిశ్శబ్దముగా దానిచుట్టును నిలుచుండి చూచుచుండిరి. స్పష్టముగా నీక్రిందియక్షరములు వారికగపడియెను.
“ ఇప్పు డీపరమరహస్యము బయటఁబడినది ! ”

ఆయుత్తరక్షణముననే శ్వాసనిలిచిపోయెను. ఆ పేటిక పగిలి ముక్కముక్కలై క్రిందఁబడిపోయెను. దానిలో నొకయుక్కుపెట్టె యుండెను. కాంతనాథుఁ డాపెట్టెనుగూడఁ దెఱచెను. దానిలో నొకవైపున హస్తాక్షరసమన్విత మగునొకపత్రమును మఱియొకవైపున ననర్ఘరత్నములు నుండెను. ఆ పత్రమునందు "సత్యమేనిత్యము. అన్యాయమే యపాయము" అని వ్రాయఁబడియుండెను

ఆ పెట్టెముక్కలనన్నిటినేర్చి పరీక్షించిచూడఁగా నదిసర్వోత్కృష్టమగు మరకతమణిచే నిర్మింపఁబడినట్లగపడియెను. కాంతనాథుఁ డామరకతఖండములనన్నిటిని దీసికొని యాయుక్కుపెట్టెలో భద్రపఱచెను. లోపలనున్న యా దివ్యరత్నములలో మూఁడింటిని దీసి పల్లవవిరలనకేశులకిచ్చి మిగిలినవానిని ప్రఫుల్లకిచ్చివైచెను. ఆమె వానిని బ్రణామపూర్వకముగ నందుకొనియెను.

విందునకువచ్చినవారందఱును దగుసత్కారములనంది సంతోషపూర్వకముగఁ దమతమ గృహములకుఁబోయిరి. తిలకసుందరీ వారణులప్రేతములకుఁదగిన విధులనొనరించుటకును, వారణునియుత్తరక్రియలకును విరలుఁడు తగినయేర్పాటులనుగావించెను. ఆ నేరములను గూర్చి నవనగరన్యాయస్థానమున విచారణము జరగెను.

కాంతినాథుని సేవకుఁడగు హనుమంతునిజంపిన నేరమునకై మాధవభాస్కరుల కిరువురకు మరణదండనము విధింపఁబడియెను. సౌదామినీనాగేశుల కామరణాంతము కారాగృహవాసశిక్ష యయ్యెను. వనజచంద్రుని నేరమును విచారించుటకై యాతనిని లలితపట్టణమునకుఁ దీసికొనిపోయిరి. ఆ పుణ్యభూమియం దిదివఱకెవ్వరును బితృవధామహాఘమునకు లోఁబడినవారు లేనికారణమున నీఘోరవృత్తాంతము వినినతోడనే జనులలోహాహాకారముపుట్టెను. అందఱును గన్నుల నీరునించిరి. వనజచంద్రునకుఁగూడ నురిశిక్షయయ్యెను. అంతటితోఁ బ్రజలుశాంతాత్ములైరి.

ఈ భయంకరనాటకమునం దుపపాత్రములైయున్న వారిలో నింగాలసుందరుఁడు పలాయనసూత్రమును బఠించెను. నళిని

నిరాతంకముగా జీవించుచుండెను. మిగిలినవారు నిర్భయముగఁ దమ తమదుర్వ్యాపారములను సాగించుకొనుచునేయుండిరి.

ప్రఫుల్లాకాంతనాథులు క్రమముగ బంధుమరణదుఃఖశాంతికిని, పరలోకమునందు వారికిసద్గతికలుగుటకును తీర్థయాత్రలను గావించుటకై, కాశి, ప్రయాగ, గయ, మథుర, గోకులబృందావనము, బదరీనారాయణము మొదలగు నుత్తరదేశపుణ్యక్షేత్రములను, గోకర్ణము, జగన్నాథము, నాసిక, కంచి రామేశ్వరము, అనంతశయనము మొదలగు దక్షిణదేశ పుణ్యక్షేత్రములను దిరుగుచు నందందుఁజేయవలసిన పుణ్యకార్యములను జేసికొని శాంతచిత్తులై గృహమునకువచ్చిరి. ఈ తీర్థయాత్రలలోఁ గాంతనాథుఁడు తనతల్లినిగూడఁ దీసికొనిపోయెను.

కాంతనాథునకు లలితపట్టణముకంటె నవనగరమే వాసయోగ్యముగా నగపడుటచే నాతఁడు తనపిత్రార్జితమైన యాస్తినంతను జూచుచుండుటకుఁ దగినవారిని నియమించి, తానునవనగరమునందే వాసము చేయుచుండెను. అప్పుడప్పుడు లలితపట్టణమునకుఁబోయి వచ్చుచుండెను.

పల్లవుఁడు శ్రీమతియనునేక్షకమీఁదఁ దన ముఖ్యబంధువుల నియమించి, యింకముందుఁ దాను సముద్రయానముచేయుటనుమాని విఠలమూర్తి జహగీరుగ్రామమునఁ గొంతభూమిని సంపాదించుకొని యక్కడనే సుఖముగా వాసముచేయుచుండెను.

నరేశవిఠలులు తమపత్తేదారుపనిని మానుకొని యా జహగీరు గ్రామమునకు బోయి శాంతిసామ్రాజ్యమనుభవించుచుండిరి.

ఇంతజరగినను, విఠలుఁడు తన సాహసచరిత్రమునుగూర్చి యెప్పుడును డంబముగ మాటాడుకొనలేదు. ఒకవేళ నెవ్వరైనవచ్చి యుద్దేశపూర్వకముగఁ దన్నడిగినప్పుడాతఁడు గాంతనాథుని పునరుజ్జీవనము, మరకతమంజూషామాహాత్మ్యము మొదలగునవి మాత్రమే చెప్పి వారికి వినోదమును గలిగించుచుండెను.

స మా ప్త ము.

శ్రీ రాజేశ్వరి ప్రెస్. రాజమండ్రి—1958

అనువాద గ్రంథమండలి—౫.

# వివాహం

శ్రీ నేరళ్ల నారాయణమూర్తి
శ్రీ మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి
అనువాదితము.

ప్రకాశకులు
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,
సంస్కృతాంధ్ర గ్రంథాలయం (స్థా. 1883) రాజమండ్రి.

## అధ్యాయం—౨

నేను చరిత్రోపాధ్యాయుడు రాకపోవుటచే ద్వితీయవార్షిక విద్యార్థులు గుంపుగా గూడి యేవో లోకాభిరామాయణముల జెప్పుకొనుచున్నారు. హాస్యాలాపములతో—ఆనందకేళనములతో—అట్టహాసము లొనరించుచున్నారు. "గోల చేయవల"దని ప్రక్కగదిలోని యుపాధ్యాయు లొకటి రెండు మారులు వర్తమానము లంపినను, ప్రయోజనము లేకపోవుటచే వారును ఊరకున్నారు. కొలది కాలములో బట్టభద్రులు కానున్న ప్రాయమువచ్చిన విద్యార్థుల నెవ్వరు మదలింప గలరు?

ఆతరగతిలోని యువకుల కెల్ల నాయకుడు రజతుడు. అతడు ధనవంతుడు—సౌందర్యవంతుడు—విలాసప్రియుడు—వాక్చతురుడు కవి—కథకుడు—ఆ కాలమున వంగసాహిత్యపత్రిక లన్నియు రజతుని రచనల నపేక్షించుచుండెను. సాహిత్యపత్రికలలో నెల్ల శిరోభూషణ మనదగు "సంగ్రహ" యను మాసపత్రికలో రజతుని వ్యాసములు మనోహర బహువర్ణ లతాచిత్ర పరివేష్టితములై పాఠకులకే కాక, ప్రేక్షకులకుగూడ హృదయాహ్లాదకరములై వెలువడుచు, రజతకీర్తిని దిన దినాభివృద్ధి నొందజేయు చుండెను. రజతునియెడ సాహిత్యప్రియులే కాక—విద్యార్థులు లేకాక—ఉపాధ్యాయులు గూడ నాదరానురాగముతో మెలంగుచుండిరి.

రజతుడు తనతోడివారి నడుమ నిలిచి యేవో హాస్యోక్తుల నాడుచు నందరిని నగించుచు, నలుదెసల జూచుచుండెను. తన విలాసములతో సంపర్కము లేక, ఒక్కమూల నేకాగ్రచిత్తుడై కూర్చుండి యేమిటో వ్రాసికొనుచున్న యొక యువకుడు రజతునకు గానుపించెను. రజతుడు చకితుడయ్యెను. నిర్నిమేష వీక్షణముల నాయువకునిపై

నిగిడ్చి, నీరవృద్ధై, అట్టె నిలిచిపోయెను. విద్యార్థులుగూడ విస్మయ వీక్షణముల నొకమారు రజతుని వదనము నందును—ఇంకొకమారు శిశిరునిమీదను బరపుచుండిరి.

ఆయువకుడు విద్యార్థిలోకమున కపరిచితుడు కాడు. కాని యాతని జీవితవిధానము నెరింగినవా డొక్కడును లేడు కాళిదాసను యువకునకుమాత్రము గొంత తెలియును. ఆయువకునిపేరు శిశిరుడు. బ్రాహ్మణుడు—ఇంచుమించు చిరువదినాలుగేండ్ల ప్రాయమువాడు— ఆతడు ధరించినవి సామాన్యవస్త్రములేయైనను బరిశుభ్రములైనవి. పాదరక్షలు గాని, యెండవానల నుండి రక్షించుటకు గొడుగు కాని, యాతని యొద్ద లేవు. ఆతని ప్రశాంత తేజోమయ ముఖమండలమును బరికించినచో మానసిక తీవ్రవేదనాచ్ఛాయలు గోచరించుచుండును. నేత్రములు జ్యోతిఃపూర్ణములే యైనను విలాస రహితములు. దారుణ దరిద్రదేవతా కరాళకరసహస్రగాఢాలింగితుడైనను దైన్యదేవతకు దన ఛెంత నిసుమంతయు జోటిచ్చుటలేదు. తన తీవ్రమనశ్శక్తిచే దరిద్ర దేవతను దరిమివేయుచున్నాడు. పరాజయ మొందుచున్నాడు లోకుల దృష్టిలో నాతడు దరిద్రుడైనను, ఆతడు మాత్రము దరిద్రబాధ నొందుటలేదు. మనశ్శక్తిచే సాధింపరాని కార్య మేమున్నది ?

శిశిరుడు తనలో గలసిమెలసి యుండక, ప్రత్యేకముగ నుండుట తన్నవమానించుటయే, యని రజతుడు తలంచెను. ఎట్లులైన శిశిరుని దనలో గలుపుకొనిన గాని, తనగౌరవము దక్కదని నిశ్చయించెను. విద్యార్థి బృందమువంకకు జూపులను మరల్చెను "ఇదిగో! ఇటుచూడుడు. ఈత డీవత్సరమున బ్రథమపారితోషికము నందుటకు మిక్కిలి కృషి చేయుచున్నాడు !" అనియెను. విద్యార్థు లందరు నొక్కపెట్టున వికట హాస మొనరించిరి.

# అధ్యాయము—1

కాళిదాసనునొక యువకుడు లేచి "వలదు! వలదు! మీ రాతనిని బరిహసించి చీకాకు బరుపవలదు. ఆతనికి బుస్తకములు లేవు. కొనుటకు ద్రవ్యమును లేదు. ఇతరుల పుస్తకములను జూచి, వ్రాసికొని చదువుకొనుచున్నాడు. అట్టి వానిని బాధించుట భావ్యము కాదుకదా!" అని చెప్పెను.

ఆమాట లాలించి అందరును నీరవులై నిలిచిపోయిరి. రజతుడాశ్చర్య మొంది "ఏమి! పుస్తకములన్నియు నిట్లే వ్రాసికొనుచుండెరా?" అని యడిగెను.

"ఔను" అని కాళిదాసు మెల్లగా బ్రత్యుత్తర మిచ్చెను.

"అట్లయిన మన సుందరమును జందాల మూలమున శిశిరునకు బుస్తకములను గొని యీయవలెను" అని రజతుడనెను.

"శిశిరు చందముల కంగీకరింపడు. ఆతడు నివసించుచున్న గదికి మే మాతనియొద్ద నద్దె పుచ్చుకొన గోరలేదు. ఆగది చిమ్మచీకటి కిమ్మగుటయె కాక, వంటయింటి ప్రక్కనున్నది. దాని నెవ్వరు నద్దెకు దీసికొన నిచ్చగింపరు. అట్టి యింటికిగూడ నద్దెయీయకుండ నివసింపని వాడు, మనము చందాలమూలమున బుస్తకముల గొనియిచ్చిన బుచ్చుకొనునా?" అని కాళిదాసనెను.

"అది యేమిమాట! అద్దె యిచ్చుకొనుచున్నపుడు, అనుకూలమైన గదియే యేల తీసుకొనరాదు?" అని ఖగేనుడు సహేళనముగ ననెను.

"మీరు మూర్తీభవించిన ప్రజ్ఞాస్వరూపులవలె నిలిచి మాటలాడుచున్నారు! మంచిగది పుచ్చుకొనినచో, అద్దె యధికముగ నీయ నక్కరలేదా! ఆతనికి వచ్చునవి పదునైదు రూప్యములు. సాయం సమయమున విద్యార్థులకు బాఠములను జెప్పుచు మరి యొనిమిది

రూపాయలను సంపాదించుకొనుచున్నాడు. అందులో బదిరూపాయిలను వనమాలి యనువానికి పంపుచుండెను. మిగిలిన పదమూడు రూపాయలతో నెట్లో కాలక్షేపము జేసికొనుచుండెను" అని కాళిదా సనెను.

"అతని కాత్మీయు లెవ్వరును లేరా?" అని ఖగేను డడిగెను.

"లేరు. నే జెప్పజాలను. అతడెవ్వరితోడను గలసి మెలసి యుండువాడు కాడు. ఆతనియొద్దకు వచ్చువారును లేరు. ఎవరియొద్ద నుండియైన జాబులుగూడ వచ్చు నాచారము లేదు. వనమాలీ దాసున కంపిన మనీయార్డరు రసీదుమాత్రము ప్రతినెలయు వచ్చుచుండును. బ్రాహ్మణుడైన శిశిరునకు వనమాలిదాసు డాత్మీయుడు కాడుకదా?" అని కాళిదాసు చెప్పెను.

కాళిదాసుని మాటలను వినినంతనే అందరి హృదయములును గరుణాసమన్వితము లయ్యెను. కలకలమంతయు జప్పున జల్లారెను. "ఉపాధ్యాయుడు వచ్చుటచే గాబోలును నిశ్శబ్దత కలిగిన"దని తలంచి శిశిరుడు తల మీదకెత్తి చూచెను. ఉపాధ్యాయుడు కానుపింపమిచే మరల దన కార్యమును జేసికొన దొడగెను.

రజతుడు మెల్లమెల్లగా శిశిరుని యొద్దకు బోవుచుండెను. కాళిదా సాతని కడ్డమువచ్చి "రజతబాబూ! మీరు శిశిరుని బరిహాస మొనరింపకుడు" అని ప్రార్థనాపూర్వకముగ ననెను.

"కాళిదాసూ! నే నంతటి తెలివి మాలిన వాడనా?" అని యతనిభుజముపై జేతితో దట్టుచు శిశిరుని యొద్దకేగి నిలిచెను.

శిశిరుడు తల పైకెత్తి రజతుని జూచెను. రజతుడు శిశిరుని భుజముపై జేయినైచి "మనము సహపాఠులము. కావున మన కన్యోన్యస్య సోదరభావము కలదు. నీవు నాకు సోదరుడవు. నేను నీకు సోదరుడను"

# అధ్యాయము—1

అని చెప్పుచుండగనే శిశిరుడు వ్రాయుచున్న కలమును నట్టె యుంచి, లేచి, తనకరములను రజతుని మృదుహస్తముల గీలించి "రజతుడు నాబంధువు. కాని రజతునిపోలు ధనికునకు శిశిర సదృశ నిర్ధనునిబాంధవ్యము చిరస్థాయిగ నుండదేమొ" అని శిశిరుడు రజతుని ముఖమును రెప్పవాల్పక చూచుచుండెను.

రజతుడు మాటాడకయే శిశిరునిచెంత కూరుచుండి పక్కనున్న కలమును దీసికొని "సోదరా! నీవు చాలసేపటినుండి వ్రాయుచున్నావు అలసియుందువు. కావున నేను గొంచెము నీవు వ్రాసెదను" అని సానురాగముగ ననెను.

"వలదు! వలదు! మీకు శ్రమ గలిగింప వలసినంతటి యవసర మేమియు నిపుడు తటస్థించుట లేదు.

రజతుడు శిశిరునిమాట కడ్డమువచ్చి "ఇదియేనా! సోదరుల పరస్పరానురాగ విధానము? నేనుగూడ నీశ్రమలో భాగమును గోరుచున్నా" నని రజతుడు సవినయముగ ననెను. శిశిరుడు మాటాడజాలకుండెను. రజతుడు రెండుపంక్తులను వ్రాసి, తటాలున వ్రాయుటమాని "నేనెట్టిమూర్ఖుడను! వ్యర్థప్రయాసము నొందుచున్నానే! సోదరా! నాయొద్ద బతిపుస్తకమునకును, ఇంకొక ప్రతియున్నది. నేను కొనిన సంగతి నెరుంగక మామమాస్తాగూడ పుస్తకములన్నింటిని గొని తెచ్చెను మరల వాని నంపివేయుట లేదు నీవు వాని నుపయోగించుకొనుము" అని రజతుడు చెప్పెను.

"వలదు! సోదరా! వలదు. మీ పుస్తకముల నుపయోగించి మీకు శ్రమ గలిగింపజాలను" అని శిశిరుడు తడబాటుతో ననెను.

నీవు నాపుస్తకములను దీసికొననక్కరలేదు. ఇతరుల పుస్తకములను దెచ్చి వ్రాసికొనిన పిమ్మట మరల వారి పుస్తకములను

రూపాయలను సంపాదించుకొనుచున్నాడు. అందులో బదిరూపాయి లను వనమాలి యనువాని కంపుచుండెను. మిగిలిన పదమూడు రూపా యలతో నెట్లో కాలక్షేపము జేసికొనుచుండెను" అని కాళిదా సనెను.

"అతని కాత్మీయు లెవ్వరును లేరా?" అని ఖగేను డడిగెను.

"ఆది నే నెప్పుజాలను. అతి డెవ్వరితోను గలసి మెలసి యుండువాడు కాడు. ఆతనియొద్దకు వచ్చువారును లేరు. ఎవరియొద్ద నుండియైన జాబులుగూడ వచ్చు నాచారము లేదు. వనమాలీ దానున కంపిన మనియార్డరు రసీదుమాత్రము ప్రతినెలయు వచ్చుచుండును. బ్రాహ్మణుడైన శిశిరునకు వనమాలీదాసు డాత్మీయుడు కాడుకదా?" అని కాళిదాసు చెప్పెను.

కాళిదాసుని మాటలను వినినంతనే అందరి హృదయములును గరుణాసమన్వితము లయ్యెను. కలకలమంతయు జప్పున జల్లారెను. "ఉపాధ్యాయుడు వచ్చుటచే గాబోలును నిశ్శబ్దత కలిగెను"దని తలంచి శిశిరుడు తల మీదకెత్తి చూచెను. ఉపాధ్యాయుడు కానుపింపమిచే మరల దన కార్యమును జేసికొన దొడగెను.

రజతుడు మెల్లమెల్లగా శిశిరుని యొద్దకు బోవుచుండెను. కాళిదా సాతని కడ్డమువచ్చి "రజతబాబూ! మీరు శిశిరుని బరిహాస మొనరింపకుడు" అని ప్రార్థనాపూర్వకముగ ననెను.

"కాళిదాసూ! నే నంతటి తెలివి మాలిన వాడనా?" అని యతనిభుజముపై జేతితో దట్టుచు శిశిరుని యొద్దకేగి నిలిచెను.

శిశిరుడు తల పైకెత్తి రజతుని జూచెను. రజతుడు శిశిరుని భుజముపై జేయివైచి "మనము సహపాఠులము. కావున మన కన్యోన్య సోదరభావము కలదు. నీవు నాకు సోదరుడవు. నేను నీకు సోదరుడను"

అని చెప్పుచుండగనే శిశిరుడు వ్రాయుచున్న కలమును నట్టె యుంచి, లేచి, తనకరములను రజతుని మృదుహస్తముల గీలించి "రజతుడు నాబంధువు. కాని రజతునింబోలు ధనికునకు శిశిర సదృశ నిర్ధనునిబాంధవ్యము చిరస్థాయిగ నుండదేమొ" అని శిశిరుడు రజతుని ముఖమును రెప్పవాల్పక చూచుచుండెను.

రజతుడు మారాడకయే శిశిరునిచెంత కూరుచుండి ప్రక్కనున్న కలమును దీసికొని "సోదరా! నీవు చాలసేపటినుండి వ్రాయుచున్నావు అలసియుందువు. కావున నేను గొంచెము నీవు వ్రాసెదను" అని సానురాగముగ ననెను.

"వలదు! వలదు! మీకు శ్రమ గలిగింప వలసినంతటి యవసరమేమియు నిపుడు తటస్థించుటలేదు.

రజతుడు శిశిరునిమాట కడ్డమువచ్చి "ఇదియేనా! సోదరుల పరస్పరానురాగ విధానము? నేనుగూడ నీశ్రమలో భాగమును గోరుచున్నా" నని రజతుడు సవినయముగ ననెను. శిశిరుడు మారాడజాలకుండెను. రజతుడు రెండుపంక్తులను వ్రాసి, తటాలున వ్రాయుటమాని "నే నెట్టిమూర్ఖుడను! వ్యర్థప్రయాసము నొందుచున్నానే! సోదరా! నాయొద్ద ప్రతిపుస్తకమునకును, ఇంకొక ప్రతియున్నది. నేను కొనిన సంగతి నెఱుంగక మాగుమాస్తాగూడ పుస్తకములన్నింటిని గొని తెచ్చెను మరల వాని నంపివేయుటలేల నీవు వాని నుపయోగించుకొనుము" అని రజతుడు చెప్పెను.

"వలదు! సోదరా! వలదు. మీ పుస్తకముల నుపయోగించి మీకు శ్రమ గలిగింపజాలను" అని శిశిరుడు తడబాటుతో ననెను.

నీవు నాపుస్తకములను దీసికొననక్కరలేదు. ఇతరుల పుస్తకములను దెచ్చి వ్రాసికొనిన పిమ్మట మరల వారి పుస్తకములను

వారి కిచ్చివేయుచున్నావుకదా! అటులనే నీయవసరము తీరిన పిదప మరల వానిని నా కిచ్చివేయుము. ఇప్పుడు డాపుస్తకములు బీరువాలో ముక్కి చెడుటకంటె నీవు చదువుకొనుట నా కానంద దాయకమును, ప్రయోజనవంతమును గదా? ఇప్పుడు నీకొరకు నేను తెప్పించినచో నీ వంగీకరింపవలదు. నీవు నా వెంట మామందిరమునకు రమ్ము! బీరువాలో బుస్తకములు లేనిచో నీవు నన్నంగీకరింపవలదు" అని రజతు డనెను.

స్వార్థవిరహితములగు రజతునిమాటలకు శిశిరుడు ముగ్ధుడయ్యెను మారుమాటాడ జాలకపోయెను. రెండవగంట మ్రోగెను. ఉపాధ్యాయుడు తరగతిలోనికి వచ్చెను. అందరు తమ తమ స్థానములలో గూరుచుండిరి. శిశిరుని హృదయము కృతజ్ఞతాపూర్ణమై పోవుచుండెను.

రజతుడు రహస్యముగ నొకమిత్రుని బిలిచి "అంగడిలో బుస్తకములను గొని బీరువాలో సిద్ధముగ నుండునట్లు చేయుము" అని చెప్పి మరల నేమియు నెరుగని వానివలె గూరుచుండెను.

## అధ్యాయం—2

కళాశాలలో చివరగంట మ్రోగినది. విద్యార్థులందరును గోల గోలమని బయలుదేరినారు. రజతుడు శిశిరునియొద్దకువచ్చి వాని చేయి పట్టుకొని తన బండివద్దకు దీసికొనిపోయినాడు. శిశిరుడు మంత్రముగ్ధునివలె, మారుమాటాడక రజతునితో నడచినాడు.

ఇరువురును బండిలో గూరుచున్నారు. బండి విద్యుద్వేగమున వచ్చి రజతుని భవనద్వారమునొద్ద నాగెను. ఇరువురును బండిదిగి లోని కేగినారు.

## అధ్యాయము—2

విచిత్ర జలయంత్రములతో—వివిధవర్ణ మనోహర పుష్పవాటికలతో—విభ్రమదాయకములగు వింతవింత దంతపు బొమ్మలతో—విరామములేక దిరుగు విద్యుద్వ్యజనములతో—విలువగల కాచపాత్రములతో—ఆ భవనము ఆనందభవన మనదగియుండెను. రజతుడు శిశిరుని దోడ్కొని తనగదిలో బ్రవేశించెను. అక్షణముననే యొక్క సేవకుడువచ్చి, రజతశిశిరులకు వందనముగావించి, రజతుని కాలిజోడును విప్పదొడగెను.

"సోదరా! అవిగో పుస్తకములు, బీరువాలో నున్నవి జూడుము" అని శిశిరునకు బీరువాను జూపెను. అద్దములోనుండి బీరువాయందలి పుస్తకములు శిశిరునకు గానిపించెను. ఆపుస్తకములు నీ వుపయోగింపనిచో, అందే ముక్కి పాడయిపోవును. దానివలన నాకు నష్టమేకదా! నీ వుపయోగించనిచో నాద్రవ్యము సార్థకత నెందును. రమ్ము! అమ్మగారిని జూచివత్తము!" అని రజతు డనెను.

జోడువిప్పుట పూర్తి యయినది. రజతుడు లేచి నిలిచెను.

"నన్నిప్పట్టున వదలివేయుము. విద్యార్థులకు పాఠము చెప్పువేళ యయినది. నాకొరకు వా రెదురు జూచుచుందురు" అని మెల్లమెల్లగా శిశిరు డనెను.

"ఇంకను సంధ్యాసమయమైనను గాలేదే! అనుచు శిశిరుని జేయి పట్టుకొని నడువదొడగెను. ఇరువురును మేడమీద కేగిరి. ఒకపీఠమున గూరుచుండి 'స్టవ్' మీద పూరీ చేయుచున్న సౌమ్యమూర్తియగు ప్రౌఢవయముదప్పిన యొక విత్తంతువయు, ఆమె చెంతనే నిలిచియున్న అత్యంత లావణ్యవతియగు నొక తరుణియు, శిశిరునకు గానుపించిరి. ఆగరు నేలలాటపలకమున దేదీప్యమానమగు నొక్క దివ్యజ్యోతి శిశిరునకు గానవచ్చెను. అతడు నిశ్చేష్టితుడయిపోయెను.

# అధ్యాయము—1

"సోదరా! ఇచట పల్లిగాడును, మీవదినెయును గాక అన్యు లెవ్వరును లేరే! ఏల సంకోచించుచున్నావు?" అని రజతుడు దరహాసిత వదనుడై నుడివెను.

రజతుని మాటలనువిని యాతరుణి భర్త చెంతనున్న యపరిచిత వ్యక్తిముఖముపై తన ప్రశాంత వీక్షణమును బరపి వెంటనే మరలించెను.

"ఇతడు నామిత్రుడు—సహపాఠి—యోగ్యుడు—మేధావి— ఈతని పేరు శిశిరుడు" అని రజతుడు తల్లితో జెప్పెను.

రజతుని తల్లియగు సునయనీదేవి శిశిరుని గనులారజూచి ఆతని విషాదచ్ఛాయాసమాకీర్ణప్రశాంత వదనమండలమును గని, నిజకోమల హృదయపేటిక యందలి కరుణరసము వెల్లివిరియ, నొక్క నిట్టూర్పు విడచెను. "నాయనా! ఇట గూరుచుండుము!" అని పుత్రవాత్సల్య మొలయ బలికెను. కోడలిని జూచి "నీమరది కొక యాసనమును దెచ్చి వేయుము" అని యాజ్ఞాపించెను.

కోడలగు సంధ్యాదేవి పీఠమును దెచ్చుట కేగెను. శిశిరుడు సునయనీదేవికి బ్రణామ మొనరించి, ఆమె చెంత నేయున్న జముఖాణముపై గూరుచుండి, "అమ్మా! ఇంత ప్రశస్తమగు జముఖాణ ముండగా నింక నాసన మెందులకు?" అనెను.

సంధ్యాదేవి పీఠమును దెచ్చి నిలిచెను.

రజతుడు నవ్వుచు "అమ్మా! నీకోడలు పీఠమువేయుటకై స్థలాన్వేషణ మొనరించుచున్న" దనెను.

సంధ్య లజ్జితయై వసారాలోని కేగి, పీఠము నొకచోటనుంచి, భీషణభ్రుకుటికి కటాక్షమును నాథుని ముఖముపై బరపెను.

సునయనీదేవి శిశిరుని జూచి "నాయనా యెల్లవేళల నిటులే మీవదినె నగతాళి సేయుచుండును" అని దరహాస మొనరించెను.

రజతుడు నవ్వి "సోదరా ! చూచితివా ! తల్లిగారి పక్షపాతము! పుత్రవాత్సల్యతను విడనాడి, కోడలిపై నెట్టియాదరణము జూపు చున్నారో !" అనెను.

"కోడలిపై నా కత్యంతవాత్సల్యము కలదని నే నంగీకరించు చున్నాను" అని సునయనీదేవి శిశిరునితో ననెను.

ఆమాటలకు సంధ్యాదేవి ముఖము సంతోష విలసితమయ్యెను. "బాగు ! బాగు ! తగిన ప్రత్యుత్తరము లభించినది" అని రజతుడు విను నట్లు సంధ్య మెల్ల మెల్లగ ననెను.

అపుడు శిశిరుని ప్రతిరక్తనాళమునుండియు, మాతృదేవతా స్వరూపిణియగు సునయనీదేవిపై గల భక్తిరసప్రవాహము పొంగి పొరలజొచ్చెను. వానిహృదయము మాతృభక్తిచే పరిప్లావితమయ్యెను. "ఈగృహ మెంతయు ధన్యమైనది. వీరిహృదయములందు శాంతిదేవత స్థిరనివాస మేర్పరచికొనియున్నది. రజతుడు మిక్కిలి భాగ్యవంతుడు" అని తనమదిలో ననుకొనుచుండెను. హఠాత్తుగా నాతనిమోము కళా విహీన మయ్యెను.

సునయనీదేవి దానిని దెలిసికొనెను. "ఈతడు ప్రేమాప్రపంచితుడై నటుల గానుపించుచున్నాడు" అని తలంచి "కోడలా ! రెండుపళ్ళెరములను వడ్డించుటకు దెమ్ము ! నీమరదికి భోజనమిడుము" అనెను.

"వీడీ గృహమున రజతుని ప్రసక్తియే లేదు. అమ్మగారు శిశిర సమాదరణమున నిమగ్నులై యున్నా" రని రజతు డనెను.

శిశిరుడు నిశ్చలుడై సునయనీదేవిని జూచుచుండెను. ఆమెయు శిశిరునిజూచి "కుమారా ! చిన్నకుమారుని యెడ దల్లి కనురాగము మెండుకదా !" అనెను.

# అధ్యాయము—1

"సోదరా ! ఇచట తల్లిగారును, మీవదినెయును గాక అన్యు లెవ్వరును లేరే ! ఏల సంకోచించుచున్నావు ?" అని రజతుడు దరహాసిత వదనుడై నుడివెను.

రజతుని మాటలనువిని యాతరుణి భర్తచెంతనున్న యపరిచిత వ్యక్తిముఖముపై తన ప్రశాంత వీక్షణమును బరపి వెంటనే మరలించెను.

"ఇతడు నామిత్రుడు—సహపాఠి—యోగ్యుడు—మేధావి—ఈతనిపేరు శిశిరుడు" అని రజతుడు తల్లితో జెప్పెను.

రజతుని తల్లియగు సునయనీదేవి శిశిరుని గనులారజూచి ఆతని విషాదచ్ఛాయాసమాకీర్ణప్రశాంత వదనమండలమును గని, నిజకోమల హృదయపేటికనుండలి కరుణరసము వెల్లివిరియ, నొక్క నిట్టూర్పు విడచెను. "నాయనా ! ఇట గూరుచుండుము !" అని పుత్రవాత్సల్యమొలయ బలికెను. కోడలిని జూచి "నీమరది కొక యాసనమును దెచ్చి వేయుము" అని యాజ్ఞాపించెను.

కోడలగు సంధ్యాదేవి పీఠమును దెచ్చుట కేగెను. శిశిరుడు సునయనీదేవికి ప్రణామ మొనరించి, ఆమె చెంత నేయున్న జముఖానముపై గూరుచుండి, "అమ్మా ! ఇంత ప్రశస్తమగు జముఖాణ యుండగా నింక నాసన మెందులకు ?" అనెను.

సంధ్యాదేవి పీఠమును దెచ్చి నిలిచెను.

రజతుడు నవ్వుచు "అమ్మా ! నీకోడలు పీఠమువేయుటకై స్థలాన్వేషణ మొనరించుచున్న" దనెను.

సంధ్య లజ్జితయై వసారాలోనికేగి, పీఠము నొకచోటనుంచి, భీషణభ్రుకుటికటాక్షమును నాథుని ముఖముపై బరపెను.

సునయనీదేవి శిశిరుని జూచి "నాయనా యెల్లవేళల నిటులే మీవదినె నగతాళి సేయుచుండును" అని దరహాసమొనరించెను.

## అధ్యాయము—2

రజతుడు నవ్వి "సోదరా ! చూచితివా ! తల్లిగారి పక్షపాతము! పుత్రవాత్సల్యతను విడనాడి, కోడలిపై నెట్టియాదరణము చూపు చున్నారో !" అనెను.

"కోడలిపై నా కత్యంతవాత్సల్యము కలదని నే నంగీకరించు చున్నాను" అని సునయనీదేవి శిశిరునితో ననెను.

ఆమాటలకు సంధ్యాదేవి ముఖము సంతోష విలసితమయ్యెను. "బాగు ! బాగు ! తగిన ప్రత్యుత్తరము లభించినది" అని రజతుడు వినునట్లు సంధ్య మెల్లమెల్లగ ననెను.

అపుడు శిశిరుని ప్రతిరక్తనాళమునుండియు, మాతృదేవతా స్వరూపిణియగు సునయనీదేవిపైగల భక్తిరసప్రవాహము పొంగి పొరలజొచ్చెను. వానిహృదయము మాతృభక్తిచే పరిప్లావితమయ్యెను. "ఈగృహ మెంతయు ధన్యమైనది. వీరిహృదయములందు శాంతిదేవత స్థిరనివాస మేర్పరచికొనుచున్నది. రజతుడు మిక్కిలి భాగ్యవంతుడు" అని తనమదిలో ననుకొనుచుండెను. హఠాత్తుగా నాతనివదనము కళా విహీన మయ్యెను

సునయనీదేవి దానిని దెలిసికొనెను. "ఈతడు ప్రేమాప్రవంచితుడై యటుల గానుపించుచున్నాడు" అని తలంచి "కోడలా ! రెండుపళ్ళెరములను వడ్డించుటకు దెమ్ము ! నీమరదికి భోజనమిడుము" అనెను.

"నేడీ గృహమునందు రజతుని ప్రసక్తియే లేదు. అమ్మగారు శిశిర సమాదరణమున నిమగ్నులై యున్నా" రని రజతు డనెను.

శిశిరుడు నిస్తబ్ధుడై సునయనీదేవిని జూచుచుండెను. ఆమెయు శిశిరునిజూచి "కుమారా ! చిన్నకుమారునియెడ దల్లి కనురాగము మెండుకదా !" అనెను.

## అధ్యాయము—2

ఆమాట వినినతోడనే శిశిరుని సర్వావయవము లొక్కసారి యనురాగవేగ సంచలితములయ్యెను. ఆతని ప్రతిధమనియు—ప్రతిశిరయు ఆనందరసవాహిక లయిపోయినవి. ప్రకృతియంతయు నాతని కిప్పుడు మాతృప్రేమానుగుంఫితమై వినూత్నత శోభను వెలయుచుండెను.

సంధ్యాదేవి రెండుపళ్ళెరములలో బహువిధ రుచ్యభక్ష్యముల నుంచెను.

శిశిరుడు సవినయముగ దల్లీ! "నాకిట్టివేళ భోజనముచేయు నలవాటులేదు" అని సునయనీదేవితో ననెను.

"కుమారా! ఒక్కరోజున వేళదప్పి భుజించినంత మాత్రమున ప్రమాద మేమున్నది?" అని సునయనీదేవి సానురాగముగ ననెను.

అనుల్లంఘనీయమును—శిరోధార్యమును నగు సునయనీదేవి యాజ్ఞ ననుసరించి శిశిరుడు భోజనముసేయక తప్పినదికాదు. రజత శిశిరు లిరువురును భోజనముజేయ దొడగిరి. సంధ్యాదేవి వారివెనుక నిలచి వీవనతో విసరుచుండెను.

"అమ్మా! ఇప్పుడు విసరవలసిన యవసర మేమున్నది!" అని శిశిరుడు సునయనీదేవితో ననెను.

"కుమారా! సేవ సేయుటయేకదా స్త్రీల ధర్మము!" అని సునయనీదేవి యనెను.

ఆమాట వినినంతనే మాతృప్రేమయు, పుత్రవాత్సల్యతయు, పత్నీ స్నేహమును శిశిరుని బూర్తిగ ముగ్ధుని గావించెను.

రజతు డింతదనుక నేమియోచించెనో కాని, తల్లినిజూచి "అమ్మా! నీకోడలికి గొంచమైన నాంగ్లభాషను జెప్పింపకున్నచో ఈకాలమున నిత్యవ్యవహారములుగూడ సాగవు. నే నెన్నిమారులు చెప్పినను నీవు శ్రద్ధవహింపకున్నావు" అనెను.

"అయిన నీవేల ప్రయత్నింపరాదు ?" అనెను సునయని.

"నా కవకాశమేది ? ఆమెకు విద్యాగరపుట కగుకాలములో నొకటి, రెండు పద్యములనుగాని, చక్కని కథనుగాని, మంచి ప్రహసనమునుగాని, వ్రాసికొనినచో మిగుల ప్రయోజనవంతముగ నుండును గదా !" అనెను రజతుడు.

"పోనిమ్మా ! నీ కవకాశములేకున్న నింకెవ్వనిచేనైన జెప్పింపరాదా ?" అని సాభిప్రాయముగ సునయనీదేవి నుడివెను.

"ఇతరు నెవ్వనినో నియమించుటకంటె వదినెగారి శిక్షాభారవహనమును శిశిరునకే సమర్పించిన నెంట్లుండునో ?" అని రజతుడు మందహాస మొనరించుచు ననెను.

సంధ్యాదేవి మందహాసమున మోము వ్రాల్చి నిలిచియుండెను.

శిశిరసహాయమున నేదియో మహాకార్యమును రజతుడు సాధింపనున్నాడని నిశ్చయించి సునయనీదేవి రజతునిజూచి "మంచిది నీయాలోచనము మిక్కిలి యుత్తమమైనది"

అనుచుండగనే శిశిరు డామెమాటల కడ్డమువచ్చి "అమ్మా ! వదినెగారికి విద్యగరపుటకు యోగ్యురాలగు ఉపాధ్యాయినినిగాని, సత్ప్రవర్తకుడును—కాలము గడపినవాడును నగు నుపాధ్యాయునిగాని నియమించుట సముచితమగు"నని చెప్పెను.

రజతుడు పక్కుననవ్వి "సోదరా ! నీవట్లనరాదు. మేముబాగుగ నాలోచించితిమి, యీ కార్యభారమును నీపై నుంచినాము. ఇంకెట్టి ప్రమాదమునులేదు" అనెను.

భోజనము లైనవి. చేతులుగడుగుకొని వచ్చుసరికి సంధ్యాదేవి యొక పళ్ళెరముతో సుగంధబంధురితమైన తాంబూలమును దెచ్చి తొలుత శిశిరున కీయబోయెను.

## ద్వి ధ్యాయము—2

“...నెగారూ ! నాకు దాంబూలము వేయు నలవాటులేదు” అని శిశిరుడు మెల్లగా జెప్పెను.

“అయిన ఏలకులను వక్కలను దెచ్చియిచ్చెదను” అని రజతునకు దాంబూల మిచ్చి, యామెలోని కేగెను. ఇదియంతయు శిశిరున కాశ్చర్యముగ నుండెను.

“ఈయింట సింధుజవ్వనముగల మనోహరాంగియును నిస్సంకోచముగ నపరిచితుడనగు నాతో సంభాషించుచున్నదే ! ఇంతటి స్నేహమా ! ఇంతటి బంధుత్వమా ! వీరు బ్రహ్మసామాజికులా ! క్రైస్తవులా ! కారు. వీరిమందిరమున అనేక హైందవ దేవతాచిత్రము లున్నవే ! వీరు సనాతనధర్మమార్గావలంబులే. సందియము లేదు. ఎంతటి వినిర్మల విశాలహృదయములు ! వీరి విశ్వమానవప్రేమ నన్ను ముగ్ధుని జేసి వేయుచున్నదే !” అని శిశిరుడనేక రీతుల నాలోచించుకొనుచుండెను.

సంధ్య ఏలకులను, వక్కలను దెచ్చి శిశిరున కిచ్చెను. శిశిరుడు వానిని గైకొనెను. ఒక్కమారు కనులెత్తి సంధ్యాముఖ మండలమును జూచెను. ఆమెముఖమున ప్రకాశించు అకుటిలస్నేహదీప్తి కాతడు ప్రవంచితుడై పోయెను.

జన్మప్రభృతి శిశిరుడిట్టి వినిర్మలప్రేమామృతమును జవిజూచియైన నెరుగడు. అతనిజీవితమున నారుచి నెరుంగుట కిదియే మొదటిసారి. వాని ప్రత్యవయవమునుండియు కృతజ్ఞతాప్రదీప్తి బయలు వెడలుచుండెను. తానేగుటకు సునయనీదేవిని ఆజ్ఞవేడెను.

“కుమారా ! తల్లినివిడిచి పుత్రు లెందుబోయెదరు ? నీవిచ్చటనే యుండుము. నీవదినెయందు లక్ష్యముంచుము” అని సునయనీదేవి అనురాగ ముట్టిపడ బలికెను.

## అధ్యాయము—2

"అమ్మా! ఈ విశాలజగత్తున మీకంటె నాకెవ్వరును 'నా' యన దగువారులేరు" అని డగ్గుత్తికతో నెట్లో శిశిరుడనెను.

"నేటి కెట్లో నిన్ను వదలుచున్నాము. రేపటికి నీవు తప్పక రావలెను. నీకై నేనును, మీవదినెయు నెదురు చూచుచుందుము" అని ప్రగాఢస్నేహమున నాతని ముద్దిడుకొనెను.

అపుడు శిశిరుని ప్రతిరక్తాణువును విద్యుద్విచలిత మైనట్లయ్యెను. సర్వాంగములను బులించి పోయెను. కనుగవనుండి యానందాశ్రువులు శతసహస్రభిన్నములై బొటబొట రాలదొడగెను. అప్పటి యాతని హృదయతత్త్వమును మేము వ్రాయబూనుటకంటె, మేధానిధులగు మీయోచనమున కందించి విడుచుటయె సమంజసముకదా!

తల్లియొద్దను వదినెయొద్దను, అనుజ్ఞవడసి, రజతుని కరమును గ్రహించి "అన్నా! ఇంకనైన ననుజ్ఞ నిచ్చెదవా?" అని యడిగెను.

రజతుడు శిశిరునితోగూడ ప్రధానద్వారమువరకు వచ్చెను. "సోదరా! నీవు వెడలుటకు నే నెట్లంగీకరింపగలను? నీ నిరోధవశమున నేటికి వెడల నిచ్చుచున్నాను. రేపటినుండియే నీవు సంధ్యకు పాఠము జెప్పవలెను సుమ్మా!" అనెను.

"ఇది యుచితముకాదని నేను మరల జెప్పుచున్నాను. వదిన గారి కింకొక యుపాధ్యాయుని నియమించుట శ్రేయోదాయకము. సౌందర్యవతియగు దరుణికి జదువుసెప్పుటకు అవివాహితుడగు యువకుని ఉపాధ్యాయునిగా నేర్పరచుట సమంజసము కాదు. నా ప్రవర్తనముతో బరిచయము మీ కిసుమంతయును లేదు. మీకు నాయెడగల పరిచయము ఒక్కనాటిదేకదా?"

అని శిశిరుడనుచుండగనే రజతుడు మందహాస మొనరించుచు "సోదరా! నీవు యోగ్యుడవనియు—శిక్షిత యువకుడవనియు—

నాతల్లికి ద్వితీయపుత్రుడవనియు—నాకు సోదరుడవనియు మేము తలంచుచున్నాము. నీవు దృఢచిత్తముగల ధర్మభీరుడవని కాళిదాసు పలుమారులు చెప్పియుండెను.

సంధ్య నాభార్య. మాకిరువురకును అవిచ్ఛిన్నమగు పరస్పర స్నేహముకలదు ఆమె యేయన్యపురుషునితో స్నేహ మొనర్పదలచి నను, నేను నిరోధింప బూనుకొనను. ఆమె స్వేచ్ఛనరికట్టి, ఆమెస్వాతంత్ర్యమును నాహస్తగత మొనరించుకొని, ఆమెనొకగదిలోబెట్టి, తాళము వేయజాలను. కాంతలను కఠిననిర్బంధములలో నుంపదలంచుట సమంజసమును, సౌఖ్యదాయకమునుగాదు. నీ వామెకు ఉపాధ్యాయుడుగా నుండుట యిసుమంతయేని యనుచితముగ మాకు దోచుటలేదు. నీ వీవిషయమున సంకోచించుటకుగూడ నవకాశములేదు'' అనెను.

అది యంతయువిని శిశిరుడు విస్మితుడయిపోయెను.

“సోదరా! రాత్రి యగుచున్నది. రేపు కళాశాలలో గలసికొందము. బండిలో బుస్తకములున్నవి. తీసికొనుము'' అని రజతుడనెను.

రజతుని యనుమతి వడసి శిశిరుడు బండిలో గూరుచుండెను. బండి నడువదొడగెను.

రజతుడు తల్లియొద్దకు వచ్చెను. సునయనీదేవి రజతుని జూచి “కుమారా! శిశిరుడు మిక్కిలి బీదవానివలె నున్నాడే!'' యనెను.

“జననీ! అసహాయుడు—అత్యంతదరిద్రుడు'' అని రజతుడు చెప్పెను.

“అతని కాత్మీయు లెవ్వరును లేరా?'' అనెను సునయని.

“అది నాకు తెలియదు. కాళిదాసున కాసంగతి తెలిసి యుండును. వానియింటనే శిశిరుడు నివసించుచున్నాడు. ప్రతిమాసమును

శిశిరుడు వనమాలీదాసునిపేర బదిరూప్యములను బంపుచున్నాడనియు, మనీయార్డరురసీదుతప్ప మరేవిధమగు లేఖలు నతనిపేర వచ్చుటలేద నియు, శిశిరు డెవ్వరికిని లేఖలు వ్రాయువాడు కాడనియు, గాళిదాసు వలన దెలిసికొంటిని" అని రజతుడు చెప్పెను.

"వానిముఖలక్షణములు గుర్తించినచో వానిహృదయమున నేదియో భయంకర మానసికవేదన యున్నట్లు స్పష్టముగ దెలియ వచ్చుచున్నది. ఆవేదనా బీజరహస్యమును దెలిసికొనవలెను. లేకున్న వాని నాదుఃఖమునుండి విముక్తుని జేయజాలను" అనెను సునయని.

కావుననే నేను వాని నిచటికి దీసుకొనివచ్చినాను. నీవే వాని రక్షణమొనర్పగలదానవు—నీవు వానిసంతప్తహృదయమునకు శాంతి ప్రదాన మొనర్పగలదానవు" అనెను రజతుడు.

"రేపటినుండియు శిశిరుడు సంధ్యకు పాఠమును జెప్పటకు వచ్చునా ?" అని సునయని యడిగెను.

"రమ్మనియే చెప్పితిని. రాకున్నచో బలవంతమున బట్టి తెచ్చె దను. అత డొకచోట జదువుచెప్పుచున్నాడు. అందువలన అతనికి నెల కేనిమిదిరూప్యములు లభించును. మన మేమిచ్చిన బాగుగ నుండును !" అనెను రజతుడు.

"నెల కిరువదిరూప్యములతో నతనికి సుఖదాయకముగ కాలము గడచిపోవదా ? పండుగపర్వముల నతనికివలయు వస్త్రాదుల నే నిచ్చు చుందును. అతడు నాహృదయమున నివసించి యున్నాడు. కాని వానిభావ మెట్లున్నదో నే నెరుంగను" అని సునయనీదేవి యనురాగ మొలయ బలికెను.

"నీ యనురాగభాషణము లాలించునపు డాతని నేత్రము లశ్రు మయము లయ్యెను గదా !" అని రజతుడు చెప్పెను.

సంధ్యాదేవి వింటిలో సంధ్యాజ్యోతిని వెలిగించెను. సునయనీ దేవి దీపమునకు నమస్కారమొనరించి, యీశ్వరుని ధ్యానింపదొడగెను. రజతు డటనుండి తనగదిలోని కేగెను.

# అధ్యాయం—3

శకటము రాజమార్గమునబడి మహావేగమున బోవుచున్నది. శిశిరుని హృదయము విమ్యుద్వేగమున సర్వలోకసంచార మొనరించు చున్నది. ఆతని కీజగజ్జగత్తు నేఁడు చేతనమయమయి యుండెను. రస విహీనమనుకొనిన ధరాతలమునకూడ, నిర్మలమధుర ప్రేమప్రవాహము లాతనికి గోచరించుచుండెను. పురవీధులెల్ల అనురాగవాహినీ ప్లావితములైనట్టు లాతనికి గన్పట్టుచుండెను. అంతయు ప్రేమానంద మయముగ నుండెను. "నే నెంత సంకుచిత హృదయుడ నైపోయితిని! ఎట్టి క్షుద్రబుద్ధి నైపోయితిని! ఎట్టి మహాపరాధ మొనర్చితిని! నేటివరకు సహృదయతా ప్రేమభావముల వాస్తవిక స్వరూపములను మలిన మొంరించుచుంటిని—దూరముగ నెట్టివైచుచుంటిని—నన్ను ప్రేమించు మిత్రుల యనురాగమును సంశయపేక్షణముల జూచుచుంటిని—నేఁడు అంధకారమునుండి విముక్తుడనైతిని—వాస్తవిక ప్రేమ తత్త్వమును దెలిసికొనగలిగితిని. ఏమి న్యాభ్రాతి! దరిద్రుడనగు నాయెడల వారికి గల దయను ప్రేమగా—బుత్రవాత్సల్యతగా సమర్థించుకొనుచున్నాను. ఎంతటిమూఢుడను! వారికి నాపై నిశ్చయముగ ప్రేమయేకలదు— పుత్రవాత్సల్యతయే కలదు. ఒక సామాన్య దరిద్రునిపై నుంచదగిన దయకాదు.................. రేపటినుండి విద్యార్థులకు పాఠములు జెప్పుట మానెదను. వదినెగారికి జదువుజెప్ప నారంభింతును. కాని వారివలన ప్రతిఫలమేమియు నపేక్షింపను" అని తన మనస్సులో నిశ్చయించు కొనెను.

# అధ్యాయము—౩

ప్రతిమాసమును వచ్చుచున్న ఎనిమిదిరూపాయిల రాబడియును వదలివేసినచో వచ్చు ఇక్కట్టులను కూడ ప్రేమానందవివశుడగు శిశిరు డూహింపలేకపోయెను. నేడు శిశిరునకు కలిగిన సుఖము కఠినాతికఠిన యాతనలను కూడ సహింపజేయ సమర్థమయ్యెను. కష్టగర్భితములగు సుఖోద్రేకములకంటె సుఖమార్గదర్శకములగు దుఃఖములే మేలయినవని శిశిరున కప్పుడు స్ఫురించునా!

శకటము శిశిరుడున్న యింటిగుమ్మమునొద్దకువచ్చి యాగెను. శిశిరుడు బండిదిగి కాళిదాసునిగదిలోని కేగెను. మందహాస వదనుడై కాళిదాసాతని కెదురుగావచ్చి కరస్పర్శగావించి, కూరుచుండ జేసెను. శిశిరుడు ఆనందపులకితగాత్రు డయ్యెను వాని నేత్రములనుండి కృతజ్ఞతా దీప్తులు వెలువడుచుండెను. కాళిదాసునిచేయి పట్టుకొని మందహాస మొనరించుచు "మిత్రుడా! నీవును, రజతుడును నాకు బంధువులగుటచే నేను ధన్యుడను—కృతార్థజన్ముడను—భాగ్యవంతుడను—రజతుడు అగర్భశ్రీమంతుడే యైనను. అతనిస్వభావ మత్యంత సరళమైనది. అతని తల్లియగు సునయనీదేవి దయాస్వరూపిణియే"

అనుచుండగనే కాళిదాసు మహానందభరితుడై "అచ్చటనేమి జరిగినది?" అని యాతురతతో నడిగెను.

"కాళిదాసూ! వాని యనురాగ విధానము అనుభవైకవేద్యమే కాని చెప్పనలవికాదు. నేను రజతునిభవనము స్వర్గభోగానుభూతికై నాకు లభించినది. పుట్టినదాది మాతృప్రేమయన నెట్టిదో యెరుంగని నాకు నేడు అఖండమాతృప్రేమా ప్రవాహములో స్నాన మొనరించు మహాభాగ్యము సంప్రాప్తించెను. నేడే జననియంకమున నా శైశవావస్థ యారంభ మైనట్లు తోచుచున్నది" అని చెప్పుచుండగనే కంఠము రుద్ధమయ్యెను. నేత్రము లశ్రుమయము లైపోయెను.

కాళిదాసు హృదయముకూడ గరుణానందరసతరంగితమయ్యెను. ఈతపస్వి యింతటి ప్రసన్నచిత్తుడై యుండుట నాత డింతకుమున్నెన్నఁడును జూచియుండలేదు. ఈతని మోమున నిట్టి యుల్లాసలక్ష్మి యెన్నఁడును వానికి గన్పట్టియుండలేదు. ఇట్టి ప్రేమపూర్ణ మధురవాక్యములీతని ముఖగహ్వరమునుండి యిదివర కెన్నఁడును వెలువడియుండలేదు. నేఁడీ సరళస్వభావుని హృదయమునుండి ప్రేమానంద వాహినులు సంపూర్ణవేగమున బొంగిపొరలివచ్చుచుండుట కాళిదాసు చూచెను. కాని యావేగమును నిరోధింపఁదలంపలేదు.

శిశిరునిభుజముపై చేయుంచి "సోదరా! నీస్వభావమున కనుకూలమగు సాంగత్యమే నీకు సంప్రాప్తించుచున్నది. ఇంక నీకు సర్వేశ్వరుఁడు సౌఖ్యప్రదుఁడగుగాక" అని యనురాగముతో ననెను.

## అధ్యాయం—4

మరునాటి సాయంసమయమున గళాశాలవిడిచినపిదప రజతుఁడు శిశిరునియొద్దకువచ్చి, వానిచేయి పట్టుకొని, తనబండిలోనికి దీసికొనిపోయి, కూరుచుండఁజేసెను. కొంచెముసేపటిలో బండి రజతుని భవనమునొద్ద నాగెను. రజతశిశిరులిరువురును బండిలోనుండి దిగి, గదిలోని కేగిరి. రజతుఁడు పుస్తకములను టేబిలుపై నుంచెను. సేవకుఁడువచ్చి పాదరక్షలను విప్పివేసెను. రజతుఁడు దుస్తులను మార్చివేసెను. "సోదరా! లోపలికి పోవుదము రమ్ము!" అని శిశిరునితో ననెను.

"ఇప్పుడేపోయి [illegible] నదనేగారు [illegible] జెప్పుకొనువేళ యగునప్పుడు పిలిపింపుము" అని శిశిరుఁ డనెను.

రజతుఁడేమియు జెప్పజాలక మౌనముతో వెడలిపోవుచు "అన్యుల గృహములో ప్రతిదినము భుజించుట శిశిరునకు మొగమోటమువలె

గన్పట్టుచున్నది. కావున పట్టుదలజూపుట ఉచితముకాదు. అట్లుండిన నే శిశిరునకు శాంతికలుగును'' అని యనుకొనెను.

శిశిరు డొంటరియై నిశ్శబ్దముగ కూరుచుండి పుస్తకమును జూచుకొనుచుండెను! ఒక్కక్షణమైనను గాలేదు. గదిలోనికి సునయనీ దేవి వచ్చెను

శిశిరుడు శీఘ్రపాటుతో లేచి నిలచి, సునయనీదేవికి ప్రణామ మొనర్చి, యొక పక్క నిలిచియుండెను

''తనయా! అపరాధునివలె నిలచినావేల? తల్లి చెంతకు వచ్చుటకు బుత్రుడు లజ్జితుడగుట యొందైనగలదా? ఇట్లు లజ్జాతురుడైన పుత్రు నెందును గనలేదు. రమ్ము! లోనికిరమ్ము!'' అని సునయనీదేవి శిశిరుని చేయిపట్టుకొని యెత్తెను. తప్పించుకొనుట కవకాశము లేక పోవుటచే శిశిరుడు వెడలెను

చలువరాతి తిన్నెపై రెండాసనములు సిద్ధముగనుండెను. ఒక దానిపై రజతుడు కూరుచుండి యెవ్వరిరాకకో ప్రతీక్షించుచుండెను.

సంధ్య భోజనపదార్థములను వడ్డించియుండెను.

లోనికేగి సునయని శిశిరునిజూచి ''అదిగో ఆ యాసనమున గూర్చుండుము! కోడలు పాకపూజ యొనర్చును. ఆమె స్వహస్తము తోడనే సామగ్రులన్నియు సిద్ధపరచినది. నాచేతినైన సోకనిచ్చినది కాదు'' అని దరహాసముతో ననెను.

సునయనీదేవి హృదయసరళతయు—ప్రేమగాంభీర్యమును శిశిరుని ముగ్ధహృదయుని జేసివేసెను. నోరుమాటాడజాలక యతడు వెడలి వేదికపై గూరుచుండెను.

''మరదిగారింకను నే పాలింపవలసియున్నది'' అని సంధ్య మంద హాసమొనరించుచు వీణారవానుకారియగు కంఠస్వరముచ ననెను.

శిశిరుడు విస్మితుడై సంధ్యవైపు చూడసాగెను. సంధ్య యేమియు జెప్పక మందహాసమొనర్చుచు అటనుండి వెడలిపోయెను.

ఇది యంతయు శిశిరుడు గ్రహింపజాలక సంశయవీక్షణములతో సునయనీ రజతులను జూడదొడగెను.

ఇంతలో సంధ్య యొక సుందరమగు పేటికను గైకొని వచ్చి శిశిరునియెదుట నిలిచెను ఆ పేటికయందలంకారసామగ్రులును, రూప్యములు నుండెను. ఇట్లుంచుటలోగల యభిప్రాయమేమియో శిశిరుడు గ్రహింపజాలకపోయెను, విభ్రమవిస్ఫారిత నేత్రుడై శిశిరు డెల్లవైపు దేరిపారజూచి. ఇదియంతయు నేమి ?" అని యడిగెను.

"పాదపూజ" అని సంధ్య నవ్వుచు ననెను.

శిశిరుడు పేటికను స్వీకరించుట కనిష్టతను సూచింపసాగెను.

అది గని రజతుడు శిశిరునిజూచి "సోదరా! సంధ్యచేతులు కంపించుచున్నవి. ఆమెచేతులనుండి పెట్టెనందుకొనుము. లేనిచో క్రిందపడి పగిలిపోవు" ననెను.

తప్పకపోవుటచే శిశిరుడు సత్వరమున సంధ్యచేతిలో నుండి పేటిక నందుకొనెను.

రజతుడు కరతాళధ్వనులు గావించి "సోదరా! చెప్పలేదా, ఇప్పుడు తీసుకొనవలసివచ్చినదా!" అని చమత్కారముగ ననెను.

శిశిరుడు సిగ్గుపడెను. శుష్కహాసము గావించి నగవులనుండి యొరగి చూచుచుండెను. సునయనీ సంధ్యలును బక్కున నవ్విరి.

"పెట్టెనొకచో నుంచుకొని భోజనమునకు లెమ్మా" అని సునయనీదేవి శిశిరునితో ననెను.

# అధ్యాయం—5

శిశిరుడు సంధ్యకు ఉపాధ్యాయుడుగా నియుక్తుడయ్యెను. నెలకు ఇరువదిరూపాయలు వేతనమును, సాయంకాల భోజనమును ఏర్పాటు జేసినారు. శిశిరునకు ఈవ్యాపారము మిక్కిలి కష్టదాయకముగనే యుండెను. వేతనమును బుచ్చుకొనుటయే గాక, ప్రతిదినము ను భోజనముసేయుచుండుట అనుచితమని యతడు తలంచుచుండెను. వేతనమును గ్రహించుట కాతడు మిగుల లజ్జించుచుండెను. 'నేటినుండి వీరియింట భోజనముచేయ'నని ప్రతిదినమును నిశ్చయించుకొనుచుండును. కాని సంధ్యా సునయనులు వచ్చి భోజనమునకు బిలువగనే పెంపుడు లేడివలె, నిరుత్తరుడై వారివెంట బోవుచుండును. వాని దిరస్కరించు సాహసము లేకుండెను. అందుచే వానిచిత్తమున శాంతి నెలకొనుటలేదు.

శిశిరుని ఆంతరంగిక వేదనమును రజతుడు తెలిసికొనలేకపోలేదు. వాని హృదయవేదనము శాంతింపజేయు నభిప్రాయముతో అప్పుడప్పుడు రజతుడు వాని నివాసమున కేగుచు, శిశిరునివలన అల్పాహారాదులు స్వీకరించుచు వింతపుస్తకమేదేని గానుపించిన దీసుకొనుచుండెడివాడు. దీనిచే శిశిరునిహృదయమునకు గొంతశాంతి గలుగుచుండెడిది.

ఒకనాడు రజతుడు కాళిదాసుతో నేమియో మాటలాడి వెడలిపోయెను. పిదప కాళిదాసు వచ్చి "శిశిరా! నిస్సహాయులగు విద్యార్థులు దూరదేశమునుండి వచ్చి పెక్కుయిక్కట్టులకు లోనై విద్య నేర్చుకొనుచున్నారు. కావున వారలసహాయముకొరకు ఈ మాసమునుండియు ఇంటియద్దెను సగబాలు తగ్గించితిని" అని ఈగృహాధికారి వర్తమానమంపెను. కావున నీవు క్రిందగదికి ఇవుడిచ్చుచున్న యద్దెకే నీవు పైభాగమున నివసింపవచ్చును" అని చెప్పెను.

## అధ్యాయము—౫

గృహాధికారి యౌదార్యమునకు శిశిరు డెంతయు సంతసించెను. కళాశాలకు బోయినవెంటనే గృహాధికారియొనర్చిన త్యాగవిషయమును రజతునితో జెప్పెను. రజతుడు దరహాస మొనరించి యూరకొనెను. రజతునిచందము శిశిరునకు వింతగాదోచెను. పిదప గాళిదాసునితో రజతునిచందము నెరిగించెను.

కాళిదాసువిని, నవ్వి "శిశిరా! ఇందు వింతపడదగిన దేమున్నది! ధనాఢ్యుడగువానికి ఎంతయధిక ప్రశంసావిషయమైనను జులకనగా గన్పట్టదా? పోనిమ్ము! నీవుమాత్ర మీవిషయము మాటవరుసకైనను గృహాధికారితో ననవలదు. "ఈవిషయ మతిరహస్యముగ నుంచవలసిన" దని యాతడు నొక్కినొక్కి చెప్పియున్నాడు."

నాటిసాయంకాలము చదువుచెప్పు సమయమున సునయని సంధ్యలతో మాటవరుసగా గృహాధికారిని ప్రశంసించెను. వారుగూడ ఇది గొప్పవిషయముగా దలంచినటుల శిశిరునకు గానరాలేదు.

శిశిరునిమాట లాలించి సునయనిదేవి "మావాయింటిలో నుండి ఏల శ్రమపడుచున్నావు? నీతల్లియొద్ద ఇరువురుపుత్రులుగూడ ఉండుటకు జాలినంత భవనమున్నదే" యని చెప్పెను.

"తల్లీ నాగృహమున నెట్టి కష్టమును లేదు"

శిశిరునిమాటలు ముగియకపూర్వమే సునయనీదేవి ఆతని ముఖముపై జూపులను బరపి "కుమారా! నీగృహ మెచ్చటనున్నది?" అని యడిగెను.

ఆమాట వినినంతనే శిశిరునిమోము విషణ్ణమై, శోభావిహీన మయ్యెను. హృదయము దుఃఖావిలమగుటచే నేత్రము లశ్రుపూర్ణము లయ్యెను. పెదవులు కంపించుచుండెను. మాటాడజాలక అట్టె స్తంభితుడై పోయెను.

## అధ్యాయము—౫

అతని యవస్థను సునయనీసంధ్యారాజతులు జూచి సంచలిత హృదయులై పోయిరి. సునయనీదేవి [illegible] "వత్సా! నీవిట్టి దారుణదుఃఖభారముతో నేల జీవయాత్ర సేయుచున్నావా!" అని అనురాగపురస్సరముగ నాతని వీపుపై జేయినిడి "తనయా! నీ కాప్తులెవ్వరును లేరా? వనమాలీదాసుడను వాని కెవనికో ప్రతిమాసమునను బదేసిరూపాయలు మనియార్డరుద్వారా పంపుచున్నావని వినుచున్నాను వానికిని నీకును గల సంబంధమేమి?" అని యడిగెను.

ఇంతవరకు శిశిరుని విస్మృతికుహరమునం దడగియున్న అనుభూత తరంగములు వనమాలీప్రశంసచే మరల పొంగిపొరలదొడగెను. శిశిరుడిప్పుడు సంపూర్ణముగ శోకవిహ్వలుడయ్యెను. కనులనుండి యశ్రుధారలు వడివడి గారజొచ్చెను. కంఠము నిరుద్ధమగుటచే ప్రత్యుత్తరమీయజాలక తలవంచి కూరుచుండెను.

"నాయనా! నీ యాకారమును, నీ నిత్యవ్యాపారముల యందలి విధానమును, నీ యభ్యాసములును, నీ భోజనభాజనాదులును నేను మిక్కిలి సూక్ష్మదృష్టిచే గమనించుచున్నాను. నీవు రాజపరివార సంబంధములగు సుఖభోగముల ననుభవించియున్న వాడవనియు, గారణాంతరములచే భాగ్యసౌధమునుండి జారిపడి, ఈదుఃఖసాగరతరంగముల నిదులాడుచుంటివనియు, ఏదో దారుణమార్మికవేదన అహర్నిశము నిన్ను గబళించుచున్నదనియు, నే దలంచినాను" అని సునయనీదేవి అశ్రుపూరితనేత్రయై యనెను.

శిశిరుడు [illegible] కూరుచుండెను కనులనుండి సెలయేళ్ళవలె అవిరళాశ్రుధారలు గారుచుండెను.

"నాయనా! ధైర్యమునువీడి యేడవకుము! నీ దుఃఖకారణము నా కెఱిగింపుము. ఎట్టి ప్రబల ప్రయత్నమున నైన నే దాని నంత

మొందింతురు. నీచరిత్రమును జెప్పుటకు నీకెట్టికష్టమునుగాని, ఎట్టి అటంకమునుగాని యున్నచో జెప్పనద్దు. లేనిచో నీబాధను నీ తల్లి కెరిగింపకుండుట సమంజసముకాదు"

శిశిరుడు తలపైకెత్తి సానుభూతివీక్షణముల నామెనుజూచి "తల్లీ! మీయొద్ద మాటుపరుపదగిన గూఢవిషయము లేవియును లేవు. నాజీవిత ఘటనము దుఃఖమయమైనది—తీవ్రనారకీయబాధకంటె గురుతరమైనది—అతి తీక్ష్ణమయినది. మిముబోలిన సరళహృదయులు వినదగినది కాదు. వినజాలరనికూడ జెప్పగలను. హేతుమగు—బాధాజనకమగు—నా దుఃఖమయచరిత్రను నానోట జెప్పింపవలదని ప్రార్థించుచున్నాను" అని డగ్గుత్తికతో వెక్కుచు జెప్పలేక చెప్పలేక యెట్లో చెప్పెను.

సునయనీదేవి శిశిరునికనులు తుడుచుచు "నాయనా! అంతటి హృదయ విదారకమైనచో నీచరిత్రమును జెప్పవద్దు" అని యూరడించెను.

రజతుని హృదయము కలతజెందెను. సంధ్యాసుందర ముఖారవిందము విషాద రేఖాకళంకితమయ్యెను.

కొంతసేపైన పిదప శిశిరుడు సునయనీదేవిముఖమునుజూచి "తల్లీ మాతృప్రేమామృతవంచితుడనైన నేనిపుడు మాతృలాభము నొందితిని. స్నేహస్వరూపిణియగు వదినెగారు—ఉదారహృదయులగు అన్నగారును నాకిపుడు సంప్రాప్తించిరి. మీరు ముగ్గురును నావిపత్సాగర తరంగముల నంతమొందించి, నా దుఃఖభూయిష్టజీవిత కావ్యమును సుఖాంతముగ మార్చివేయుచున్నారు. భాగ్యదేవత యిపుడు నాపై దనసంపూర్ణ తేజశ్శక్తులను బ్రసరింపజేయుచున్నది. నా హృదయము బాధావిరహితమై—సంతోష సంస్థానమయ్యెను. పురానుభూత తరంగములు

విస్మృతి కుహరమునుండి రేగుచున్న పుమమాత్రము కొంత తీవ్రయాతన ననుభవింపక తప్పకుండెను" అని చెప్పజాలక చెప్పజాలక మిక్కిలి కష్టముతో నెట్లో చెప్పను.

సునయనీ దేవియు, సంధ్యయు నేడ్చుచుండిరి. రజతునకుగూడ హృదయము భారమయ్యెను.

"నేడు వదినెగారికి పాఠములేకపోయెను. రేపు వేగముగవచ్చి యీలోపమును దీర్చుకొందు" నని శిశిరుడనెను.

సంధ్య దుఃఖము నాపుకొని "రేపు శనివారము, మేము సంగీతము నేర్చుకొనుదినము. అయినను విద్యుత్తు వచ్చులోపల గొంతవరకు జదువగలను" అనెను.

"విద్యుత్తు ఆరుగంటలకు వచ్చును. ఈతడు నాలుగుగంటలకే వచ్చి పాఠముజెప్పివేయవలెను. తరువాత నేను గోష్ఠికి దీసికొనిపోయెదను" అని రజతుడనెను.

"అన్నగారూ! నే నిచ్చటికివచ్చి యప్పుడే యైదుదినములైనది నాకింకెవ్వరితోడను బరిచయములేదు. విద్యుత్తెవరు? గోష్ఠియేమి?" అని శిశిరు డడిగెను.

"విద్యుత్తు నాసఖి ఇపుడు బి. ఏ. చదువుచున్నది. ఆమె ప్రతి శనివారమును నాకు సంగీతము జెప్పవచ్చుచుండును" అని సంధ్య రజతుడు చెప్పుటకు మున్నే చెప్పినది.

"ప్రతిశనివారము నిచటనొక సాహిత్య పరిశీలక మిత్రమండలి సమావేశమగుచుండును. సభ్యులెల్లరును దమతమరచనలను వేర్వేరుగా వినిపించుచుందురు. వానిపై వ్యాఖ్యానములు వివరింపబడుచుండును. సంగ్రహాస్త్రతికాసంపాదకులగు భూధరబాబుగారీమండలికి సభాధ్యక్షులు

నేను కార్యనిర్వాహకుడను నీవును సభ్యునుగా నుండవలెను" అని రజతుడనెను.

"సభ్యునకువలయు నియమములెవ్వి ?" అని శిశిరుడడిగెను.

"భయపడదగు విషయము లెవ్వియులేవు. ప్రతిసభ్యుడును సంవత్సరమునకు మూడుస్వీయరచనల వినిపించుచుండవలయును" అనెను రజతుడు.

"సోదరా ! ఇంతకంటె నధికమగు భయహేతువేమిగలదు ? పరీక్షకు దప్ప మరెప్పుడును స్వయముగానేదియు వ్రాసియెరుంగని వాడెట్లు గోష్ఠిలో ప్రవేశింపసాహసింపగలడు ?" అనెను శిశిరుడు.

శిశిరుని భయావస్థగాంచి, సంధ్యకు జాలిపుట్టినది. కాని ఆమె హృదయమున నొకవిధమగు ననిర్వచనీయగర్వముకూడ కలిగినది. "మీరు కొంచమైనను వ్రాయజాలరా ? మాయన్నగారు చిన్ననాటి నుండియు చక్కని కావ్యములను వ్రాయుచున్నారే ! అని యామె రజతు నుపలక్షించుచు శిశిరునితో ననియెను

తనపత్ని తన్ను ప్రశంసించుటను విని రజతు డుప్పొంగిపోయెను. "సంధ్యా ! నీవట్లనుట ఉచితము కాదు. నా వ్రాతలునీకు మనోహరముగ దోచుట సాధారణవిషయము. కాని శిశిరునితో దానిని పొగడి చెప్పుట యెల్లవిధముల ననుచితము" అనెను రజతుడు.

సంధ్య సిగ్గువడినది.

'రజతరాయునినామము వంగభాషాజ్ఞానముగలవారిలో నెరుంగని వారెవరుందురు ? సంగ్రహ పత్రికారాజములో ప్రతిమాసమును ప్రకటితమగుచుండు రజతకవితారచనల కెదురుచూడనివారెవ్వరున్నారు ? అట్టి స్థితిలో వదినెగారు అన్నగారిని ప్రశంసించుటలో గొప్పదనమేమున్నది!' అని ఆమెను సంతోషింపజేయుటకు శిశిరుడనెను.

సంధ్యాముఖకమలము వికసించినది. తనంత నేసిగ్గు క్షీణించిపోయినది. సంధ్య మోముపై కెత్తి, ఒక్కసారి రజతునివంక జూచినది. "నేను చెప్పినదే సత్యము" అని యామెదృష్టి స్పష్టముగా జెప్పుచున్నది.

ఈ ప్రశంసను విని రజతుడు దరహాసితవదనుడయ్యెను. పుత్రి ప్రశంసను వినుటచే సునయనీదేవి హృదయముగూడ సంతోష వికసితమాయెను. శిశిరునివీపుపై జేతితోదట్టుచు "ఈ వాదమున కెప్పటికేని యంతమున్నదా లేదా? రెండుయామములు కావచ్చినది. రేపు మరల వాదించి పూర్తి జేసుకొనవచ్చును లెండు! అందరమును నిద్రింపబోవుదము ఇంతరాత్రివరకు మేల్కొనియుండుట మంచిదికాదు. శిశిర! నీవును ఇచటనే నిద్రింపుము" అని సునయనీదేవి యనెను.

"లేదమ్మా! నేనుపోవుటకు నేడేమియు వేళమించలేదు. అనుజ్ఞనొసంగుడు" అని శిశిరుడు సునయనీదేవికి వందన మొనర్చెను.

"పుత్రా! దినమున కెన్నిమారులు వందనముచేయుదువు?" అనెను సునయని.

శిశిరుడు గంభీరస్వరముతో "ఏచరణముల ప్రతిక్షణము—"

శిశిరుని వాక్యము ముగింపకముందే సునయనీదేవి అడ్డువచ్చి, "మంచిది! నీవిపుడు వెడలుము" అనెను.

శిశిరుడు ప్రసన్నచిత్తుడై తననివాసమున కేగెను.

## అధ్యాయం—6

సంగీతమున సర్వజీవనసమ్మోహనశక్తి కలదు. దానిని సహజమధుర మార్దవస్వరము గల మనోహరాంగులు నేర్చుకొని, రాళ్ళు కరగునట్లు పాడునప్పుడా స్థల మిలాతలస్వర్గమై యుండుననుటలో సందియమేమి! దానికితోడు నాట్యాభినయనములుగూడ నేర్చికొనినచో జెప్పనగిన

దింకేమున్నది ! పాతివ్రత్యవిభూషితలగు కులకాంతలయొద్దనే యీ సంగీతవిద్యయున్నయెడల నాదేశము స్వర్గభువనమేకదా !

నేడు శనివారము. ఈరోజు సాయంకాలము సంధ్యకు ఆటపాటలు నేర్చుకొనుకాలము. రాత్రి రజతుని గోష్ఠీసమావేశము. ఇది యంతయు దలపోసి శిశిరుడు కళాశాలనుండి వచ్చినవెంటనే అల్పాహారమొనర్చి సంధ్యకు పాఠమును జెప్ప గూరుచుండెను. కొంచెముసేపు బోధించిన పిమ్మట "వదినగారూ ! మా అన్నగారు వ్రాసిన పుస్తకములొక్కసారి చూడవలెనని యున్నది. ఎక్కడనున్నవి ?" అని యడిగెను శిశిరుడు.

సంధ్య ఆటనుండి లేచి రజతుడు వ్రాసిన పుస్తకముల దెచ్చుటకు లోనికేగెను.

శిశిరు డొంటిపాటున గదిలోనుండెను. ఇంతలో నొకతరుణీమణి యచటికి వచ్చెను. ఆమె వయస్సు ఇంచుమించు ఇరువదియేండ్లుండును. ఆమెశరీరము పుష్పకోమలము. ముఖకాంతి మనోజ్ఞముగ ప్రకాశించుచుండెను. ఆమె సౌందర్యము—సౌష్ఠవము—కమనీయమై హృదయాకర్షణసమర్థములు. ఆమె ప్రత్యవయవమునుండియు లావణ్యరస ముట్టిపడుచుండెను. ఆమె ముఖమునుండి ప్రగాఢవిద్యుత్తు ఒలికిపడుచుండెను. వినయభావ మామె కాంతికమలనీయతలను మరింత హెచ్చుచేయుచుండెను. భ్రమరపంక్తుల దిరస్కరించు నామె కేశపాశమత్యంతరమణీయముగ సంస్కరింపబడియుండెను. సునీలకోమల కనీనికాద్వయము తళతళ మెరయుచు చంచలమై యుండెను. ఆమెయున్నత భ్రూవిలాసములు ముఖరమణీయతను మరింత పెంపుజెందించుచుండెను. ఆమె శరీరమున నాలుగైదు సాధారణ భూషణములుండెను. ఆమె ముఖమున

నిరంతరము విరాజమాన విద్యు త్ప్రభవలె దోచు మందహాస రేఖ ఆ భూషణములకంటె మిక్కిలి హృదయంగమ మగుచుండెను

ఆమెను జూడగనే "ఈమెయే విద్యుత్తు" అని శిశిరు డను కొనెను. ఆమె ముఖదీప్తి శిశిరుని నేత్రములకు మిరిమిట్లుగొలిపెను. వానిచిత్తము చాంచల్యమొందెను. విద్యుత్ప్రభావమున శిశిరుడు కించిత దేహుడయ్యెను.

శిశిరుడు తృష్ణాసహితనయనముల నామె వంక రెప్పవాల్పక చూడసాగెను. విద్యుత్తు చిరునగవుతో మెల్లగా గదిగుమ్మమువద్ద నుండియే "సంధ్య యెచటనున్నది?" అని యడిగినది. ఆమాటయం దెంత మాధుర్యమున్నదో—ఎంత యానందమున్నదో—ఎంత మోహాన శక్తియున్నదో వానికే యెరుక.

ఎడముగానుండి పాడిమాటల నెన్నిటినైనను జెప్పవచ్చును. కాని యొంటిపాటున గనుల మిరుమిట్లుగొలుపు కాంతలు తారసించినపుడెంతటి వారికిని మనసు నిలుపదరము కాదుకదా!

విద్యున్ముఖనిర్గతమగు వాక్యము అమృతధారవలె శిశిరునకు దోచినది. ఆమధురసుధావచనము శిశిరునిపై నత్యద్భుతవ్యాపార మొనరింపదొడగెను. లేచి నిలువబడి "ఇటగూరుచుండుడు! వదినెగారిప్పుడే వత్తురు" అని శిశిరుడు కంపితస్వరమున ననెను.

సంకోచములేక పడకకుర్చీపై సౌఖ్యముగ విద్యుత్తు గూరుచుండెను. ఆమె నవ్వకున్నను ఆమె ముఖస్థితమగు దొంటి మందహాస రేఖ పరుగెత్తుచున్నట్లున్నది.

విద్యుత్తు కూరుచుండిన పిమ్మట శిశిరుడు తనచోటున గూరుచుండి, క్షణకాలము మిన్నకుండి, పిమ్మట "మీపేరేనా విద్యుత్తు?" అని శిశిరు డడిగెను.

ఈ ప్రశ్నముచే విద్యుత్తునకు గొంచెము నవ్వువచ్చినది. కాని వెంటనే సిగ్గు ఆవరించినది. తలవంచుకొని "ఔనండీ" అని మెల్లగా ప్రత్యుత్తరమిచ్చి "తమకు నాపరిచయముగలిగినది కాని, నాకింతవరకు దమపరిచయసౌభాగ్య మలవడలేదు" అన్నది.

ఆ ప్రాగల్భ్యపూరితవచన విన్యాసమునకు శిశిరుడు ముగ్ధుడాయెను. ఏమో చెప్పబోవునంతలో వెనుకనుండి సంధ్య "వీరు నామరదిగారు. వీరినామము శిశిరబాబు" అని చెప్పుచు గదిలోనికి వచ్చినది. శిశిరవిద్యుత్తులనడుమ నిలువబడి యామె యొక్కసారి వారి దెస జూపులు బరపి నవ్వుచు "మీరు నాశిక్షకురాండ్రు. వారునా శిక్షకులు" అని విద్యుత్తుతో ననెను.

విద్యుత్తు వాడిచూపుక్కలు సంధ్యాముఖముపై నిగిడ్చెను.

"విద్యుత్తూ! నాయభిప్రాయ మదిగాదు. ఇపుడు నీమనస్సున నేమి యాలోచనకలిగినదో దాని నీశ్వరు డెవుడేని జరితార్థ మొనరించినయెడల, అంతకంటె అధికసంతోష విషయము మాకింకేమియు నుండజాలదు" అని నవ్వుచు ప్రత్యుత్తర మొసంగినది సంధ్య.

విద్యుత్తు అన్యవిధముగా భావించుకొని సిగ్గుపొందినదని తలంచి "వదినెగారూ! ఆపుస్తకము నొక్కసారి చూతునా?" అని సంధ్యతో శిశిరు డనెను.

"నేడును, రేపును దానిని జూడవలసిన యావశ్యకత లేదు. అంతకంటె మనోహరవిషయములు మీకు లభించును" అని చెప్పి తన కొంగుచాటున మొగమును మాటుబరచికొని నవ్వుకొనుచున్నది సంధ్య.

అబ్బురపాటున సంధ్యమోమును జూడదొడగినాడు శిశిరుడు.

## అధ్యాయము—౬

"సఖీ ! ఇంతనవ్వునకు గారణమేమి ?" అని కృత్రిమ రోషమున నడిగినది విద్యుత్తు.

తప్పకపోవుటచే అప్రాకృతిక గంభీర భావమును దాల్చి "ఇందు నాదోషమేమి కలదు ? మరదిగారితో మీరు సంభాషించుట జూచి నవ్వునుంప నుంపగలనా ?" అన్నది సంధ్య.

"నేను మీమరదిగారితో నేమి రహస్యాలాపములాడితిని ?" అని నవ్వుచు మెల్లగా నన్నది విద్యుత్తు.

"సహజాకర్షణ పటిష్ఠులగు మరదిగారితో నొంటిపాటున మాటలాడుట మంచిపనికాదుసుమా !" అని నవ్వుచు సంధ్య యనెను.

"వదినెగారూ ! అన్నివిధముల నేను మీ మాటలు బాగుగలేవు. అన్యులను దనవశముచేసికొనువిద్య నేను నేర్చుకొనలేదు. కాని యెవ్వరేని నన్ను దమవశ మొనరించుకొనగోరినచో, నేనొక్క-క్షణకాలము వనే వారికడుడ నగుచుందును. మీరెట్లు నన్ను ... ... ... ..." అని శిశిరుడు చెప్పుచుండగనే—

సంధ్య విద్యుత్తునద్దకు బోయి కూరుచుండి ఆమెచెవిలో "సఖీ! వినుము. మరదిగారు నీకద్దకే విజ్ఞాపనపత్రముపంపుచున్నారు. నీ విద్దాని గైకొనుట యుచితము" అని చెప్పినది.

విద్యుత్తుమోము లజ్జారుణవిలసితమయ్యెను. మోమును బ్రక్కకు ద్రిప్పుకొని సంధ్యను కొనగోటితో బాడిచెను.

సంధ్య ఉలికిపడెను.

"వదినెగారూ ! విద్యుద్ఘాతా తాడితులైనట్లున్నారే !" అన్నాడు శిశిరుడు.

మితిలేని సిగ్గునుబొంది సంధ్యను పట్టుకొని "నీవును, మరదియు పరిహాసము లాడుకొనుడు. నే బోవుచున్నాను" అన్నది విద్యుత్తు.

ఆమె మోమువైపు తనమోమును త్రిప్పి "కాదు. అక్కినన్ను మను గాజాలదు. మరదిగారూ మీగానమును వినుటకు కుతూహలురై యున్నారు. కంఠము పియానావద్దకు" అని పలికి విద్యుత్తును బియానా వద్దనున్న కుర్చీమీద కూరుచుండబెట్టినది. సంధ్య.

"వదినెగారూ ! మీగానము నే నెన్నడును వినలేదు" అన్నాడు శిశిరుడు.

"నాపాట యింకొకరోజున వినిపించెదను. నేమును, రేపును విద్యుత్తువంతు" అన్నది సంధ్య

పియానాపై వ్రేళ్లునడుపుచు "రా సోదరీ! నీవును నాతో స్వరము మేళవింపుము" అన్నది విద్యుత్తు.

"మొదటి భావము మిక్కిలి శక్తికలదికదా? కావున నేను నాస్వరమును మేళవించి మరదిగారి ప్రథమభావమునకు భంగము గలిగింపను" అని సంధ్య యనెను.

విద్యుత్తు కృత్రిమక్రోధమున గన్నులెఱ్ఱజేసి సంధ్యవంకజూచి మరల బియానాతో స్వరమును మేళవించి పాడనారంభించినది.

"మధుర మధుర మురళీ—మంజుల గీతాలహరీ
ప్లావిత పావన బృందా—వన సంచారీ శౌరీ !"

శిశిరుడును గానమృదంగవాద్యాదుల గడితేరినవాడు. విద్యుత్తు కంఠనాద మత్యంతమధురము—సరసము—శ్రావ్యము—నై యున్నది గాన విద్యయందామె యత్యంత నిపుణురాలు. పాటముగించిన పిదప "మీరు గానవిద్యలో మిక్కిలి నిపుణలు, మీకిందు జక్కని నేర్పరితప మలవడినది" అని శిశిరుడు ప్రశంసించెను.

"మాతల్లి గానవాద్రితాదుల ప్రసిద్ధురాలు. చిన్నతనమునందే యామె ప్రసిద్ధుడగు శిక్షకునిమూలమున నీవిద్య నలవరుచుకొన్నది. నే నీవిద్యను మాతల్లివద్దనే నేర్చుకొంటిని" అన్నది విద్యుత్తు.

"మరదిగారూ! విద్యుత్తు నాట్యకళలోగూడ మిక్కిలి నేర్పు కలదిసుండీ" అని నవ్వుచు అన్నది సంధ్య.

విద్యుత్తు సంధ్యవంక జూచి సత్వరమున లజ్జావనతముఖి యయ్యెను.

శిశిరుడు లజ్జితయైన విద్యుత్తునుజూచి, "కులకాంతలు నృత్తగీతాదులు నేర్చుకొనుట గౌరవమున కీసుమంతయేని లోపమయినపని కాదు. హైందవనారీమణులు నృత్తగీతాదుల నేర్చుచుండి రనుట కెన్నియో యుదాహరణములు మన పురాణములందును, నాటకములందునుగూడ గనబడును. ప్రత్యేకముగ చారణులను సాంసారిక స్త్రీలే మనదేశమున నృత్తగీతాది వినోదములకొరకు ఏర్పరుపబడి యుండిరి. నాట్యకళాభిజ్ఞత వ్రీడాజనకమును, హీనమునగు విషయముకాదు. ప్రాచీనకాలమున నీపవిత్రదేశమున నాట్యకళాభిజ్ఞత ఉత్తమగుణముగా గౌరవింపబడుచుండెడిది. నేడావిద్య సర్వవిధముల లోపించిపోయినది. పొరపాటుననైన దానిని "ఇది నావిద్య" అని యనుకొనుటగూడ దప్పుగా గన్పట్టునంతటి కళంకితమై పోయినది. ఈదేశమున ఆనంద పులకితులగుట కిదియొక సాధనముగా నుండకపోవుటయే దీనికి గారణము. నృత్తగీతగానములచే హృదయతంత్రులబ్బి వికసించును. ఇతరదేశములందుగూడ నాట్యకళ సాంఘికానంద సాధకమున కొక యంగముగా నిపుడంగీకరించుచున్నారు. మీరొక్క మధురగీతమును బాడవలయును. నేను తబలా వాయింతును" అని శిశిరు డనెను.

అ ధ్యా య ము—౮

సంధ్య విస్మయముతో "మీరు సంగీతశాస్త్రమున గూడ పూర్ణవిద్వాంసులై యుండియు మా కింతవరకు జెప్పక దాచిపెట్టినారా" అని మెల్లగా విద్యుత్తుతో "చూచితివా! మరదిగారు ఈ సంగతిని నేటివరకు జెప్పక నీకొరకు దాచియుంచినా" రనెను.

విద్యుత్తు కోపపుజూపుల సంధ్యవంక బరపి, ఒక కటాక్షమును శిశిరునివంక బరపెను. విద్యుత్కటాక్షములనుండి యొక యపూర్వజ్యోతి వెలువడినది.

"ఈచర్చవలన నిసుమంతయు ప్రయోజనము గానుపించుట లేదు" అని శిశిరు డనెను.

సంధ్య యపుడే తబలా శిశిరుని చెంగటనుంచి "అభ్యర్థన మట్లుంచి, స్వరసమ్మేళన మొనర్పుము" అనెను.

విద్యుత్తు పియానా వాయింపసాగెను. వెంటనే శిశిరుడు తబలా తీసికొని పియానాస్వరముతో తబలా స్వరమును గలిపెను. విద్యుత్తు పాడదొడగెను.

గానవాద్యము లొకదాని కొకటి యీడుదీయక చిత్రాతిచిత్ర గమనములతో—వినూత్నకల్పనములతో—సర్వజీవ సమ్మోహనకర శ్రావ్యరీతులతో—మధురము—మార్దవము—మనోజ్ఞమునై యుండెను.

పాట ముగించినపిమ్మట సంధ్య ఆనందపూరితచిత్తయై "మరది గారూ! మీరు ఈ విద్యయందింతటి చతురులయ్యు నేటివరకు మాతో జెప్పక వినదగినవారు వచ్చువరకును మాటుపరచినారే! మీ మధుర మంజులగానము నాకొరకైనను వినుపింపరా!" అనెను.

"వదినెగారూ! మీమాటలు వేరురీతిగా నున్నవి. కలకంఠ కంఠీ కలనిస్వనములవలె కర్ణకఠోరకాకస్వరమా? నే నంతటి యున్మత్తుడనా?" అని నవ్వుచు శిశిరు డనెను.

"మీయభ్యర్థనము లేకయే నేను పాడినానుకదా! ఇంక మీరో" అనుచు లజ్జాభరాక్రాంతములగు చూపులు శిశిరుని మోముపై విద్యుత్తు బరపెను.

నేనుగూడ మీరు కోరకుండ గాన మొనర్ప సిద్ధముగానున్నాను. కాని, నాగానమును విని మీరు పరిహాసముమాత్రము చేయవలదు" అని శిశిరు డనెను.

సంధ్య కల్పితక్రోధమును జూపి "నేను గోరినప్పుడు మీరు పాడుటలేదు. కాని విద్యుత్ప్రభావము మీపైనిగూడ కార్యకారి యయినదే ?" అనెను.

పరిహాసభాషణముల నాప సంధ్యమోమును విద్యుత్తు మూసి వేసెను. సంధ్య యామెచేతులను ద్రోసి నవ్వసాగెను. శిశిరుడు లజ్జించి ప్రేమపూరితనేత్రముల విద్యుత్తుదెస జూచి "సరే మీరు తబలాతీసి కొనుడు. వదినెగారికి సారంగి నొసంగుడు. నేను పియానా ప్రయోగింతును" అని శిశిరుడనెను.

పియానా వాయించుచు శిశిరుడు పాట నారంభించెను.

నీదరహాస విలాస వికాస వి
నిర్మల కోమల చంద్రికలన్
కాళిందీతట కాననాంతర
ప్రసవకుంజములు భాసిలుతన్.

సంధ్య విద్యుత్తుదగ్గరకుబోయి మెల్లగా "మరదిగారు గాన వ్యాజమున దన హృదయగతసందేశమును నీవద్దకు బంపుచున్నారు" అన్నది సంధ్య.

శిశిరగానానంద వివశురాలగు విద్యుత్తునకామాట వినిపించుట లేదుకాబోలును, మారుమాటాడక కొంతసేపైనపిదప "పురుషుల కంఠములు గూడ ఇంత సౌకుమార్యము—శ్రావ్యత—చమత్కృతియు నుండునా !" అని తనవిస్మయభావమును విద్యుత్తు ప్రకటించెను.

## అధ్యాయము—6

శిశిరుని సౌమ్యసుందరమూర్తిచే—అగాధ విద్యాగాంభీర్యముచే-సుకుమార వాక్ప్రతిభచే—విద్యున్మనఃఫలకమున వాని ప్రతిబింబము ముద్రితమైపోయెను. సంధ్యాదేవి సంభాషణములును కటాక్షములును దానిని సజీవముగ జేయుచుండెను.

పాటజాలించి శిశిరుడు వెనుముద్రిప్పి చూచెను. ద్వారమునొద్ద సునయనీదేవిగారును, రజతుడును ముగ్ధులై నిలిచియుండుట జూచెను. ఆక్షణముననే వారును గదిలోనికివచ్చిరి.

"కుమారా! నీ కుక్షిలో నింత పాండిత్యమును దాచి యుంచుకొనినావా! ఇంత మనోహర మధురగానము నెన్నడును వినియుండ లేదుసుమా!" అని సునయనీదేవి యనురాగకంఠమున ననెను.

శిశిరుడు తటాలునలేచి "అమ్మా! తల్లిచూపులో తనయుడెప్పుడును అనుపమానుడేకదా?" అని అనెను.

సునయనీదేవి హృదయము వాత్సల్యవిలసితమయ్యెను. "పుత్రా! నీవు నాపుత్రుడవై పక్షపాతమొనరించు చున్నావుసుమా! నీవంటి సోదరుని బొందుటచే రజతుడు ధన్యుడైనాడు" అని సునయనీదేవి యనెను.

"అమ్మా! మీకు నేనొక రత్నస్వరూపుడనే. కాని, మీ చిన్న కుమారునియెదుట నా ప్రతిభ నిలువజాలదుసుమా" అని రజతుడు పరిహాసముగ బలికెను.

"అన్నా! వంగదేశమున రజతరాయని నామపరిచయము లేని చోటులేదు. శిశిరునిపేరు వినినవాడొక్కడును లేడుకదా!" అని శిశిరుడు త్వరపడుచునుడివెను.

"సోదరా! అది కొలదికాలములో దెలియగలదు. వేళయైనది గోష్ఠికిబోవుదము రమ్ము! నేడచ్చటివారిని గూడ నీగానకళాకౌశలమున వివశులజేయవలెను" అని రజతుడు నుడివెను.

శిశిరు డటనుండి లేచి, విద్యుత్తువంకకు దృష్టినిమరలించి "నేటికి క్షమింపుడు !" అని కంపితస్వరమున ననెను.

విద్యుత్తు ముఖమును వంచుకొని "మరల దర్శనభాగ్యమును గలిగింపుడు !" అని వినమ్రస్వరమున ననెను.

రజత శిశిరులటనుండి వెడలిరి. పిదప సునయనీదేవియు వెడలి పోయెను.

"వీరెవ్వరు ? ఇంతకు మున్నెన్నడును వీరి నిచట జూచియుండ లేదు. వీరి ప్రసంగమైనను వినలేదు" అని విద్యుత్తు సంధ్యాదేవినడిగెను.

ఆమాటకు సంధ్య మందహాసమొనరించి "ఏల ! చల్లచల్లగా వికలభావ మభివృద్ధియగుచున్నదే ! చూచితివా ! నీకంగీకారమగుచో నేనాప్రయత్న మొనరింతును" అని పరిహాసముగా ననెను.

"సంధ్యా ! నేడేమోకాని నీవు వింతగా—మిగుల జమత్కారముగా—మాటలాడుచున్నావు. ఆతని కళాకౌశలము హృదయంగమ మైనంతమాత్రమున వానితో మైత్రియొనరించుకొనవలెనా ? బాగు బాగు !" అని కృత్రిమక్రోధమున విద్యుత్తు పలికెను.

"ఏమి ! కళాకౌశలమేగాని వారియందు ఉత్కృష్టమానవ లక్షణములు నీకు గోచరించుటలేదా ? అట్టివారు నీకెట్లు లభింతురు ?" అని తానెరిగియున్నంతవరకు శిశిరుని సంగతిజెప్పి "సఖీ ! ఈయన జీవితము దుర్భేద్యరహస్యవేదనామయమును—గభీరమునునై యున్నది. వనమాలీదాసుడను వాడొక్కడుమాత్రము దీని నెరింగియుండునని తలంచుచున్నాము. అనతికాలముననే వానివలన నీ రహస్యము భేదింప నున్నాము. లేకున్న నీతని దారుణ మార్మికవేదనము మాన్పజాల" మని సంధ్యచెప్పెను.

విద్యుత్తు మారుమాటాడలేక మిన్నకుండి తనచేతితో సంధ్య చేతిని గట్టిగాబట్టుకొనెను. ఆమెహృదయమున నపు డేయేవిధములగు భావము లుదయించుచుండెనో ఆమె వ్యక్తము చేయజాలకుండెను.

కొంచెముసేపు ఇరువురును మిన్నకుండిరి. పిమ్మట విద్యుత్తు "సఖీ ! నేడింక పాటసాగదు. నేటికి నన్ను విడువుము. రేపు శీఘ్రముగ వచ్చెదను" అనెను.

సంధ్యయును అల్లేతలంచినది కావున "సరే! అటులనేకానిమ్ము. ఇపుడు గోష్ఠీసమాలోచనాశ్రవణమునకు బోవుదమురమ్మ" అనెను. ఇరువురును లేచిరి.

# అధ్యాయం—7

రజతునితోగూడ శిశిరుడు గోష్టిలో ప్రవేశించెను—పూర్ణుడు—ఖగేనుడు—హేముడు—కాళిదాసు మొదలగు సహపాఠులును ఇంక మరికొందరు పెద్దమనుష్యులును గూరుచుండి యల్పాహారముల జేయు చున్నారు.

గదిలో ప్రవేశింపగనే రజతుడు "ఇతడే నాప్రియబంధువగు శిశిరబాబు. ఈయనసంగతియే మీతో నేను జెప్పియుంటిని. నే డితడు తన మృదుమధురగాన సుధారసధారలచే మీకర్ణపుటముల దనిపి పవిత్ర మొనర్చును" అనియెను.

తరువాత శిశిరునివైపు జూచి, "సోదరా ! ఈసభ్యుల పరిచయము నీకు గలుగజేయుచున్నాను. "వీరే సంగ్రహ పత్రికా సంపాదకులగు భూధరబాబుగారు — వీరు వంగదేశ సుప్రసిద్ధ కవిపుంగవులగు నరేశ చంద్రసేనుగారు—వీరు ప్రసిద్ధ విచిత్ర కథాలేఖకులగు సంతోష కుమార ఘోషుగారు—వీరు సుప్రసిద్ధేతి హాసవేత్తలగు యతీంద్రనాథ మిత్రగారు" అని వేర్వేరుగా అచటిసభ్యులను శిశిరునకు దెలియజేసెను.

## అధ్యాయము—7

శిశిరు డెల్లరికిని వందనములొనర్చి యొకచోట గూరుచుండెను. భూధరబాబుగారు తమనామమును సంపూర్ణముగ జరితార్థమొనర్చు చున్నారు. ఆయన పొడవైనవాడు—స్థూలాంగుడు—మోటుగనము గలవాడు—ఆతనివయస్సు రమారమి నలువది సంవత్సరములుండును. నరేశ చంద్రసేనుడు దుర్బలుడు—పలుచనివాడు—శ్యామలవర్ణుడు—పొడవరి—విశాలమగు ముఖమువాడు—బట్టతలవాడు—ఫ్రెంచ్ కట్ మీసమువాడు—ఇరువదియారేండ్ల ప్రాయపుయువకుడు. యతీన్ బాబు నున్నగా గడ్డము మీసములు గీయించుకొన్నవాడు—బంగారు సులోచనములు దాల్చువాడు.

భూధరబా బొకానొక గిరిగహ్వరమువలె నోరుచాపి పుంజీలకు పుంజీలుగా మిఠాయియుండలను వేసికొని నములుచుండెను. తప్పక పోవుటచే నరేశుడు రోగియయ్యు భయపడుచు భయపడుచు నొక చిన్నయుండలోని ముక్కను దినుచుండెను. తక్కినవారు భూధర బాబుగారితో ప్రతివాద మొనర్చుటకు సిద్ధముగానుండిరి.

ఒకనిండు పూరీపై నాలుగైదు బంగాళదుంపలనుంచి దానిని ముఖవివరమున బడవైచికొనుచు "అట్లయినచో రజతబాబుగారూ! నేడు గోష్ఠీకార్య సమారంభము సంగీతముతోడనే కానిండు! మేము అల్పాహార మొనర్చుచునే పాట వినుచుందుము" అని భూధరబాబుగా రనిరి.

రజతుని యిచ్ఛానుసారము శిశిరుడు హార్మోనియమును వాయించుచు బాడదొడగెను.

"శ్యామల కోమల— జలధర సన్నిభ
మోహనరూపా—మురళీకృష్ణా!"

పాటముగిసినది. భూధరబాబుగారు చేతిగుడ్డతో మూతిదుడుచు కొనుచు "శిశిరబాబుగారూ! మీది వెలితిలేని కంఠము—అని చమత్కృతిగా" ననెను.

భూధరబాబుగారిట్లనినంతనే యుపస్థితమిత్రమండలి వారివ్యంగ్య భావమును జక్కగా గ్రహించినవారివలె యొక్కపెట్టున పకపక నవ్వసాగిరి. తక్కుంగలవారును వారినిగని కిలకిలధ్వనితో నవ్వదొడగిరి.

రజతబాబుగారూ! ఇక మీరు మీవిచిత్రకల్పనాకలిత చిత్ర కథానకముల వినిపించెదరుగాక" అని భూధరబాబుగారనిరి.

రజతుడు తన స్వకపోల కల్పితకథానకముల వినిపింపసాగెను. శ్రోతలెల్లరు నిశ్శబ్దముగా వినసాగిరి. ఒకమాటయైనను విడిచినచో యనర్థము సంభవించునను భావముతో దత్తచిత్తులై వినుచు, సంతోషమును బట్టజాలక పైకి వెలువరించుచు, నడుమనడుమ నొక్కొక్క మాటకు నాసికయు గనుబొమలను జిడిముడివడజేయుచు, దామును అట్టికథల వ్రాయదలంచుచు పరవశులగుచుండిరి.

రజతుని రచనలు శిశిరునకేమాత్రమును నభిరుచి గలుగజేయ జాలినవికావు. కథానకములైనను పూర్ణయోగ్యతాబద్ధములై యుండి పటుల దోచలేదు. వర్ణనశైలియు రోచకముగ లేకుండెను. కాని ముగింపు కాగానే "ఏమి భావపూర్ణ రచనావిశేష విలసితములుగ నున్నవి!" అని యనెను.

"సర్వశ్రేష్ఠములు కాకున్నను, శ్రేష్ఠములనిచెప్పుట కెవ్విధమగు సందేహమునులేదు. ఇవ్విధమగు జమత్కార కథానకములను ఒక్క రవిబాబుగారు మాత్రము సాధనాయుగమున వ్రాసియుండిరి" అని ఖగేనుడనెను.

తన్నుప్రశంసించుచుండుటను విని రజతుడు పులకితుడై పోవుచుండెను. వ్రాసినదానినెత్తి బల్లపైనుంచెను.

భూధరబాబుగారు "దానిని సంగ్రహపత్రిక కొసంగుడు" అని కోరెను.

"ఇది మీ ప్రస్తవయే. కాని దానిని నేడే ముగించితిని. కొన్ని చోటుల సవరింపవలసియున్నది కావున సవరించి మీకు పంపించెదను" అని రజతుడు సగర్వముగ ననెను.

శిశిరుని దెసజూచి "శిశిరబాబుగారూ! ఇంక మీవంతున్నది" అని భూధరబాబుగారనిరి

"నాకు వ్యాసములు వ్రాయునలవాటు లేదండీ" అని సిగ్గుతో శిశిరుడనెను.

"స్వతంత్రగ్రంధ రచనాసమర్థత లేనిచో ఏదియోయొక క్రొత్త పుస్తకమును దీసికొని ఖండనమండనాది సమాలోచనములైన లిఖింపుడు" అని ఖగేనుడనెను.

"మీకు సహజముగనే స్వతంత్రగ్రంథరచన మలవడవలసి యున్నది. మీమిత్రుడింతటి ప్రతిభాశాలియగు లేఖకుడై యుండ మీయందీయభావముండరాదు. మీబుద్ధి చాలతీక్ష్ణమైనది. రెండుమూడు దినముల అభ్యాసముచేతనే మీకు స్వతంత్రరచనావిధాన మలవడునట్లు రజతబాబుగారు చేయగలరు" అని యతీనుడనెను.

రజతుడతిగంభీరుడై "నేను శిశిరునకు నేర్పెదను. ఈవచ్చు శనివారమునాడు శిశిరుడు తనలేఖను చదువునట్లొనర్తును. ఈశనివార భారము నింకెవరిపైనైనను మోపుడు" అనెను.

"ఈశనివారమున నేను వహించుచున్నాను. ఆనాటికి శిశిరబాబుగారేదో చిన్నకథను వ్రాయనూహింతురుగాక" అని సంతోషుడు ఆత్రముతో ననెను.

# అధ్యాయము—7

"ఇదియే బాగుగనున్నది. 'మధురేణసమాపయేత్' అనునట్లు నేను శిశిరబాబుగారిని మరల నింకొక్క పాట పాడునట్లు నిరోధించెదను" అని భూధరబాబనెను.

శిశిరుడు సత్వరముగ హార్మోనియమును దీసికొని శ్రుతి మేళగించుచు "నా నేర్చినరీతి నీగోష్ఠీసేవ గావించువాడను. వ్యాసములు మున్నగునవి వ్రాయుగోడవ నాకుం గలుగజేయకుందురుగాక" అని యనెను.

రజతుడు శిశిరునిచెంతనే నిలిచి మిత్రభావద్యోతకంబుగ నతని భుజములపై చేతులుంచి "సోదరా! భయపడుచుంటివేమి? నేను పూర్తిగా సంస్కరించుచుందును. రెండుమూడుమారులు వ్రాయునంతలోనే దానిలోనికిటుకు నీకు దెలిసిపోవును. పిదప నెవ్విధముగు కఠినతయు నుండజాలదు. నీవు వ్రాయనారంభించుటకు ముందుగా, నే వ్రాసిన వ్రాతలను సావధానముగ జదువుకొనినచో నీకెల్లవిషయములును దేటతెల్లముగ దెలియబడగలవు" అని యనెను.

"పదార్థముల నధికముగ నలగగొట్టినగాని కవిరాజు కాజాలడా?" అని నవ్వుచు శిశిరుడనెను.

ప్రక్కగదిలో గూరుచుండి సంధ్యావిద్యుత్తులు గోష్ఠీవ్యాపారములన్నియు జూచుచుండిరి.

"మరవిగారి స్వభావము సరళమైనది. అందుచే ధైర్యమును వహింపజాలకున్నారు" అని సంధ్య యనెను.

విద్యుత్తు మందహాస మొనరించి మిన్నకుండెను.

"సరే ఇంక ప్రార్థనములటుంచి యొక్క చక్కనిపాటపాడుము!" అని రజతుడు శిశిరునితో ననెను.

## అధ్యాయము—7

శిశిరుడు పాడెను. గోష్ఠీకార్యము ముగించి యతిథిగణమున కనుజ్ఞనొసంగి రజతు డంతఃపురి కేగెను. విద్యుత్తున కనుమతినొసగి సంధ్యయు దనగదిలోనికివచ్చి సంగ్రహపత్రికయొక్క నూతనాంక మును జదువుచుండెను. భర్తగారు గదిలో నడుగిడినతోడనే, అభిమాన పూర్ణములగు నయనములతో "మీమానసాకాశమున నద్భుతభ్రాంతి జలదపటల మావరించినట్లు బొడగట్టుచున్నది. మీకు వ్యాసరచన మల వడినదని లోకులనందరిని వ్యాసలేఖకులుగా జేయదగునని దలపోయు చుంటిరి. ఇది కేవలము స్వాప్నికదృశ్యము. అసంభవము. రచనాశక్తి పుట్టుచాయకాని, పెట్టుచాయకాదు. అది పరమేశ్వర ప్రసాదలభ్యము ప్రయత్నసాధ్యముకాదు" అని యనెను.

పత్ని తన్ను శ్లాఘించుచుండగా విని రజతు డుప్పొంగిపోయెను. "ఔను ప్రేయసీ ! నీవనినట్లు రచనాశక్తి యీశ్వరానుగ్రహమున లభింప వలసినదే. కాని, సూక్ష్మబుద్ధులకు బాహ్యప్రయత్నమువలన గూడ నిది సాధ్యముకావచ్చును. శిశిరునిబుద్ధి మిక్కిలి చురుకైనది. ప్రయ త్నించినచో నతడు మిక్కిలి యుత్తమలేఖకుడు కాకపోయినను సాధారణ లేఖకుడుగానైన నవశ్యముగాగలడు. సందియములేదు" అనెను.

"సరే బాగుగనున్నది. కాని మీరాతని బోధించుటమాత్రము మంచిపనికాదు. కావున మీరీ విషయమున బ్రయత్నము జేయవలదని నామనవి" అని సంధ్యయనెను.

"ఏమనుచున్నావు! నేనీ ప్రయత్నమును విడనాడుట సము చితముకాదు. శిశిరు డెంతటి నిస్సహాయుడు! ఎంతదీనుడు! ఎంతదుఃఖి తుడు! వ్యాసలేఖన మలవరుచుకొని వార్తాపత్రికలకు వ్యాసములు వ్రాసి పంపుకొనుచుండి నెలనెలకు నేదో కొంతడబ్బు సంపాదించు

కొనగలను. ఈపనికి సహాయపడి నేనతని కెల్లవిధముల దగినయేర్పాటు చేసెదను" అని రజతుడు దయార్ద్రభావమున ననెను.

"మీరీ విషయమును బాగుగ యోచించినారు. ఇది అతనిజీవనమున కొకింత యాదరువు కాగల" దని సంధ్యయనెను.

"రేపాదివారము. రేపే పని ప్రారంభించెదను" అని రజతుడనెను.

# అధ్యాయం—8

మరునాడు రెండుజాములు దాటినపిమ్మట రజతుడు శిశిరుని బసకు బోయెను. నా డాదివార మగుటచే విద్యార్థులందరును విచ్చలవిడిగా నెచ్చటకో యాడుకొనుటకు బోయియుండిరి. బసలో నొంటిపాటున శిశిరుమండెను. కాగితము లిటునటు దిప్పుచు నేమియో వ్రాయుటయందు దారుమారుపడుచుండెను.

అకస్మాత్తుగా రజతుని జూచి శిశిరు డదరిపడి చెల్లాచెదరుగ బడియున్న కాగితములనెల్ల దొంగతనము చేయుచుండగా పట్టుబడి యాత్మరక్షణ ప్రయత్న మొనరించుకొననెంచు దొంగవలె బోగుజేయ దొడంగెను.

రజతుడు లోనప్రవేశించి యొక పుస్తకమును దీసెను.

శిశిరు డాపుస్తకమును లాగికొనుటకై చేయిసాచి, "సోదరా! అది మిక్కిలి రహస్యమైనది. దీని నితరులెవ్వరును జూడరాదు" అనియనెను.

రజతుడు శిశిరునిచేతిని విదిలించివైచి "మహాశయా! మునుకవేసి అడుగునీటిని ద్రావుట యెప్పటినుండి నేర్చుకొంటివి?" అని ఆపుస్తకమునందలి పది పదునైదుపుటలను ద్రిప్పిజూచి, "ఏమేమీ!

## అధ్యాయము—8

ఇది యుపన్యాసమా! బాగుగనున్నది. కాని ప్రారంభముననే యుపన్యాసములను వ్రాయబూనుట సముచితము కాదు. మొట్టమొదట చేయి పట్టుకోవలెను. పిమ్మట లోనికి జేరవలెను. నే నిన్ని దినము లలవాటు బడినపిమ్మట నిప్పు డిప్పు డుపన్యాసములు వ్రాయనారంభించితిని. భూధరబాబు మున్నగువారు నా శైలిని ప్రశంసించుచుంటిరి. కాని నాకు దృప్తిగ లేదు. కథాముఖమును అంతమువరకు నిర్వహించుకొను సమర్థత చాలకుండిన నవల వ్రాయుటకు బడిన కష్టమంతయు వ్యర్థమయిపోవును. కథానకములు బాగుగ లేకున్నను అధికకాలము నష్టము కాదు" అనెను.

శశిరుడు లజ్జించి "దీనిని నవలయని చెప్పదగదు. పెద్దకథయని చెప్పుట సమంజసముగానుండును. నాచూపున కీకష్టము వ్యర్థమే యయిపోయినది. ఎందుకనగా—అది ప్రకటించుటకై వ్రాయబడలేదు. ఒకవిధముగా నేను సమాజపు వెట్టివాడనై యున్నాను. నా మనోగత భావములను అప్పుడప్పుడు తోచినట్లు అంకిత మొనర్చితిని" అనెను.

రజతుడు మరల పుస్తకమును జదువదొడగెను. ఇందలి భాషా భావాదికములు సాధారణ శ్రేణినిసముత్పన్నములుగ దోచుటలేదు. ఆపుస్తకమును జదువునప్పు డతనికి శశిరుని మాటల కుత్తర మొసంగుటకుగూడ జ్ఞానము లేనంతటి పరవశత్వముగలిగెను. శశిరుడు సిగ్గుపాటున దలవంచుకొని కూరుచుండెను.

ఒక అధ్యాయమును ముగించి రజతుడు తలనెత్తెను. తన గొప్పదనమును ప్రకటించుటకు నాసికయు, గనుబొమలును ముడుచుకొనుచు "ప్రథమప్రయాసము గావున నిది బాగులేదని చెప్పజాలను.

కాదంబరి చరిత్రయందు నెక్కుడుదోషములున్నవి. కొంచెమస్వాభావిక మయినది. మరియు రెండవదోషము ఆమెతో ప్రశాంత నిన్ని దినములు గడచినపిదప నకస్మాత్తుగా గలుపుట యుచితముకాదు. ఏదో యొక ఘటనాచక్ర సమావేశమున గలిపినయెడల నింతకంటె అధికముగ శోభించును'' అని రజతుడనెను.

శిశిరుడు విరక్తచిత్తుడై ''దీనియం దధికముగ దోషములు నిండి యున్నవి. నేను దీని నెవ్వరికిని చూపింపకుండుట కిదియే కారణము. ఈసంగతి నాకు స్వయముగ తెలిసియేయున్నది'' అనెను.

రజతుడు మందహాస మొనరించుచు ''ఈవిధముగ దాచియుంచు టచే నిది యుపకరింపజాలదు. విమర్శించుటచే సంస్కరింపబడును. నే నిపుడు పట్టుకొంటిని. అన్నియు నింటికి దీసుకొనిపోయి చదివి చూచెదను'' అనెను.

శిశిరుడు వలదని నిరోధింపసాగెను. కాని రజతుడా నిరోధ మును లక్ష్యపెట్టుటలేదు. పుస్తకము లన్నిటిపై నధికారియయ్యెను. పోవుచుబోవుచు ''సాయంకాలము వచ్చుచో నిరుపురమును గలసి ఆలోచనాప్రత్యాలోచనల గావింతము. అంతవరకు నేను వీటిని జదువు చుందును'' అని చెప్పి రజతుడాగృహమునుండి వెడలి బండిలో గూరుచుండెను.

''వీటిని జదువుటకై మీరేల వ్యర్థముగా గాలమును బుచ్చెదరు? ఇవి మీరు చదువదగినవికావు. మరల సిగ్గుతో నేను మీయెదుట మోమెత్తి చూపించుటకైన యోగ్యుడనై యుండలేను'' అనెను శిశిరుడు.

''ఏభాషాసాహిత్యము నెత్తిచూచినను గొప్పగొప్ప విలేఖకుల యారంభావస్థ యిదేవిధముగ నుండునట్లు నీకు విదితముకాగలదు.

ఒక్కరోజుననే వారింతటికి ర్తిసి గడించిన లేఖకులై యుండలేరు" అని బండిలో గూరుచుండియే రజతుడనెను. బండి కదలెను.

ఎంత వేగ మింటికి చేరెదను ? ఎప్పుడాపుస్తకముల జదివెదను ? అను కుతూహాల మతని కడుగడుగునకు మెండయిపోవుచుండెను. ఆత డనతికాలముననే యిలుసేరెను.

తత్తరుపాటున వచ్చి భర్తనుగాంచి "ఇవియన్నియు నేమి ?" అని సంధ్యయడిగెను.

"శిశిరుడు వ్రాసిన పుస్తకములు" అని రజతుడనెను.

సంధ్య చకితచిత్తయై "ఏమి ! మరదిగారివద్ద ఇన్ని వ్రాసిన పుస్తకములుండెనా ?" అని యనెను.

"ఔను ! మహాశయుడు దొంగతనముగా వ్రాయుచున్నా"డని రజతుడనెను.

"ఎట్లున్న"వని సంధ్య యనెను.

"అప్పుడే చేయుపని యాగుటలేదు. కాని సంపూర్ణ మగునను ఆశకలదు. ఒక పుస్తకమును జదివిచూచెదవా ?" అని రజతుడు కను బొమలు ముడుచుకొనుచు ననెను

సంధ్య నవ్వి "వీనిని జదువుటకెవరు కాలమును వ్యర్థమొనర్చె దరు ? ఇంక మీ నూతనోపన్యాసమున నాల్గవ పరిచ్ఛేదమే మిగిలి యున్నది. దానిని ముగింపబోవుచున్నాను" అనెను.

"నాథా ! మీరు చదివి అందలి ముఖ్యవిషయములను ముడి మాటలలో నాకు జెప్పివేయుడు. వానియాధారమున నేను మరదిగారి నుత్సాహితుల గావించెదను" అని సంధ్య యనెను.

"ఓహో ! పీఠికాపాండిత్యబలమున నుపన్యాస వేదికలెక్కి బల్లలు గుద్దుచు, దైతక్కలాడు ఈకాలపు జంఝామారుతోపన్యాసకుల

ఫక్కిని నీవుకూడ నేర్చుకొన్నావా ? ఇక దిగ్విజయ మొనర్పగలవు' అని రజతుడు దరహాస మొనరించుచు ననెను.

"మీమాటకేమి లెండు !—మీ నవలలో మంజులికను డాక్టరు గారి యింటికి జేర్చినారు. పిమ్మట నామెగతి యేమగును ?" అని యాతురతతో సంధ్యయడిగెను.

ప్రియురాలిమాట లాలించి రజతుడు సమ్మోదితచిత్తుడై, అనురాగవీక్షణముల నామెముఖముపై బరపి పక్కున నవ్వెను.

సంధ్యయు దానికి నవ్వుతోడనే ప్రత్యుత్తరమిచ్చి "దీని యంత్యపరిణామ మెట్లుండునో తెలిసికొనుటకు నాహృదయ మాతురతనొందుచుండెను. మీరు దీని నెప్పుడు ముగింతురో తెలియకున్నది. కొద్దికొద్దిగా వ్రాయుచున్నారు. వేగముగ ముగింపరేమి ?—మంజులికారణవీరులు చివరకు గలుసుకొందురా లేదా" అని యడిగెను.

రజతుడు పుస్తకమును జదువుచు, తలవంచుకొనియే "రాణిగారి యాజ్ఞాపరిపాలన మొనరింపక తప్పదుకదా ?" అని మందహాస మొనరించుచు ననెను.

"అటులయిన వారిరువురకును గలయిక గలిగింతురుగాక—" అని సంధ్య రజతునిముఖముపై దరహాసాలంకృత వీక్షణమును బరపెను.

రజతుడు తదేకచిత్తముతో బుస్తకమును జదువుకొనుచుండుటచే దానిని గమనింపలేదు.

"ఇప్పుడు మీరు గ్రంథావలోకనాతత్పరులై యున్నారు. ఇచ్చట నేనేమిచేయవలెను ?" అన్నది సంధ్య.

"నీవుగూడ నేజేయునదే చేయుము" అనెను రజతుడు.

"ఇది క్రొత్తకలమునుండి వచ్చిన గ్రంథము. ఎట్లుండునో తెలియదు. కావున నేనేగి కుట్టుపని చేసుకొనియెదను" అని సంధ్య

ప్రక్కగదిలోని కేగి కుట్టుపని జేసుకొనుచుండెను. అపుడు విద్యుత్తు వచ్చి గదిలో ప్రవేశించెను. సంధ్య యామెను సగౌరవముగ గూరుచుండ జేసి "నేడు మిక్కిలి వేగముగ వచ్చినావే!" అనెను.

"మీరందరు నిచట నుండగా నే నొక్కతె నింటియొద్ద నెట్లుండ గలను?" అన్నది విద్యుత్తు.

"నీవు వచ్చినావుకాని నీహృదయమాంత్రికు డింకను రాలేదు" అని నవ్వుచు సంధ్య రజతునిగదిలో కేగి శిశిరవిరచితగ్రంథావళిని దెచ్చి విద్యుత్తునెదుట నుంచెను.

అది యంతయు జూచి విద్యుత్తు నవ్వుచు "ఏమియీగాలివాన!" అన్నది.

"మరణించాక రచియించిన గ్రంథపరంపర" అన్నది సంధ్య.

"వారెన్ని పుస్తకముల నెప్పుడు వ్రాసినారు" అన్నది ఆశ్చర్యముతో విద్యుత్తు.

"ఆతని జీవితమంతయు దుర్భేద్యరహస్యమయమని తొలుతనే చెప్పియుండలేదా? వారు తెరచాటున భాగవత మాడుచున్నారు" అని దరహాస మొనరించుచు సంధ్య చెప్పెను.

ఒకపుస్తకమును దెరచి కొంచెముచదివి "శైలి యెంతసరళముగ నున్నది" అని పుస్తకమును చదువుచుండెను.

"ఇంకను గొ్రత్తచేయి" అన్నది సంధ్య.

"ఏమనుచున్నావు? క్రొత్తచేయి యనియా! పత్రికాసంపాదకులవలె నీవును క్రొత్తలేఖకుల గౌరవింపవా? రసోత్పాదనా సమర్థుడగు కవి క్రొత్తవాడైననేమి? ప్రాతవాడైననేమి? నీవీ పుస్తకమును జదివినావా? ఇప్పటి సుప్రసిద్ధరచయితలలో కొలది మందిమాత్రమే యిట్లు

వ్రాయగలరు. వినుము నేను చదివెదను" అని విద్యుత్తు కొంతభాగమును జదివి సంధ్యకు వినిపించెను.

సంధ్య విస్మయావిలచిత్తయై "సఖీ! నీవనినది నిజమే. ఆతని శక్తిని నీవు చక్కగా గ్రహించినావు" అని నవ్వుచు ననెను.

"నీ చమత్కారసంభాషణమును గట్టిపెట్టి, నీయొక పుస్తకమును దీసికొని చదువుము" అన్నది విద్యుత్తు.

ఇరువురును రెండుపుస్తకములను దీసి చదువదొడగిరి. కొంత సేపటికిరువురును అన్యవిషయవిజ్ఞానవిహీనలై చిత్రప్రతిమలవలె దన్మయులై పోయిరి.

కొంతసేపటికి విద్యుత్తు తనపుస్తకమును ముగించి "ఎంతలలితమైనశైలి!—ఎంతరచనాప్రౌఢిమ!—ఎంతభావనాప్రతిభ!–" అన్నది ఆశ్చర్యమొందుచు.

ఏకాగ్రచిత్తముతో జదువుచున్న సంధ్యకు విద్యుత్తుమాటలు వినిపింపలేదు.

"సఖీ! ఎట్లున్నది రచనాకౌశలము?" అని విద్యుత్తు సంధ్య నడిగెను.

"గభీరము–అపూర్వము–మనోజ్ఞము" అని సంధ్య పుస్తకము నుండి చూపు మరలింపకయె చెప్పెను.

విద్యుత్తు మందహాసమొనరించుచు "నూత్నలేఖిని కావుననే వినూత్నకళాశోభిత కావ్యరాజముల నిర్మించుచున్న" దనెను.

ఎవ్వరోవచ్చి నిలిచిననీడ గాన్పించుటచే మోముత్రిప్పి ఆమె ద్వారముదెస జూచెను. మందహాసవిలాస భ్రాజితముఖుడై శిశిరుడు ద్వారముచెంత నిలిచియుండెను.

విద్యుత్తు ఇంచుక సిగ్గునొంది, సంధ్యను జేతితో దట్టి శిశిరబాబు గారు వచ్చినారని మెల్లగా జెప్పెను.

సంధ్య తటాలున ముఖమునుద్రిప్పి శిశిరునిజూచి లేచి, "ఓహో! గ్రంథకర్తగారా! మిమ్ముల నింక మిక్కిలి రహస్యముగ అన్యులకు గానరాకుండ దాచవలసియున్నది" అని విద్యుత్తువైపుజూచి "సోదరీ! మీదనున్న చీకటిగదిలోదాచినచో గ్రంథకర్తగారి రహస్యము లెవ్వరికిని దెలియకుండును. మన మా ప్రయత్నమొనరింతము రమ్మా" అనెను.

సంధ్యాదేవిమాటలకు విద్యుత్తు మందహాసమొనరించి "నీవద్ద వారిరహస్యమేమియు దాగుట లేదుకదా?" అనెను,

"బాగు బాగు! అప్పుడే ఆతనిని వెనుకనిడికొని యెదురుదిరుగు చున్నావా?" అన్నది సంధ్య.

శిశిరుడు నవ్వుకొనుచు వచ్చి విద్యుత్తుప్రక్కనేయున్న యొక కుర్చీపై గూరుచుండి "భావగర్భితముగ మాటామటలో వదినెగారు మిగుల నేర్పుగలవారు" అని యూరకుండెను.

"అగాధసాహితీభాండారమును—అపూర్వకవితాశక్తిని—అసాధారణకళావిజ్ఞానమును, అతినిగూఢముగ దనగర్భకుహరమున నిముడ్చుకొనిన మరదిగారి సహవాసమున నీపాటియైన గలుగదా?" అన్నది సంధ్య.

"మీకు నాయం దనురాగము గలదు. కావున నాకార్యము లన్నియు మీకు సంతోషకరములుగ నుండును. ఏదీ! మీ రాదరించి నట్లొక పత్రికాసంపాదకుడైన నారచనల నాదరించినాడా?" అని శిశిరు డనెను.

## అధ్యాయము—8

"ఎంత రసవంతముగనున్నను, క్రొత్తవాని రచనలను స్వీకరింప కుంఠుట పత్రికాసంపాదకుల వ్యాధులలో మొదటివ్యాధి—సుప్రసిద్ధ రచయితల రచనలనుగూడ ద్రిప్పివేయుచున్నగాని పత్రికకు గౌరవము గలుగదని తలంచుట రెండవవ్యాధి—" అని విద్యుత్తు చెప్పుచుండగనే! "ఏకసూత్రమున నెల్లరిని ముడివెట్టుకుము" అనుచు రజతు డాగదిలోనికి వచ్చెను.

అందరును లేచిరి. సంధ్యప్రక్కనున్న యొక యాసనముపై రజతుడు గూరుచుండెను. అందరును గూరుచుండిరి.

రజతుడు శిశిరుని జూచి "సోదరా! కాండారీపత్రికా సంపాదకులగు దక్షిణాబాబుగారితో నాకు మిగుల బరిచయమున్నది. వారితో జెప్పి నీరచనలను వారిపత్రికలలో బ్రకటించున ట్లేర్పాటు గావించెదను. నామాట నాత డతిక్రమింపజాలడు" అనెను.

"కాండారీపత్రిక సుప్రసిద్ధమైనదికాదే! భూధరబాబుగారితో జెప్పి సంగ్రహాపత్రికలో బ్రకటింపజేయుము" అనెను సంధ్య.

క్రొత్తలేఖకునకు సంగ్రహాలో స్థానము దొరకునో దొరకదో నేను నిశ్చయముగ జెప్పజాలను. అయినను భూధరబాబుగారితో మాటలాడిచూచెదను" అని రజతుడనెను.

రజతుని మాటలకు శిశిరుడు లజ్జితుడై "రజతబాబూ ప్రతిభ జాలని నావ్రాతను బలత్కారముగ బ్రకటించి నన్ను హాస్యాస్పదుని గావించుట సముచితముకాదు" అని శిశిరుడనెను.

"నీ వట్లనుకొనవలదు. ఇప్పటి సుప్రసిద్ధవిలేఖకు లెల్లరును దొలుదొల్త నీయిక్కట్టునకు లోనైనవారే. ఒక్క నాకుమాత్ర మీ కష్టము కలుగలేదు. భూధరబాబుగారు గోష్ఠీసందర్భమున నావ్రాతల నాలించి తమంతదామె కోరి తీసుకొనిపోయిరి. ఇప్పుడాసంగతు లేల?

నిన్ను భూధరబాబుగారియొద్దకు దీసికొనిపోయెదను వచ్చెదవా ?'' అని రజతుడు శిశిరునడిగెను.

"ఇప్పుడే వెడలవలసినంతటి యత్యవసర మేమున్నది ? ఇంకొకప్పుడు చూడవచ్చును—" అని శిశిరుడనెను.

ఆమాటవిని రజతుడు మందహాసమొనరించి విద్యుత్తు ముఖము నొక్కసారిచూచి మరల శిశిరునితో "సోదరా! నీచిత్తమిపు డన్య విషయాక్రాంతమైనట్లున్నది. నేనేగెదను'' అని యటనుండి వెడలెను.

శిశిరుడు లజ్జాపూర్ణవీక్షణముల విద్యున్ముఖమండలముపై నొక్క మారు బరపెను. ఆమెమో మరుణరాగరంజితమై యుండుటగాంచెను. దానికి గారణము అనురాగమో—విరాగమో—సంక్షోభమో— లజ్జయో ఆత డూహింపజాలకపోయెను.

ఇదియంతయు జూచుచున్న సంధ్య "మరదిగారూ ! మీయన్న గారు సంగ్రహపత్రికాసంపాదకునితో మాటలాడి మీలేఖల నాపత్రికలో ప్రచురించున ట్లేర్పాటుజేయుటకే వెడలిరారు. ఇంక మీ రహస్య లేఖలన్నియు బయలుపడగల''వని శిశిరునితో ననెను.

"సంధ్యా ! ఇట్టి యపూర్వకల్పనావిలసితములగు రచనలను బ్రకటింపవలెనని పత్రికాసంపాదకులను బ్రార్థించుటయు—నిరోధించుటయు, ఈలేఖలను—ఈలేఖకునిగూడ నిశ్చయముగ నవమానించుటయె యగునుసుమా !'' అని విద్యుత్తు ఉద్వేగపూరితస్వరమున ననెను.

విద్యుత్తు పలుకులచే సంధ్యాహృదయమున సమ్మోద సంక్షోభమొక్కసారి బొడసూపెను. శిశిరునిపై దనకుగల యనురాగము విద్యుత్తు వెలువరించుటచే సమ్మోదమును—దన నాథుని

గ్రిందువడజేయు. నాడినవాక్యములచే సంక్షోభము ననుభవించుచు "సఖీ! నీవు చెప్పినది సమంజసమేకాని క్రొత్తలేఖకులు స్వయముగా బత్రికాసంపాదకులతో బరిచయము గలుగజేసికొనజాలరు కదా!" అనెను.

సంధ్యమాటలు విద్యుత్తునకు కర్ణశూలములుగనుండెను. కాని తనభావమును వెలువడనీయక "ఇది లేఖకుని రచనాకౌశలమున రాదగినదేకాని యన్యుల ప్రేరణమునవచ్చుట గౌరవనీయముకాదు. రజత బాబుగారిలేఖలను భూధరబాబుగారు స్వయముగానే తీసికొనినారు కారా?" అని యూరకుండెను.

విద్యుద్వాక్యములచే సంధ్యాహృదయము భాధావిలమై యుండునని తలంచి శిశిరుడు విద్యుత్తునుజూచి "మీరిట్లనుట సముచితము కాదు. అతనిరచనాకౌశల మెక్కడ? నావ్రాత లెక్కడ? మాయిరువురి రచనలకు హస్తిమశకాంతర ప్రభేదమున్నది. 'విఖ్యాతలేఖకు' డను గౌరవమందుటకు నే వానిని వ్రాయుటలేదు. కేవలము నావినోదమునకే వ్రాసియుంటిని. కాని యదృష్టవశమున వానికిపుడు సన్మానముగూడ సంప్రాప్తించెను. కావున నిపుడు నన్నునే ధన్యునిగాదలంచుచున్నాను" అని యూరకుండెను.

"మరదిగారూ! విద్యుత్తువంటి విదుషీరత్నమునే విశహృదయగా నొనరించివెలయుచున్న మీ కళాకౌశలములను మాబోంట్లు వేరుగ బహూకరింపవలెనా?" అని సంధ్య విద్యుత్తుమోముపై జూడ్కి నిగిడ్చి మందహాస మొనరించెను.

శిశిరు డామాటలకు జకితుడై "నేడు మీమాటలు తీవ్రముగా నున్నవి. మీరు నన్నన్యథాతలంపవలదు. మీరుగాక యింతమానవ లోకము నందును నావారెవ్వరునులేరు" అని యనెను.

సంధ్య నిర్విణ్ణయై "మరదిగారూ! నేను నవ్వులాటకట్లంటిని; మీరు వేరుగభావింపవలదు" అనెను

"ఇట్టి సంభాషణములచే నీతని నెన్నడును గలతవెట్టకుము" అన్నది సంధ్యతో విద్యుత్తు.

"ఈతడింతటి మృదుహృదయుడని యెరుంగక యిట్లంటిని ఇంత మనసుబింకము లేనివాడని నాకేమి తెలియును. వీరి హృదయతత్త్వము నెరింగిన నీవైన జెప్పరాదా?" అని నవ్వుచు అన్నది సంధ్య.

"ఇదిగో! ఇది నీమాటలవరుస. ఎవ్వరినైన నెగతాళిసేయకుండ నీవుండజాలవు. మానసికవేదనా విహ్వలుల హృదయము లతిలఘువుగ నుండునని యెరుంగవా?" అన్నది విద్యుత్తు.

"నే నెన్నడును మానసికవేదన ననుభవించియుండలేదు. కొలది దివములనుండియు నాయీవేదనము ననుభవించుచున్న నీవిపుడు చెప్పుటచే దెలిసికొంటిని. ఇంక వారినేమేని యన్నచో నన్ను నీయిష్టము వచ్చినట్లు శిక్షింపుము. చేసినదోషమును క్షమింపుము" అని నవ్వుచు విద్యుత్తుచేతులను బట్టుకొని శిశిరునివైపు జూచెను.

"ఇంక నీయొద్దనుండరాదు. నీవాక్ప్రాభావమంతకంతకు నధికమగుచున్నది" అని విద్యుత్తు లేచెను.

"నాయొద్ద గష్టముగనున్నచో నీకు సంతోషము కలుగుచోటుననే కూరుచుండుము. నేను కుట్టుపని చేసికొనుట కేగెదను" అన్నది సంధ్య.

"ఈవాదప్రతివాదములేల? వదినెగారూ! మీరొక్కపాట పాడుడు" అని శిశిరుడు మందహాసమున ననెను.

"మీూపై... కాదు కాదు. మీరు శశాంకశేఖరముపై నభిమానముగల యీూమె పాడి మిమ్మానందింపజేయును" అని విద్యుత్తు చేతులను

బట్టుకొని లేవ త్తి పియానాయొద్ద గూరుచుండ జేసి, శిశిరుని చేతికి తబలా నందించెను.

## అధ్యాయం—9

“కాండారీ” పత్రికాకార్యాలయ మొకసందు వీథిలో జిన్నగది. ఆగదినడుమ నొక టేబిలున్నది. దానిదగ్గర రెండు ప్రాతకుర్చీలున్నవి. ద్వారమున కెదురుగా గోడదగ్గర నొకబొక్కిబీరువా యున్నది. అందు కాండారీపత్రికాభాండార మంతయునున్నది. టేబిలుపై నొక రోమపు గుడ్డ పరవబడెను. అదియును సిరాడాగులతో—జిమ్మంటరంధ్రములతో ధూళీధూసరితమైయుండెను. దానిపై సీమాసపత్రికలైదారును, గొన్ని యితరపుస్తకములు నుండెను.

పత్రికాసంపాదకుడగు దక్షిణాబాబు కుర్చీమీద గూరుచుండి యేవోకాగితములను చూచుకొనుచుండెను. ఒకమోటారు దడదడమని వచ్చి కార్యాలయమునొద్ద నాగెను. దక్షిణాబాబు ద్వారమువంకకు జూపుద్రిప్పెను. రజతుడు ద్వారమునొద్దకువచ్చెను. పెన్నిధినిగన్న పేదవలె దక్షిణాబాబుగారు మహానందభరితులైపోయిరి. ఆతురతతో లేచి రజతబాబునకు స్వాగతమిచ్చెను. రజతుడు ద్వారమునొద్దనే నిలిచియుండెను.

“మహాశయా! లోనికివచ్చి మాకార్యాలయమును బవిత్ర మొనరింపుడు” అని దక్షిణబాబుగారు మిక్కిలి యాదరముతో—గౌరవముతో—భక్తిప్రపత్తులతోననిరి.

గాలిలేక చీకటికొటారముననున్న యాలోని కేగుట కిచ్ఛగింపక యీవలనుండియె “మహాశయా! మీకీలేఖ నిచ్చివేయుటకే వచ్చినాను. నిలచుటకవకాశము లేదు” అని కొన్నికాగితములనిచ్చి చదివి చూడుడు ప్రకటింపనర్హములో కావో అనెను రజతుడు.

రజతునతో లేఖనందుకొనుచు "మీ లేఖల యోగ్యతాయోగ్యతలను నిర్ణయింపదగిన సమర్థు డీవంగదేశమున నెవ్వడున్నాడు?" అని దక్షిణాబాబనెను.

"మహాశయా! ఇది నా లేఖ కాదు. నేను వ్రాసిన ప్రతివాక్యమును భూధరబాబుగారు దిద్దికొని బోధించుచుందురు. ఇది నా మిత్రుని లేఖ." అని రజతుడు చెప్పెను.

"ఆహా! నా యాశలన్నియు నడుగంటెనా? యిన్ని మాసములనుండి నేజేయు ప్రార్థనమంతయు నీటఁగలిసినదా?" అని ఖిన్నవదనముతో దక్షిణాబాబనెను.

"ఇదియు నంత అప్రశస్తమైనది కాదు." అని రజతుడనెను.

"ఎట్టి మనోజ్ఞముగ నున్నను మీయంతటికి సాటియగునా?" అనుచు ఆ కాగితము నందుకొని చూచి 'శ్రీ శిశిరచంద్రచక్రవర్తి' ఇది యీ లేఖకుని పేరుగదా? బాగు! బాగు! రజతరాయనికి వచ్చు కీర్తి వంగసాహిత్యమున నింకొకనికి వచ్చుట కల్లగాదు." అని దక్షిణాబాబుగారనిరి.

"ఇప్పటికి క్షమింపుము. నేను గొప్ప వ్యాసములను వ్రాసి యిచ్చుటకు ప్రయత్నించెదను. ఇతరలేఖలతో బాటీలేఖయును బనిచేయ జాలును." అని రజతుడు చెప్పెను.

"మీమాట నే నతిక్రమింపజాలను. కాని, మీరు నన్ను జ్ఞాపకముంచుకొనవలసియున్నది." అని దక్షిణాబాబనెను.

"తప్పక జ్ఞాపకముంచును." అని నవ్వుచు మోటారులో గూరుచుండెను. మోటారు కదలెను.

రజతుడు వెడలినపిదప దక్షిణాబాబుగా రాలేఖల నొకవైపు బారవైచి "మిత్రుని లేఖయట! నా పత్రిక యిట్టి లేఖల బ్రకటించుటకే

స్థాపింపబడినట్లున్నది. వాని నావార పడియుండనిమ్ము” అని తనలో దానను కొనెను.

రజతుని మోటారు “దడదడ” మనుచు ‘సంగ్రహ’ కార్యాలయమునొద్దకుబోయి నిలిచెను. ఆకార్యాలయము విశాలమైనది. గదిలో నాలుగు కుర్చీలును ఒక బెంచియు, ఒక టేబులును, ఒక బీరువాయు, ఒక పెద్ద బల్లయు గలవు. ఆకుర్చీపై తలగడ నానుకొని అజగరమువలె అవయవములు సాచుకొని భూధరబాబుగారు అచ్చుచిత్తులను చూచుచుండిరి. మోటారుచప్పుడువిని కిటికీలోనుండి చూడబోవునంతలో నెదుట రజతరాయులు కానుపించెను. “రజతబాబుగారు! దయ చేయుడు!” అని యనెను.

రజతు డేమియు ప్రత్యుత్తర మొసంగక యే పోయి కుర్చీపై గూరుచుండెను. “మీ కల్పితకథానకములను సవరించుచుంటిని” అని భూధరబాబు అనెను.

అ మాటవిని రజతుడు మందహాస మొనర్చెను.

ఇంతలో భూధరబాబుగారిదృష్టి రజతునిచేతిలోగల కాగితములపై బడెను. “ఏదియో క్రొత్తవస్తువును గైకొనివచ్చినారే! నూతనోపన్యాసము సిద్ధమైనట్లు తెలియుచున్నది” అని భూధరబాబుగారడిగిరి.

“ఔను. ఉపన్యాసమే కాని నాదికాదు. శిశిరునిది”

“శిశిరబాబుగా రుపన్యాసములు వ్రాయగలరా? మీరు చదివినారా? ఎట్లున్నది?”

“ఔను నేను చూచితిని లోపములంతగా లేవు. నడచిపోజాలును. మీరుచితముగ సంస్కరించి ముద్రించు నేర్పాటు గావించినచో వానికి

మంచి ప్రోత్సాహము కలుగును. అనిరుపేద కెన్నో కొంచము పురస్కారము లభించినచో జాల యుపకారమొనరించినవా రగుదురు"

"పేరుప్రతిష్ఠలుగల లేఖకుల లేఖలెన్నియో మూలబడియుండగా క్రొత్తలేఖకులలేఖ లెపుడు ప్రకటింపవలెనా !"

"ఏమియు తొందర లేదు. అవకాశము చిక్కినప్పుడు సంస్కరించి యొకమూల దీనిని ముద్రించినచో మీకు నేను జాలకృతజ్ఞుడనగుదును. శిశిరుని సుదర్శను మీరు చక్కగ నెరుగుదురుకదా" అని రజతుడనెను.

భూధరబాబుగారా ప్రసంగమును విడిచి "మహాశయా ! మీరు మీయుపన్యాసమును ముగించినారా ? దానికి మీరిడి "ప్రేమపాశము" అనుపేరు బాగుగ లేదు. 'పాశశబ్దమంతయింపుగాలే' దనెను.

"మీరు చెప్పినది సమంజసముగానున్నది. "ప్రణయవేదన" అని నామకరణ మిడదలంచుచున్నాను" అని రజతుడు చెప్పి లేచెను.

"సరియె; దీనిచర్చ శనివారమునాడు గోష్ఠిలో నొనరింతము" అని భూధరబా బనెను.

భూధరబాబుగారి యనుజ్ఞనొంది రజతుడు మోటారులో గూరుచుండెను.

ఇంటికివచ్చుసరికి సంగీతగోష్ఠి చాలసందడిగానుండెను. సంధ్యయు విద్యుత్తును శిశిరుడును గలసి మందిరమంతయు సంగీతవాహిని పరిప్లావితముగ నొనరించుచుండిరి. రజతుడు లోనబ్రవేశింపగనే గాలివానయంతయు జప్పున జల్లారినట్లొక్కమారు గానమాగిపోయినది.

"ఆపివేసినారేల ?" అని రజతుడడిగెను.

ఒక్కరును మారుమాటాడుటలేదు. పిదప రజతుడు శిశిరుని జూచి "సోదరా ! నీలేఖలను కాండాగిపత్రిక కొకటియు, సంగ్రహపత్రిక కొకటియు నిచ్చివచ్చితిని" అని రజతుడు చెప్పెను.

[illegible] సిగ్గుతో దలవంచుకొని చూచుచుండెను. సంధ్యయు, విద్యుత్తును మాటాడక యూరకుండిరి.

తానొనరించిన [illegible] కార్యమునొక్కరును మెచ్చుకొని ప్రశంసింపకుండుటచే రజతు డాశ్చర్యమొందె, చిత్రప్రతిమవలె నిలిచిపోయెను.

ఆసమయమున సునయనీదేవివచ్చి "గీతవాద్యవినోదములు ముగిసినవికదా! భోజనములకురండు !" అని అందరిని బిలిచెను.

# అధ్యాయం—10

శిశిరుడు, సంధ్యాదేవి కుపాధ్యాయుడుగ నియుక్తుడై యొక మాసమయ్యెను. మాసాంతమున సంధ్యాదేవి పదేసి రూపాయలనోట్లు రెండు దెచ్చి శిశిరునిచేతిలో నుంచెను.

వానినిజూచి "వదిగారూ ! ఇవియేల ?" అని శిశిరుడడిగెను.

"నమస్కారములు, ఏమిసమర్పింపగలను. ఇది మీకు దక్షిణ" అన్నది సంధ్య.

"మీకు విద్యగరపుచు నేను పొందుచున్న బహుమాన మీ దక్షిణకంటె నమూల్యమైనది-దుర్లభమైనది" అని శిశిరుడనెను.

ఇదియంతయు జూచుచు ద్వారము ప్రక్కనేయున్న సునయనీదేవి వచ్చి "వత్సా ! నీకు మేమెట్టిబహుమానమేమియు నిచ్చుటలేదే ?" అనెను.

ఆమాట విననంతనే శిశిరునిహృదయము సంతోషవికసిత మయ్యెను. గద్గదస్వరముతో "తల్లీ ! నిర్మలము—నిరుపమానము—అమూల్యము—అఖండము—అగాధమునగు ప్రేమను బొందితిని. వినిర్మలప్రేమానందముకంటె విశ్వానందమింకేమున్నది ?" అని యూరకుండెను.

ఈమాటలను వినినపిదప రూపాయల నాతనిచేతిలో నుంచుట కెవ్వరికిని సాహసము లేకపోయెను. సునయనీదేవి యించుక యోచించి "వత్సా! నీ సర్వభారమును నీజననిసోదరులపై నున్నది" అనెను.

"నా కేవిషయమునను మీరు కొరతగలిగించుటలేదు" అని శిశిరు డనెను.

"తల్లిగారు వనమాలీదాసు సంగతి నడుగుచున్నారు. వానికి నీవు ప్రతిమాసమును బంపుచున్న పదిరూప్యములును ఇంక మేమే పంపుచుందుము" అని రజతు డనెను.

"ఆభారము నేను వహింపవలసినదే. కాని యన్యులపై నుంచ వలసినది కాదు" అనెను శిశిరుడు.

"ఇందన్యులెవరు!" అన్నది సునయని.

శిశిరు డామాటకు మారాడజాలక పోయెను. సునయనీదేవియాజ్ఞ నతిక్రమింప జాలక మొట్టికేల నంగీకరించెను.

[illegible] కొన్ని మాసపత్రికల నిచ్చెను. అవిమా[illegible] [illegible]దేవి మాతురితో "ఈమాసపు కాండారీ పత్రికలో మరదిగారి లేఖ యుండవచ్చు" ననెను.

రజతుడు కాండారీపత్రికనుదీసి వ్యాససూచిని జూచెను. అందాతని పేరులేదు.

రజతుని ముఖాకృతినిగని సంధ్య యాపత్రికలో శిశిరబాబుగారి వ్యాసములేదని తెలిసికొనెను.

"అన్నగారూ! సుప్రసిద్ధపత్రికలమాట యటుండనిండు. కాండారి వంటి సాధారణపత్రికగూడ నాలేఖనంగీకరింపలేదు. ఇంక నాలేఖలకై మీరు శ్రమజెందనక్కరలేదు" అని శిశిరుడనెను.

"సోదరా! ప్రతిమాసమునందును మొదటిదినముననే వ్యాసములకు స్థలమును నిర్ణయించుకొనుచుందురు అందుచే ఏమాసమున నిచ్చినవ్యాస మామాసమున ప్రకటన కాకపోవుచుండును. అంతమాత్రమున నీ వధైర్యపడరాదు" అని రజతుడనెను.

"నావ్యాసములు పత్రికలో ప్రచురింపబడెనని నీవుపడుచున్న శ్రమయంతయు వ్యర్థమైనచో, నావలన నీవు లజ్జింపవలసినవాడవగుదువుసుమా?" అనెను శిశిరుడు.

"సోదరా! నేను దృఢముగా జెప్పుచున్నాను వినుము. ఒకానొకప్పుడు శిశిరచక్రవర్తిగారియశస్సు వంగదేశమున మూలమూలలగూడ వ్యాపింపగలదు" అని మందహాస మొనరించుచు జెప్పెను.

"వ్యర్థప్రశంసచే నేమి ప్రయోజనముండును. రజతదీప్తిముందు శిశిరదీపిక నెవ్వరుగణింతురు?" అనెను శిశిరుడు.

ఆసమయమున గదిలోనికి విద్యుత్తువచ్చి నిలిచెను. ఆమెనుజూచి సంధ్య నవ్వుచు "ఏమిసఖీ! ఈసమయమున వచ్చినావు?" అని యడిగెను.

"మాతల్లిగారు అస్వస్థగానున్నారు—"

అని విద్యుత్తు చెప్పుచుండగనే "—అందుచే నిచ్చటికి వచ్చినావా?" అనెను రజతుడు.

"విద్యుత్తు లజ్జనొంది—అట్లుకాదు. నేను మాతల్లిగారితో శిశిరబాబుగారిని గురించి చెప్పియుంటిని. ఈ జబ్బుసమయమున ఆమె వీరిని పిలువనంపినది"

"ఇన్నిదినముల బరిచయమునగూడ మాకిట్టి నిమంత్రణభాగ్యమలవడినది కాదే! మామాటకేమి! మీసఖియగు సంధ్యకుగూడ అలవడుటలేదు—శిశిరబాబు మిక్కిలి ధన్యుడు" అనెను రజతుడు.

రజతునిమాటలకు విద్యుత్తుముఖ మనురాగరంజితమయ్యెను. అవనతమయ్యెను. ఆమె అట్లే నిలచియుండెను.

“సఖీ ! నిలిచియున్నావేల ?” అన్నది సంధ్య.

విద్యుత్తు శిశిరునిదెస మోమునెత్తిచూచి కుర్చీపై కూరుచుండెను. శిశిరుడు లజ్జాపూర్ణహృదయుడై అద్భుతానందభావానుభవమందుచుండెను. తనలేఖలు ముద్రింపబడుటేదను ఆంతరఖేద మీయానందప్రవాహమున నొక్కపెట్టున గొట్టుకొనిపోయెను.

విద్యుత్తు లజ్జించియుండుట నెరింగి సునయనీదేవి “కుమారీ ! “పవిత్రపదార్థ మెల్లరికిని ప్రాణతుల్యమైన” దని నేలచెప్పరాదు ? నీవిందు లజ్జింపదగినవిషయ మేమున్నది పుత్రీ ! శిశిరుని ప్రేమింపజాలనివా రీలోకమున నొక్కరైన నుందురా ? శిశిర సదృశధీరోదాత్తనాయకుడు నీకు లభించుట దుర్లభము. నీవు స్వయముగా నాతనికాత్మసమర్పణ మొనరించి ధన్యురాలవగుటకు లజ్జించుచుంటివేని మాతో జెప్పుము. మేమా శుభాచరణమునకు బద్ధకంకణుల మయ్యెదము” అని అనురాగపూర్వకముగ జెప్పెను.

సంధ్యారజతులు మెల్లమెల్లగా నవ్వుకొనుచుండిరి. శిశిరుడు లజ్జానందపూర్ణమందహాస వికసితవదనమండలము నించుక వ్రాల్చియుండెను.

విద్యుత్తు లజ్జాభరాక్రాంతచిత్తయై యచ్చట నిలువజాలకుండెను లేచి పోవుటకునూ శక్తి జాలకుండెను

విద్యుత్తుహృదయావేగ మప్పుడేరీతినుండునో బాగుగా దెలిసికొనిన సునయనీదేవి, విద్యుత్తునొద్దకు వచ్చి, తన పవిత్రహస్తమున విద్యుత్తువదనమును మీదికెత్తి, “కుమారీ ! మాటలాడకుండ

కూరుచున్నావదేల? శిశిరుని నిమంత్రణ మొనరించినావా! లెమ్ము. ఆలసించుచున్నావేల?" అనెను.

ఇదివరకెన్నడు నెరుంగని లజ్జాక్లేశవశమున కుర్చీపై నుండి లేచి తనకంపిత మృదులహస్తముతో నాకెజాబును శిశిరున కందించెను. ఆజాబు నందుకొనుచున్నపుడు శిశిరహస్తముకూడ కంపించుచునే యుండెను.

"మరదిగారూ! లేఖ క్రిందబడిపోవును. చేతిని వణకింపకుడు!" అని సంధ్య నవ్వుచుండెను.

"విద్యుత్ప్రభావము సంచలన మొందించుటలో వింతయేమున్నది?" అని రజనియు కూడ నవ్వుచుండెను.

"సరళహృదయులగు వారినేల మీరు మాటిమాటికిని బరిహసింతురు?" అనెను సునయిని.

శిశిరుడు జాబువిప్పి తనలో జదువుకొనెను. అందిట్లున్నది

"కల్యాణవరునకు:—

కల్యాణియగు మావిద్యుత్తువలన మీసమాచారమంతయును విని, మిమ్ము జూడవలెనని ఉత్కంఠితనై యున్నాను. విద్యుత్తునకు మిత్రులైన మీవంటివారు గౌరవనీయులు. మీరు నా గృహమునకు వచ్చినచో నేను కృతార్థురాలనగుదును. మీరు తప్పక వచ్చెదరని సంపూర్ణముగ విశ్వసించుచున్నాను.

ఇట్లు శుభాకాంక్షిణి
—క్షణప్రభాదేవి"

జాబుజవమువుకొని శిశిరుడు మౌనముద్రవహించి కూరుచుండెను. శిశిరుని ప్రత్యుత్తరము నపేక్షించుచు విద్యుత్తు కూరుచుండెను.

సునయనీదేవి యీచందమునంతయు గమనించి శిశిరునిజూచి "కుమారా! మౌనధారణము సముచితముకాదు సిగ్గును విడనాడుము. లెమ్ము! విద్యుత్తుతో గలసి యామెమందిరమున కేగుము. విద్యుత్తునిన్ను విడిచి వెడలుట కిచ్ఛగింపకయే యింతవరకు కూరుచున్నది" అనెను.

శిశిరుడు మాఱుమాటాడక, తలవంచుకొనియె మెల్లగలేచెను. వెంటనే విద్యుత్తుకూడ లేచెను. ఒకరినొకరు చూచుకొనకయే—వదనములను వంచుకొనియే—యిరువురును గదిలోనుండి యీవలకువచ్చిరి. విద్యుత్తువచ్చిన బండిద్వారముకొద్ద వేచియుండెను. ఇరువురును బండిలో కూరుచుండిరి.

సంధ్య మంగళసూచకగీతమును బియానాపై వాయింప దొడగెను. రజత సునయనులు మిగుల ప్రమోదించిరి.

# అధ్యాయం—11

విద్యుత్తును శిశిరుడును బరస్పర సంభాషణాదికములు లేకయే బండిలో కూరుచుండిరి. ఆంగ్లేయ బాలికాపాఠశాలలో జదువుచున్న విద్యుత్తునకు అంగనాజనసామాన్యమైనలజ్జ యనేకదినములకు బూర్వమె యంతరించిపోయినను, మరల నేడు తన సంపూర్ణశక్తిస్వరూపములతో నామె నావరించెను. ఎట్టిపురుషులతో మాటలాడునప్పుడును, విద్యుత్తు లజ్జాసంకోచముల నొంది యెరుగదు. కాని, నేడు బండిలో శిశిరునితో సంభాషించుట కామెహృదయమునే యనుసరించెగాబోలును, ఆతడును అభూతపూర్వమౌనధారియై యుండెను.

# అధ్యాయము—11

బండి శ్యామబజారులోనున్న యొక మందిరమునొద్ద నాగెను. విద్యుత్తు బండినుండి దిగి "మహాశయా! ఇదియే మామందిరము. బండినుండి దిగుడు!" అని మెల్లగా జెప్పెను.

శిశిరుడు బండినుండిదిగి విద్యుత్తువెంట నడువదొడగెను. ఆ మందిరము ఉన్నతశ్రేణిలోనిది కాకున్నను సామాన్యమైనదికాదు. శిశిరుడు ద్వారముదాటి జాజి, శేఫాలిక, చామంతి, గులాబి మొదలగు పలురకముల పూలమొక్కలచే—వివిధవర్ణ చిత్రపత్రశాఖలచే—అల్లిబిల్లిగా నల్లుకొనుచున్న లతావితానములచే మనోజ్ఞమైన మార్గమున మందిరమును జేరెను. అందు ధవళకాంతులనీను చలువరాలుస్థాపితములై యుండెను.

విద్యుత్తుతో శిశిరుడు మెట్లమీదనుండి మేడమీదకేగెను. వివిధ విదేశ విలాసవస్తుసమాలంకృతమైన యొకగదిలో సుప్రశస్తమృదుల పర్యంకమున నొకపెద్దదిండు నానుకొని రాజస మట్టిపడినట్లు గూరుచుండియున్న యొక స్త్రీ యాతనికి గానుపించెను.

ఆమెశరీరము కాంతిమంతము—నేత్రము లలసభారములు—ముఖము శృంగారకళాకలితము—వేషము విలాసమయము. శిశిరుడామెను జూచి తటాలున అచ్చటనే నిలిచిపోయెను

విద్యుత్తు మోముద్రిప్పి "నిలిచిపోయినారేల? ఆమె మాయమ్మగారు" అనెను.

విద్యుత్తుమాటను విని శిశిరుడు చమత్కృతుడయ్యెను. ఆశ్చర్యపూరితహృదయుడయ్యెను. "ఈమె వితంతువుకదా! విధవా వేషమింత విలాసభాజనమా! శృంగారజనకమా! వివిధభోగానుభవయోగ్యమా! ఈ చిత్రాతిచిత్రవర్ణపుచీర ఏమి! ఈ జరీజిలుగు జాకట్టువేమి! అమూల్య మణిమయరత్నాలంకారము లేమి! విధవావదనమున విలాసరేఖయా!

యింకేదో రహస్యమున్నది. సునయనీదేవికూడ వితంతుయేకదా! ఆమె కూడ జాకట్టును దొడుగుచుండునే! ఆమెమోమునందలి సాత్వికద్యుతి యీయామెమోమున గానుపింపదే! ఆమెను జూచునపుడు నాహృదయమున గలుగు భక్తివిశ్వాసము లీమెను జూచినపుడు కలుగుటలేదే!" అని తెలపోయుచు గదిలో బ్రవేశించెను.

విద్యుత్తుతల్లియగు క్షణప్రభాదేవి శిశిరునిజూచి "నాయనా! వచ్చితావా! రమ్ము. ఈపడకకుర్చీపై గూరుచుండుము!" అని యను రాగముతో ననెను.

శిశిరుడు మౌనముగనే కుర్చీపై గూరుచుండెను. విద్యుత్తును దల్లి చెంత మంచముమీద గూరుచుండెను.

"నాయనా! అనేకమారులు విద్యుత్తువలన నీప్రశంసను విని నిన్ను జూడవలెనని మిక్కిలి యాతురతతో నుంటిని. నేటి కాయానం దము చేకూరెను. నీపరిచయభాగ్య మలవడినదాది నీ ప్రశంసలేని మాట నీమెనోట వెలువడుట నేనెరుంగను" అని క్షణప్రభాదేవి యనుచుండగనే,

శిశిరు డామెమాటల కడ్డమువచ్చి "నాప్రశంసకు గారణ మీయామెకు నాపైగల యభిమానమే" అని యూరకుండెను.

"నిజమే. అభిమానమునకు గూడ గారణ ముండవలదా! నీ నిష్కళంక చరిత్రము—నిశితబుద్ధిము—నిరవధికపాండితీప్రతిభయు— నిరుపమాన కళాకౌశలమును నీపై నామెకుగల యనురాగమునకు గారణములు. ఈమెకు జిన్ననాటినుండియు విద్యయందును, వినిర్మల ప్రవర్తనమునందును అనురాగము మెండు. అందువలననే మీప్రసంగము నాలించుటయున్నను మీతోడి సంభాషమున్నను మీ సహ సమన్నను

ఈమెకు మిక్కిలి సంతోషదాయకమగుచుండును" అని శిశిరుని ముఖమువంక జూచి నిగిడ్చెను.

శిశిరుడా మాటల నాలించుచు నేమో యోచించుచు అవనత ముఖుడై యుండెను. విద్యుత్తు లజ్జానందహృదయుడై తలవంచు కొనెను.

"కుమారా! మారుమాటాడక తలవంచుకొని కూరుచున్నా వేల? నామాటలయందలి సత్యాసత్యములను యోచించుచున్నావా? నీయాత్మయే యిందలి సత్యమును నీకు జెప్పుటలేదా? "సత్ప్రవర్తకుల కాత్మయే సంశయముల దీర్చివేయు"నను కాళిదాససూక్తిని మరచి నావా?" అని మందహాస మొనరించుచు క్షణప్రభ యనెను.

క్షణప్రభమాటలకు శిశిరు డాశ్చర్యావిలహృదయుడై యోచనా శూన్యుడై నిగ్రహమనొందినవానివలె అట్లు కూరుచుండెను.

క్షణప్రభ శిశిరునితీరు జూచి మందహాస మొనరించుచు "కుమారా! నేడే మిట్లు విపరీతముగ గానుపించుచున్నావు! నన్ను వేరుగా దలంపకుము. నీవిద్యుత్తునకు నేను తల్లినికదా! నాతో సంభాషించుటకు నీవేల లజ్జించుచున్నావు? నీవు నిస్సంశయముగ హృదయకవాటములను దెరచి నాయెదుట మాటలాడుము. నీవు నా కుమారికె కెపుడనురాగపాత్రుడవైతివో అపుడే నా కాదరణీయుడ వైతివి. ఇంక నీ కష్టసుఖములతో నాకు సంపూర్ణ సంపర్కముకలదు. నీసుఖమే మాసుఖము. నీయానందమే మాయానందము. నీకష్టమే మాకష్టము" అని యూరకుండెను.

శిశిరు డామె న్ప్రసంగమునుండి మరలింపనెంచి మోము త్రాల్చుకొనియే "యీమె నాపైగల నిర్వ్యాజానురాగమునకు నేను

మీ యొక్క కృతజ్ఞతను. నీ శరీరము అస్వస్థతగా నున్నదని నీ మిత్త్రు జెప్పి యుండెను. ఇప్పు డెట్లున్నది?" అని యడిగెను.

"సహజముగ నాశరీరము అనారోగ్యమైనది. నిన్నటిసాయంసమయమున అకస్మాత్తుగ హృదయస్పందనము మందగించుటచే గళాశాలలోనున్న యీమెకు వర్తమాన మంపి రప్పించితిని. నేడు స్వస్థతగానున్నది. మృదుహృదయయు, కష్టముల నెరుగనిదియు నగుటచే ఈమె మిక్కిలిభీతిజెంది మీతో నతిదారుణముగ జెప్పియుండును. నాశరీరక వ్యాధికంటె, నాయనంతర మీమెగతి యేమగునోయను మానసిక వ్యాధి నన్నహర్నిశము దీవ్రముగ వేధించుచున్నది. ఎచ్చటనో, ఏవేళనో, నేనకస్మాత్తుగ గన్నుమూసివేసినచో ఈమెను దగ్గరకు దీసికొని యాదరించువా రెవ్వరునులేరు. కావున నాజీవమున్నపుడే నినుబోటియోగ్యుని హస్తమున నుంచివేసినచో నేను నిశ్చింతగా బ్రాణములను విడువగలను. కాలక్రమమున నీమెయు నావియోగ దుఃఖమును మరచి సుఖింపగలదు. ఇప్పటినుండియు నాకు గొంత దూరముగా నున్నచో బిడ్డ నాకై యంతగా దుఃఖింపదనునమ్మకమునచే యీమెను ఆంగ్లేయబాలికా పాఠశాల కొప్పగించి, యచ్చట నీమె కేలోటయు గలుగకుండు సర్దుబాటులు గావించితిని. మరికొన్ని మాసములలో నీమె బి. ఏ. పరీక్షయందుత్తీర్ణురాలగును. అప్పుడీమె యచటనుండుటకు నవకాశముండదు. అందుచే ఈవిషయమును నీతో గొంత యోచించి, చేయదగినకార్యమును జేయవలెననియే నిన్ను రావించితిని. నీవు సకలసద్గుణ భాగ్యములు గలవాడవు. ఈమె హృదయమునెల్లను దోచినవాడవు. ఈమెసుఖమునే—అభివృద్ధినే—ఆనందమునే—గోరుచున్నవాడవు. ఈవిషయమును నీవు యోచించి, కర్తవ్యమును నిర్ణయింపుము. నీ యాదేశమే నా కాచరణయోగ్యము.

ఈమెభార మంతయు నీపైనుంచినాను. ఈమె భవిష్యజ్జీవితమంతయు నీహస్తగతమైయున్నది. ఇంక నీమెపై నాకెట్టి యధికారమును లేదు. ఈమెను — ఈనా సర్వసంపదను — సర్వాధికారములతో నీయధీన మొనరించినాను" అని క్షణప్రభ చెప్పి ప్రత్యుత్తరాభిలాషతో శిశిరుని జూచుచుండెను.

"శాస్త్రజ్ఞుడు కాని యొక్క పేద విద్యార్థిని గన్యాసంపత్సంబంధములగు కార్యములను నిర్వహించుటకు యజమానిగ నియోగించుట మిముబోటి ప్రాజ్ఞతగల వారి కుచితము కాదని మనవిచేయుచున్నాను" అని మెల్లమెల్లగా శిశిరుడనెను

శిశిరుని మాటకు క్షణప్రభ పక్కునవవ్వెను. విద్యుత్తు తనలో దాను నవ్వుకొనుచు అటనుండి లేచి లోనికేగుచుండెను.

క్షణప్రభ విద్యుత్తునుజూచి "లోనికేగుచున్నావేల ? నీమిత్రుని కల్పాహారమును దెమ్ము" అనెను.

శిశిరుడు ముఖమునెత్తి విద్యుత్తుదెస జూడక్కనిగిడ్చెను. విద్యుత్తు మందహాసమొనరించుచు శిశిరుని ముఖముపై నొక తీవ్రవీక్షణమును బరపి మరల మోమును వ్రాల్చెను.

ఇదియంతయు క్షణప్రభ గమనించి "నీహృదయ మతిగభీరము. దానిని విద్యుత్తుగాక యన్యులెరుంగజాలరు" అని శిశిరునితోననెను.

విద్యుత్తు ఒక చిన్న మేజాను దెచ్చి శిశిరుని చెంతనుంచి, దానిపై నొక పరిశుభ్రవస్త్రమును బంచి, లోనికేగి, యొకపళ్ళెరముతో పలు రకముల భక్ష్యములును చిన్నగాజుగిన్నెతో నిర్మలజలమును దెచ్చి మేజాపై నుంచెను.

"వేగముగా 'తేనీరు'ను సిద్ధపరుపుము" అని విద్యుత్తుతో క్షణప్రభ చెప్పెను.

విద్యుత్తు శిశిరుని దెసజూచి "మీరు 'తేనీరు' త్రాగుదురా ?" అని యడిగెను.

"నాకా యభ్యాసములేదు" అనెను శిశిరుడు.

"సరియె వేడిపాలును దెచ్చియిమ్ము" అన్నది క్షణప్రభ

విద్యుత్తు లోనికేగెను

"ఇవియన్నియు నీకొరకు స్వయముగ విద్యుత్తు సిద్ధపరచినవి కావున నన్నిటిని దినవలెను" అని క్షణప్రభయనెను

విద్యుత్తు చిన్నగాజుగిన్నెలో పాలును దెచ్చి మేజాపైనుంచెను.

శిశిరుడు క్షణప్రభతో "నేనంతయధికముగా దినజాల" ననెను.

"ఔను వీరిభోజనము మిక్కిలి స్వల్పము" అనెను విద్యుత్తు.

"సరియె ! విద్యుత్తువంట యెటులుండునో తెలిసుకొనుటకు ప్రతి పదార్థమును గొంచెము గొంచెముగా రుచిచూడుము. వ్రాతకూతలే కాక, గృహస్థులకవసరమగు ప్రతికార్యమునందు నీమెకు సమర్థతగలిగింపనెంచితిని. ఈమె సంపూర్ణముగా గృహకార్యముల నిర్వహించుకొనగలదు" అని క్షణప్రభయనెను.

శిశిరుడల్పాహారమును ముగించెను.

"ఇంకేమి కావలయును ?" అన్నది విద్యుత్తు.

"ఏమియు నక్కరలేదు" అనెను శిశిరుడు.

"అయిన జేతులను గడుగుకొనుటకు రండు !" అన్నది విద్యుత్తు.

"చేయిగడికొనుట కెక్కడికిదీసికొని పోవుచున్నావు ? ఇచ్చటికే పళ్ళెరమును దీసికొనిరమ్ము" అన్నది క్షణప్రభ.

"ఈమ్లేచ్ఛాచారము లితనికి రుచింపవు" అన్నది విద్యుత్తు.

"వీరు నీమిత్రులు. వీరి కేదియిష్టమో, ఏదియనిష్టమో, నీవు బాగుగా నెరుంగుదువు. కావున వారికిష్టమగురీతినే యొనరింపుము" అన్నది క్షణప్రభ.

విద్యుత్తు శిశిరుని వెలుపలకు దీసికొని వెడలెను.

విద్యుత్తు శిశిరునిచేతిపై నీరువోయ సిద్ధముగనుండెను. శిశిరుడు చకితుడై "వలదు వలదు. మీరు నీరు వోయవలదు. జలపాత్రము నచ్చటనుంచుడు" అనెను.

విద్యుత్తు మందహాసము గావించి "అట్లు చేయరాదు. నేడు మీరు మాకతిథులుకదా ?" అనెను.

శిశిరుడు మారుమాటాడజాలక యామె నీరువోయుచుండ వంగి చేయిగడిగికొనుచుండెను. ఇరువురిముఖములును మిక్కిలి సమీపమైపోయినవి. శిశిరుడు చేయిగడుగుకొనుచుండెనే కాని వాని నేత్రచకోరములు మందహాసవిలసిత విద్యున్ముఖచంద్రమండలద్యుతులను తనివిదనక గ్రోలుచుండెను. విద్యుత్తుగూడ నీపాఠమునే జదువుచున్నది. విద్యున్మృదుహస్తములనుండి కలశార్ణోధార శిశిరునిచేతిపై బడుచున్నది. అవాఙ్మానసగోచరమైన యానందవాహిని హృదయనాళములలో ప్రవహించుచున్నది.

చేయి గడుకొనినపిదప నొకతువాలును దుడుచుకొనుటకిచ్చి, వెంటనే యొక్కపళ్ళెరముతో వక్కలు, ఏలకులు, మసాలా మొదలగునవి పట్టుకొని గదిలోనుండి విద్యుత్తు వచ్చెను.

"కుమారీ ! తమలపాకులనేల తీసికొనిరాలేదు ?" అన్నది. క్షణప్రభ.

"వీరు తాంబూలమును వేయరు !" అన్నది విద్యుత్తు.

"ఎంతకాల మీబ్రహ్మచర్య వ్రతదీక్ష ?" అని క్షణప్రభ నవ్వుచు అన్నది.

మిక్కిలి స్వల్పపరిచయముననే తన ప్రవర్తనాదికములనెల్ల విద్యుత్తు ఎట్లు గ్రహించెనే యని శిశిరు డాశ్చర్యచకితుడయ్యెను.

పళ్లెరమునందలి కొంచెము చక్కెరగుండను, ఒక ఏలకపండును దీసికొనెను. "నేనువచ్చి చాలసేపైనది. ఇంక నాకనుజ్ఞ నొసంగుము" అని క్షణప్రభా దేవితో మెల్లగాననెను.

"ఏమీ ! నీవువచ్చి యొకగంటకాలమైన గాలేదే ? అప్పుడే వెడలి పోవుటకు దొందరపడుచున్నావేల ?" అన్నది క్షణప్రభ.

"సునయనీదేవిగారియింట నున్నంతయానంద మిచ్చట లేక పోవుటచేత" అని విద్యుత్తు మోము వ్రాల్చుకొని చెప్పెను.

"నాయనా ! వింటివా ? నీవిప్పుడే వెడలుటకు విద్యుత్తుగూడ యంగీకరించుటలేదు. నన్నుగాదని నీవు వెడలగలవు కాని; విద్యుత్తును గూడ గాదందువా !" అన్నది నవ్వుచు క్షణప్రభ.

"మిక్కిలి యవసరమైన కార్యములున్నవి" అని శిశిరుడూరకుండెను.

"సరియే ! వచ్చెడి యాదివారమున భోజనమునకు నీ విచ్చటికి రావలెను. నేటినుండియే నిన్ను నిమంత్రణమొనరించు చున్నాను" అని క్షణప్రభ యనెను.

"తప్పక వచ్చెదనని నేడే నేనెట్లుచెప్పగలను ? ఆనాటి కెట్టి యాటంకములు కలుగునో ?" అని శిశిరు డనుచుండగనే—

"నేడేమో ఏమిమాటలచందమంతయు విపరీతముగానున్నది" అని విద్యుత్తు శిశిరుని ముఖముపై జూడ్కినిగిడ్చెను.

"సుకుమారా ! నిను జూచి — నీ మాటలాలించి — నీ చర్యల దలంచి—ఆనందమొంది—పులకించి—తన్మయురాలగుచున్న యీ సరళహృదయను, విద్యుత్తును నీవెన్నడును వేరుగ భావింపకుము. ప్రతిశనివారమును ఈమె పాఠశాలనుండి యిచ్చటికి వచ్చుచుండును. నీవుగూడ ప్రతిశనివారమును ఇచ్చటికి వచ్చుచుండుము. ఇరువురును

గలసిమెలసి యుండుము. అది మీయిరువురకును ఆనందదాయకమే కాక, నాకుగూడ మహానందజనక మగుచుండును. నీవు ఆర్థికవిషయమున నెట్టియిక్కట్టును బొందవలదు. ఈవిద్యుత్తు సంపదయంతయు నీయాధీనమే యని తలంపుము''

విద్యుత్తు కరుణానురాగమయవీక్షణము లొకసారి శిశిరుని వదనమండలముపై బరపి వెంటనే యువతిముఖి యయ్యెను.

"కుమారా! నీకిచ్చట స్వజనులెవ్వరును లేరని వినియున్నాను. ఆ స్వజనవిరహితుని హృదయము దారుణవేదనామయమై యుండును. కావున, నీవు బంధువిరహితుడవై యుండవలదు. నీకిష్టసుఖములతో సంపూర్ణసంపర్కముగలవారిని విడిచియుండకుము. మమ్ము నీయాప్తకోటిలోనివారిగ—స్వజనముగ—భావింపుము. మాకుగూడ నీ విశాలవిశ్వమున బంధువులుగాని, మిత్రులుగాని, యెవ్వరును లేరు. విద్యుత్తువలన నీప్రశంస వినిననాటనుండియు నీవే మా స్వజనములోనివాడవని తలంచితిని. ప్రాజ్ఞుడవగు నీకు నేనింతకంటె నెక్కువగ జెప్పనక్కరలేదు. నీవు తప్పక శనివారమునాడిచ్చటికి రమ్ము. శనివారాదివారము లిచ్చటనే యుండుము. నాకోరిక చెల్లింపుము" అని క్షణప్రభ అనురాగమధురస్వరమున ననెను.

క్షణప్రభమాటలు శిశిరునకు వింతగా—ఆశ్చర్యకరములుగ—ఆనందదాయకములుగ నున్నను, అతడేమియు మారుపలుకక లేచి నిలిచి "సరియే నాకిప్పు డనుజ్ఞనొసంగు" డనెను.

ఎట్టకేలకు క్షణప్రభ యనుజ్ఞనొసంగెను.

శిశిరుడు లేచి గదిలోనుండి వెలుపలకు వచ్చెను. విద్యుత్తుగూడ ఆతని వెంటవచ్చెను. శిశిరుడు విద్యుత్తుమోము నొకసారిచూచెను. ఆమెనేత్రము లనురాగపూర్ణములై యుండుట నెరింగి "మరలవచ్చెదను"

అని డగ్గుత్తికతో నని మెట్లనుండి దిగుచుండెను. విద్యుత్తు మారు మాటాడక అట్లెనిలిచి చూచుచుండెను

# అధ్యాయం –12

రమణీయమణీయ మందహాస చంద్రికల చల్లదనమునకు సంగ సింపని జను డుండునా? కాంతాకటాక్ష వీక్షణవిద్యుద్వాహికల వేగ మునకు వివశుడు కాని వెకలియుండునా? ఎట్టి విద్వాంసుడైనను "కామినీ హేలాకృష్టకురంగశాబక" మగుటలో వింత యేమున్నది!

శిశిరుడు విద్యున్మందహాస చంద్రికలలో విహరించి విహరించి తన్ముగ్ధమధుర కటాక్షవేగము సంచలితుడై పోయి, యామెచేతి "హేలాకృష్టకురంగశాబక"మై పోయినాడు.

—తడు శనివారములకే యెదురుచూచుచున్నాడు. అందరకు శనివారమేమైనను శిశిరున కది మంగళవారమే. ఉన్మత్తహృదయము లను ఉద్వేగమునొందించుటకు సర్వచంద్రుడే పటిష్ఠుడైనను, శిశిర హృదయము నుద్వేగించుటకు శుక్రవారచంద్రుడే శూరుడగుచుండెను శుక్రవారపురాత్రి అందరకును ద్వియామమైనను, శిశిరునకు మాత్రము అనంతయామ యగుచుండెను. శుక్రవార శశాంకునితో బాటు శనివార పుదివాకరుడును ఆతనినుద్వేగ మొందించుచుండెను. శిశిరుడు వాంఛించు చున్న శనివారపు దినభాగములయందలి మూడవభాగము చాలకాల మునకు గాని రానట్టులాతనికి దోచుచుండెను.

నేడు శనివారము. శిశిరుడు సంస్కృతు పాఠమును జెప్పుచుండెను కాని వానిమనస్సు విద్యుత్తుపై దగులువడియుండుటచే "వదినెగారూ! పాఠముజెప్పుట కుత్సాహముగలుగుటలేదు. నేటికి సమాప్తముచేయు దము" అని యకస్మాత్తుగా బలికెను.

# అధ్యాయము—12

"నేడేమో విద్యుత్తు వచ్చుట చాల నాలస్యమైనదా!" అని సంధ్య నవ్వుచు బలికెను.

"వదినెగారూ! మీ రత్యాచారా మొనర్చినారు. నిజముగా విద్యుత్తుకొరకే నాచిత్తము వ్యాకులపడుచున్న దనుకొనుచున్నారు కాబోలును" అని శిశిరుడు నవ్వుచు ప్రత్యుత్తర మొసంగెను.

"ఏదియో సందేహమున బారము విడుచుటచే నేమిలాభము? ఇరువురిహృదయములును సమానాకర్షణములు గలవైనచో గలయిక కలుగుచుండునా?" అని నవ్వుచు సంధ్యయనెను.

"అవునుగాని విద్యుత్తును దీసికొనివచ్చినచో మన మెచ్చట నుందుము? మనమహాలులోనా?" అని శిశిరుడు నవ్వుచు ననెను.

తన దరిద్రతను, నిరాశ్రయతను దెలియజెప్పి శిశిరుడు సంధ్యను అప్రతిభాశాలినిగ నొనర్చెను. దీనికి సరియగు సమాధాన మొసంగ జాలక తిరస్కారపూర్వకశబ్దములతో "మీరు మిగుల గానివారు. నేను మీతో మాటలాడను" అని యామె యనెను.

"ఎంతవరకు?" అని నవ్వుచు శిశిరు డనెను.

ఈమాటలను దొలగించు నభిప్రాయమున "ఒకమాట జ్ఞప్తికి వచ్చినది. విద్యుత్తు మీశరీరమును కొలువుమని నాతో చెప్పియుండెను" అని సంధ్య యన్నెను.

"ఏల?" అని నవ్వుచు శిశిరు డనెను.

"ఆమె కుట్టుపని నేర్చుకొనియున్నది. మీకొరకొకచొక్కా సిద్ధపరచును. స్వయముగా మీతో జెప్పుటకు లజ్జిలి నాతో జెప్పెను" అని సంధ్యఅనెను.

నాకొరకు క్రొత్తచొక్కా సిద్ధపరచుటకు ఈయుపాయము పన్నినదని శిశిరుడు తెలిసికొని మౌనమువహించెను. సంధ్య కొలతకై టేపు దెచ్చుటకు బోయెను.

ఇంతలో విద్యుత్తు గదిలో కిఁవచ్చి యొంటరిగానున్న శిశిరుని జూచి "సంధ్య యెచ్చటనున్నది?" అని అడిగెను.

"పరోపకార వ్యాపారమునకు నేగినది" అని శిశిరుడనెను.

"నా మాటలర్థము తెలియకున్నది" అని విద్యుత్తనెను.

"మొదటిది మీకొరకు నాచొక్కా కొలుచుకొనుట—రెండవది నాకొరకు క్రొత్తచొక్కా సిద్ధపరచుట" అని శిశిరుడనెను.

శిశిరునిమాటలు విని విద్యుత్తును దుఃఖమును, లజ్జయు నొక్కమారుగా నావరించెను. ఏమియు జెప్పక యూరకె తలవంచుకొనెను.

ఇంతలో టేపుగైకొని సంధ్యవచ్చి గదిలో విద్యుత్తునుజూచి "మీరు వచ్చినారా? మగదిగా రుస్మత్తులయి పోవుచుండిరి" అని టేపునొసంగుచు మీరును సమయమునకే వచ్చినారు. మీకొలత మీరే కొలుచుకొందురు" అని ఆమెను బలవంతముగ జేయిబట్టుకొనిలాగి శిశిరుని యెదుట నిలువబెట్టెను. విద్యుత్తు క్రీగంట నొక్కమారు శిశిరునివంక జూచెను. ఆదృష్టి విద్యుత్తుయొక్క హృదయమును శిశిరునియెదుట స్పష్టముగా దెరచివైచినది. విద్యుత్తు శిశిరుని శరీరము గొలువసాగినది. సంధ్య మందహాస మొనరించుచు ముసిముసినగవుల నవ్వుచు ఆచిత్రమును కాగితముపై లిఖింపదొడగెను.

కొలతదీసికొనినపిదప సంధ్య, చిత్తసమున్నతితో "నేను కొలతను గోరికోరి వ్యాకులచిత్తనైతిని. కాని మరదిగారు ఏదోయొక యాటంకము జెప్పి నిరాకరణమునే సూచించివైచిరి. ఇపుడు విద్యుద్రాణి టేపుపట్టుకొని నిలువగానే మౌనభావముతో నెట్లు కొల యొసంగినారో" అని యనెను.

శిశిరుడు సిగ్గుతో "ఏదో యొకమార్గమున బోయినచో వాద ప్రతివాదము లొనర్చుటకూడ సముచితముగానుండును. కాని యిచ్చ

వచ్చినచోటున యితరుల మాటల వినిపించుకొనకయే ప్రసంగించుచున్న వారితో దర్కమొనర్చుటచే లాభమేమి? వచ్చినచోటున యోటమి నంగీకరించి మౌనముగానుండుటయే సముచితమార్గము కదా?" అనెను.

"నేటినుండి నేను నపర్గళ ప్రలాపినయితిని" అని సంధ్యయనెను.

"అట్లయిన నే నిరువురి నడుమను బడి దారిగానక యంధుడ నైతినిగదా!" అని శిశిరుడనెను.

"మే మిరువురము వేర్వేరుచొక్కాయలను సిద్ధపరచెదము చూచెదము మీ కెవరు కుట్టినది బాగుగానుండునో!" అని సంధ్య నవ్వుచునెను.

"నా కిరువురును సమానులే యగుదురుకదా?" అని శిశిరుడనెను.

ఆమాట కందరు నకస్మాత్తుగా నవ్విరి. ఇంతలో "కాండారీ" పత్రికను గైకొనివచ్చి రజతుడు గదిలో బ్రవేశించి "శిశిరా! చెప్పుము! ఏలనవ్వుచున్నారో?" అని యడిగెను.

"నాలేఖ వెలువడినదా యేమి? నీ వొసంగినలంచమునకు దగినయేర్పాటు చేసిసంపాదకుడు నీకు సంతృప్తిని కలిగించెనా?" అని శిశిరుడనెను.

"సామాన్యమగు లంచము నొసంగితిని. చాలకాలమునాటి నాలేఖయొకటి ముద్రించికొననిచ్చితిని" అని రజతుడనెను.

"ఇది సాధారణమైనది కాదు. దాని ప్రభావమువలననే నాలేఖ ముద్రితమైనది" అని శిశిరుడనెను.

శిశిర రజతు లిరువురును నవ్వసాగిరి. ఇంతలో సంధ్య రజతుని చేతిలోనుండి "కాండార్" పత్రికను గైకొని చదువసాగెను. విద్యుత్తు నమ్రతతో వినదొడంగెను

"సంగ్రహపత్రిక కొసంగియుండిన లేఖసంగతి యేమైనది" అని శిశిరుడడిగెను.

"ఇప్పుడు దానినిజూచుట కవకాశమే చిక్కలేదనియు, అనేక ప్రసిద్ధవిద్వాంసుల లేఖలుగూడ నట్లే పడియున్నవనియు, భూధర బాబుగా రనిరి" అని రజతు డనెను.

"అట్లయిన వానినేల దీసికొని రాకబోతివి ?" అని శిశిరుడనెను

"ఇంత చింత యేటికి ? అనేక లేఖకుల లేఖలు సంవత్సరముల కొలది బడియుండును. కాని నీవు చెప్పుటకుముందే ఫలాతురుడవైనట్లు కన్పట్టుచుంటివి కదా ?" అని రజతు డనెను.

"ఇది నీకుగలిగిన భ్రాంతిమాత్రమే. నేనుమాత్రము చెట్టు నెక్కగోరలేను. ఫలాతురుడను గాలేను నీవు బలవంతముగ నన్ను నిర్బంధించి నెక్కించుచున్నావు. నీవు నిర్బంధింపకున్నచో నాకాగితము లన్నియు నున్నవి యున్నట్లుండవలసినవియే. లోకములో నెవ్వరును వానిగంధ లేశమైన బీల్చియుండరు గదా !" అని శిశిరుడనెను.

"సరే యీమాటలెల్ల నట్లుండనిమ్ము నేను ప్రయత్నించి సంగ్రహపత్రికలో గూడ నవి శీఘ్రముగ నే ప్రకటితమగునట్లు చేయింతును రమ్ము" భూధరబాబు మున్నగువారు వచ్చియున్నారు. అని చెప్పి రజతుడు శిశిరుని చేబట్టుకొని వెలుపలికి దీసికొని పోవదొడగెను.

పోవుచు బోవుచు శిశిరు డొకమారు విద్యుత్తువంకకు జూడ్కులు ప్రసరింపజేసెను. అంతలో విద్యుత్తుకూడ బుస్తకమునుండి చూడ్కులను మరల్చి శిశిరునివైపు జూచెను. ఇరువురి నయనములును

గలసిపోయినవి. విద్యుత్తు లజ్జిలి మరల బుస్తకమును జూడదొడగెను. శిశిరుడు రజతునితో గదిలోనుండి వెలుపలికిబోయెను.

దూరమునుండియే శిశిరునిగాంచి "రండు! శిశిరబాబుగారూ! నేను మొదటినుండియును గొలదిదినములలో మీసాహిత్యకీర్తి వంగ దేశమునందెల్ల వ్యాపింపగలదని భవిష్యత్తును జెప్పియే యున్నాను గదా!" అని భూధరబాబనెను.

రజతుడు కొంచెము గంభీరహృదయుడాయెను. భూధరబాబు గారి ముఖమునుండి ముక్తకంఠముతో నీరీతిప్రశంస నేటివరకెవ్వరును వినియుండలేదు. భూధరబాబుగారు తన్ను గేలిసేయుచున్నారనియు. లోకనిందయే స్వభావముగా గలిగిన బాబుగారు నా లేఖలను ఎట్లు ప్రశంసించుననియు, వారి ప్రకృతిని జక్కగా నెరింగిన శిశిరుడనుకొనెను.

గదిలో ప్రవేశించి "మీరు శిశిరునిలేఖలను జదివియుంటిరా?" అని రజతుడు భూధరబాబుగారి నడిగెను.

"లేదు" అని భూధరబాబుగారుత్తరమొసంగిరి.

భూధరబాబుగారిమాట ముగియకమున్నే రజతుడు పెద్దపెట్టున నవ్వెను.

అచ్చటి సభ్యులుకూడ రజతునితోపాటు పకపక నవ్విరి. వీరి యట్టహాసములచే భూధరబాబుగారు తమవాక్యమును ముగించుటకు గూడ అవకాశము చిక్కలేదు. శిశిరుని మనస్సు మిక్కిలి చిన్న బోయెను.

"శిశిరబాబుగారి లేఖలను జూడనక్కరలేకయే కూర్పుసేయ ముద్రణాయంత్రమున కొసంగివేసితిని. కాండారీపత్రికలో వెలువడిన వారిలేఖలను జూడగనే వారిలేఖనీప్రభావ మెంతమహాత్వము కలదియో

వారిబుద్ధి యెంతటి చమత్కారపటుత్వము గలదియో, వారిప్రతిభ యెట్టిదియో, గ్రహింపగలిగితిని. భాషయం దింతటి పటిష్ఠాధికారము—శబ్దవిన్యాసమున నింతటి చమత్కారము—వాక్యరచనయం దింతటి మాధుర్యము—భావశ్లేషణమున నింతటిప్రతిభ సాధారణముగ నీవయస్సున నేలేఖకుడును బ్రకటింపజాలడు" అని భూధరబాబు ముక్తకంఠమున ననెను.

భూధరబాబుగారి మాటవలన నచ్చట ఒక్కపెట్టున నిశ్శబ్దత యలముకొనెను. ఇవి యెగతాళిసేయుట కాడినమాటలు కావు. బక్కపలుచని వాడును—దుర్బలుడును—క్షీణకాయుడును—మితభాషియు శాంతప్రకృతియు నగు నీ యువకుని హృదయమునందు భూధరబాబు వంటి విశాలవిమర్శకులు గూడ ముక్తకంఠమున బ్రశంసింపక తప్పనంతటి ప్రతిభయు—విదగ్ధతయు—విచక్షణతయు బూర్ణరూపమున నెలకొని యుండెను. రజతున కింతటి యశస్సు స్వప్నమందైన కలుగజాలకుండెనుగదా! "సమువగలుగుచున్నాడు—మందముగగాదు—ఒకవిధముగ బాగుగనున్నది" అను నిట్టి ప్రశంసలే రజతుని లేఖలకు సదా లభించుచున్నవి. నేడు శిశిరునకు లభించిన మహోత్కట ప్రశంసవలన రజతుని హృదయమున నకస్మాత్తుగా మంట లెగయదొడగినవి. కాని హృదయగతభావమును మాటువడజేసి పరాజయజన్యలజ్జా కళంకమును దొలగించుకొనుటకై నవ్వుచు "శిశిరా! చూచితివా! ఆనాడు నీవు నాపై గోపమును దెచ్చుకొంటివి. కాని నేడింతటి ప్రశంస యెవ్వనికారణమున సంభవించినది?" అని రజతు డనెను.

శిశిరునిహృదయము కృతజ్ఞతాపూరిత మాయెను. గంభీరస్వరముతో "సోదరా! నీయెడల నాకుగల కృతజ్ఞతాభావము నానాటికి బ్రవర్ధమానమగుచున్నది. నాయదృష్టరేఖ యనుకూలముగ నుండనిచో

నీవు నన్నిట్లు బంధుభావమున నేలయాదరింతువు ? నీయనురాగమేగదా నన్నింతటి స్థితికి దెచ్చినది. నీఋణమెట్లు తీర్పగలను !" అని శిశిరుడనెను.

ఎల్లరిమోములను "శిశిరుడు తనకు ఋణి" యనుభావము విస్పష్టముగా శిశిరముఖముననే ప్రకటితమైనను రజతునకు సంతుష్టి కలుగలేదు. ఆ పరాజయము అతని కొక్కక్షణకాలమైన మరపునకు వచ్చునా !

"శిశిరబాబూ ! నేను రేపు తమగృహము నాక్రమింపదలంచియున్నాను. అన్యుల కెవ్వరికేని జేరకపూర్వమే నేను తమ సమస్తభండారాధికారమును స్వీకరింపగోరుచున్నాను. రజతబాబు నావెంటనుండును" అని భూధరబాబనెను.

ఇంతదనుక రజతు డేదోవిధమున హృదయగతభావమును మాటువడజేసి కృత్రిమహాసము నొనర్చుచుండెను. కాని, భూధరబాబుగారిపుడు పలికిన పలుకులనాలించి యతడొక్కపెట్టున సంక్షుభితహృదయుడై "రేపు రాజాలను. ఆవశ్యకమగు పనికలదు" అని రజతుడనెను.

భూధరుడు రజతుని గంభీరభావము నుపేక్షించి "అట్లైన నేనొక్కడనే వచ్చెద"నని శిశిరునితో ననెను.

ప్రప్రథమసాఫల్యభావమున శిశిరునిచిత్తము ఆనందరసోద్దీప్తమైయుండెను. స్వభాగతలజ్జావశమున నమ్రుడై "మీకు స్వాగతము. కాని నాయింట స్వీకరింపదగిన పదార్థమెద్దియును లభింపదని తలంచెదను" అని శిశిరుడనెను.

భూధరుడు నవ్వుచు "నేను గైకొని రాగలుగునది వంగసాహిత్యమున నత్యంత దుర్లభమగువస్తువు. తమహృదయమున విద్యాసౌందర్యముల విచిత్రసమ్మేళనము వెలయుచున్నదిగదా !" అనెను.

రజతుడు మౌనభావమున వట్టియుండెను. కాని ఏవిషయమునను సంబంధము కలుగ జేసుకొనలేదు. వాని యనుచరులుగూడ నట్లే మిన్నకుండిరి. భూధరబాబుగారి రసభరితములగు వాక్యములు గూడ వారిమౌనభావమును సడలింపజాలకపోయినవి. ఆనాడు వాడుకగా జరుగుచుండు గోష్ఠియు జరుగలేదు. ఎల్లరును సామమిత కాలముకు మున్నే వెడలిపోయిరి.

"శిశిరుని లేఖిని యసాధారణ వేగవంతము—అపూర్వకల్పనా శక్తిమంతము—అతని కార్యము లత్యంతవిధేయతావిలసితములు—పలుకులు పరోపకారపారీణములు—మనస్సు మహోదారము—అతడు నాకంటె సర్వవిధముల సమున్నతస్థానము నలంకరించునుగాబోలును? సంగ్రహపత్రికాధిపతి సాధారణప్రజ్ఞగలవాడు కాడు. అట్టివాడే శిశిరుని వ్రాతల కచ్చెరువందుచున్నాడు. ఇంక నా గొప్పతనము కూలవలసిన దేనా! నామిత్రమండలిలో నాకు తలవంపురాదా! సంధ్య పరిహసింపదా! పాపము! నిరుపేద! నిష్కల్మషభావమూర్తి! ఇట్టి శిశిరు నధఃకరించుట పాడియా? కాకున్న నన్ను నేనే తిరస్కరించుకొందునా? వాని వ్రాతలలో దోషారోపణ మొనర్చి నాగొప్పదనము నిల్పుకొని వాని కపకారమొనర్తునా?" అని రజతు డాలోచించుచుండెను.

గోష్ఠి భంగమయినది. రజతుడు గృహములోనికి పోయెను.

## అధ్యాయం—13

"భూధరబాబుగారు మరదిగారిని మిక్కిలి ప్రశంసించుచుండిరే" అని సంధ్య ప్రసన్నవదనయై పలికెను.

"అది యంతయు పత్రికాసంపాదకుల సహజలక్షణము. నూతన వ్యాసరచయితలను తమవలలో బడవైచుకొనుట కిదే యుపాయము" అని రజతు డనెను.

"అల్లునిదగునా! మొదట జదువకయే వారు లేఖ [illegible] దలంచియుండిరి కాని 'కాండారీ' పత్రికలో ప్రకటింపబడిన లేఖను జదివినపిదప వారిమతము మారిపోయినది" అని సంధ్య ప్రతివాద మొనర్పదలచి పలికెను.

"కాండారీ పత్రికలో ప్రకటితమైన లేఖ శిశిరుడు వ్రాసినదియే యనుకొనుచుంటివా? కాదు కాదు. వానిచిత్తుప్రతి నెంతయో సంస్కరించి చదువరుల కత్యంతమనోహరముగు నిప్పటి రూపాంతర మొందించి యొసంగినవాడను నేనే" అని రజతుండనెను.

శిశిరుని పేరుపై వెలువడిన లేఖ పూర్తిగా శిశిరుని వ్రాత కాదనియు దానియందు రజతుని చేయి కలసినదనియు, రజతుడు సంస్కరించుట వలననే దానికిట్టి మనోహరరూపము కలిగినదనియు, నాథుని పరిశ్రమ మూలముననే శిశిరునకింతటి ప్రసిద్ధి కలిగినదనియు, దలపోసిన సంధ్యకు సుఖమును, దుఃఖమును గూడ గలిగెను. ఈ లేఖ శిశిరునిదే యాగుచో నామె యధికప్రసన్నురాలయి యుండవలసినదే. శిశిరునిది మాత్రమే కాదని తెలిసికొనినసంధ్య కత్యంత ఖేదము కలిగెను. కాని తనభర్తకుగల మిత్రానురాగమున కామె యత్యధిక ప్రసన్నహృదయ యయ్యెను.

"నాథా! మొదట నాకీసంగతి నేల దెలుపకుండిరి? నూత్నలేఖకుడు మీకంటె మనోహరముగా నెట్లు వ్రాయగలడని నేనును దలపోసియే యుంటిని. ఇరువురుచేతులును గలయుటచేతనా యతడింతటి యుత్తమప్రశంసాపాత్రుడయ్యెను?" అని సంధ్య రజతునితో ననెను.

కాని యింతమాత్రమున రజతున కిసుమంతయు సంతసము కలుగలేదు. "ఔను" అని మాత్రమే చెప్పి వెలుపలికి బోవసాగెను.

సంధ్య భర్తగారి గంభీరతను గమనింపక యింకనిట్లనెను "ఇంక భూధరబాబుగారు కొంతమేని సాహాయ్యము కలుగును. చూడనిదే లేఖను ముద్రణమున కొసంగి మోసగింపజాలనని తెలిపెను. చూడుడు! నేటినుండి మీరు చిత్తుప్రతిని జూడవలదు. సంశోధనముగూడ జేయవలదు" అని చెప్పెను.

రజతునకు సంధ్య చెప్పిన మాటలవలన గొంచెమేనియు నానందము కలుగలేదు "నీవుపోయి పండుకొనుము నా కత్యావశ్యకమగు నొక లేఖ వ్రాయవలసియున్నది" అనెను.

భర్తగారునుడివిన యంతిమవాక్యములను విని, సంధ్య మారుమాటాడక మిన్నకుండెను. భర్తగారు మిక్కిలి గంభీరహృదయులై యుండిరనియు, వారికాట్టి సంతుష్టమైనట్టి యానందము స్ఫురించుటలేదనియు నామె గ్రహించెను "హృదయము నేదియో నూత్నభావమావిర్భవించినది. వారు దాని సంకేతమొసగ్రదగు సోపానసరణి నిర్మించుచున్నారు. ఏదియో యొక నూతనరచన తప్పక యొనర్తురు. చదువరులకు క్రొత్తభావములు లభించును" అను నభిప్రాయమున నామె మిక్కిలి సంతోషమొంది వెడలి శయ్యపై బండుకొనెను.

రజతుడు గదిలోనికిబోయి దీపము వెలిగించి కాంచారీ పత్రికలో వెలువడిన క్రొత్తసంచికలోని విషయములకు విమర్శన వ్రాయ మొదలిడెను. ఇంచుమించుగా పండ్రెండుగంటలరాత్రి యగుసరికి తనవిమర్శను ముగించెను.

సంధ్య యుడుకుమోతనముతో "ఏమివ్రాసితిరో చూచెదను!" అని పట్టుదలతో నడిగెను.

రజతు డాశ్చర్యముతో "నీవు నిద్రించుటలేదా?" అనెను.

"లేదు. మీ లేఖ జూడనిదే నామనస్సునకు విశ్రాంతి సమకూడదు" అని సంధ్య యనెను.

"విశేషములేమియు లేవు. కాండారీ నూత్నసంచికా విమర్శన మొనరించితిని. రాబోవు సంగ్రహపత్రికలో వెలువడును" అని రజతుడనెను.

"మీ ముఖమున మీ నాతలరీతుల సౌందర్యరసము నాస్వాదింప దలంచి యడుగుచున్నాను" అని పట్టుదలతో ననెను.

రజతుడు కుంఠితుడై "దానియందుగల లోపములనెల్ల సంక్షిప తింపవలసియున్నది" అని యనెను.

సంధ్య లేఖనె త్తి తీయుచు, "సంగ్రహతింపవలసిన భాగములను బిదప సంగ్రహతింపవచ్చును. నే నిపుడు తప్పక చదివియే తీరవలయును. ఇందులకే యింతదనుక మేల్కొనియుంటిని" అని చెప్పెను.

రజతుడటనుండి లేచి మెల్లమెల్లగా బోయి పర్యంకముపై బరుండెను. సంధ్య నూత్నవిమర్శనము జదువ మొదలిడెను. తక్కిన వ్యాసములపై సామాన్యదృష్టుల బరపుచు రజతుడు తన కల్పితకథలపై దీక్ష విమర్శన మొనరించియుండెను. అంతమున శిశిరుని యుపన్యాసమును విమర్శించియుండెను. లేఖకుని అసంగతశబ్దప్రయోగము—శబ్ద విన్యాసశైథిల్యము—భావగ్రహణలోపము—నాయికానాయక సంభాషణముగల యతిశయోక్తులు—మున్నగువిషయముల గూర్చి తీవ్ర విమర్శ మొనరించెను. ఈ విమర్శనచే సంధ్య చకితచిత్తయై "మీరు మీచేతులతో మీ మిత్రులనే విమర్శింపబూనితిరా!" అని నవ్వుచు బలికెను.

"విమర్శించుటలో స్వపరిభేదము గమనింపదగదు. ఇచ్చట నేమో యొకవంక లేఖకుడను. రెండవవైపు సమాలోచకుడను. సాహిత్య దృష్టితో ప్రతిలేఖకుని విమర్శింపవలసియుండును. అప్రతాసునందే తూచవలసియుండును" అని రజతుడనెను.

సంధ్యహృదయమున శ్రద్ధయు, ప్రేమయు పెనుగొనుచుండెను, "నానాథు డింతటి నిష్పక్షపాతియా" యని తలంచెను. అచటనుండి తటాలున లేచి భర్తను గాఢాలింగన మొనర్చుకొనెను. దానివలనగూడ రజతునిహృదయమున నుల్లాసము కలుగలేదు.

"ఇంక మేలుకొనియుండకుము. చాలరాత్రియయినది. పోయి పండుకొనుము" అని చెప్పెను.

*    *    *    *    *

గోష్ఠిముగిసినపిదప శిశిరు డెప్పటియట్లు విద్యుత్తునింటి కను పుటకు ఆమెతో నేగుచుండ త్రోవలో విద్యుత్తు "భూధరబాబుగారు గావించిన ప్రశంసను మీమిత్రులు ప్రసన్నముఖులగుట లేదు" అని యనెను.

"కాదు! అట్లుకాదు! ఈప్రశంసవలన గలుగు నెక్కుడు శ్రేయోభాగము వారిదే యని యెరుంగుము" అని శిశిరు డనెను.

"రజతబాబుగారు సదా స్వప్రతిష్ఠా పరాయణులు. వారికంటె మిన్నయగువారిని గాంచిన వ్యాకులచిత్తులై సహింపజాలని స్వభావము గలవారు. ఈవిషయము రెండువత్సరములనుండి వారియింటికి రాక పోకలు సలుపుచుండిన నాకు స్వానుభవవేద్యము" అని విద్యుత్తు పలికెను.

శిశిరుడు వ్యాకులుడై "నీవు రజతబాబును చక్కగా గ్రహింప జాలకుంటివి. అతనిహృదయము మిగుల సరళమైనది, ఉదారమైనది" అని పలికెను.

విద్యుత్తు శిశిరుని సహజసరళతయును, లోకముపై నతనికిగల దృఢవిశ్వాసమును దలచుకొని ముగ్ధయై "ఔను మీరు చెప్పినది సరిగానున్నది. కాని రజతబాబుగారి యుదారతకు సమానుడుగాని,

అధికుడుగాని గన్పట్టునంతవరకే. కాని తన్నతిక్రమించువాడు కన్పట్టి నచో నతనిప్రకృతి కుమార్గమును బట్టి వికటరూపమును ధరించును" మీకు కలిగినప్రశంస కాయన ప్రసన్నహృదయు డగునని తలచు చుండిరా ?" అని యనెను.

శిశిరుడు దుఃఖితుడై "అట్లగుచో నేను నాలేఖలను గైకొన వలసియుండును. నాకు యశోభిలాష లేదు. రజతునిమైత్రియే నాకు కావలసినది. అదియే నాకావశ్యకమైనది. ఇంతవరకవి ముద్రితములు కాలేదుగదా ? ఇకముం దెన్నడును ముద్రితములు కావు" అనెను.

పరాభ్యుదయముకొరకు స్వలాభములను విశుద్ధహృదయముతో విడనాడు శిశిరుని యుదారస్వభావముకొరకు విద్యుత్తు ముగ్ధురాలై "స్వార్థశూన్యుడు విద్వద్వరేణ్యుడయినను దన వైదగ్ధ్యమునకు గర్వింపడు కదా !" అని మిన్నకుండెను.

# అధ్యాయం—14

మరునాటి మూడవజామున భూధరబాబుగారు శిశిరుడున్న గృహమునకు వచ్చిరి. "సంగ్రహ" సంపాదకులు స్వయముగా లేఖలను గైకొనుటకు శిశిరుని గృహమునకు వచ్చియున్నారనువార్త ఆ గృహ మంతటను వ్యాపించెను. "శిశిరుడెంతటి యోగ్యుడో కదా !" యని యచటివారందరును విస్మయులై చూడదొడగిరి.

"మహాశయా ! నాలేఖలను బత్రికలో బ్రకటించుటకు నామన స్సంగీకరింపకున్నది. రజతునితోగూడ నేనిదియే చెప్పియుంటిని. "దీని కనేక కారణములుకలవు" అని శిశిరుడు భూధరబాబుగారితో ననెను.

ఇట్టి సంకోచమును మీరొందరాదు. నేనీనాడు మీ "పూవుల బుట్ట"ను చదివితిని. దాని నేమనివర్ణింతును ! అత్యంత మధురమనోహర

రచనాలంకృతమై వెలయుచున్నది. చదివినకొలది మానసము విస్మ యావిలమై పోవుచున్నది. వా స్తవముగ బూవులబుట్టలోని ప్రతిశబ్దమును సురభిళ ప్రసూనరాజమే ! ప్రతిశబ్దమందును వెలయు అపరిమితభావ సౌరభము పుష్పసౌరభ సదృశమై మనోజ్ఞమగుచున్నది. ప్రతిశబ్దమును ప్రౌఢ లేఖినీనిర్గతమని చెప్పక తప్పదు" అని భూధరబాబు ముక్తకంఠ మున ననెను.

"రజతుని యనభిజ్ఞత నా కెంతయును వెరపుగొలుపుచున్నది. నన్ను మానసిక చింతావాగురులలో దగుల్కొన జేయకుడు ! మీరు నన్ను ప్రశంసించుట నాకు హానికరమగునేమోయను భయము కలుగు చున్నది" అని విరాగముతో శిశిరుడనెను.

భూధరబాబుగారును, అచ్చటనున్న యితర విద్యార్థులును గిలకిల నవ్విరి. "ఇప్పుడు తమవద్ద సిద్ధముగానున్న లేఖలను నా స్వాధీన మొనర్పుడు ! బి. ఏ. లో కృతార్థులై మరల వ్రాయవచ్చును" అని భూధరబాబుగారనిరి.

"మీరు నన్ను క్షమింపుడు! అనురాగపూర్వకముగ నా లేఖలకై యిట్లు నిరోధించుచున్నారు. నా కింతకంటె సౌభాగ్యమేమున్నది? కాని, దీనివలన నే నాపదను శంకించుచున్నాను. కారణము మీ రూహించినచో దెలియగలరు" అని శిశిరుడనెను.

"ప్రథమసంతానలాభము నొందిన నవవధువువలె నూతన లేఖకులు సంకోచము నొందుట సహజమే" యని తలచి కాళిదాసు శిశిరవిరచిత గ్రంథావళినెల్ల దెచ్చి భూధరబాబు నెదుటనుంచి "ఇప్ప టికి జిక్కిన వివియే. ఇంకను వెదకెదను" అని యుత్సాహముతో జెప్పెను.

# అధ్యాయము—14

భూధరబాబుగారా గ్రంథములను గైకొని ఆనందభరితులై "చాలును ! నేవచ్చినపని యయినది. శిశిరమహాశయా ! ఇంక నాకనుజ్ఞ నొసంగుడు ! ఇప్పటికిబోయి మరియొకసారి మిముజూడవచ్చెదను" అని మందహాసముతో యటనుండి వెడలిరి.

అచటనున్న విద్యార్థులెల్లరు నొక్కపెట్టున శిశిరునియుత్తరతో ప్రశంసించిరి.

శిశిరుడు కాళిదాసునుజూచి "సోదరా ! నీవొసరించిన కార్యమేమియు బాగుగలేదుసుమా !" అనెను.

"విమర్శకుల కఠోరలేఖినులకు భయవిహ్వాలుడై శిశిరుడిట్లనుచుండెనేమో" యనుకొని కాళిదాసు శిశిరునివంకజూచి నవ్వుచు "సోదరా ! విమర్శకలోకదండనాథు డనదగిన 'సంగ్రహ' సంపాదకుడే స్వయముగావచ్చి ముక్తకంఠమున ప్రశంసించి, నిర్బంధించి నీవ్యాసములను దీసికొనిపోవగా, సామాన్యవిమర్శకుల సమాలోచనములకు నీవు భీతిపడనేల ?" అని చెప్పెను.

"శిశిరచక్రవర్తిగారు మేడమీాదనున్నారా !" అనుధ్వనిక్రింద నుండి యాసమయమున వినవచ్చెను.

శిశిరుడు చకితుడై నిలిచియుండెను. "ఆం. ఉన్నారు మీాదకు రండు !" అని కాళిదాసు క్రిందకుజూచి చెప్పెను.

ఇరువురు పురుషులు గదిలోనికివచ్చి నిలిచిరి. అందొక పురుషుడించుక స్థూలకాయుడు — బలముగలవాడు — స్ఫూర్తస్యూవనోత్సాహమున నున్నవాడు—కొంచము మలినమైన పాంచాలదేశపు టుత్తరీయమును పల్లెవాటుగా వేసికొనినవాడు. రెండవ యాతడు కృశాంగుడు—దుర్బలుడు—సులోచనములు ధరించినవాడు—సగము గొరిగించుకొనిన మీాసములవాడు—మంచి వస్త్రులను ధరించినవాడు.

# అధ్యాయము—14

కాళిదాసు వారిరువురికి రెండుకుర్చీలను జూపి కూరుచుండ గోరెను. వారా కుర్చీలపై గూరుచుండిరి.

వారిరువురిలో మొదటిపురుషుడు కాళిదాసువంకజూచి "నాపేరు శైలేంద్రనాథసర్కా రందురు. 'మందిర' పత్రికాసంపాదకుడను. వీరి పేరు శిరీషచంద్రమైత్రు 'ముద్రిక' పత్రికాసహాయ సంపాదకులు. కాండారిపత్రికలో వెలువడిన శిశిరబాబుగారి వ్యాసమును జదివి మేము ముగ్ధులమైతిమి. భూధరబాబు గారుగూడ శిశిరబాబుగారిని మిక్కిలి ప్రశంసించిరని వింటిమి మేము శిశిరబాబుగారిని సందర్శించి వారికృపా వీక్షణములు మాపత్రికమీదగూడ ప్రసరింపజేయవలెనని ప్రార్థింప వచ్చినాము. మీలో శిశిరచక్రవర్తిగా రెవరో తెలుప బ్రార్థించు చున్నా"మని యనెను.

"ఇట్టి కోమలకవితాప్రదీప్తుల బ్రసరింపజేయుచున్న కళాపూర్ణుడు మాటుపడి యుండజాలడుకదా ? సర్వవిషయవిజ్ఞాన మూలకములగు పత్రికలకు బిత్ప్రాయులగు మీరు వానిని గురుతింపజాలరా ?" అని మందహాస మొనరించుచు గాళిదాసనెను.

కాళిదాసుమాటల నాలించి శైలేంద్రుడు చకితుడై విభ్రాంతు డయ్యెను.

"ఇట్లు మాటలాడుచున్న మీరు శిశిరచక్రవర్తిగారుకారు". అని శిశిరునిమోముపై జూడ్కి నిగిడ్చి "మహాశయా ! మీయాకారమును స్వభావగత లజ్జయు—సాహితీసముజ్జ్వలిత ముఖకాంతియు, జూడగా మీరె శిశిరచక్రవర్తిగా రనుసందియము కలుగుచున్నది" అని చెప్పు చుండగనే యచ్చటివారెల్లరును బ్రసన్నులై పకపక నవ్వదొడగిరి.

"మహాశయా! మీరు పరీక్షలో కృతార్థులైతిరి. కాని ఇప్పుడె భూధరబాబుగారువచ్చి ఉన్నతపుస్తకములనెల్ల దీసుకొనిపోయిరి" అని కాళిదాసనెను.

"ఏమి! అన్నియు దీసికొని పోయినారా?" అని హతాశుడై శైలేంద్రుడడిగెను.

"అయిన నేమాయె! కవులు కల్పవృక్ష సదృశులుకారా? ఎవ్వరైన నున్న ఫలములనెల్ల గైకొని పోవగలరు. కాని, ఫలశక్తిని దీసికొని పోవజాలరుకదా?" అని శిరీషబాబు మందహాసమొనరించుచు ననెను.

శిరీషబాబుగారి యూహచాతుర్యమునకు శిశిరుడు సంతసించి "మహాశయా! మీపత్రికలో నా వ్యాసములకు దావొసంగదలచుటచే నేనెంతయు భాగ్యవంతుడనైతిని" అని లోనికేగి రెండువ్యాసములను దెచ్చి యిరువురకు నిచ్చెను.

శైలేంద్రు డపరిమితానందభరితుడై "మహాశయా! మీ సౌజన్యమునకు మేమెంతయు కృతజ్ఞులము. మీరెప్పుడేని మా కార్యాలయములకు వచ్చి మమ్ము ధన్యులజేయ ప్రార్థించుచున్నాము. మేము తరుచుగ వచ్చిపోవుచుండుట కవకాశముండదు కదా? నేటికి మా కనుజ్ఞనొసంగుడు" అని గౌరవపూర్వకముగ ఆమాసపు "ముద్రిక" "మందిర" పత్రికలను శిశిరునకు బహుమానముగనిచ్చెను.

శిశిరుడును సగౌరవముగ వారి కనుజ్ఞనొసంగెను, వారేగిన పిదప శిశిరుడు దుస్తులనుధరించి, విద్యాభవనమునకు బోవ సిద్ధముగ నుండెను.

అప్పుడు కాండారీపత్రికా సంపాదకులగు దక్షిణాబాబుగారు మరియొక భద్రజనునితో గలిసి, శిశిరునియొద్దకువచ్చి, కాళిదాసువలన శిశిరునెరింగిరి.

శిశిరుడును వారిని సగౌరవముగ నాసనాసీనుల గావించెను.

దక్షిణాబాబు తన పరిచయమును శిశిరునకు గలిగించి "మహాశయా! మీయమూల్యవ్యాసరాజము కాండారీభాగ్యమును బరివర్తన మొనరించెను. ఈమాసముద్రికలో మీవ్యాస మెంతయు గొనియాడ బడినది. అందుచే గ్రాహకులు గుంపులు గుంపులుగావచ్చి చేరు చున్నారు" అని యానందముతో జెప్పెను.

"శిక్షుబాబుగారిపుడే యిచ్చటనుండి వెడలిరి. కాని వారీసమాచారమును నాకు జెప్పుటలేదే! ఈమాసపత్రముద్రికను నాకిచ్చినారు. ఇంకను దానిని నే జదువలేదు" అని శిశిరుడనెను.

"అది మీరు చూడవచ్చును. వీరు నామిత్రులగు శ్యామలాల్ ముఖోపాధ్యాయులు. పుస్తకప్రకటనకర్తలు. 'కాండారీ'లో వెలువడిన మీవ్యాసమును బుస్తకరూపమున వెలువడజేయుటకు మీయనుజ్ఞను గోరుచున్నారు. రెండువేలరూప్యములను పురస్కారముగ్గైకొని సర్వస్వాతంత్ర్యములను బ్రకాశకునివిగా నొసంగ బ్రార్థించుచున్నారు" అని చెప్పెను.

"ఈవిషయమున మీరు రజతబాబుగారితో బ్రసంగింపగోరుచున్నాను" అని శిశిరుడు చెప్పెను.

"రజతబాబుగారియొద్దకేగి యడిగితిమి. వారు మీయొద్దకే పంపినారు" అని దక్షిణాబాబనెను.

"సరియె యోచించి రెండుమూడు దినములలో మీకు దెలిపెదను" అని శిశిరుడు చెప్పెను.

"మీరన్యథా భావింపవలదు" అని శిశిరునియొద్ద ననుజ్ఞగైకొని వారిరువురు నేగిరి.

# అధ్యాయం—15

శిశిరుడు విద్యుద్భవనమున ప్రవేశించి మేడమీదకేగి గది గుమ్మమునొద్ద దట్టాలున నాగిపోయెను.

క్షణప్రభ నిలువుటద్దమునొద్ద నిలిచి, తన సౌందర్యచ్ఛటలను జక్కగాదిద్ది సరిచేసికొనుచుండెను. ఆమె మొలకనవ్వులు—భ్రూవిలాసములు నిల్వుటద్దమున బ్రతిబింబించుచుండెను. ఆనడుమ లజ్జాపూర్ణమగు శిశిరునిముఖముగూడ నందు గోచరించెను.

క్షణప్రభ తత్తరపాటుతో సవరణముగించి "కుమారా! రమ్ము విద్యుత్తు నీరాకకై యింతవరకు నిరీక్షించి నీవు రజతబాబుగారి యింటి కేగియుందువని యిపుడిపుడే అచటికేగినది. నీవేల నేడింత యాలస్యమొనరించితివి?" అని యడిగెను.

"నాకై వచ్చిన భద్రజనులతో మాటలాడుచుండుటచే నాలస్యమైన" దనెను.

"నీవును రజతునిమందిరమున కేగుము" ఆమె నీరాకకచట వేచియుండును" అన్నది క్షణప్రభ.

పుత్రికనుగూర్చి తల్లినోటవెలువడిన యిట్టిమాట శిశిరునకు మిక్కిలి హేయతగా దోచెను. క్షణప్రభయొద్ద ననుజ్ఞగొని యటనుండి రజతమందిరమునకు బయలువెడలెను.

విద్యుత్తును, శిశిరుడును ప్రత్యేకద్వారములనుండి యొక్కమారుగనే రజతునిభవనమున బ్రవేశించిరి. అపుడు సంధ్యాసునయనులు రజతుడు నొక్కచోటుననే యుండిరి.

విద్యుచ్ఛిశిరు లిరువురును గలిసివచ్చుటచూచి సంధ్య నవ్వుచు "ఒకరివెంటనొకరు దంపతులవలె నేడు మీరువచ్చుట మాకు మిక్కిలి

యానందకరముగను, సుఖదాయకముగ నున్నది. రండు ! మీరిరువురు నారెండుకుర్చీలపై గూరుచుండుడు !" అనెను.

విద్యుత్తు లజ్జావనతముఖియై సంధ్యయొద్దకేగి దంతపుముక్కల బోలు నామెచెక్కిళులపై లేజివురులబోలు తనవ్రేళ్ళతో మెల్లగాగొట్టి "నీమాటలతీ రెల్లపుడు నొక్కవిధముగనే యున్నది !" అనెను.

సంధ్యనవ్వుచు శిశిరునిజూచి "మీరీ మాసపు 'ముద్రిక'ను జూచినారా ? లోకమును మోసగించుటలోగల మీయనుపమాన చాకచక్యము మాయెడ బనిసేయగలదనియె తలంచుచున్నారా" అన్నది.

సంధ్యమాటలలో నిమిడియున్న గంభీరాభిప్రాయమును దెలిసికొనజాలక, శిశిరుడు చకితుడై "ఎట్లు లోకమును వంచించుచున్నాను?" అని యడిగెను.

"కాండారీ పత్రికలో మీపేరుతో బ్రకటితమైన వ్యాసము మీదియేనా ?" అన్నది నవ్వుచు సంధ్య.

ఆమాటకు శిశిరుడు సంక్షుభితచిత్తుడై "నాది కాదని యన్నవారెవరు ?" అని యనెను.

"ఇప్పటి మనోహరపరిణామమొనరించి దానిని బ్రకటింపజేసిన మీబంధువు" అని రజతునిపై జూపుబరపెను.

శిశిరుడు నీరవుడై రజతునివంక జూచెను. ఆతని ముఖభంగిమ జూచి వానిహృదయతత్త్వము నెరింగి, మరల సంధ్యనుజూచి "తెలిసినది నేనెంతగాజెప్పినను రహస్యము దాచక అంతయు నీతడు వెలువరించెను. ఈవ్యాసమున నాపేరుంచవలదని నే నెంతనిరోధించినను వినక యిట్లొనరించెను. నిజముగా నిందు మూడువంతులవ్రాత అన్నగారిదే ! నాకు ప్రఖ్యాతి కలుగవలెనని యిట్లొనరించినారు. కాని, దొంగతన

మెన్ని దినములు మాటుపడియుండగలను ?'' అని కృత్రిమ మందహాస మొనరించెను.

శిశిరుని మాటలచే విద్యుత్తుహృదయమున లజ్జావేదనాసంక్షోభము లొక్కపెట్టున లేగినవి. మరి యామె యచ్చటనుండజాలక పోయినది. "నాశరీరస్థితి బాగులేదు. నే నింటికేగెదను" అని తటాలున లేచెను.

"అకస్మాత్తుగా నేమికలిగెను !'' అని తొట్రుపాటుతో సునయనీదేవి యడిగెను.

"శిరోవేదన చాలతీవ్రముగా నున్నది. అప్పుడప్పు డీబాధ నాకు గలుగుచుండును" అని విద్యుత్తు చెప్పెను.

సంధ్య అనురాగపురస్సరముగ నామెశరీరముపై జేయినిడి "ఇచటనే పండుకొనుము! కొంచెముబాధ తగ్గినపిదప నింటికేగవచ్చును" అన్నది.

"కాదు కాదు ! నే నింటికిబోవకతప్పదు'' అన్నది విద్యుత్తు.

విద్యుత్తునకు గలిగినబాధకు శిశిరునిహృదయము వేదనామయమయ్యెను. కాని, యచట నేమనుటయు సమంజసముకాదని మిన్నకుండెను.

విద్యుత్తునడువదొడగెను. ఆమె ఒంటిగబోవుచుండుట శిశిరుడు సహింపజాలక మనస్సునందే దారుణయాతన ననుభవించుచుండెను.

సునయనీదేవి శిశిరునజూచి "శిశిరా ! ఈమెశరీరస్థితి బాగులేనపుడు ఒంటిగాబోవుట మంచిదికాదు. నీవు గూడ బోయి యీయామె నింటికి జేర్చిరమ్ము !'' అని చెప్పెను.

ఈ యాజ్ఞాపరిపాలన మొనరించుటకు శిశిరుడు మహానందభరితుడై లేచి నిలిచెను.

సునయన నవ్వి "మరదిగారిని లేవదీసికొనిపోవుట కనుకూలతగూడ చక్కగాకుదిరిన" దనెను.

కోడలిమాటకు సునయనినవ్వెను. రజతుడు మౌనముద్ర వహించెను. విద్యుత్తుతో శిశిరుడు బయలుదేరెను. ఇరువురును బండిలో కూరుచుండిరి బండినడచుచున్నది.

"మీతలనొప్పి యంతతీవ్రముగా వేధించుచున్నదా ?" అని శిశిరుడు కరుణాపూర్ణస్వరమున నడిగెను.

"ఈతలనొప్పి మీకల్లమాటల నాలించుటచె వచ్చినది" అనెను కోపముతో విద్యుత్తు.

విద్యుత్తుమాటకు చకితుడై, ఆమె బుద్ధికుశలతకు ముగ్ధుడై "నామాటలలో నేమిదోసమున్నది ?" అని శిశిరుడడిగెను.

"నాయెదుట మీచమత్కారములను గట్టిపెట్టుడు ! రజతబాబు గారి శైలి నేనెరుంగనిదికాదు. మీలేఖలోని యొక్కపంక్తినైన నాతడు వ్రాయనర్హుడా ? ఈజన్మమున కాదుగదా ! ఇంక పదివేలజన్మము లెత్తినను ఆతని వశముకాదు. వ్రాయనక్కరలేదు; అందలి గభీరభావమునైన గ్రహింపగలడా ? ఇదియేకదా ! వారికి మీపైగల యీర్ష్యకు గారణము ?" అని విద్యుత్తు మిక్కిలి తీవ్రముగననెను.

"ఛీ ! రజతుడు నాపుస్తకము నే విషమసమయమున వెలువడ జేసెనోకదా ! తప్పించుకొనుట కిప్పుడేమార్గమును గానుపింపకున్నదే ! 'సంగ్రహ'—'మందిర'—'ముద్రిక' సంపాదకులు గూడ నేనువచ్చి వ్యాసములను గైకొనిపోయిరే !" అనిచెప్పి శిశిరుడు యోచించుచుండెను.

"ఏమీ ! ముద్రికాసంపాదకులు గూడ వ్యాసములగోరి తీసుకొని పోయినారా ! బాగు ! బాగు !! 'ముద్రికా' సంపాదకులను రజత

బాబుగారికిని విరోధమున్నది. "ముద్రికలో ప్రకటింపబడిన వ్యాసము గూడ నేనే సవరించితి"నని రజతబాబుగారెట్లు చెప్పగలరో చూచెదను గాక!—" అని విద్యుత్తు నుడివెను.

శిశిరుడామాటలకు మందహాసమొనరించి "ఇదివరకే రజతబాబు వ్యాసమును సవరించియుండెను" అని చెప్పెను.

బంకే పస్యత్తుగుమ్మమునొద్ద నాగెను.

# అధ్యాయం—16

మరునాడు శిశిరుడు కళాశాలలో ప్రవేశింపగనే ఖగేనుడు శిశిరునియొద్దకు వచ్చి, వానిభుజముపై జేతితోదట్టుచు "రజతబాబు తాను ప్రతిజ్ఞబట్టిన విధముననే మిమ్మనతికాలమున విఖ్యాతలేఖకులుగ జేసినారే!" అనెను.

"కావుననే సర్వదా యాతనిమైత్రి నభిలషించుచున్నాను" అని శిశిరుడు చెప్పెను.

"చూడుడు! రజతబాబునందెంతటి సామర్థ్యమున్నదో! తన శైలి నితరలకు దెలియనీయకుండ దనలేఖినిని మీలేఖినితో నెంత సాంద్రముగ మేళవించెనో!" అని ఖగేను డుద్వేగముతో ననెను.

"ప్రతిభయన నిట్టిదేకదా! ఇది యాతనికి బుట్టుకతో వచ్చినది" అని శిశిరుడు నుడివెను.

అంతవరకు నచ్చటనేయున్న రజతు డామాటవినిని దూరముగ వెడలిపోయెను.

"ఆత్మప్రశంసావాక్యముల నాలింపనొల్లక రజతబాబుదూరముగ నేగెను" అని ఖగేను డనెను.

ఇంతవరకు శిశిరఖగేనుల సంభాషణమంతయు నాలించుచున్న కాళిదాసు ఖగేనుని దెస జూడ్కి నిగిడ్చి "ఏమనుచున్నావు! 'కాండారీ' పత్రికలో వెలువడిన శిశిరుని లేఖ రజతుడు వ్రాసినదనియా!" అని శిశిరునిజూచి "శిశిరా! ఈమాట సత్యమేనా?" అని యడిగెను.

"బాగు బాగు! కాళిదాసూ! ఈవిషయమును శిశిరు డెన్నడైన అంగీకరించునా! ఒకనాడు రజతబాబుగారు నాతో నిట్లు చెప్పినారు. నేను శిశిరునకు అన్నవస్త్రములిచ్చుచుంటిని. గృహాధికారి యింటియద్దె తగ్గించివేసెనని మిషపెట్టి యింటియద్దె నిచ్చుచుంటిని. అతనికి పేరు ప్రతిష్ఠలు గలుగవలెనని కొన్ని పుస్తకములను—వ్యాసములను వ్రాసి శిశిరుని పేరనే ప్రకటించుచున్నాను. ఇన్ని యుపకారములు నే నొనరించుచున్నను, నాయెడ కృతజ్ఞత జూపకున్నాడు" అని ఖగేనుడు నుడివెను.

ఖగేనుని మాట చెవినిబడినంతనే శిశిరుడు తన తలపై పిడుగు పడినట్లెంచెను. లజ్జాభయవిహ్వలవీక్షణములను గాళిదాసుముఖముపై ప్రసరింపజేసెను.

కాళిదాసు ఖగేనుని జూచి "కల్ల—కల్ల పట్టి కల్ల! ఇన్ని పుస్తకముల వ్రాయుదగు నవకాశము రజతున కెక్కడనున్నది! భూధరబాబుగారు స్వయముగ శిశిరుని మందిరమునకువచ్చి బహుభంగుల ప్రశంసించి లేఖలను గోరినను, ఈతడిచ్చుట కంగీకరింపలేదు. నే నా కాగితములనెల్ల వెదకి దీసి యిచ్చివేసితిని. అందొక్క కాగితముపైన గూడ రజతుని హస్తాక్షరములు గానుపించుట లేదు" అని యనెను.

"సరి! భూధరబాబుగారి పొగడికలకేమి? పత్రికాసంపాదకుల ధోరణియేయిది. ఇపుడు పొగడుదురు-ఆమరునిముసముననే నిందింతురు" అనెను ఖగేను.

"ముద్రిక—మందిర—పత్రికాసంపాదకులుగూడ వచ్చి కాండారీలోని లేఖను మిగుల ప్రశంశించినారే! వారుగూడ నొక్కొక లేఖను దీసుకొనిపోయినారు" అని కాళిదాసనెను.

"కాండారీలో నెలువడిన వ్యాసమునం దెంత పసయున్నదో యీమాసపు సంగ్రహాలో దెలియగలదు" అని ఖగేను డీర్ష్యతోననెను.

ఆసమయమున శిశిరునకు సంధ్యమాటలు జ్ఞప్తికివచ్చినవి. ఇంచుక యోచించి, "ఇంక నిచ్చటనున్నచో నెట్టి యప్రియముల నాలింపవలసివచ్చునో" యని యూహించి యాతడటనుండి వెడలెను. కాళిదాసుగూడ శిశిరునే యనుసరించెను.

ఖగేనుడు రజతునియొద్దకేగెను. ఇరువురును ఏవో రహస్యముగ మాటలాడుకొనుచుండిరి. ఇంతలో గళాశాల గంట మ్రోగినది. ఉపాధ్యాయుడు తరగతిలోనికి వచ్చెను. విద్యార్థులందరును సావధానులై యుండిరి.

# అధ్యాయం—17

సాయంకాలము కళాశాలనుండి శిశిరుడు రజతుని మందిరమునకు వచ్చెను.

సంధ్య శిశిరుని కళావిహీనవదనమును జూచి సంచలితహృదయయై "మరదిగారూ! మీహృదయము అస్థిరముగానున్నదా?" అని యడిగెను.

శిశిరుడు క్షణకాలము మౌనము వహించి "లేదు లేదు. సరిగానే యున్నది" అని ప్రత్యుత్తరమిచ్చెను.

"శాలనుండి యిప్పుడే వచ్చుచుండెనుకదా అందుచే మోము వాడియున్నది. కుమారా! రమ్ము. అల్పాహార మొనరింపుము!" అన్నది యనురాగమధురస్వరమున సునయనీదేవి.

శిశిరు డశ్రుపూర్ణనయనుడై "అమ్మా! నేను భుజింపజాలను. వదినెగారూ! మీరు పుస్తకమును దీయుడు!" అనెను.

శిశిరుని మాటవలన సునయనీదేవి విహ్వలచిత్తయయ్యెను. "ఏదియో విపరీతఘటనచే శిశిరుడు వ్యథాపూరితచిత్తుడయ్యె" నని యూహించి యాతనియొద్దకు వచ్చి కరుణానురాగపురస్సరముగ శిశిరుని వీపును జేతితో నిమురుచు "కుమరా! ఏమిజరిగినది? ఏల వ్యథాపూర్ణ హృదయుడవైతివి?" అని యడిగెను.

తటాలున రజతుడాగదిలోనికి వచ్చెను. సునయనీదేవి కుమారుని జూచి "బాబూ! నేడు శిశిరుడేల యల్పాహారమును గైకొనకున్నాడు? ఏమిజరిగినది!" అని యడిగెను.

"నాకేమి తెలియును!" అనెను రజతుడు.

"శిశిరా! ఏమిజరిగినదో నాతో నేలచెప్పవు? నీకష్టము దీర్చుటకు నీతల్లి యున్నదికదా అని యనెను.

"అమ్మా! రజతుడు నాకన్నవస్త్రములును, ఇంటియద్దెయు నిచ్చుచున్నాడని విద్యార్థులందరును నన్ను గేలిసేయుచున్నారు" అని డగ్గుత్తికతో ననెను.

ఆమాటకు సునయనీదేవి హృదయము సంక్షుభితమైపోయెను. రజతునిపై దనకోపారుణితవీక్షణమును నిగిడ్చి "వారిట్లేల వీనిని బరిహసించుచున్నారు?" అని రూక్షస్వరమున నడిగెను.

## అధ్యాయము—17

"అమ్మా! ఏల యూరక నన్ను గోపించుచున్నావు? నేను లోకమునోరు మూయగలనా?" అనెను రజతుడు.

"చాలు జాలు! నీవుచెప్పకున్న నింటియద్దెవిషయము వారి కెట్లు తెలియును?" అని గద్దించి యడిగెను సునయనీదేవి.

"ఆయింట నివసించుబాలుడెవ్వడో యీరహస్యమును బయలు పరచియుండును" అని నిర్లక్ష్యభావమున శిశిరుడు చెప్పెను.

సునయనీదేవి రజతుని తీవ్రదృష్టులజూచి, పిదప శిశిరుని రెండు చేతులను బట్టుకొని "పుత్రా! తేజోవంతమగు నీయాత్మగౌరవమును ధనమదమున మేమెరుంగజాలక నిన్నవమానించితిమి. నీవు మమ్ము క్షమింపుము!!" అని ప్రేమ పూర్ణస్వరమున ననెను.

ఆమాటకు దటాలున శిశిరుడు సునయనీదేవిపాదములపై బడి "అమ్మా! మీరేమియు నట్టి యకార్యమొనరించుటలేదే! నేను మీపుత్రుడను కదా!" అని సవినయముగ ననెను.

రజతుడొక్క క్షణమేని యచటనిలువజాలక వెడలిపోయెను.

సునయనీదేవి యాదరముతో శిశిరుని బట్టియెత్తి "పుత్రా! నీవంటిపుత్రుడు మాకు లభించుటచే మేమెంతగర్వించుచుంటిమో నీ వెరుంగవు. ఆనందగర్వమున నాకసమందికొనుచున్నాము. మావంటి భాగ్యవంతులీయిలాతలమున నింకెవ్వరును లేరని విఱ్ఱవీగుచున్నాము. అట్టి మా పుత్రలాభగర్వమును నశింపజేయకుము. తత్తరపడి మాతోడి సంబంధమును విచ్ఛేదమొనరింపకుము!" అని సానురాగముగ—సకరుణముగ—కనులనీరుగ్రమ్మ—గద్గదకంఠియై చెప్పెను.

సునయనీదేవిమాటలచే శిశిరునిహృదయము ద్రవీభూతమయ్యెను "అమ్మా! నేను తప్పక ప్రతిదినమును వదినెగారికి పాఠముజెప్పుట

కెప్పటియట్ల నచ్చుచునే యుందును. అని ప్రతిజ్ఞాపూర్వకముగ— మీపాదసాక్షిగ జెప్పుచున్నాను" అని గద్గదస్వరముతో ననెను.

"కుమారా! నీ నోటనుండివచ్చిన యీప్రతిజ్ఞయే నాసంక్షోభిత హృదయమునకు శాంతి జేకూర్చెను. నీవు యశస్వివై—చిరంజీవివై—సౌఖ్యప్రదుడవై యుండుము!" అని యానందోద్రేకమున నాశీర్వాద మొనర్చెను.

సునయనీదేవి హృదయనైర్మల్యతచే శిశిరుని కామెయందుగల శ్రద్ధాభక్తులు ద్విగుణీకృతములయ్యెను. శిశిరుడందువలన సర్వదుఃఖములును మరచెను. "వదినెగారూ! రండు! పాఠమును జదువుడు!" అనిచెప్పెను

సంధ్య తీవ్రతరలజ్జాపాశబంధితయై యటనుండి మెల్లమెల్లగా లోనికేగి, పుస్తకమును దెచ్చి చదువుటకు గూరుచుండెను. కాని మును పటివలె చదువుజరగలేదు. నేడు గురుశిష్యసంబంధము సంపూర్ణముగ నడుచుచుండెను.

# అధ్యాయం—18

శిశిరుడు ప్రతిదినమును నియమితకాలమునకువచ్చి సంధ్యకు విద్యగరపుచుండెను. కాని తొంటివలె నాతసికామందిరము డానంద భవనముకాలేదు. రజతుడుగూడ జోరునివలె నన్నపానాదులముగించి వెడలుచుండును. అతనితల్లియు, బత్నియు, విషణ్ణసంక్షుభిత హృదయములతో నుండునవు డాతనిహృదయమునకు శాంతియెట్లు కలుగును! శిశిరునకు దనమోముజూపుటగూడ రజతునకు గష్టముగానుండెను.

రజతునిచందమును జూచి సునయనీసంధ్య లిరువురును "శిశిరుని రజతుడవమానించుట నిజమే!" యని తెలిసికొనిరి. రజతునిమోాిల

శిశిరుని ప్రసంగమును మానిరి. రజతునితో మనసిచ్చి తొంటివలె సంభాషణాదులనుగూడ మానివేసిరి.

రజతుడు తనయింటనే—తనతల్లికి—దనభార్యకుగూడ బగతుడయ్యెను. మందిరమంతయు క్రోధదీప్తులతో నిండియున్నటు లాతనికి గానుపించుచుండెను. ఈవైపరీత్యమునకు గారణుడు శిశిరుడేయని యతడు శిశిరునియెడల నెంతయు నప్రసన్నచిత్తుడగుచుండెను.

శనివారమునచ్చెను. శిశిరుడు రజతుని మందిరమునకువచ్చెను. నేడు సంధ్యాదేవి యుత్ఫుల్లహృదయముతో—మందహాసవిలసితముఖమండలముతో—అనురాగ ప్రభాదీపితనేత్రములతో శిశిరునియొద్దకు వచ్చి "మరదిగారూ! మీరీమాసపు 'సంగ్రహ'ను జూచినారా" అనెను.

సంధ్యాదేవి యాకారమునుజూచి శిశిరుడు మహానందభరితుడై పోయెను. గడచినయేడు దినములనుండియు మనసులో గ్రిక్కిరిసియుండిన భావజాలమంతయు నొక్కమారు ప్రతిధ్వనింప నారంభించెను. సంధ్యా ప్రసన్న ముఖమండలదర్శనమున శిశిరుని హృదయమున నిండియున్న యావేదనము నశించిపోయెను. అత్యంతప్రసన్నతనొందెను. మోమున దరహాసరేఖ పొడమెను. కృతజ్ఞతావీక్షణములను సంధ్యముఖమునబరపి "లేదు! వదినిగారూ! నేను దానిసిజూచుటలేదు. నాలేఖ నెవ్వరేని విమర్శించినారా యేమి?" అనెను శిశిరుడు.

"ఔను. మీరుచదివిచూడుడు! 'పుష్పగుచ్ఛము' అను మీ నవలయు బ్రారంభమైనది" అని సంగ్రహపత్రికను శిశిరునకొసంగెను"

శిశిరుడా విమర్శనమును జదువదొడగెను. ఆతనిమోము వికచాంబుజమువలె ప్రసన్నమగుచుండెను. అదిచూచి సంధ్యచెందు సంతోషమునకు మేరలేకుండెను.

ఆ విమర్శనమున రజతుని ప్రాతలు మిక్కిలి నిందింపబడి, శిశిర రచన లధికముగ గొనియాడబడియుండెను. అది చదివినపిదప శిశిరునకు రజతునిపై భక్తియు, విశ్వాసమును బూర్ణరూపముల నొందినవి. కొలది దినములనుండి రజతునిపై గలుగుచున్న యసద్భావమంతయు దటాలున నంతరించెను. ఆసమయమున రజతుడచటనున్నచో శిశిరుడు తన యపరాధము క్షమింపుమని వానిని బ్రార్థింపకుండ నుండజాలడు.

సునయనీదేవి యాసమయమున నచటికివచ్చెను సంధ్యాశిశిరుల చందముజూచి, ఏదియో వింతయున్నటుల నూహించి "కుమారా! ఏమిసమాచారము" అని యనురాగముతో నడిగెను.

సునయనీదేవిగారిభావము పూర్వపురీతినే స్థిరముగా నున్నట్లు తోచి, శిశిరుడు నవ్వుమోముతో "అమ్మా! రజతుని త్యాగము జూడుడు! విశ్లేషకముగ దనలేఖను నిందించుకొనుచు, నాలేఖ నెంత యుదారభావమున బ్రశంసించెనో! 'నాలేఖలను ద్రిప్పివేయవలసిన'దని పత్రికాధిపతుల కెల్లరకును బ్రార్థనాపత్రముల నంపుకొంటిని. రజతుడు పోయి యెల్లరితో నాప్రార్థనాపత్రముల నంగీకరింపవలదని నిషేధించెను" అని చెప్పెను.

సునయని పుత్రుని యపరాధముల నెల్ల మరచెను. రజతుడు తన పాపములకెల్ల బూర్తియగు ప్రాయశ్చిత్త మొనరించుకొనెనని తలచెను. ఆమెహృదయమున బుత్రవాత్సల్యసుధారస ముప్పొంగెను. "రజతుడు నిన్ను సోదరునివలె బ్రేమించుచున్నాడు. సోదరుని సము న్నతస్థితిని గోరనివాడెవ్వడు?" అని శిశిరునితో ననెను.

ఆసమయముననే రజతుడును గృహమున బ్రవేశించెను. అందరును ఆనందమగ్నులయి యుండుటగాంచి, యాశ్చర్యచకితుడై, చిత్తరువట్లు

నిశ్చేష్టితుడయ్యెను. సత్వరముగ శశిరుడు రజతుని చెంతకుబోయి "అన్నా ! నీవిట్టి యన్యాయ మొనరించితివేమి ?" అని యడిగెను.

"సత్యము స్వీయబంధువగుటచే దానిని విడువజాలను. విమర్శకుడు సదా పక్షపాతవిరహితుడై యుండవలెను" అని రజతుడు చెప్పెను.

"ఇది నిష్పక్షపాతమగు విధానము కాదు. నీ లేఖలనిట్లు నిందించుచు నా లేఖ నంత ప్రశంసించుట సముచితముగ లేదు. నా లేఖకును నీ లేఖకును ఎంతయో భేదమున్నదికదా ?" అని శశిరుడు నవ్వుచు ననెను.

రజతుడు స్తంభితుడై "పత్రికను జూచితివా ?" అనెను.

రజతుని మాటలు వారందరి మనముల సందేహము గలిగించినది. తటాలున సంధ్య "ముందుగ యందరువురినిందయు జేయబడియుండెను. ఈమార్పు ఎప్పుడు చేయబడెను ?" అని యడిగెను.

సంగ్రహపత్రికావిమర్శనము జదువుచు రజతుడు గంభీరస్వరముతో "పిమ్మట మార్పు చేయబడెను" అనుచు సంధ్యచేతిలో సంగ్రహాంకమునుంచి బయటికిపోవ నుంకించుచు, వికటముగ నవ్వి "మీరు లోకుల నెట్లు మోసగించితిరి ?" అనెను.

రజతుని గంభీరభావము ఏసందేహము నుత్పన్నము గావించియుండెనో దానిని ఈనగవు దూర మొనరించెను.

ఇంతలో విద్యుత్తుగూడ వచ్చి చేరెను. సంధ్య నవ్వి "ఈమాసపు సంగ్రహపత్రికను జూచితివా ? ఈయంకమున మరదిగారి "పుష్పగుచ్ఛము" అను నవలయు ఆరంభమయినది. 'కాండారీ' పత్రికలో వెలువడిన లేఖకు ప్రశంసాపూర్ణమగు విమర్శనముగూడ వెలువడినది" అని విద్యుత్తుతో ననెను.

విద్యున్మ్రఖలత క్షణములు ప్రసన్న వికసితము లయ్యెను. ఆమె శిశిరుని ముఖముపై జూపులుబరపి సంధ్యచేతిలోనున్న సంగ్రహాంక మును గైకొని చదువుచు "విమర్శకుని కొక్క త్రుటియును దొరకలేదు" అనెను.

"బాగు బాగు ! తనచెల్లె ల్లపుడిదియనువా రెవ్వరైన నుందురా" అన్నది సంధ్య.

ఆమాటకు మహానందమునొందుచు, తనసంతోషమును వెలికి గనబడనీయక శిశిరునిపై జూపులనుబరపి చొక్కా సిద్ధపరచి తెచ్చితిని నీది సిద్ధమయినదా ? లేదా ?" అని సంధ్యనడిగెను.

సంధ్యకీమాట మిగుల గష్టముదోచెను. చొక్కా సిద్ధమయినది. కాని వెనుకటిఘటనవలన దానిని శిశిరునకొసంగు సాహసము లేక పోయెను. ఇప్పటి యామోదప్రమోదములచే నామె యాస్మృతి మరువ దలంచెను. కాని విద్యుత్తు దానిని మరల మేల్కొల్పెను. అందువలన సంధ్య సంభ్రాంతచిత్తయై చేసన్నచే విద్యుత్తునాపెను. విద్యుత్తుకూడ వ్యాకులపడెను. సంధ్యాముఖభంగిజూచి ప్రస్తుతవిషయసందర్భమేమో యామె యెరుగజాలకపోయెను. ఆమె సంశయ వీక్షణములతో శిశిరుని వైపు జూచెను.

"వదినెగారూ ! తాము కుట్టినదికూడ బయటపెట్టుడు ! ఇపుడు మీగుణపరీక్ష చేయబడును !" అనెను శిశిరుడు.

శిశిరుని ప్రసన్న వదనమును వీక్షించి సంధ్యకుగల భయమంతయు దూరమయ్యెను. తటాలునబోయి చొక్కా తీసికొని వచ్చెను.

వాటినందుకొని "వీటియందు గెలుపు వదినిగారిదే. వదినెగారూ! రజతసోదరుని పిలుపింపుడు ! నాయెడల నీకెంతటిస్నేహముగలదో నే నతనికి జూపించెదను !" అని శిశిరు డానందముతో ననెను.

సంధ్యావిద్యుత్తులు పక్కనవివ్వారి. సంధ్యలేచి రజతుని బిలువ బోయెను.

విద్యుత్తు ఒంటిగానుండుటచూచి "ఒకవిషయమును మీతో నొక్క చెప్పవలసియున్నది" అని శిశిరుడనెను.

విద్యుత్తు రెప్పవాల్పక శిశిరునివైపు జూచుచుండెను.

శిశిరుడు శకితుడై "నాకేదేని యుద్యోగము లభించునంతదనుక నేను మీగృహమునకు రాకపోకలు సల్పుట మానెదను. కావున; మీరీవిషయమున నను నిరోధింపవలదని ప్రార్థించుచున్నాను. నే నిచ్చటికిగూడ రాదలంచుకొనలేదు. కాని సంధ్యాసునయునులును, మీరును నన్నింతవర కాకర్షించుచున్నారు" అని చెప్పెను.

"ఇతని కెంతటిమర్మవేదన గలిగెనో! లేకున్న నిట్టి యసద్వ్యవహారము జేయబూనునా?" అని తలంచి విద్యుత్తు నొచ్చుకొనెను. ఒకప్పుడామె యీ విషయమును సూచించియే యుండెను. శిశిరుని మనోవేదనమున కామె భయంకరసంతాపమునొందెను.

అంతలో సంధ్యవచ్చి "నన్ను వెలుపలకిబంపి మీరేవో రహస్య సంభాషణము లొనర్చుకొనుచున్నారా? మీయన్నగా రెచ్చటికో యేగిరి. వారు వచ్చినపిమ్మట మన వృత్తాంతమును వినుపింతును. ఇప్పుడు తమ యనురాగ విషయవిచార మొనరించుకొనుడు! నే నిటనుండి వెడలెదను" అని సంధ్య వెడలిపోవ నుద్యుక్తురాలయ్యెను.

విద్యుత్తు సంధ్యచేయిపట్టుకొని వాడినమోము దమ్మితో—మర్మాంతిక వేదనతో—కనులుకనులుగలపి సంధ్యవంక జూచెను.

శిశిరుడు నవ్వుచున్నను, వాని నవ్వులో నొకవిధమగు వేదన కలిసియున్నట్లు సంధ్య తెలిసికొనెను. ఈకాళరాత్రి యకస్మాత్తుగా

నెటనుండి వ్యాపించినదో యామె యెఱుంగజాలకుండెను. భయాతురగా కలితస్వరమున "ఏమయినది విద్యుత్తూ?" అని యడిగెను.

విద్యుత్తు నిజమును గప్పిపుచ్చి, కృత్రిమహాసమొనరించి "ఏమగును? ఏమియు లేదు" అని సంధ్యతోననెను.

సేవకుడు వచ్చి "రజతబాబుగారు సినిమాకు వెడలిరి. సమావేశ స్థలమున యతీశ్ బాబుగారును, గాళిదాసుబాబుగారును గూరుచుండి శిశిరబాబుగారిని బిలుచుచున్నారు" అని చెప్పెను.

సంధ్య చకితయై "సినిమాకు వెడలిరా? ఇది క్రొత్తమాటగా నున్నదే? నేడు సమితిసమావేశదినముకదా!" అనెను.

విద్యుత్తు సంధ్యాముఖమున జూపులు నిగిడ్చి, ఆమంగళ సూచక గభీరసంశయచ్ఛాయ చూచి యామెను దన చెంతకుదీసి కూరుచుండ బెట్టుకొనెను. కాని యొకరితో నొకరు చెప్పుకొన సాహసింప జాలని భావతరంగములచే నిరువురిహృదయము లాందోళితములగు చుండెను.

"వచ్చిన మహాశయులకు అల్పాహారముల నొసంగిరమ్ము!" అని సునయనీదేవి సేవకునితో జెప్పి, పళ్ళెరములో గొని పదార్థములనుంచి వానికిచ్చెను. సేవకుడు వాటిని దీసికొని యావలకేగెను.

"ఇదియంతయు వింతగానున్నది. ఎన్నడును మమ్మువిడిచి సినీమాలకును, నాటకములకును వెడలి యెఱుంగని రజతుడు నేడేల యొంటిగా నేగవలెను? పోవుచు బోవుచు త్రోవలో సేవకునితో జెప్పుటయా! ఎంత విపరీతము!" అని సునయనీదేవి శిశిరునితో జెప్పెను.

సేవకుడు పళ్ళెరముతో దిరిగివచ్చి "అమ్మగారూ ! వచ్చినవా రిరువురును అప్పుడే వెడలిపోయినారు" అని చెప్పి పళ్ళెరము నటనుంచి వెలుపలికేగెను.

సునయనీదేవి విషాదచిత్తయై అట్లె గూరుచుండెను. సంధ్యయు శిలావిగ్రహమువలె గూరుచుండి, అత్తగారిముఖమును దైన్యవీక్షణముల జూచుచుండెను విద్యుత్తుగూడ గదిలో నొంటిగా గూరుచుండి శిశిరుని మాటల దలంచుకొని యావేదన మొందుచుండెను.

ఈ దృశ్యము శిశిరునకు హృదయవిదారకమయ్యెను. సంతోష సంస్థానమగు నీ భవనము నేడశాంతికిరవైనట్లు తలంచెను. ఈపరివర్తనమునకు దానే హేతుభూతుడనని నిశ్చయించుకొనెను. తటాలున సునయనీదేవి పాదములపై వ్రాలెను. "తల్లీ ! నాసీడపడిన చోటులెల్ల అశాంతికి నెలవులగుచున్నవి. నావలనే మీయానందసౌధమున నిట్టి యంశాంతి యుత్పన్నమైనది. నే నడుగుపెట్టకున్నచో నిట్టి పరివర్తనము కలుగకుండెడిదని నేను దృఢముగ జెప్పగలను. అమ్మా ! ఇంక నా కాశీర్వాదమొసంగుము !" అని గద్గదకంఠుడై నుడివెను.

సునయనీదేవి హృదయము, వ్యధాపూరిత మయ్యెను. శిశిరుని లేవనెత్తి "కుమారా ! నీవు ... ... ..." అని యేమో చెప్పబోయెను. కాని యామెనోట మాట వెలువడుటలేదు. కంఠము రుద్ధమయ్యెను. కన్ను లశ్రుమయము లయ్యెను.

శిశిరు డశ్రుపూర్ణనయనుడై సంధ్యాదేవినిజూచి "వదినెగారూ ! మీదయాదృష్టియే నాయంధకారమయ జీవితమున కొక రత్నజ్యోతి. దీనినెన్నడును మరువజాలను. ఎరుగక నేనొనర్చిన యపరాధములను క్షమింపుము ! వాటిని మనస్సునం దుంచుకొనకుడు ! ఇదియే నా ప్రార్థనము ! అని డగ్గుత్తికతో నెట్లో చెప్పెను.

సంధ్య కనులనుండి జలజల నశ్రుబిందువులు రాలఁదొడంగెను.

శిశిరుఁడవి చూచి తటాలున వెలుపలకి బోయెను.

విద్యుత్తు చెప్పలేని వేదన ననుభవించుచు నెవ్వరితోడను జెప్పకయే, అటనుండి లేచి క్రిందకుబోవుచుండెను. అందరును కొయ్యబొమ్మ వలె అట్టి స్తంభితులై యుండిరి.

విద్యుత్తు బండిలో గూరుచుండెను. శిశిరుడు వడివడిగ బండి యొద్దకువచ్చి డగ్గుత్తికతో "మీరొంటిగా వెడలుచున్నారా ?" అని యడిగెను.

"మొదటను ఒంటిగానే బోవుచుండుదానను. ఇపుడు ఒంటిగా నే బోవుచుంటిని. సర్వదా నావెంట వచ్చువారెవరున్నారు శిశిరబాబూ" అన్నది దైన్యస్వరమున విద్యుత్తు.

ఆమాటకు శిశిరుడు వ్యాకులహృదయుడై —యోచనా శూన్యుడై —నిర్వృడై పోయెను. బండిలో గూరుచుండిన విద్యుత్తు చేయిపట్టుకొని "అనురాగశీలా ! ఇదియే తుదికలయికయని తలంచుచున్నాను !" అని వ్యథాపూర్ణ స్వరమున ననెను.

ఆమాట వినినతోడనే విద్యుత్తు ధైర్యరహిత యయ్యెను. "శిశిరమహాశయా !......" అని యేమో చెప్పబోయెను. కాని నోట మాట వెలువడుట లేదు.

శిశిరుని హృదయముగూడ తీవ్రయాతనామయమయ్యెను. మాటలాడినచో తనహృదయవేదనము విద్యుత్తున కెరుకపడునను భీతిచే నాతడు మాటలాడకయే మెల్లమెల్లగ విద్యుత్తుచేతిని విడిచెను.

విద్యుత్తు దీర్ఘనిశ్వాస మొనరించెను.

బండి కదలెను. శిశిరుడు వ్యాకులహృదయముతో తన నివాసమునకు మరలెను.

# అధ్యాయం—19

సంగ్రహాంకమున బ్రకటితమైన శిశిర లేఖా ప్రశంస జరిగిన పిదప రజతుడు త్తేజితహృదయుడయ్యెను. ఒక్క నిముసమైన నింటనిలవజాలక పోయెను. వెంటనే 'సంగ్రహ' కార్యాలయమునకేగెను. భూధరబాబుగారేవో వ్యాసములను సరిజూచుకొనుచుండెను.

రజతుడు లోనబ్రవేశింపగనే భూధరబాబుగారినిజూచి "అయ్యా నావ్యాసమును మీరిట్లు మార్చివేసినారేల ?" అని యావేగపూరిత హృదయుడై యడిగెను.

"సంపాదకుని పేర నీవిమర్శ వెడలినప్పుడు అసత్యవిషయమును నేనెట్లు ప్రచురింపగలను ?" అని భూధరబాబుగారనిరి.

"అటులయినచో నాకథాంశమును నేలమార్పుచేయలేదు ?"

"అది సముచితముగా నుండుటచేత"

శిశిరుని లేఖను మీరు తీసుకొనకపూర్వ మెన్నడును మీరిట్టి సాహసకార్య మొనరించియుండలేదుకదా ?"

ఈమాట వినినంతనే భూధరబాబించుక యాగ్రహమునొందెను. "రజతబాబుగారూ ! 'పిట్టచిన్నది—కూతపెద్దది' అనునట్లున్నది. సంగ్రహపత్రికా సంపాదకునిట్లను సాహసముగలవారింతవర కీవంగదేశమున నెవ్వరును గోచరింపలేదు. మీభావిసౌభాగ్యము నపేక్షించి మీవ్యాసములను సంగ్రహాలో బ్రచురింపదొడగితిని. యథార్థతత్వము నెరుంగజాలక యిపుడు మిమ్ము మీరే సుప్రసిద్ధలేఖకులుగ బరిగణించుకొనుచున్నారు. శిశిరబాబుగారి రచనలకును మీరచనలకును స్వర్గనరకములకున్న ప్రభేదముకలదు. అట్లు వ్రాయుటకు మీరీ జన్మమునకాదు కదా ! మరిపదిజన్మములకైన నసమర్థులని నేను రూఢిగ జెప్పుచున్నాను.

శిశిరచక్రవర్తి సహజసంపూర్ణప్రతిభాశాలి కాని, పత్రికాసంపాదకుల దయామూలమున, మందలోగలసి, మనుష్యుడనిపించుకొనుచున్న పండితమ్మన్యుడును—ప్రతిభాశూన్యుడై, అర్థవిరహితములు—భావశూన్యములు—కృత్రిమశబ్దాడంబర సమన్వితములు అగు పద్యముల వ్రాయుచు వారికంటె యభాజనుల ప్రశంసలకుబ్బి, తరగతిలోని బాలుర మ్రోల దైత్యకులారి కవినామధారికాడు. సంపూర్ణకవితాకళాకోవిదుడు—కవితాసమాధియోగమున సకలలోకసంచార మొనర్చి సమస్తవిషయములను చక్కగా దెలిసికొని శ్రావ్యమగు శైలిలో భావవ్యక్తీకరణసమర్థములగు సునిశితశబ్దములతో—హృదయంగమయముగ వ్రాయగల సమర్థుడు.

మీరాను విమర్శించిన విషయమును మీరెరించుకయు గ్రహించినట్లు గానరాలేదు. శిశిరచక్రవర్తి గారు వ్యాసమున లోకమునకిచ్చిన సందేశమును విషయలోలురై విలాసతరంగముల నీదులాడు లేఖకులీయగలరా? గ్రహింపగలరా? రజతబాబూ! మీకింకను గవిత్వప్రయోజనమే తెలియలేదు. ఏవో విషయవిహీనములగు పద్యములును, హృదయవిదారక దుర్భేద్య ఘటనా చక్ర సమన్వితములగు కథానకములును, గవిత్వపరమావధియనుకొనుచున్నారు. కవిత్వము లోకకల్యాణసాధనమై యుండవలెనని నిజముగ జెప్పుచున్నాను! నాపై మీరాగ్రహింపవలదు! మీకథానకములును, త్రిపాద, చతుష్పాద, పంచపాద భావకవిత్వనామక ఖండకావ్యపు వస్త్రాలును, గాలిపటములు గట్టుకొనుటకైన నుపయోగించునా? మీరిప్పటికి బస్తాలకధికముగ—బండ్లకు సరిపోవునన్ని కాగితములను వ్రాసినారే! మీరు లోకమున కొసంగిన సూద్దేశమేదియో మీరు చెప్పగలరా? పోనిండు; మీపద్యములను

మీ లేఖావముతో వ్రాసినారో చెప్పగలరా! ఇట్టి దానినే పత్రికా కవితయందురు. ప్రాజ్ఞులెవ్వరును దీనిని ప్రశంసింపరు.

లోకమునకు మీ పరిచయమును గలిగించినపిదప—మీ లేఖినికి వ్రాతలువాటు కలిగినపిదప—చెప్పవలసిన విషయములను మీకు జెప్పి, చేయవలనసి విధానములను బోధించి మిమ్ము సరియగు మార్గమున నుంచవలెనను తలంపుతో మీకు "సంగ్రహాలో" స్థాన మొసంగి, అందరిదృష్టుల నాకర్షించుటకు మీపద్యములను లతాచిత్ర సమన్వితములుగ ప్రకటించుచుంటినేకాని; మీ లేఖిని ప్రౌఢమైనదని మెచ్చుకొని కాదు" అని భూధరబాబుగారు కఠోరస్వరమున జెప్పెను.

అతనిమాటల నాలించి రజతుడు సంక్షుభితహృదయుడై భూధర బాబుగారిపై గర్వకలుషవీక్షణముల బరపి "చాలు! చాలు! నేను మీ పత్రికకొనరించిన మహోపకారమునంతయు మరచి, మీరు నన్నిట్లు తృణీకరించుచున్నారా! ఇతరలవేర నేను మీపత్రిక కెంతధన మొసంగుచున్నానో, మీ రెరింగియె యున్నారు. నేటినుండి నావలన మీ కెట్టి సహాయము నుండబోదు. మీకిచ్చుధనముతో నొకపెద్ద పత్రికను మేమే స్థాపించుకొనగలము. మీరింక శిశిరుని దెచ్చియుంచుకొనుడు!" అని యాగ్రహముతో ననెను.

ఆమాటకు భూధరబా బసూయాసూచకదరహాస మొనరించి "సంగ్రహాపత్రిక మీ దానాభావమున బతనమొందదు. మీరొక పత్రికను నెలకొల్పినమాత్రమున నంతరింపదు. ఎన్నిపత్రికలు పుట్టుచున్నవి! ఎన్ని యంతరించుచున్నవి! మీరొకపత్రికను స్థాపించికొనసాగించినచో నే నమందానందభరితుడనగుదును. ఏదేశమున నుత్తమ పత్రికాబాహుళ్య ముండునో ఆదేశమున విజ్ఞానాభివృద్ధియు నుం—

# అధ్యాయము—19

మహాశయా! ఒకటికాదు పదిపేరులతో పత్రికలను స్థాపింపుము! మిమ్ము వలదనువారెవ్వరు! ఇపుడు మన దేశమున నెన్ని పత్రికలులేవు! మాసపత్రికలు—ద్వైమాసికములు—త్రైమాసికములు వందలు వేలునున్నవే! మీ స్వాంతమునకు ప్రత్యేకముగ నొక పత్రికను స్థాపించుకొని మీ ఖండకావ్యములను, మీ కథానకములను, మొదట నుండి చివరవరకు, గుత్తుగుత్తులుగా—వరుసవరుసలుగా—దొంతర దొంతరలుగా ప్రచురించుకొనుచుండుడు. లేదా మిత్రుల వ్యాసములను గూడ ప్రచురించుచుండుడు. మిమ్మాటంకపరచువా రెవరున్నారు! కాని పత్రికపేరుచెప్పి మమ్ము బెదరింపదలంపకుడు! మీదానము లేకున్న 'సంగ్రహ' నిలిచిపోవునని తలంపకుడు!

పత్రికాజీవితము సంపాదకుని సమర్థత ననుసరించి యుండునుగాని యొకరిద్దరి ధనసహాయమాత్రమున నుండదు. సంపాదకు డసమర్థుడైనచో నెంతటి మహదైశ్వర్యవంతుడు బూనుకొనినను, అది జరుగనేరదు. ధనబలమున నొకవేళ నిలిచినను గౌరవములేక హాస్యాస్పదముగనుండును. త్రివర్ణచిత్రములను—బహువర్ణచిత్రములను జూచి సామాన్యజనులు బాగు బాగన్నను భాషాభిమానులు మాత్రము పారజిమ్మివేతురు. మా సంగ్రహకువచ్చిన ప్రసిద్ధి సంపాదకబలముననే కాని, సంపద్బలమునగాదు"

భూధరబాబుగారి మాటలు రజతునకు కర్ణశూలములుగ, హృదయపుట భేదనములుగ నుండెను. రజతు డొక్కనిముసమైన యచట నిలువజాలకపోయెను. తటాలున లేచి "భూధరబాబుగారూ! దీని పరిణామ మెట్లుండునో మున్ముందు మీ రెరుంగగలరు" అని చెప్పి వెల్పలకు వచ్చెను.

## అధ్యాయము—19

ఆసమయమున ఖగేనుడు మొదలగువారు రజతునికై సంగ్రహ కార్యాలయమునకు వచ్చిరి. రజతుడు ద్వారముదాటిన వెంటనే వారిని గలిసికొనెను.

"రజతబాబూ! నేడు సమావేశము జరుగవలసిన దినముకదా! మీరిచ్చట నూగుచున్నారేల?" అని ఖగేను డడిగెను.

"నేడు నామనస్సు సరిగాలేదు. ఇంటియొద్ద నుండుటకుగూడ నంగీకరింపకున్నది. ఇపుడు గూడ నింటికిబోవజాలను. మనమందరము నెచ్చటికేని బోవుదము రండు" అని రజతుడు చెప్పెను.

"సరియే! 'సినీమా'కు బోవుదమా!" అనెను ఖగేనుడు.

"మీకందరకు ఇష్టమున్నచో బయలుదేరుడు" అని రజతు డనెను.

అందరును సినీమాకు బయలుదేరిరి. త్రోవలో రజతుడు ఖగే నునిజూచి "మనమొక పత్రికను వెలువడజేయవలసిన యవసరము కలిగినది" అని చెప్పెను.

ఖగేనుడు ఉత్సాహపూరితహృదయుడై "బాగు బాగు! మంచి యాలోచనయె. పత్రికపేరేమి?" అని యడిగెను.

"పత్రికపేరు 'నారద'—విమర్శనాంకముపేరు 'నరకము' అని యుపదలంచితిని" అని రజతుడనెను.

ఆమాటకు ఖగేనుడు నవ్వి "కలహసూచకమగు ఈపేరు నుంప నేల?" అనెను.

"ఔను ఈపత్రిక కలహకారణమునకే వెలువడుచున్నది. కనుక ఇందు విమర్శలే యెక్కుడుగ వెలువడుచుండును కనుక—నారదుడు సర్వదా సకలలోకసంచారి కనుక—" అని చెప్పి, పిదప, భూధరబాబు గారితో దనకుజరిగిన వివాదమునంతయు వారి కెరిగించెను.

అందరును మహానందభరితులైరి. "ఈమాసమునందే పత్రికను వెలువడ జేయవలె"నని యుత్సాహముతో ననిరి

సినీమాశాలయొద్దకు వచ్చిరి. టిక్కట్లు దీసికొని లోనప్రవేశించిరి. కాని రజతునివ్యాకులమనస్థిరమగుటవలన నాతడా ప్రదర్శనమునుజూచి వినోదింప జాలకుండెను. రెండుభాగములైనవి. రజతుడు లేచి నిలిచెను.

"మహాశయా! లేచినారేల?" అని ఖగేను డడిగెను.

"నామనస్సేమియు బాగులేదు. ఇంటికేగెదను" అని రజతు డనెను.

"మేముగూడ మిమ్మనుసరింపవలసిన వారమేకదా?" అని ఖగేనుడు లేచెను. మిత్రులందరును లేచిరి. వెలుపలకువచ్చిరి.

## అధ్యాయం—20

ఇంతరాత్రివరకేమిచేయుచుంటిరి? అని సంధ్య యడిగెను.

"ఒక పత్రికను నెలకొల్పుటకు యోచించుచుంటిమి" అని రజతుడు చెప్పెను.

"ఎప్పటినుండి వెలువడును? పేరేమి" అన్నది సంధ్య.

ఈనెలనుండియే వెలువడగలదు. "సంధ్య" యను పేరుంచుటకు చర్చ జరుగుచున్నది.

"ఏమీ! ఒకరికిష్టమగునన్ను నెల్లరకు నిష్టమగునా?"

"రజతరాయలు సంధ్యాసంపాదకులుగా నుండ నది ఎవ్వనికి మనోహరము కాకుండును?"

"శిశిరబాబుగారి నామముగూడ సంపాదకస్థానముననుండునా!"

"సంధ్యాసంపాదకులుగానుండ రజతరాయలొక్కడు చాలడా!"

సంధ్య రజతుని ముఖభంగిమ జూడజాలకపోయెను. అతని పలుకులు పరిహాసవాక్యములుగా నుండు నట్లామెకు దోచుటలేదు. అందువలన నామె "మహాశయా ! నిజముగా జెప్పుడు. శిశిరునకందు స్థానముకలదా ? లేదా ? సంపాదకస్థానమున నిరువురి నాయకులుండిన బాగుగానుండును" అనెను.

"అతడు క్రొత్తలేఖకుడు అతని నెరిగినవా రెవ్వరున్నారు ?"

"ఇప్పుడతనికి గొప్ప ప్రసిద్ధి కలుగుచున్నది. ప్రతివారినోట నతనిపేరే వినవచ్చుచున్నది. అతని లేఖలుకూడ మీ లేఖలకంటెను జక్కగానున్నవి"

"ఒకప్పుడు నాలేఖలే నీ దృష్టియందు సర్వోత్కృష్టములై యుండెనుగదా !"

"మీ యీ మాటకుత్తరము మీ యీ కవితయే యొసంగుచున్నది" అని సంధ్య నవ్వుచు నన్నది.

"ఇంకేమని వలసిన నడుగుము ! కాని సంధ్యా ! నీవిదిమాత్ర మడుగుట యుచితముకాదు. నీవును నన్ను శిశిరునికంటె హీనునిగా తలంచుచున్నావా ! నేను నీపతిదేవుడను. శిశిరుడు నీ కేమగును ?"

సంధ్య పతిదేవుని దైన్యవాక్కు నాలించి స్వచ్ఛచిత్తయై 'మున్నొకనాడు మీరు శిశిరుని ఈ గృహమునకు గైకొనివచ్చి, సంధ్యా ! ఈ శిశిరుడు నీవాడు' అని చెప్పియుండినమాట మీకు జ్ఞాపకముండవచ్చును. నేడే నే నతనికొక చొక్కాను కుట్టి యొసంగియున్నాను. దానినిగాంచి యాతడు "ఈచొక్కా వదినెగారి ప్రేమానురాగ రక్తవిలసితమై యున్నదని యనెను. తమరు నాపతిదేవులు. వారు నా దేవరలు. మీ రిరువురును నావారే. కావున నే నతనిగూర్చి చెప్పవలసియే యున్నది" అనెను.

# అ ధ్యా య ము—20

## రజతుడు మారుమాటాడక దుస్తులను దీయసాగెను.

సంధ్య రజతుని ముఖగాంభీర్యము నా యంధకారమున గుర్తింప జాలకపోయెను. పత్రిక వెలువడునను తలంపున నత్యంతానంద పరవశయై యిట్లనియెను. ఈ పత్రిక ఒక నెలకు ముందే వెలువడియుండినచో మరది గారి లేఖ యొక్కటియు నితరుల చేతికి బోక యుండెడిది. వారి లేఖవలన ఈ పత్రిక మిగుల శీఘ్రముగ నలుగడల వ్యాపించియుండును" అన్నది సంధ్య.

రజతుడు క్రోధముతో "శిశిరుని లేఖలు లేకయే యీ పత్రిక మహోన్నస్థితిని బొంది వెలుగొందుటను శిశిరోపాసకులకెల్ల నేచూపు వాడను. వంగదేశమున శిశిరుడొక్కడుమాత్రమే నా లేఖనకళాభిజ్ఞాత! ఇదుగో నేను చూపించెదను! శిశిరుడెంతటి సమర్థుడో !" అని యనెను.

ఈమాట వినినంతనే సంధ్య వ్యాకులహృదయురాలైనది. ఇంత వరకు నామె మిత్రుని యెదుట మిత్రుని ప్రశంసించుచు ప్రసన్నురాలగు చుండెడిది. కాని "శిశిరుని ప్రశంస రజతునకు సహ్యముగ లేదు. అతని మాట విన్నంతనే రజతుడు క్రోధానలమూర్తియగుచున్నాడు" అని సంధ్య యిప్పుడు గ్రహించినది. ఇప్పుడామె దుఃఖమునకు క్షోభమునకు అంతము లేదు, శిశిరుని యభివృద్ధి రజతునకెంతమాత్రము నిష్టము లేదని యామెకు స్పష్టమయినది. అతని పేరు వినినమాత్రముననే రజతునకు క్రోధ మావిర్భవించుచుండెను. ఇంక రజతునెదుట శిశిరుని పేరెత్త దలంచుకొనలేదు. సంధ్య మారుమాటాడక మౌనభావమున నామె యట్టె నిలిచియుండెను. రజతుడు ఏమియు ననలేకయే బండుకొనెను.

# అధ్యాయం—21

తనభార్య తనయెదుట శిశిరుని ప్రశంసించుట రజతునకు సహింపరానివేదనను గలిగించుచుండెను.

"ఏవిధముగానైన శిశిరుని ధవళయశశ్చంద్రికలు కలుషితములు గావించితీరవలె"నని రజతు డారాత్రి దృఢసంకల్పమును గావించు కొనెను. మరునాడు సత్వరముగ భోజనమొనర్చి తన మిత్రుడగు ఖగే నునితోగూడ వెలుపలికి బోవ నుద్యుక్తుడగుచుండెను.

సునయనీదేవి రజతునియొద్దకువచ్చి "నీవు ముందుగాబోయి శిశిరుని దోడ్కొనిరమ్ము. పిమ్మట నీప్రతికావ్యనవహారములను జూచికొన వచ్చును" అని చెప్పెను.

"అవకాశము చిక్కినచో బోవుదును". అని చెప్పి దుస్తులను దాల్ప గదిలోనికి బోయెను. సంధ్య యతనివైపుజూచి "అమ్మగారూ! శిశిరబాబుగారిపేర ఒక జాబు వ్రాయుమనలసినదని చెప్పుచున్నది. వ్రాయుదునా ?" అని యడిగెను.

రజతుడు సంధ్యను కన్నెత్తియైనను జూడక అట్లే తనదుస్తులను దాల్చుచు "నీయిచ్చవచ్చినట్లు చే.....ము. ఇంతకుముందెన్నడైన నిట్టి ప్రశ్న వేసియుంటివా ?" అనెను.

"అపుడు మీాగతినపై కృపాదృష్టి కల"దని సంధ్య యనెను.

రజతుడు సముచితసమాధానమును చెప్పజాలక "దీనినే స్త్రీబుద్ధి యందురు. ఏవస్తు వెవనికి ప్రియముగా నుండదో దానిచే వతనికి...... మీారును శిశిరునివంటివారే అగు ?"

సంధ్య శిశిరుని గంభీరభావ మిసుమంతయు దెలియజాలకపోవుట రజతునివలన, సందేహమంతయును దీరి ప్రసన్నురాలై శిశిరున కీక్రింద రీతిని జాబువ్రాసెను.

"మహాశయా !

మీరు భ్రమబడియున్నారు. అది యంతయు నట్టి పొరపాటు. అమ్మగారు మిమ్ములను బిలుచుచున్నారు. నేనును తదనుయాయినే; మిమ్ములను మీయన్నగారు స్వయముగా బిలువవచ్చుచున్నారు. తప్పక మీరు దయ యుంచి రావలయును. రానిచో తల్లిగారి ఖేదమునకు మేరయుండదు నేను మిక్కిలి క్రోధపూరిత నగుదును. పెక్కు మాటలేల ?

మీ స్నేహమయి
మీ వదినె సంధ్య"

ఆ జాబును సంధ్య రజతుని చేతి కిచ్చెను. రజతు డా పత్రమును గైకొని తిన్నగా శిశిరుని చెంతకు బోయి వానికొసంగెను. శిశిరుని సందేహమంతయు ఆ లేఖచే మాయమయ్యెను. వానిచిత్తము ప్రఫుల్లిత మయ్యెను. తృప్తిత నేత్రముల నతడు రజతునివంక జూచెను.

"మే మొక యద్భుతకార్యమును జేయుచున్నాము" అనెను రజతుడు.

శిశిరుడు మిగులసంతోషముతో "ఏమది ?" అనెను.

మే మొక పత్రికను వెలువడ జేయుచున్నాము. ఈమాసము నుండియే ప్రకటింతుము. పేరు, "నారద" జగడములాడుటయే దాని పనిగా నుండును. ఎవరి లేఖల నెచ్చట లోపము గన్పడునో ఆలోపములపై తీవ్రవిమర్శనమందు వెలువడుచుండును. నీవును దీని నుండి తప్పించు కొనజాలవు !" అని రజతుడనెను.

శిశిరుడు నవ్వి "ఇంతకన్న గొప్పమాట మేమున్నది ? సత్వరముగా నాపేరు పైకిరాగలదు" అనెను.

"కాని ఆ సమయమున క్రోధభావమును వెలువరింపవలదు. నేను మొదటినుండియు తెలియజేయుచునే యున్నాను. ఇపుడు నాకు నాగరుడు స్మరణకు వచ్చెను. పోవుచున్నాను" అని రజతు డేగెను.

శిశిరుడు రజతునితో ద్వారమువరకు వచ్చెను. అతడు వెడలిన పిమ్మట తాను సునయినీ సంధ్యలచెంతకు వెడలెను. ఇంటిలో నడుగు పెట్టినంతనే సంధ్య ఎదురుగవచ్చి "తాబేటిపిల్లా!" అని నవ్వుచు బలుకరించెను.

శిశిరుడు గదిలోనికి జూపులను బరపెను.

సంధ్య కిలకిలనవ్వి "మీ చూపులు విద్యుదన్వేషణవాంఛా సమన్వితము లగుచున్నవికదా? కనుక నే నామెను మొదలనే పిలిపించి యుంటిని. దానినే 'తాబేటిపిల్ల' అనుచున్నాను" అనెను.

"అనుదినసహవాసమున లభించు నీసుఖమునకు బ్రతీకార మొనర్పగోరినచో హరిశ్చంద్రునింబోలె నే నమ్ముడువడియును, మీ ఋణము దీర్చుకొనజాలను. మీకు నేను మొదటినుండియు అమ్ముడు వడియేయున్నాను" అని శిశిరుడు సంధ్యతో ననెను.

సంధ్య ప్రసన్నచిత్తయై "అట్లైన మీపైనాకు సంపూర్ణాధి కారము కలదు. నాయిష్టానుసారముగ మీచే బనిచేయించగల యధి కారము నాకు గలదు" అనిచెప్పి శిశిరునిచేయిపట్టుకొని విద్యుత్తుచెంతకు లాగుకొనిపోయి, ఆమెచేతిలో శిశిరుని చేతినుంచి "విద్యుత్తూ! ఈ కుదువవస్తువును నీకర్పించుచున్నాను. భద్రముగా దీనిని గాపాడవల యును. ఇట్టి యపూర్వవస్తువు నీకు లభింప నలవియగునది కాదు" అనెను.

సునయనీదేవి వచ్చి "ఏమి శిశిరా! నీ వెప్పుడును విద్యాభ్యాసమునర్చుచుండుట వేతనమునకా? వ్యర్థముగా సేవసేయుటకా?" అని యడిగెను.

సునయనీదేవిగారి ప్రశ్నయందలి మర్మమును గుర్తించి శిశిరుడు మందహాస మొనర్చి యూరకుండెను.

"వేతనముగైకొన్న లోకులు నిన్ను నిందించెదరా?" అని సునయనీదేవి యనెను.

శిశిరుడు ప్రేమపూర్ణములగు సునయనీవాక్యముల నాలకించి ముగ్ధుడై "అమ్మా! నాకేదియు కొరత లేదు. పూర్తియగు పురస్కారము లభించుచున్నది. శేఖరాదులచే లభించుధనము నిలువయగుచున్నది. వనమాలిభారముకూడ తగ్గినది" అని యనెను.

"వనమాలిదాసుడు జూపినలేఖను కుతూహలతచే వానికి జాబు వ్రాయించినాను. శేఖరోదంతమునకే వనమాలీదాసు ఇచ్చటికి వచ్చెను. ఈమాట చెప్పుటకే నిన్నిందుదాపించితిని. మరియు, నీకవసరమగు నపుడెల్ల నీతల్లినడిగి రూపాయిల గైకొనుచుండుము!" అని సునయనీదేవి యనెను.

శిశిరుడు ప్రసన్నభావమున "అన్నపూర్ణాప్రసాదమును బడయుటకు నావంటి దరిద్రనారాయణుల బెక్కండ్ర సమావేశపరతును తల్లీ! అని శిశిరు డనుజ్ఞగైకొనెను. విద్యుత్ సుందరియు వెడలిపోయినది.

మార్గమధ్యమున భూధరబాబుగారు కన్పట్టిరి. శిష్టాచారములు నిర్వర్తించినపిమ్మట భూధరబాబుగారు శిశిరునితో "మీరు మీబంధువు నక్రమముగా గ్రందుజేసితిరి" అనెను.

"ఏలాగున?" అని శిశిరుడనెను.

"కాండారీలో వెలువడిన మీ లేఖా ప్రశంసను విని వారు మండి పడిరి. తుదకు వారు దానిని నిందించుచు నొక లేఖ వ్రాసి ప్రకాశనార్థము "సంగ్రహము"కు బంపిరి. నే నద్దానిని ముద్రింపక నా నిజాభిప్రాయమును ముద్రించితిని. దీనివలన వారు మరింత క్రుద్ధులై నాతో జగడమాడిరి. మిమ్ము నిందించుచుండుటకొరకిపుడు వారొక క్రొత్త పత్రికను వెలువడజేయు ప్రయత్నము లొనర్చుచున్నట్లు వినవచ్చుచున్నవి" అని చెప్పెను.

భూధరబాబుగారిమాటలవలన శిశిరునకు మార్మికవేదన కలిగినది కాని ఆంతరికభావములను నణచిపరచి "లోకము భిన్నరుచి కలది. నేడు నా కత్యావశ్యకమగు పనియున్నది. క్షమింపుడు!" అనుచు సెలవు గైకొని తననివాసస్థానమునకు బోవసాగెను.

భూధరుడు విడిచినంతనే శిశిరునకు తనకు మనసులోలేదు రజతుని వ్యవహారమున వలెనికొంపకమగులజ్జ కలిగినది. రజతుని నింద వినినంతనే యతనికి గొప్పవ్యథకలుగుచుండెను. దీనికంతకు గారణ మేమి? రజతు డిట్లేల క్రుద్ధుడగుచున్నాడు? అని తనమనస్సు నడుగ దొడగెను.

## అధ్యాయం—22

ఇంతకుమున్ను రజతుడు వీధిలోనుండి గృహమునకు వచ్చిన తోడనే తిన్నగా దల్లిగారియొద్దకును, బ్రియురాలిచెంతకును బోవుటయు వారితో మాటలాడినపిమ్మట వెలుపలికివచ్చుటయు జేయుచుండువాడు. కాని యిపుడు కొన్నిదినములనుండియు నాయలవాటుమారినది. అతడిపు

డీలుసేరగానే వెలుపలి సమావేశస్థానముననే కూరుచుండుటయు, భోజన శయనములకు మాత్రమే లోనికి బోవుచుండుటయు జరుగుచుండెను. అదిగూడ నెన్నడో పిలువగా వచ్చినప్పుడు మాత్రమే జరుగుచుండెను.

"నేడతడు స్వయముగా శిశువుని బిలువనేగియుండుటచే లోనికి వచ్చి శిశువుని వార్త దెలియజేయు" నని సంధ్య యాశించియుండెను. ఆమె మిక్కిలి యుత్సాహముతో ఈ విషయమునకై యెదురుచూచు చుండెను. కాని రజతుడుమాత్రము లోనికిరాలేదు.

వెలుపలదీపము ప్రకాశించుచుండుటయు—రజతుడు గదిలో గూరుచుండుటయు సంధ్య బొడగాంచెను. చాలసేపటివరకు నిరీక్షించి విఫలమనోరథయై తుదకు దానే అచ్చోటికి బోయినది.

రజతు డొంటిగా గదిలోగూరుచుండియుండెను. భూత ప్రేత ములగాంచి భయపడునట్లు చీకటిరాత్రి మ్లానముఖయగు సంధ్య అకస్మాత్తుగా గదిలోనికివచ్చుట జూచి రజతుడు తత్తరపాటున "నీవేల యిచ్చోటికి వచ్చితివి?" అని యడిగెను.

సంధ్య మందస్వరమున "మీ కోసమువలననే—ఇచ్చటికి రానిచో మీదర్శనలాభము దుర్లభమని తలంచియే—" అనెను.

రజతుడు క్రుద్ధుడై "ఇట్టి వ్యర్థాలాపములచే నన్ను జీకాకు పెట్టకుము! ప్రతికార్యవిషయ విచారమునకు సమయమున్నది" అనెను.

సంధ్య పీడితయై "మీరిప్పు డేమి చేయుచున్నారు? ఇట్టి సమయమునగూడ మీతోనొకటి రెండు నిమిషములు మాటలాడ జాలరా?" అనెను.

"ఇందువలననే 'స్త్రీలు బుద్ధిహీనలు' లని లోకము చెప్పుచున్నది. చక్కగా విచారింపనిదే యేకార్యమైన నెరవేరునా? కార్యాలోచనయే కదా దానికి మూలమంత్రము?" అనెను రజతుడు.

ఇంతలో సంధ్య మేజాపై నున్న యొక పత్రికను జూడఁగాంచి దానిని జదువవలయు నను తలంపున వ్యాకులచిత్త యయ్యెను. దానియం దిట్లున్నది.

"శిశిరబాబుగారి లేఖలపై వ్రాయబడిన నిందారూపక విమర్శనము నొక్కదానిని "సంగ్రహ"లో ముద్రింప నసమర్థులగుట కతన నేను మీ యీర్ష్యాపూర్ణ లేఖాస్థానమున సమాలోచనమును వ్రాసి ప్రకటించితిని. దీనికై మీరీ కార్యాలయమున కేతెంచి అసభ్యులంబోలె నాతో జగడమాడుటకు సంసిద్ధులై యుంటిరి" అని.

ఈ జాబునకామె మరింత కుతూహల చిత్తయయ్యెను. పూర్తిగా బత్రికను జదువవలయునను ప్రబలమగు వాంఛ ఆమెహృదయమును దొందరపెట్టుచుండెను. ఆగజాలక ఆమె పత్రికనందుకొన జేయిముందుకు జాచెను. అన్యమనస్కయగు సంధ్యనుగాంచి రజతుడు ఆమెదృష్టి ననుసరించుచుండెను. ఆమె చేయిజాపినంతనే రజతుడు పత్రికనుదీసికొని "ఇదియంతయు జూడ నీకేల !" అని యడిగెను.

సంధ్య అత్యంతదుఃఖితయై ఇంతకుముం దెన్నడును నాకు దెలియజేయరాని రహస్యవిషయ మేదియేనుండునని కలలోనైన నూహింపలే" దని యనెను.

రజతుడు మిన్నకుండెను. సంధ్య తనచేతులను మేజాపైనుంచి తలవంచుకొని యూరక నిలిచి సహింపరాని వేదనవలన నామె బయటికి వెడలజూచుచుండెను.

కొంచముసే పట్లున్నపిదప సంధ్యతో "పొమ్ము ! లోనికిపొమ్ము ! ఎవ్వరేని రాగలరు !" అని రజతుడనెను.

సంధ్య యొక్క-సారి రజతునివంక జూచెను. దీర్ఘనిశ్వాసమును విడిచి గదిలోనుండి వెలుపలికి బోయెను.

రజతుని యీ నిష్ఠురవ్యవహార మామెకు సహింపరానిదిగా నుండెను వివాహ మయిన నాటినుండియు నివ్విధమగు వ్యవహార మెన్నడును ఆమె చూచియుండలేదు. గృహస్థవిషయములలోగూడ రజతు డామెను తనదగ్గరనుండి పొమ్మని కఠినముగా జెప్పియుండలేదు. కాని నేడతని కామెను వేరుసేయుటయే పరమసుఖముగా నుండెను.

"దీనికి కారణమేమి ?" అని తనలో నామెతలంచినది. అప్పు డామెకు వెనుకటివిషయములన్నియు నొక్కటొక్కటిగా జ్ఞాపకమునకు రాదొడంగినవి. వానినెల్ల నాలోచింపగా "సంగ్రహ"లో శిశిరుని ప్రశంస జరిగిన రజతునిముఖము నామె జూచినది. వారు త్వరగావచ్చి వెలుపలకేలపోయిరి ? భూధరబాబుగారి రాకపోకలు లేమికి కారణమేమి? సంగతసమావేశమేల నిలచిపోయినది ? క్రొత్తపత్రికను వెలువరజేయు ప్రయత్నములేల జరుగుచున్నవి ?"

వీటికన్నిటికిని ముఖ్యకారణము నిర్దోషియగు శిశిరునిపై రజతు నకుగల హింసాప్రవృత్తియే—అసూయయే—ఈర్ష్యయే అని యామెకు స్ఫురించినది. కాండారీపత్రికలో వెలువడిన శిశిరునిలేఖలను దానే వ్రాసియొసంగియుంటినని చెప్పిన రజతునిమాటలు వట్టివనికూడ గ్రహించినది. సంధ్య యీప్రసంగమును దెచ్చి శిశిరునొకమారవ హేళనమొనర్చియుండెను. కాని విశుద్ధహృదయుడగు శిశిరు డాయవ మానమునుగూడ పూర్ణప్రసన్నభావమున నంగీకరించి యుండెను. ఇది యెల్ల యోచించి సంధ్యాహృదయమున బతిదేవునిపై నెంతటిగ్లాని యుత్పన్నమయ్యెనో శిశిరునిపై నంతటి శ్రద్ధాభక్తులుగూడ యుత్ప న్నములయ్యెను. ఆమెయిప్పు రజతు బోల్చిచూచినది. రజతునికంటె శిశిరు

డెన్నిగా నా సహంగుడు సుగుణవంతుడని గ్రహించినది. అందువలన నామె హృదయమున నొక విధమగు సంతోషమును లజ్జయు నుదయించినది

## అధ్యాయం—23

సంధ్యాసునయనులును రజతుడును, వారియొద్ద నొక నూతన యువకుడును గూరుచుండియుండిరి. రజతుడు గంభీరభావమున మౌన ముద్ర వహించియుండెను. సంధ్యయు, వాడిన మోముతో నుండెను.

సునయనీదేవి నూతన యువకునితో సంభాషించుచుండెను. ఆ యువకుడును మెల్లమెల్లగ—సవినయముగ సంభాషించుచుండెను.

అకస్మాత్తుగ విద్యుత్తు వచ్చి లోపల ప్రవేశించెను.

సంధ్య మోమెత్తి కనుసన్న చేసినే విద్యుత్తును 'గూరుచుండుము' అని చెప్పెను.

సునయనీదేవి విద్యుత్తునుజూచి "కుమారీ! నీవును దగినసమయమునకే వచ్చినావు. ఈతడే శిశిరబాబుమిత్రుడగు వనమాలిదాసు! శిశిరుని చరిత్రము నెరింగినవాడు. ఈతడు నిన్నటిరాత్రియె యిచ్చటికి వచ్చెను. శిశిరచరిత్రము నెరుంగదలచియె వీనిని రప్పించితిని. ఇప్పుడే యీతనిని శిశిరునివృత్తాంతము నడిగియుంటిని. ఈతడును జెప్పనుపక్రమింపగనే నీవును వచ్చితివి. నీవు కూడ వినదగినదే కావున సావధానముగ నాలింపుము!" అనెను.

వనమాలి విద్యుత్తును జూచెను.

విద్యుత్తు మోము వ్రాల్చుకొనెను.

"కుమారా! శిశిరుడు తన చరిత్రమును జెప్పుట కిసుమంతయు నంగీకరింపకపోవుటయె కాక ఆ ప్రసంగమును దెచ్చినచో నాతడెంతయు

దుఃఖము గుచుందురు. అందుచే నీవలన వారిచరిత్రమును దెలియ వలసియున్న"దని సునయనీదేవి యనెను.

సునయనీదేవిమాట లాలించి వనమాలిదాసుడు ఇట్లు చెప్ప దొడగెను.

"అమ్మా! శిశిరచక్రవర్తిగారొక నిరుపేద బ్రాహ్మణుని కుమారుడు. వీరికి నలువురు అన్నలును, ఒక తమ్ముడును గలరు. వీరినందరిని బోషించుటకు తండ్రికి మిక్కిలి కష్టముగానుండెడిది. దినమున కొకపూటయైనను గడుపునింపుగ నన్నము నిడజాలకుండెను. ఉన్నతవంశీయుడగుటచే నాతడొకరి నడిగి తెచ్చి బిడ్డలను బెంచుట కిచ్చగింపక కుమారుల యవస్థకు మిక్కిలి దుఃఖించుచుండెడివాడు.

ఆ సమయమున రాజనగరప్రజమీందారగు శంకరబాబుగారు సంతానహీనులై తనవంశపుబాలు నొకని బెంచుకొనదలంచి యన్వేషించుచుండిరి.

ఆ వంశమునకు జెందినవాడగుటచే శిశిరచక్రవర్తిగారి తండ్రికి వర్తమానమంపి సకుటుంబముగ దన యొద్దకు రప్పించుకొని "కొంత ధనమును బుచ్చుకొని నాకొక్క పుత్రుని బెంచికొననిచ్చి వంశము నిలుపు"డని మిక్కిలి వినయముగ నాతని బ్రార్థించెను.

ధనాశచే వీరితండ్రి తనచిన్నకుమారు నొసంగ నంగీకరించెను. కాని, చిన్నకుమారు నిచ్చుటకు దల్లి యంగీకరింపలేదు. అందుచే నీ శిశిరచక్రవర్తిగారినే శంకరబాబుగారి కొసంగిరి వారియొద్దనుండి విశేష ద్రవ్యమును బుచ్చుకొని భార్యాపుత్రులతో నటనుండి వెడలిపోయెను.

శిశిరబాబుగారిని మిక్కిలి జాగరూకతతో—ఆదరముతో—పుత్ర వాత్సల్యముతో బెంచుచుండిరి. కాని, శిశిరబాబుగారు రాజపత్నియెడ

మాతృస్నేహమును, శంకరబాబుగారియెడ బితృప్రేమయు, నుంపచాల కుండిరి. ఆభోగముల కానందింపజాలకుండిరి.

శంకరబాబుగారు శిశిరచక్రవర్తిగారికి సమర్థులగు ఉపాధ్యాయులచే సంగీతసాహిత్యముల నింట జెప్పించుచు గళాశాలలలో నాంగ్ల భాషయు జెప్పించుచుండిరి. వారి మేధాశక్తికి ఆనందమును—ఆశ్చర్యమునుబొంది కన్నకుమారునికంటె నెక్కుడుగ జూచుకొనుచుండిరి.

అయిదారు సంవత్సరములిట్లు జరిగినపిదప శంకరబాబుగారికి బుత్ర సంతానలాభము కలిగెను. అదిమొదలీతనిపై క్రమముగా అనురాగము తగ్గిపోయినది. అసూయజనించి దినదినాభివృద్ధి యగుచుండెడిది. తుద కాగ్రహముగా పరిణమించినది.

శిశిరచక్రవర్తిగా రనియంతయు గ్రహించి యటనుండి వెడలి పోవ జూచుచుండిరి ఈసమయమున శిశిరచక్రవర్తిగారి నెట్లైన జంపిన గాని జమీందారీ తనకుమారునకు బూర్తిగా దక్కదని యోచించి శంకరబాబుగారు పాలలో విషముగలిపి శిశిరునకిచ్చిరి.

"ఇందరు సేవకులుండగా స్వయముగా శంకరబాబుగారే పాలు తెచ్చి యీయనేల? ఇదివరకెన్నడును లేని యీయాచారము నేడు జరుగనేల? అన్నివిధముల గొంతకాలమునుండి అనాదరముతో— అసూయతతో—గోపముతో ప్రవర్తించుచున్న శంకరబాబుగారిట్టి యనురాగము జూపనేల? కారణములేని కార్యముండ"దని నిశ్చయించి పాలను బరీక్షించి నిజమునెరింగి, ఆరాత్రియే ఆజమీందారీతో దనకుగల సర్వహక్కులను శంకరబాబుగారి పుత్రునకువ్రాసి తగుమనుష్యులచే రేజిష్టరుచేయించి యొక సేవకునిచేతికిచ్చి, తాను బయలుదేరి తల్లి దండ్రులయొద్ద కేగెను. జరిగినసంగతిని వారికెరిగించెను.

చేతికివచ్చిన జమీందారీని విడిచివచ్చినకుమారుని తల్లిదండ్రు లెంతయు నిందించి పొమ్మనిరి. అటనుండి శిశిరబాబుగా నీనగరమునకు వచ్చి నీశాలలో ప్రవేశించిరి''

వనమాలిచెప్పిన ఈమాటల నాలించినంతనే అందరిహృదయ ములును దుఃఖపూరితములయ్యెను, అందరినేత్రములనుండియు నశ్రు ధారలు గారదొడంగెను.

''ఆహా! ఏమి త్యాగశీలుడు! ఏమి యుదారహృదయుడు! ఎంతటి శాంతచిత్తుడు!'' అని సునయని గద్గదకంఠమున నుడువదొడ గెను. రజతుడటనుండి తటాలునలేచి వెలుపల కేగెను.

''కుమారా! నీకును శిశిరబాబునకును గలసంబధమేమి?'' అని సునయనీదేవి వనమాలి నడిగెను.

''అమ్మగారూ! నాతండ్రి శిశిరచక్రవర్తియొద్ద పరిచారకుడు. శిశిరబాబుగారు రాయూరునివిడుచుటకు రెండువత్సములకు పూర్వము నాతండ్రి మరణశయ్యపైనుండి నన్ను శిశిరబాబుగారి కొప్పగించి మర ణించెను. శిశిరబాబుగారి మొదటిచరిత్రమునంతయును నేను నాతండ్రి వలననే వినియుంటిని'' అని చెప్పెను.

ఆసమయమున శిశిరుడు లోనికివచ్చి అందరినిజూచెను. అందరును అశ్రుపూర్ణనయనులై యుండుటయు, వనమాలి యచట గానుపించు టయు గని ''వనమాలి తనచరిత్రము నెరింగియుండు''నని తలంచెను.

వనమాలి తటాలునవచ్చి శిశిరునిపాదములపై బడెను. సునయనీ దేవిలేచి పుత్రవాత్సల్యము పొంగిపొరల శిశిరుని గౌగిలించుకొనెను.

## అధ్యాయము—24

“మరదిగారూ! మీదర్శనమున—మీసహవాసమున—మీతోడి సంభాషణమున మేము పవిత్రులమైతిమి” అని సంధ్య డగ్గుత్తికతో ననెను.

విద్యుత్తు లజ్జానురాగవ్యాకులితాంతఃకరణముల శిశిరుని జూచుచుండెను.

## అధ్యాయం—24

పురమునందేగోడపై జూచినను 'నారద' చిత్రాంకితములగు బెద్దకాగితములే! ఏవాడ కేగినను 'నారద' పత్రికా ప్రకటన కరపత్రములే! ఏపత్రిక జూచినను 'నారద' ఆగమన సూచనలే! ఎచ్చట నాలించినను 'నారద' ప్రసంగములే! సంతలలో—పాఠశాలలలో—పల్లెలలో—పట్టణములలో—గుడిసెలలో—గోపురములలో—అంగడులలో—అంతఃపురములలో 'నారద' ఆగమన ప్రసంగములే! గడియకొకరీతిగ—గంటకొక విధానముగ—క్రొత్తక్రొత్త చందములతో—వింతవింత విధములతో 'నారద' పత్రికాప్రకటనము జరుగుచున్నది. నారదపత్రికాదర్శనమునకై బెక్కండ్రాతురతతో నెదురు చూచుచున్నారు.

ప్రకటన మారంభమైన పదునైదు దినములనాడు నారదపత్రిక వెలువడెను. ఒకచేత వీణనుబూని రెండవచేత గుంచియవీచుచు ఆకసమునుండి భూలోకమునకు వచ్చుచున్న కలహభోక్తరూపము బహువర్ణములచే—కనులకు మిరిమిట్లుగొలుపునట్లు ముఖపత్రమున ముద్రితమై యుండెను. పాలమీగడవంటి స్నిగ్ధతగల దళసరికాగితముపై పత్రిక యంతయు ముద్రితమై యుండెను. ఐదారు త్రివర్ణచిత్రములును—

పదిపండెండు సామాన్యచిత్రములును ప్రేక్షకుల కానందసంధాయకముగ నందుండెను. కొన్ని ఖండకావ్యములు—కొన్ని కథానకములు—కొన్ని ప్రహసనములు నున్నవి.

"సరికము" అను శీర్షికతో విమర్శనాంకమున్నది ఆ యంకమున శిశిరచక్రవర్తిగారి లేఖలపై గర్భోరదుర్విమర్శములు నిండియుండెను. ఒకవిషయమునే పలువురు పలువిధముల నింధించి వ్రాసినవిమర్శలు గలవు అందు కొన్ని విమర్శలక్రింద "సశేషము" అనికూడ గానవచ్చుచుండెను.

అందున్న వింతవింతబొమ్మలను జూడగోరి కొందరును—కథల జదువగోరి కొందరును—ప్రహసనముల జదువగోరి కొందరును—విమర్శల జదువగోరి కొందరును—చదువ్రుం దాసక్తిలేక పోయినను డంబమునకు గొందరును—మోమోటమిచే గొందరును, నారదను గొనుచుండిరి.

నారదపత్రికకొరకెంతయు నుత్సాహమున నెదురుచూచుచున్న సంధ్య యాపత్రికను జదివి హతాశయగుటయేగాక, వ్యాకులిత చిత్తయు నయ్యెను. సునయనీదేవియు వ్యథాపూర్ణ హృదయయయ్యెను. రజతుడు తనవ్యాపారమునకు దానే గర్వించుచుండెను.

శిశిరుడు నారదను జదివి రజతుని దుర్నయప్రవృత్తికి మిగుల జింతించెను. తనసమానశక్తిచే రజతుని వారింప నిశ్చయించుకొనెను. రజతునియొద్దకువచ్చి మందహాస విలసితముఖుడై "అన్నా! నీవీ విమర్శనావ్యాజమున నాకెంతయు గీర్తిగలిగింప బ్రయత్నించుటచే నేను నీ కెంతయు గృతజ్ఞుడను" అని సవినయముగ ననెను.

ఆమాటకు గంభీరభావమున రజతుడు తలనూపుచు అటనుండి వెడలిపోయెను.

శిశిరుడు లోనికేగెను. సంధ్యాసునయను లాతనిజూచి లజ్జాభర వివశులైరి. "కుమారా! రజతుని వ్యాపారము మా కెంతయు వ్యథాకరముగనున్నది. నీమోముమనుజూచి మేము లజ్జాఖేదముల నొందవలసి వచ్చుచున్నది. నీవు రజతుని ప్రవృత్తికి గినిసి మమ్ము విడనాడవలదు!" అని సునయని శిశిరునితో ననెను.

శిశిరుడు మందహాస మొనరించుచు "అమ్మా! రజతబాబునకు నాపై నపారమగు ననురాగముకలదు. నాయశస్సును గోరియే నాలేఖలను విమర్శించుచుండెను. ఏగ్రంథము పై నెక్కువ ఖండనమండనములు వెలువడుచుండునో యాగ్రంథమునకు లోకమునమిక్కిలి వ్యాప్తికలుగుచుండును. ఈ విమర్శలవలన నాగ్రంథములును, నాపేరును మిక్కిలి వ్యాప్తిచెందునుగదా? అందులకేకదా రజతబాబుగా రింతటిప్రయత్నమొనరించుచున్నారు!" అని చెప్పెను.

ఆమాటకు సంధ్యాసునయనులు నివ్వెరగందిరి. శిశిరుని సమాన శక్తికి ముగ్ధులైరి "మరదిగారూ! ఈగుణముచేతనే మీరు లోకుల నాకర్షించుచున్నారు" అన్నది సంధ్య.

"అదిమీ భావభేదమే" అనెను శిశిరుడు.

# అధ్యాయం—25

క్రమముగా నారద శిశిరనిందలతో నిండిపోవుచున్నది. రజతుని ఈర్ష్య యధికమగుచున్నది. శిశిరునికీర్తియు మిన్నుముట్టుచున్నది. సంధ్యాసునయనులకు రజతునిపై క్రోధము—అసూయయు బెచ్చు పెరుగుచున్నవి. నిరంతరవ్యథాపూర్ణ హృదయులగుచుండిరి. శిశిరునితో

మాటలాడుటకుగాని ఆతనిచెంత నిలువబడుటకుగాని వారిచ్ఛగింపకుండిరి; సహింపజాలకుండిరి. రజతుని మోమును జూచి భయకంపితులగుచుండిరి.

సంధ్య కొల్లింటివలె నిప్పుడు రజతుని రచనలను జదువ నిచ్ఛగింపకుండెను. అప్పుడప్పుడు శిశిరుడు చదివి వినిపింపబోవంగినను వానిని వినక యటనుండి వెడలిపోవుచుండెను. "ఈనాగర పత్రికాపరిణామ మెట్లుండునో!" యని యామె సర్వదా భీతి నొందుచుండెను. శిశిరుని సమానశక్తి నామె గొప్పగా నెంచుకొనుచుండెను. వానిపై నామెకు భక్తియు, గౌరవము, ఆదరమును దినదినాభివృద్ధి నొందుచుండెను. ఇతర పత్రికలలో ప్రకటితములైన శిశిరుని వ్యాసములను మౌనముగ జదువుచు ఆనందించుచుండెను.

నాగరపత్రికా ప్రకటనమునందా నన్యులదృష్టిలో శిశిరునికంటె మేధాసంపన్నుడననియు, కార్యనిర్వహణసమర్థుడననియు, ననిపించుకొనదలంచిన రజతుడు, తనయింటనే—తనభార్యయొద్దనే—తన తల్లియొద్దనే అయోగ్యుడనిపించుకొనెను. అందులకాతడెంతయు క్రుద్ధుడగుచుండెను. ఆతనిహృదయమున శిశిరునిపై ద్వేషమధికమగుచుండెను శిశిర సునయన సంధ్యలలో నెవ్వరియొద్దకునుబోయి నిలువజాలకుండెను. తనయింట వానికి నిలువనీడయును లేకుండెను. కళాశాలనుండి వచ్చి, ఇంటనిలువజాలకుండెను. నాగరపత్రిక—లేఖలు—విమర్శనలు—విమర్శకులు—విమర్శక పారితోషికములు—కార్యాలయము, వీనితోడనే కొంతవరకు కాలమును నెట్టుచుండెను, కాని వానిహృదయమున కూరట యెట్లుకలుగుచుండెను? ఈర్ష్యాపూర్ణ హృదయము ఝంఝామారుతాహత తరంగసంకులిత సాగరమువలె సంక్షుభిత మగుచుండవలసినదే కాని, ప్రశాంతముగ నుండగలదా?

మిత్రుల ప్రోత్సాహమున మనశ్శాంతికొరకు, సినీమా శాలలును, నాటకభవనములును, నాట్యమందిరములును, నాట్యాంగనానిలయము లును, శరణ్యములైనవి.

రజతుని యీవినూత్న ప్రవర్తన ప్రభావమున సునయనీసంధ్యల హృదయములు దారుణవేదనాగ్నిచ్ఛటావేల్లితములై దందహ్యమానములగుచుండెను. వారిమోములు దుఃఖదేవతాతాండవసీమ లయ్యెను. వాక్కులు దైన్యయుతము లయ్యెను.

శిశిరు డిదియంతయు జూచి లోలోననే కుములుచుండెను. రజతుని దుస్థితికై శిశిరుని సంతాపమునకు మేర యేలేదు సునయనీ సంధ్యలకు దొల్లింటివలె నాతడు మాటలాడజాలకుండుటయే కాక వారి చెంత నిలుచుటకు గూడ లజ్జించుచుండెను. దీనికంతకును దానే హేతుభూతుడని యనుకొనుచుండెను. నేనిచ్చటికి రానిచో గొంతశాంతించు నేమోయని తలంచుచుండెను. ఇట్టి విషమసమయమున సునయనీసంధ్యలను విడిచిపోవుట వారికి మరింత సంతాపమును గలిగించుటయే—యని దలంచుకొనుచుండెను నిశ్చయరహితహృదయుడై — నిరంతరోగ్ర వేదనాపూర్ణమనస్కుడై, సంధ్యాసునయనుల యొద్దకువచ్చి పోవుచుండెను.

సంధ్యాసునయనులు తమహృదంతరంగిక ఖేదమును శిశిరున కెరుక బడనీయకయె వానియొద్ద సంభాషణాదికములను జరుపుచుండిరి. విద్యుత్తు ప్రతిశనివారమును వచ్చి సంధ్యకు సంగీతము జెప్పుచునే యుండెను. శిశిరుడు ప్రతిదినమును జదువుచెప్పుచునే యుండెను. విద్యుచ్ఛిశిరులు గలిసినప్పుడు సంగీతమారంభమగు చుండెడివి. ఆస్వల్ప కాలమునమాత్రము సంధ్యాసునయనులు, విద్యుచ్ఛిశిరులను జూచుచు-

వారి సంగీత సుధారసము నాస్వాదించుచు, రజతుని దుష్కర్మములను మరచి యానందమున నుందురు.

నానాటికి నారదలో సగబాలు విమర్శనాంకమే వెలువడ దొడంగెను. క్రమముగా సాహిత్య సమాలోచనము వ్యక్తిగతదోష నిరూపణాపరిణామమును బొందెను. శిశిరుడు కవితాకళయం దిసుమం తయు ప్రజ్ఞలేనివాడని నిరూపించుటతో నాగక—యోగ్యతాశూన్యు డనికూడ జాటుటయె యీ సమాలోచనములకు ముఖ్యోద్దేశముగ నుండెను.

ఇందులకు శిశిరుడు వ్యథచెందెను. రజతునియొద్దకు వచ్చెను. "అన్నా ! ఇదియేమి నూతనలీల ? సాహిత్యసమాలోచనతోపాటు లేఖకుడుకూడ విమర్శింపబడునా ?" అని యడిగెను.

"మానహానికరప్రయత్నములు గోచరించుచున్నపుడు న్యాయస్థానములున్నవికదా ? పత్రికపై నభియోగము దెచ్చికొనుము" అని రజతుడూరకుండెను.

ఆమాటకు శిశిరుడు నవ్వుచు "అన్నా ! అదియె చేయుదలంచి యున్నాను. అసహాయుడనగు నాకు న్యాయాధిపతులింకెవరున్నారు ? మీరు—వదినెగారూ—తల్లిగారేకదా ? నాకు న్యాయాధిపతులు ?" అని నుడివెను.

ఆ మాటకు రజతుడు క్రుద్ధుడయ్యెను. "ఇదియా నీపౌరుషము ! పోయి ఆడువారిలో గన్నీటిని విడిచెదవా ! పురుషునివలె బౌరుషమును జూపజాలవా ! స్త్రీలచెంతకు బోయి యేడ్చియే యింతజేసితివి ! నా భార్యను, నాతల్లిని నాయెడ విరోధులజేసితివి—ఎడబాటు గల్పించితివి ఆరనియగ్ని నింట రగుల్గొల్పితివి" అని కఠోరస్వరమున జెప్పెను.

"అన్నా ! నీవిట్లనుట సమంజసముగ లేదు. నేను నీతో బోరి విజయ మొందదలంచుట లేదు. నాభాగ్య శేఖయం దెచ్చటను విజయ చిహ్నము లేదు. యోటమిని నీ చెంత నంగీకరించుటకే వచ్చితిని. సర్వదా ఈశ్వరుడు నాకు బ్రతికూలుడే ! ఇట్టి దీనుని దోసములను నీవు కాక సైరించువారెవరున్నారు ?" అని గద్గదకంఠుడై నుడివెను.

శిశిరుని మాటలకు రజతుడేమియు బ్రత్యుత్తరమీయ లేదు. శిశిరుడచట నిలువజాలక వెడలిపోయెను. రజతుని యాక్షేపణమువలన శిశిరునకు దుఃఖముతో పాటు సంతోషముగూడ గలిగెను. సునయనీ సంధ్యలకు దనపైగల యపారానురాగమున కాత డానందపూరిత హృదయుడయ్యెను. ఆనందోద్రేకమున గర్వితుడై పోయెను. "వారి విచారణ మెంతిపక్షపాతవిరహితము !—నాయెడ వారికెంతటి యగాధ వాత్సల్యము ! అనుంగుభర్తయొక్క—కన్న కుమారునియొక్క సాధార ణాపరాధమునుగూడ సంధ్యాసునయనులు సహింపజాలకున్నారే ! ఎట్టి వినిర్మలహృదయులు !— ఎట్టి పవిత్రవర్తనులు ! అని తలపోయ దొడగెను.

శిశిరుడు మందిరమునకు వచ్చియు లోనికిరాక వెడలుపోవుట సంధ్య తెలిసికొని వ్యధితహృదయ యయ్యెను. నాధునిచర్యయె దానికి గారణమని తెలిసికొనెను. ఆమాసపు నారదసంచికను జేతబట్టుకొని విరక్తభావమున రజతునొద్దకువచ్చి నిలిచెను.

రజతుడు మాటాడక యేదియో వ్రాసికొనుచున్నట్లుండెను.

"తన్మయులై యున్నారా ?" అన్నది సంధ్య.

రజతుడు ముఖమునెత్తి సంధ్యదెస కర్కశవీక్షణమును బరపి "ఏమి ? నన్ను దిరస్కరింప వచ్చితివా ఇచ్చటకు ?" అనెను.

"ఇందులకే మీచెంతకు వచ్చుచుందునా ?" అన్నది సంధ్య.

"కొంత కాలమునుండి దీనినే చూచుచున్నాను. మన ఇరువురి మధ్యమునను మరియెట్టి సంబంధమును నాకు గానుపించుటలేదు" అని విరక్తస్వరమున రజతుడు నుడివెను.

"మీహృదయము తొల్లింటివలె నిపుడు గానుపించుటలేదు. అంతయు నిపుడు క్రొత్తవిధముగా గానుపించుచున్నది" అన్నదిసంధ్య.

ఈమాటకు రజతుడేమో ప్రత్యుత్తరమును జెప్పబోవుచుండెను. కాని, సంధ్య దానిని నాటంకపరచి "నేనిపుడు మీతో వాదించుటకును మిమ్ము దిరస్కరించుటకును వచ్చినదానను గాను. కేవలము, మిమ్ము దీనాతిదీనముగ బ్రార్థింపవచ్చినదానను. మీరింక నారదపత్రికను నిలిపి వేయుడు ! శిశిరునిపైగల యీర్ష్యాద్వేషభావములను దూరముగా బారద్రోలుడు ! ఈపనిచే మీహృదయమునకు బూర్వపు ప్రశాంతియు, తొల్లింటి నా యానందమయ జీవితమును సంస్థాపితములగును. శిశిర బాబు మీ కెట్టి యపకృతియును జేసియెరుంగడు—చేయదలంపడు—మీయెడ నగ్రజగౌరవమున మెలగుచున్నవాడు—మీ శ్రేయమునే సర్వదా కోరుచున్నవాడు—మీ యొనరించిన నిందలనే యాశీర్వాదములుగా భావించుచున్నవాడు. నిరపరాధి—నిర్మలహృదయుడు—మీరు వానిని గ్రిందుసేయ బ్రయత్నింపకుడు ! ఇదియె నా ప్రార్థనము" అని చెప్పెను.

సంధ్యమాటలకు రజతుడు క్రోధోద్దీప్తమానసుడయ్యెను. సంధ్యాముఖముపై గరకుజూపులబరపి "అగును నేనే యపరాధిని. శిశిరుడు నిరాపరాధి. ఆతడు నాయెడ నెట్టి ద్రోహమును జేయలేదు. నేనే శిశిరునియెడ ద్రోహమొనరించుచున్నాను. చాలు ! చాలు !" అని రజతుడూరకుండెను.

"శిశిరుడు మీయెడ నొనరించినదోష మొక్కటియేని మీరు చెప్పగలరా ? ఊరక వానినేల నిందింతురు ?" అన్నది సంధ్య.

"ఊరకొనక మరల వాఖ్యాన మొనరించుచున్నావా ? నీ వెరుంగవా ? తల్లిగారికిని నాకును—నీకును నాకును—ఎడబాటు గలిగింపలేదా ? నాయశస్సునంతయు నపహరింపలేదా ? ఇంక నేమి చేయవలెను ?" అని కఠోరస్వరమున జెప్పెను.

రజతుని కఠోరకంఠనినాదము నాలించి "అవియన్నియు స్వయముగా నీవే తెచ్చికొంటివి. కాని శిశిరకృతములుకావు" అనుచు సునయని లోనుండి వచ్చుచుండెను.

తల్లివచ్చుట జూచి రజతుడట నిలువజాలక వేరొకద్వారము నుండి యావలకేగెను. పతిచే నిందింపబడి లజ్జాసంక్షోభ విహ్వలిత చిత్తయగు సంధ్య మోము వ్రాల్చుకొనియే యటనుండి యత్తగారితో లోనికేగెను.

# అధ్యాయం—26

సంధ్య యొంటిగా గూరుచుండి శిశిరునకొకజాబు నిట్లువ్రాసెను.

"మరదిగారూ !

మీధవళయశఃపటమున నైల్యకళంకమును గలిగింప బ్రయత్నించువారు, మీ కించుకంతయు జెరుపు సేయ జాలకుండుటయేకాక మీరు మిక్కిలి వారే పరిహాస పాత్రులగుదురు. మీకీర్తి సూర్యునింబోలె తేజఃపూర్ణమును ప్రకాశమయమును, ఎంతపని ! అద్దిరా ! దుమ్ముచే దేజస్సు గప్పబూనుట యెంతటి బుద్ధిహీనత ! మీరు

దరహాస వదనమున వారి యపరాధములనెల్ల క్షమించు చున్నారు. ఇది వారికి లజ్జను గలిగించుటలో తక్కువ విషయముకాదు.

వ్యథితహృదయ.
మీ వదినె సంధ్య"

సునయనీదేవియు శిశిరున కొకజాబు వ్రాసెను.

"వత్సా!

నేను నవమాసములు గర్భమునమోసి కనిన పుత్రుని యకార్యముగని శాంతఖిన్ననయి యున్నాను. కాని నా ప్రేమజాతుడగు చిన్నకుమారుని హృదయోదార భావముననే ఇంతదనుక నామస్తకము నెత్తుకొని యుంచ గలిగి యున్నాను.

ఇట్లు
నీతల్లి సునయని"

రజతుని దారుణ వ్యాపారమువలన శిశిరునిహృదయమున నుత్పన్నమయి యుండిన క్షోభము పక్షపాతరహితలును, స్నేహస్నిగ్ధములునగు నీ రెండుజాబులవలన దుమునబడిపోయినది. తక్షణమే శిశిరుడు సునయనియొద్దకుపోయి మందహాసమున సంభాషింప దొడగెను. ఆమె సంతప్తహృదయమునకు శాంతిప్రదాన మొనర్చు వ్యాపారమును సేయ దొడగెను. అతని వ్యవహారమున నెవ్విధమగు ఘటనావైపరీత్య చ్ఛాయలును స్ఫురింపనైన లేకుండెను. పత్ర ప్రసంగమునయిన నతడు చేయలేదు.

శిశిరుని చేష్టలచే సునయనికంఠము గద్గదికనొందెను. "వీని జన్మ మిందుకొరకేగాబోలు! తాను విషపానమొనర్చి యితరులకు

అమృతవృష్టిని గురియుటకే యిప్పుడుపుట్టెను గాబోలు" వని మనమున ననుకొనెను.

ఇంత యవమానము గలిగినపిమ్మట గూడ శిశిరుడు తొల్లింటివలె రజతుని యింటికి వచ్చుట, సంకోచభావములతో సమయమును గడపి పోవుచుండుట జరుగుచుండెను. అదిచూచి రజతుడు "ఇంతసిగ్గుమాలిన వాని నింతవరకు జూడలేదు" అనెను.

వనమాలీదాసు "బాగుగానంటిరి. వంశప్రభావముకూడ కొంచెము పరికింపవలయును" అని యనెను.

వనమాలిమాటలు రజతునకు అనుచితముగనే తోచెను.

ఇంతలో గాళిదాసువచ్చెను. వానినిజూచి రజతుడు "సోదరా! ఇప్పుడు నీదర్శనమే దుర్లభమయినదే!" అనెను.

కాళిదాసు తటస్థభావమున "మీయాగ్రహ మిప్పుడు మంచివారికి జోటిచ్చుటలేదు. ఇప్పుడు మీయాగ్రహము ఇచ్చకములాడువారికిని—ముఖస్తుతులు సేయువారికిని వాసస్థానమైనది. నేను గొప్ప కార్యము నొనర్చుచున్నానని నీవనుకొనగలవు, కాని వెలుపల నీకెవ్విధమగు నింద కలుగుచున్నదో దానిపై నీదృష్టి ప్రసరింపలేదు. నీచెవి వినలేదు" అనెను.

రజతుడు నవ్వుచు "శిశిరబాబుపక్షమును గైకొని నిందారోపణములుచేయుటకు వచ్చియున్నావు. సరే! మంచిమాటయే. ఇంతదనుక నాప్రయత్నములు సర్వదా విఫలమగుచున్నవనియే తెలిసికొనుచుంటిని. కాని, యిప్పుడు తప్పక నాలక్ష్యమున కొద్దిగానో, గొప్పగానో దెబ్బతగులుచున్నదని తెలియవచ్చుచున్నది" అని యనెను.

కాళిదాసు క్రుద్ధుడై "విఫల మెట్లగును? మీ పతనమునకు గోయి పూర్ణరూపమున సిద్ధ మొనర్చుకొనుచున్నారు. మీయీ నిస్సహాయా వస్థజూచి దుఃఖమొదవుచున్నది" అని యనెను.

రజతుడు నవ్వుచు "నేను మీ కత్యంతకృతజ్ఞుడను. మీరు నా నిరిహాదశపై సాంత్వనమును ప్రకటించిరి. దానికై నేను ఆజన్మము సేవకుడై యుందును" అని యనెను.

ఈరజతుని వ్యవహారము కాళిదాసుని విస్మితునిగావించెను. అతడేమియు ననక లేచి యటనుండి వెలుపలికి బోయెను.

కాళిదాసుని తీవ్రధ్వనివిని శిశిరుడును వెలుపలికివచ్చి వడివడిగా పోవుచున్న యతనిని జూచి వెనుకనుండి "కాళిదాసా! చిన్నమాటవిని పొమ్ము! ఏమయినది? ఎందుకు గోపము తెచ్చుకొన్నావు?" అని బిగ్గరగా నడుగనారంభిచెను.

కాని కాళిదా సేమియు ననక తనదారిని పోవుచుండెను. శిశిరుడు పరుగెత్తుకొని పోయి వానిని బట్టుకొని "కోపమునకు గారణమేమి?" అని నవ్వుచు నడిగెను.

కాళిదాసు మనస్సులోనిమాట మరుగుపరచి "ఏమియులేదు. కొంచెము మాలో మాకు పరస్పర భేదములుకలవు" అనియెను.

ఇంతలో ఖగేఒడచటికివచ్చి లజ్జితుడై, "కాళిదాసబాబూ మీరు మమ్ముల నిచ్చవచ్చినరీతిని దూషించితిరి. శిశిరబాబుకూడ మాకు మిత్రుడే. రజతబాబును మిత్రుడే. రజతబాబు లిఖించుటకు సంకోచించుచున్నాడుగాని యవశుడై వ్రాయలేక కాదు. ధనము వ్యయముసేయనిదే యుత్తమపదార్థము భోజనమునకును, త్రాగుటకు మంచి విదేశమదిరయు దొరకవుకదా? శిశిరబాబు దీని నేర్పాటు

చేసినచో జూడుము ! రేపటినుండియే నాకలము అతనిప్రశంసయే వెలువ రింప దొడగెను" అనెను.

ఖగేనుని మాటలువిని కాళిదాసుని హృదయమున తటాలున హేయభావ ముత్పన్నమయ్యెను. అతడచట నిలువజాలకుండెను. ఒక్క సారి హేయభావపూరితదృష్టు లతనిపై బరపి, అచటనుండి వెడలి పోయెను.

నవ్వుచు అతడు పోయినపిదప శిశిరుడు ఖగేనుని భుజముపై జేతినుంచి నవ్వుచు "ఖగేనుబాబూ ! ఇదియెల్ల గొప్పవారికే తగును. నేను మిక్కిలి బీదమనుష్యుడను. నావద్ద నింతటి సాధనసామగ్రి యెచ్చటకలదు ?" అని యనెను.

అసహాయుడు, చపలహృదయుడు, తెలుసుకొనుటయందోర్పు లేనివాడును అగు ఖగేనుడు శిశిరునితో "మీరు మాపై నిందలు మోపుచుంటిరి. కావున జెప్పుచున్నాను" అని యనెను.

"మీపై నేనేమినింద మోపితిని ?" అని శిశిరుడనెను.

"ఇపుడు కాళిదాసాడినమాటలు నిందాపూర్ణములుకావా ?" అనెను ఖగేనుడు.

"అతడిపుడేమనెనో నాకేమియు దెలియదుకదా !" అనెను శిశిరుడు.

"అది మీ బాధ్యతను దప్పించుకొనుట కనినమాట" అనెను ఖగేనుడు.

అన్నృతమాడవలసినంత అక్కర నాకేమున్నది ? నేనెవ్వరింగూడ దోషిగా దలంచువాడను కానే" అని నవ్వుచు శిశిరుడు అటనుండి వెడలిపోయెను.

# అధ్యాయం—27

నేడు గురువారము. విద్యుత్తు గృహమునకు వచ్చుదినముకాదది. కాని యొక యాకస్మికోత్సవ సందర్భమునకు శుక్రవారమునాడు కళాశాలకు సెలవు వచ్చుటచే నేటిసాయంసమయమున నాలుగుగంటలకే విద్యుత్తు అద్దెబండిలో గూరుచుండి తన మందిరమునకు వచ్చెను. ద్వారముననొద్ద బండిదిగి లోనికేగుచుండగనే అపరిచిత ద్వారపాలకుడొకడామెను నిరోధించి "ఇందెవ్వరు నిపుడు లేరు" అని చెప్పెను.

ద్వారపాలుకుని పలుకులకు విద్యుత్తు రిచ్చవడి "అమ్మగారెచ్చటకేగినారు ?" అని యడిగెను.

"అమ్మగారు తరుచుగా నిచ్చటనుండరు. శనివారమునాటి యుషఃకాలముననే యిచ్చటికివచ్చి, సోమవారమునాడు జాముప్రొద్దెక్కినపిదప ఇచ్చటనుండి వెడలిపోవుచుందురు" అని ద్వారపాలకుడు చెప్పెను.

ద్వారపాలకునిమాటలకు విద్యుత్తు విభ్రాంతచిత్తయయ్యెను. "నీ వెంతకాలమునుండి యిచ్చటనున్నావు ? ఇంతకుముందిచ్చటనుండు శ్యామలకు డేమైనాడు ?" అని యడిగెను.

"శ్యామలకుడుగూడ ఆమెతోడనే వెడలియుండెను. అతడే నన్నిచ్చటనుండ నియమించెను. ఏదేని కార్యవశమున నాత డొకటి రెండు దినము లావలకేగు సమయములలో నన్నక్కడనుందు నాచారమున్నది" అని యాతడు చెప్పెను.

"అమ్మగారిపుడెచ్చట నుందురో నీవెరుంగుదువా ?" అన్నది విద్యుత్తు.

"అది నేను నిశ్చయముగా జెప్పజాలను. కాని, సోమవారమునాడామె పోవుచున్నపుడు బండివానితో "సువర్ణోద్యానమునకే తీసుకొని

పోమ్మ" అని చెప్పుచుండగా ఆసమయమునకే యచ్చటికివచ్చిన నా చెవినిబడినది" అని ద్వారపాలకుడు చెప్పెను.

"సువర్ణోద్యానము" అనుమాట చెవిని బడినంతనే విద్యుత్తు హృదయము భయకంపితమయ్యెను. "సువర్ణోద్యానమునకా! సువర్ణోద్యానమునకా!" అని యనుచు, మరల బండియొద్దకువచ్చి బండివానితో "బండిని సువర్ణోద్యానమునకు దీసుకొనిపొమ్మ" అని చెప్పి బండిలో గూరుచుండెను.

ఆమాటకు బండివాడులికి "సువర్ణోద్యానమునకా!" అని విద్యుత్తు మొగముపై జూడ్కినిగిడ్చెను.

"ఏమట్లు చూచుచున్నావు?" అన్నది విద్యుత్తు.

బండివాడు మారాడకయే బండిని సువర్ణోద్యానము దెసకు దోలుకొని పోవుచుండెను.

"సువర్ణోద్యానము వేశ్యాంగనా నివాసస్థాన"మను ప్రతీతి నిదివరకే వినియున్న విద్యుత్తు, నేడు తనతల్లి యచ్చటకేగినదని విని, సంశయాకులహృదయ యగుచుండెను. ఆమె హృదయసాగరమును బహువిధ భావనాతరంగములు ప్రచలిత మొనరించుచుండెను. "శనివారమునాడు నేను రాకపూర్వ మిచ్చటికివచ్చి, సోమవారమునాడు నేనేగిన పిదప మరల బోవుచుండునా! అదియును సువర్ణోద్యానమునకా! అచ్చటనుండు అంగడియాట వెలదులతో నీమెకేమి యవసరమున్నది? ఉన్నను దినములకొలది నచ్చటనుండనేల? నేను వచ్చుచున్నపుడు మాత్రమే యీభవనమునకు వచ్చుచున్నదనికదా ద్వారపాలకుడు చెప్పియున్నాడు? ఉన్నది. ఇందేదో దారుణ గాంభీరరహస్యమున్నది. లేకున్న నీవ్యాపారమేమి? దినముకొలది సువర్ణోద్యానమున నివాసమేమి?

ఈమెయు నచ్చటతెగలోన జేరి తైతక్కలాడుచున్నదా! నీచాతి నీచమగు—సకలజన గర్హితమగు-హేయవృత్తి నాచరించుచున్నదా!" అని యోచింపదొడగెను. "కాదు కాదు! నాతల్లి సంగీత విద్యాప్రవీణ 'జంత్రగాత్రముల రాల్గరగించు విమలగాంధర్వ' విద్యావిభూషిత కావున, నచ్చటి గాంధర్వాంగనలతో గాక కేళీవినోదముల గాలము గడపుటకేగియుండును. అయిన, భోజనభాజనములు, వేషభూష ణములు గూడ నచ్చటనే గడుపుచున్నదా! అచ్చటగూడ నీమెకు ప్రత్యేక భవనమున్నదా!" అను నూహాలచే నామె హృదయము లజ్జా ఖేదముల నొందుచుండెను.

బండి సువర్ణోద్యానమును జేరెను. ప్రధానద్వారమును దాటి లోనికేగుచుండెను. మృదంగధ్వానముల నడుమ—జంత్రవాద్యముల మధ్యమున—శ్రావ్యమై—సుపరిచితమైన తనమాతృదేవతా మధుర కంఠ నినాదము విద్యుత్తు చెవుల బడుచుండెను. విద్యుత్తు హృదయ మొక్కమారు వికసితమయ్యెను. 'గానప్రియయగు తనతల్లి, గానకళా కాలక్షేపమునకే యిచ్చటికి వచ్చియున్న'దని విశ్వయించుకొన్నది. ఎంతటి మూఢహృదయను! ఎంతటి మాతృద్రోహినిని! యుక్తాయుక్త ములను బరిశీలింపక మాతృదేవతాపాద సాన్నిధ్యమున నెంతటి మహాప రాధ మొనరించితిని! ఆమె ప్రవర్తనమున కెంతటికళంకము నూహిం చితిని! ఎంతటి నికృష్టతనాపాదించితిని! ఛీ! నాయొనరించిన యకార్య మునకు ప్రాయశ్చిత్త ముండునా!" అని పెక్కుగతుల ఖేదించు చుండెను.

బండి సువర్ణోద్యానస్థిత భవనద్వారమునొద్ద నాగెను. విద్యుత్తు ఆవేగతాపూరిత హృదయమున బండినుండి దిగెను. మాతృదేవతా ముఖమునుండి వెలువడుచున్న మధుర గీతాని నాదము విస్పష్టముగ

విద్యుత్తునకు వినవచ్చుచుండెను. విద్యుత్తు మాతృదేవతా సందర్శనమునకై వడివడిగ లోనికేగుచుండెను.

ద్వారికు డేమియు నాటంకపరుపలేదు. విద్యుత్తు లోనికేగెను. అందొక పెద్దగదిలో జడలు సవరించుకొనువారును—చీరలు సింగారించుకొనువారును—అద్దములయెదుట సౌందర్యమును దిద్దుకొనువారు నగు కొందరు విలాసవతులు గాన్పించిరి. విద్యుత్తు లజ్జాభరమున మోము వాల్చికొనియెను. వారీమెను జూచి నివ్వెరపడిరి.

విద్యుత్తు మెట్లపైనుండి మేడమీదికేగెను. ప్రక్కనున్న గవాక్షమునుండి యావలగూరుచున్న యువకబృందము విద్యుత్తుకంటబడెను. విద్యుత్తు చకితయై, భయభ్రాంతియయ్యెను. "ఏమిది! ఈయువకబృందమేమి!" అనుకొని తటాలున గవాక్షమునుండి జూడ్కిబరపెను.

ఆ విశాలస్థలమున—ఆ యువకబృందమధ్యమున— మనోజ్ఞముగ నలంకరింపబడిన వేదికపై—వస్త్రాలంకారభూషితయై—విలాసవతియై— గజ్జెకట్టి తాండవించుచు—బాడుచున్న లవణకల్లి గానిపించెను.

విద్యుత్తు స్తంభితయై — యోచనాశూన్యయై సభనంతయు నాగవాక్షమునుండియే కలయజూచెను. వేదిక కెదురుగ బడకకుర్చీలపై నొయ్యారముగ గూరుచుండి "మేలు! బళీ! హాయ్ హాయ్!" అని కొనియాడుచు దలలూపుచున్న రజతుడు, ఖగేనుడు, వనమాలి మొదలగు నాతని యనుచరులును గనబడిరి. వారియొద్ద దములపాకులు వక్కలు, ఏలకులు కట్టిన కిల్లీలు, గ్రుచ్చిన తమలపాకు జిలుకల దొంతరలు, మంచిరకపు సిగరెట్ డబ్బాలు, రకరకముల మద్యపు సీసాలును గానిపించుచుండెను. వారి తాంబూలము వేయుటకు, సిగరెట్లు కాల్చుటకు మద్యము ద్రాగుటకు విధిలేదు. విరామము లేదు.

ఆ భయానకదృశ్యము విద్యున్మస్తిష్క యంత్రమును జిందరవందర సేయదొడగెను. ఆమెహృదయము వ్యాకులమై వేదనాపూర్ణమగుచుండెను. ఆ బాధయెదుట మరణబాధయొక మాత్రాప్రమాణమునకును జాలదు.

రజతుడు తటాలునలేచి, యొక్క కాచపాత్రమున మద్యమును బోసి చేతిలో బట్టుకొని క్షణప్రభయొద్దకు వచ్చి, యామె మెడపై జేయివైచి "మోహనాంగీ! నీ యధరసుధారసధారకు రుచి నొసంగదగు ఈమధుర మధ్వాసవమును గ్రోలు"మని యామెనోటియొద్ద నుంచెను.

ఇంతవరకు దనయెడ సోదరీభావమున మెలంగుచున్న రజతుడు తనతల్లియెడ నిట్టి దురాచారా మొనరించుట గనులార విద్యుత్తు జూచినది. ఈభయంకర—హేయకర—పాపకర దృశ్యమునుగాంచి విద్యుత్తు భరింపలేకపోయెను. లజ్జారోషభావపటల మామె యంతరంగమును బూర్తిగా వివశ మొనర్చి, ప్రాణకోశమును జెకలింపనొడగెను. హృదయమొక్కపెట్టున ప్రేలినట్లయ్యెను. హృదయకుహరమునుండి యుల్కాముఖీజ్వాల లుబుకదొడగినవి. భావిసుఖోద్యానబీజములను భ్రష్టమొనర్చినవి. ఆమెకు చైతన్యముండియు లేనియట్లయ్యెను. పిలువగోరియే పిలచెనో — స్వభావశక్తిప్రేరణచేతనే పిలచెనో—కాని విద్యుత్తు "అమ్మా!" యని బిగ్గరగ నొక్కయరు పరచెను. ఆధ్వని సరిగా క్షణప్రభాకర్ణపుటముల బ్రవేశించి శ్రవణేంద్రియతంతుల గంపింపజేసినది ఆకంపనశక్తి యెంతటివేగవంతనమైనదో కాని, ఆమెసర్వాంగములు నొక్కపెట్టున గంపించినవి. మర్మభేద మొనరించినది.

క్షణప్రభ తటాలున రజతు నావలకుద్రోసి ఆధ్వని వినవచ్చిన దెస జూడ్కినిగిడ్చి "విద్యుత్తూ!" అని యొక్కకేక నిడెను.

# అధ్యాయము—27

ఆ నింపు సభలో దనతల్లినోటనుండివచ్చిన పిలుపు విద్యుత్తు విని నంతనే ఆమెనేత్రములనుండి అశ్రుపూరముతోబాటు దారుణ నిస్ఫులింగచ్ఛటలు బహిర్గతములగుచుండెను. ఆమె సర్వాంగములను సత్వసార శూన్యములై గడగడ వడకిపోవుచుండెను. ప్రతిరక్తాణువును లజ్జాభర సంకుచితమై పోవుచుండెను. కన్నుల నంధకారము గ్రమ్ముచుండెను. అప్పుడామె భావనాజగత్తున దటాలున నొక్క మెరుపు మెరసినట్లయ్యెను. ఆదీప్తిలో శిశిర దివ్యమూర్తి గానిపించి చప్పున మాయమై పోయి నట్లయ్యెను. పిదప నించుక చైతన్యములవడెను. విలాసమయ విశ్వప్రకృతి వేదనాపూర్ణముగ గోచరించుచుండెను. ఇంకను గన్నుల నంధకారము పూర్ణముగ విడువలేదు. ఎటులనో మహావేగమున మెట్లనుండి దిగి క్రిందకు వచ్చెను.

"ఏమమ్మా ఇట్లు—" అని బండివాడడుగుచుండగనె, విద్యుత్తు చైతన్యమొంది, అంతరంగిక ప్రవృత్తిలోన నిముడ్చుకొని, గంభీరత నొంది, బండిలో గూరుచుండి "బండిని మిక్కిలి వేగముగ దోలుకొని పొమ్ము!" అని చెప్పెను.

"ఎచ్చటికి ?" అని బండివాడడిగెను.

ఆమాటలే విద్యుత్తుహృదయమున నిమిడియున్న దుఃఖ మొక్కమారు పెల్లగిలినది. మాట జెప్పజాలక చేసన్న చేతనే "ఇటనుండి వడిగ దీసికొనిపొమ్ము!" అని తెలిపినది. బండి మిక్కిలి వేగముగ బోవుచున్నది.

విద్యుత్తు హృదయమున అసంఖ్యాకములగు ఊహాలత తల్లిబిల్లిగ నల్లుకొని యామె నవశురాలుగ జేయుచుండెను, ఆమెశరీరము నిలువున లజ్జామయమై పోవుచుండెను "నాతల్లి యంగడివీధిలోని యాటవెలది—నేనామె పుత్రికను" అను భావమామె హృదయసీమ నతిదృఢముగ

నాటుకొనెను. "ఇంతకాలమునుండి నాకంట బడకుండ నాతల్లి వేశ్యావృత్తి నొనరించుచున్నదా! దీనికా నన్ను జిన్ననాటనుండియు దూరముజేసి వేరొకచోట నుంచినది! సెలవుదినములలో నేనింటికి వచ్చినపుడు తన పాపమయవ్యాపారము నాటంకబడకుండునట్లు తాను శ్యామబజారునన్నదున్న ప్రత్యేకభవనమునకు నాకంటె ముందుగవచ్చి నాతో మెలగుచు, నేను గళాశాల కేగినవెంటనే యీ నరలోకమున ప్రవేశించుచున్నదా!" అను పలువిధములగు భావతరంగము లామె మానససరోవరమున లేచి యామె నూపివేయదొడగెను. తనజీవితము లోకనింద్యమైనదనియు, తాను కులటాపుత్రికయనియు దలంచుకొనెను. దుఃఖ మధికమాయెను. తనజీవితముపై రోతజెందెను. "తల్లీ! తల్లీ! నీవీ హేయమగు వేశ్యావృత్తి నేలచేకొంటివి! ఏల యీ పాపకర్మమున కొడిగట్టి పతితురాలవైతివి! తిరిపెమెత్తికొని జీవింపలేకుంటివా! ఏభద్రజనుని యింటనో దాసివై పొట్టపోషించుకొన జాలకుంటివా!

ఇట్టి నీచవ్యాపారమున విద్యురాలవైన నీవా నాతల్లివి! ఛీ ఛీ! నీవిట్టి సకల జనగర్హిత నీచాతి నీచవృత్తి నవలంబింపక పూర్వమె నన్ను విషప్రయోగముననో—ఉరిబోసియో—పాడునూత బడద్రోసియో అంతమొందింపలేక పోయితివా! ఒక్కవ్రేటున గత్తితో నాకుత్తుక దెగవేయక పోయితివా! అట్టులొనరించినచో నీస్వైర విహారమున కెట్టి యాటంకమును లేకయుండునే! నీవు స్వేచ్ఛగా నీవు సుఖోపభోగముల ననుభవించియుండువే! నీవు సుఖించి నన్ను సుఖపెట్టి యుందువే! ఎంతపొరపాటొనరించియుంటివి! ఎంత తెలివిమాలినపని జేసితివి! ఎంత సుఖభంగవ్యాపార మొనరించితివి! తల్లివైన నీవు, పుత్రికనైన నాకీమాత్రపుటుపకార మొనరింపజాలక పోయితివికదా!"

## అధ్యాయము—27

అని దుఃఖించి దనయెడ నామె జూపిన యనురాగమును దలంచు కొని "తల్లీ! తల్లీ! క్షమింపుము! క్షమింపుము! నీకు నాపైగల వాత్సల్య మనంతమైనదని. తెలిసికొంటిని. అగాధమైనదని యెరింగితిని. అమూల్యమైనదని యూహించితిని. హేయాతిహేయము—నీచాతి నీచమునగు వ్యాపారమున నీవుండియు నాజీవనస్రవంతి నా కలుష మార్గమునకు బోవనీయకుండ గాపాడదగిన కట్టడల నేర్పరచినావు. చాలు! చాలు! ఈమాత్రముచాలు! తల్లీ! నీయనురాగము నెరుంగు టకు! పుత్రికనగు నాయెడల నీవు జూపదగినంతప్రేమను జూపినావు! నీవు దోషగంధబంధురవిషయ విలాసకుపథసంచారిణివయ్యు నన్ను సుగుణగంధబంధుర పుష్పోద్యానముల విహరింపజేయుచు నాజీవన స్రవంతిని పవిత్రపథగామినిగా నొనరింప నీజీవితమంతయు ధారవోయు చున్నావుకదా! తల్లీ! చాలు! చాలు! ఈమాత్రము చాలు!" అని పెక్కుగతుల దలపోయుచుండెను. ఆ ప్రచండభావప్రవాహ వేగమున నూగిపోవుచుండెను. భావిజీవిత మంధకారమయముగ నామెకు దోచు చుండెను. సర్వవిధములగు జీవితదీపికావళులును నిస్నేహభావమున నిస్తేజములగుచుండెను. నిరాశావేగమున నిహతములగు చుండెను. ఆమె యాశాలతలెల్ల సాంద్రనీహార సంసిక్తములగుచుండెను. "ఇతరుల దోషములకు నేను దలవంచుకొనవలసి వచ్చెగదా?" అని దుఃఖింప దొడగెను. పొంగి పొరలివచ్చు అశ్రుధారాప్రవాహము నాపుకొనలేక పోయెను. ఆ యనంతదుఃఖవేగమున సకలవిధజీవిత విశ్వాసములును బూర్తిగ గొట్టుకొనిపోయినవి. "శిశిరునకు సహధర్మిణినగు సౌభాగ్యము సంప్రాప్తించునని యుంటినేకాని, నేడా సౌభాగ్యచంద్రుని గారుమబ్బులు గప్పినవి. ఇంక నాజీవితమునకు సౌఖ్యమేమున్నది? సార్థకతయేమున్నది? ఈకళంకితజీవన మేవిధమున గడుపనగును? ఇపుడు నేనేమొగముతో

సమాజము నెదుట నిలువగలను?" అని పెక్కుగతుల దలపోయుచు, జెప్పరాని వేదన నందుచుండెను.

విద్యుత్తు మరలి మహావేగముగ బోవుచుండుట క్షణప్రభ చూచి "విద్యుత్తూ! విద్యుత్తూ! నిలువుము! నిలువుము! నన్నును నీతో దీసికొని పొమ్ము! రమ్ము! రమ్ము!" అని కేకలిడుచు, ఎదుటనున్న వారిని ద్రోసివేయుచు ఉన్మత్తురాలువలె గ్రిందకు దిగనారంభించెను.

క్షణప్రభ క్రిందకు వచ్చునప్పటికి విద్యుత్తు గూరుచున్న బండి విద్యుద్వేగమున నొక సందునుండి వేరొకసందులోని కేగెను. క్షణప్రభ యోచనాశూన్యయై—అలక్ష్యవీక్షణములతో—ఆవేగ హృదయముతో అవిరళనిశ్వాసములతో—అట్లె నిలిచిపోయెను.

ఆ దగ్గర నేయున్న గదిలోనుండి యొక వారాంగన వడివడిగవచ్చి "క్షణప్రభా! ఆమె నీ పుత్రికయా! యోధనాథ్యుని జేపట్టినది? ఏ భవనమున నున్నది? ఆమె నేల నీవెన్నడు నిచ్చటికి దీసుకొనిరావైతివి?" అని యడుగుచుండగనే క్షణప్రభ కనులు చిట్లించుచు, బొమలు ముడివడ జేయుచు. గద్దించి "పొమ్మావలకు—పో—పో—నాయెదుట నిలువకుము—నీజుట్టు పట్టుకొని గిరగిరద్రిప్పి పండ్లూడదన్నెదను" అనుచు జేతులజాచుచు నామె నాకర్షింపజూచుచుండెను.

ఈవికారచేష్టల కాయువిదభయపడి కేకలిడుచు గదిలోనికేగి దటాలున దలుపుమూసివేసెను.

క్షణప్రభయు మేడమీదనున్న తనగదిలోనికేగి యస్థిరచిత్తయై యిటునటు దిరుగుచుండెను.

ఇది యంతయు జూచుచున్న రజతుడు వడివడిగ క్షణప్రభ యొద్దకువచ్చి "క్షణప్రభా! విద్యుత్తు నీపుత్రికయేనా? ఆమెను బట్టుకొనజాలకపోయితివా?" అని యడిగెను.

క్షణప్రభ క్రోధదృష్టులు రజతునిపై బరపి అచటనున్న యొక మద్యపుసీసా నందుకొని గిరగిర ద్రిప్పి రజతునిపై విసరెను.

రజతుడు చప్పున ప్రక్కకుదిరిగి యాదెబ్బ తప్పించుకొనెను.

ప్రక్కగోడకు దగిలి ముక్కముక్కలై నలుగడల జెదరి యా చెంతనేయున్న ఖగేనుడు వనమాలి మొదలగు రజతానుచరులకు దగిలినవి. తీవ్రమగు గాయములు తాకపోయినను చిన్న చిన్న సరకులు వారిమేన బడకపోలేదు.

అంతటితో నాగక క్షణప్రభ మద్యపూరితములగు మరిరెండు సీసాలను బట్టుకొని రాగము నాలపించి, "బాగు! బాగు! బాగుగా నయినది. ఇటనుండి యిప్పుడే తొలగిపొండు! లేనిచో ఈదశయే మీకందరకును గలుగజేయుదును శ్యామలకుడా! గదిలోనుండి అందరను దరిమివేయుము! వెడలగొట్టుము!" అని వెఱ్ఱివెఱ్ఱిచూపుల జూచుచుండెను.

భయంకరమూర్తియగు క్షణప్రభను గాంచి రజతుడు మున్నగు వారు గుండెలు దడదడలాడ నటనుండి వడివడిగా బరుగెత్తుచుబోయిరి. తొందరపాటున ఉత్తరీయమును, కాలిజోడును మరిచి పోయినాడు. రజతుడు.

అందరును బోయిన పిమ్మట క్షణప్రభ మద్యపుసీసాలను విసరివైచి నేలబడిపోయెను.

అదిచూచి వెంటనే దాసివచ్చి "ఏమైనది? మీకుగలిగిన బాధ యేమి? ముసలితనమున సేనానాయికత్వము గోరెదరే?" అని యనెను.

కాని ఆమెవలన నేమియు ప్రత్యుత్తరమును బడయనందున నామెశరీరమును జేతితో దాకి చూచి, "పరుగెత్తుడు! పరుగెత్తుడు! ఇంకేమున్నది! ఈమెకు స్మృతితప్పిపోయినది" అని తత్తరపాటున బిగ్గరగా కేకలు వేసినది.

# అ ధ్యా య ము—27

అచ్చటివారందరును క్షణప్రభకు మూర్ఛారోగమున్నది" అని గుర్తించిరి. తక్షణమే దాసి వైద్యుని బిలుచుటకు బరుగెత్తిపోయినది.

కఠినోపచారములు జరిపినపిమ్మట తెల్లవారుజామున నాలుగు గంటలవేళకు ఆమె తెప్పిరిలినది. వెంటనే పల్లకీదెప్పించి క్షణప్రభ శ్యామబజారునందున్న తన యింటికిపోయినది. కాని విద్యుత్తుమాత్రము ఇంటికి మరలిరాలేదు. క్షణప్రభ శ్యామలకుని గళాశాలాసంబంధమగు విద్యార్థిని మందిరమునకు పంపినది. వాడు తిరిగివచ్చి "విద్యుత్తు అచ్చటను లేదు. కళాశాలకు సెలవిచ్చుటచే నామెయింటికే వచ్చినదనియు, ఇంకను దగిగి రాలేదనియు నచ్చటివారు చెప్పినా"రనెను.

విద్యుత్తు రజతునింటికిని బోజాలదని క్షణప్రభకు దెలియును కాని యనుమానము దీరుటకు నచ్చటికిగూడ వార్తనంపెను. అచ్చటగూడ విద్యుత్తులేదని తెలిసికొనినపిమ్మట క్షణప్రభకు గలిగినచింతకు మేరలేదు. ఇంతటి మహావిశాలనగరములో విద్యుత్తు ఎచ్చట దాగియున్నదో, ఆమె తెలిసికొనుటెట్లు? ఎచ్చట వెదుకుట? ఎట్లా వార్తనెరుంగుట? క్షణప్రభ కేమియు దోచుటలేదు. అంతలో శిశిరునిమాట జ్ఞాపకము వచ్చినది. అట్టిస్థితిలో క్షణప్రభ శిశిరునకీక్రింది విధముగా నొకజాబు వ్రాసినది.

"కల్యాణ నిలయా!

ఈజాబు చూచిన తోడనే బయలుదేరి రమ్ము!

నేను భయంకర సంకటదశలో బడియున్నాను.

శుభాకాంక్షిణి.

క్షణప్రభ"

# అధ్యాయం—28

రాత్రి పదిగంటల సమయమున విద్యుత్తుగూరుచున్న బండి శిశిరుని నివాసభవనద్వారము నొద్దకువచ్చి యాగెను. బండివాడు ద్వారమునొద్దకువచ్చి "శిశిర బాబుగారూ !" అని పిలిచెను.

అంతవరకు నేదియో చదువుకొనుచున్న శిశిరుడాపిలుపువిని ద్వారమునొద్దకువచ్చి "ఎందులకు బిలుచుచున్నావు ?" అని బండివాని నడిగెను.

"మీదర్శనమునకై యొకతరుణి వచ్చెను. ఆమె యీబండిలో గూరుచుండెను" అని బండివాడనెను.

ఆమాటకు శిశిరుడు చకితుడై బండియొద్దకేగెను బండిలో గూరుచున్న విద్యుత్తును జూచెను. బండికిగట్టియున్న యాచిన్నదీపపు వెలుగునందు నామెమోమున నిండియున్న దుఃఖరేఖ విస్పష్టముగ శిశిరునకు గానిపించెను. శిశిరు డాశ్చర్యమును—ఆతురతయు నొందెను. "ఏమిజరిగినది ? మీ ముఖమేల విషాదరేఖా కళంకితమైనది ?" అని యామె నడిగెను.

విద్యుత్తు శిశిరుని ప్రశ్నలకేమియు ప్రత్యుత్తరమీయజాలక గద్గదకంఠియై "మహాశయా ! మీరిపుడొక యుపకారమును జేయవలసియున్నది. 'ఇంతలోకమునందును మీరుగాక నాకెవ్వరును 'నా' యనువారులేరు. మీవలననే నేనీయుపకారమును బడయగలనను ఆశ పెంపున నిచ్చటికివచ్చినాను" అని చెప్పుచుండగనే యామె కంఠము రుద్ధమయ్యెను. నోట మాట వెలువడజాలకుండెను. కన్నీటి కాల్వలు చెక్కులపై ప్రవహింప దొడగెను.

## అధ్యాయము—28

శిశిరు డదిచూచి దుఃఖితుడై "ఏడ్చుచున్నారా? ఏల?" అని గద్గదకంఠమున నడిగెను.

తనకన్నీటి నాతనికి గానుపింపకుండ జేయుటకై విద్యుత్తు దీపమువైపునకు మోమును ద్రిప్పివేసెను.

"వలదు! వలదు! ఏడువవలదు! నేనేమి చేయవలసియున్నదో సందియమును మాని చెప్పుడు! నాయెడ మీరు సంశయముంచదగదే!" అని శిశిరు డాతురతతో ననెను.

ఆమాట లాలించినంతనే విద్యుత్తునకు బోయిన ప్రాణము మరల వచ్చినట్లయ్యెను. తనశరీరముపై నున్న నగలదీయుచు "మహాశయా! వీనిని విక్రయించియేని, కుదువబెట్టియేని కొంతధనమును దెచ్చి మీరీ రాత్రియే నాకీయవలసియున్నది. మీకిది యెంతటి కష్టదాయకమైనను జేయకతప్పదు" అని మిక్కిలి ప్రయత్నమున జెప్పెను.

"మీరు నగలను దీయవలదు. వానినట్లే మీశరీరమున నుండ నిండు! నేను మీకు వలసినధనమును దెచ్చియిచ్చెదను. మీకెంతధన మవసరమో చెప్పుడు! మీరిచట నాలసింపక యింటికేగుడు!" అనెను శిశిరుడు.

"ఇంటికా! ఇంటికా! నాకిల్లెక్కడనున్నది మహాశయా!" అని వెక్కి వెక్కి విద్యుత్తు ఏడ్చుచుండెను.

శిశిరు డాందోళితహృదయుడై "ఏమివిపత్తు వచ్చెనో నాకెఱిగింప సంశయించుచున్నారా?" అని యడిగెను.

విద్యుత్తు ప్రత్యుత్తర మీయజాలకుండుటచే శిశిరుడు మరింత వ్యాకులుడై తానుగూడ బండిలో గూరుచుండి "బండివానికి బోవవలసిన చోటు నెరింగించెను.

బండి నడువఁబొడఁగెను. శిశిరుడు ప్రేమపూర్వకముగ "ఏమి జరిగినది? మీరింతటి వ్యధనొందుట కేమికారణము? చెప్పుడు! నాహృదయ మారాటము నొందుచున్నది!" అని యడిగెను.

విద్యుత్తు చేతులతో ముఖమును గప్పికొని "మహాశయా! ఏమియులేదు. నేనా యుదంతము నిపు డెఱింగింపజాలను. నేనభాగ్యురాలను. ఆసంగతి నాలించినచో మీకును నాపై హేయతకలుగును" అని డగ్గుత్తికతో చెప్పలేక జెప్పలేక చెప్పినది.

శిశిరుడు చిక్కువిడదీయ ప్రయత్నించుచున్న కొలదియు నది మరింత చిక్కుపడిపోవుచున్నది. ఏమియు నూహింపనలవు లేకున్నది. రెండుమూడు నిముసము లూరకుండి పిదప విద్యుత్తు మోమునుజూచి "ఇల్లులేనిచో సంధ్యయొద్ద కేగరాదా?" అనెను.

సంధ్యపేరు వినినంతనే విద్యుత్తు చకితయై నే నెవ్వరియొద్దకు నుబోవజాలను నామొగ మెవ్వరికిని జూపజాలను" అని యూరకుండెను.

"అయిన మీ రెచ్చటనుందురు? నేనుగూడ నిరాశ్రయుడనే కదా!" అని డగ్గుత్తికతో శిశిరు డనెను.

"నేను గళాశాలలో మాయుపాధ్యాయుని యొద్దనే యుందును నాకిపుడు కొంచెము ధనమున్న జాలును" అనెను విద్యుత్తు.

"సరియే! రజతునియొద్ద నాధనము కొంత నిలువయున్నది. ఇప్పుడే అతనియొద్దనుండి తీసికొని మీకిచ్చెదను" అని శిశిరుడు చెప్పెను.

రజతునిపేరు చెవినిబడినంతనే విద్యుత్తునకు భీతియు అసూయయు హేయతయు, నొక్కమారు కలిగెను. "ఇపుడు నన్నచటకే తీసుకొని పోవుచున్నారా?" అని యడిగెను.

## అధ్యాయము—28

"నీవు లోనికి రానక్కరలేదు. బండిలోనె యుండుము! నేను లోనికేగి రూపాయిలను తెచ్చెదను" అని శిశిరుడు చెప్పెను.

బండి రజతుని మందిరమునకించుకదూరమున నాగెను. శిశిరుడు బండిదిగి లోనికేగెను. విద్యుత్తు బండిలోననే కూరుచుండెను. శిశిరుడు రజతుని గదిలోని కేగెను.

ఆసమయమున రజతుడు తనయనుచరులతో నేమిదో తీవ్రముగ యోచించుచుండెను. అకస్మాత్తుగవచ్చి శిశిరునిజూచి అందరును చకితులైరి.

"రజతబాబూ! నీతో మాటడవలసిన యక్కరగలిగి వచ్చితిని. అతిరహస్యము. కావున నీవొక్కసారి యావలకు వచ్చెదవా ?" అని శిశిరు డడిగెను.

రజతు డొక్కసారి తనయనుచరులవైపు జూచి కనిగిడ్చి ఆసనము నుండి లేచి శిశిరునితో వెలుపలికివచ్చెను.

"సోదరా నాకిప్పుడైదువందల రూపాయిలు కావలసివచ్చెను" అని శిశిరుడనెను.

అభిమానధనుడగు శిశిరు డీనాడు తనయెదుట నర్థియై నిలిచి యుండుటచే రజతుడు విజయగర్వమున నుప్పొంగిపోయెను. "సరియే మేడమీదకు రమ్ము!" అని చెప్పెను.

ఇరువురును మేడమీదకేగిరి. రజతు డినుపపెట్టెను దెరచి యైదు వందలరూపాయిల నోటులనుదీసి శిశిరునిచేత నుంచెను. శిశిరుడు వానిని జూచి జేబులోనుంచుకొని "కలమును కాగితమును ఇమ్ము! జ్ఞాపక పత్రమును వ్రాసి యిచ్చెదను" అని రజతునితో ననెను.

రజతుడు మందహాస మొనరించి "జ్ఞాపకపత్రమును వ్రాసి యీయవలసిన యావశ్యకత యేమున్నది ? ఇది యింటివిషయముకదా!" అనెను.

స్నేహపూరితమగు నిట్టిమాట రజతుని నోటినుండి చాలాకాలమునకు వినగలిగిన భాగ్యము మొదవె గదాయని శిశిరు డాదుఃఖసమయమున గూడ నానంద మొందెను. "మరల నీధనము ననతికాలముననే యిచ్చివేసెదను" అని చెప్పెను.

"ఓహో! వలను చిక్కినపుడిచ్చివేయవచ్చును లెమ్ము. వ్రాత యావశ్యకిత యేమియును లేదు" అనెను రజతుడు.

"ఆమాట నిజమే! కాని, జ్ఞాపకమునకు మాత్రము గుర్తించుట మంచిది" అనెను శిశిరుడు.

"బాగు, బాగు! నీవుగూడ నిపు డద్భుతవర్తనుడ వైతివే!" అనుచు కాగితమును కలమును శిశిరునకిచ్చెను.

శిశిరుడు పత్రమువ్రాసి రజతునకిచ్చి వడివడిగ వెడలిపోయెను.

శిశిరుని కంఠధ్వని నాలించి, సునయనీదేవి వడివడిగ సమావేశ స్థలమునకు వచ్చెను. కాని శిశిరు డప్పుడే వెడలిపోవుటచే వ్యాకుల చిత్తయై రజతునిగదిలోనికి వచ్చి "శిశిరు డిచటికి వచ్చెనా?" అని రజతు నడిగెను.

"ఔను. వచ్చి యైదువందల రూపాయిలను బుచ్చుకొని వెడలి పోయెను" అని రజతుడు చెప్పెను.

"ఎందులకు?" అని యడిగినది సునయని.

"నాతో నేమియు జెప్పుటలేదు" అనెను రజతుడు.

రజతునిమాట లాలించినంతనే సునయనీదేవి హృదయము మరింత వ్యాకులమందెను.

"ఇంతరాత్రివేళ శిశిరున కైదువందలరూపాయిల యవసరమేమి కలిగినది? ఇచ్చుటకువచ్చియు నన్నుజూడకయే వెడలిపోయెనేల!

ఇంతటితొందరపాటతని కేమిగలిగినది ?" అని పెక్కుగతుల యోచించు కొనుచు అటనుండి లోనికి వెడలిపోయెను.

బండియొద్దవకుచ్చి శిశిరు డైదువందల రూపాయిల నోటులను విద్యుత్తుచేతనుంచి "ఇవి చాలునా ? ఇంకేమేని గావలసినచో నాజ్ఞాపింపుము !" అని యనెను.

విద్యుద్వీక్షణము లపుడు కృతజ్ఞతాపూర్ణములో ప్రేమావిలములో కృతజ్ఞతా ప్రేమమయములో చెప్పజాలము. కాని, రెప్పవేయక అట్లె యామె శిశిరుని మోముజూచుచు "ఇవి చాలును" అని గద్గద స్వరమున ననెను.

విద్యుద్వీక్షణ తేజమున శిశిరనేత్రదీప్తి విలీనమైనది కాబోలును శిశిరుని ప్రయత్నము లేకయే వాని చేతులు విద్యుత్తుచేతులయొద్ద కేగినవి. విద్యుత్తు శిశిరుని చేతులను గట్టిగ దనచేతులతో బట్టుకొనెను. ఆపజాలని తన యాంతరంగికభావముల నాతని కీవ్యాజమున బ్రకటించుచున్నదో ! తనహృదయగత వేదనామయప్రేమా ప్రవాహమును దీవ్రస్పర్శశక్తిచే శిశిరహృదయసీమ బ్రవహింపజేయుచున్నదో ! కాని, యిరువురును స్తంభీభూతులై యున్నారు.

"అమ్మా ! బండియెచ్చటికి దీసికొని పోవలెను ?" అని యాసమయముననే బండివా డడిగినాడు.

ఆమాట చెవినిబడినంతనే ఇరువురును జకితులైనారు. వారి చేతులపట్టు సడలిపోయినది. కాని విద్యుత్తునోట మాట వెలువడుట లేదు. శిశిరుడు మెల్లమెల్లగా "క్రైస్తవ మహిళాకళాశాలకు దీసికొని పొమ్ము !" అని చెప్పెను.

బండి కదలెను. "వెడలెదను !" అని యొనఒకరితో నొకరు చెప్పకొనజాలకుండిరి. అప్పటి విద్యుచ్ఛిశిరుల హృదయసంక్షోభము

అనుభవనీయులగు కోమల హృదయులకేకాని, అందరకు దెలియబడదు కదా !

బండి చూపుమేర దాటెను. శిశిరుడు హృదయభారముతో నివాసమునకు వచ్చెను. ఆరాత్రి యాతనికి నిదురపట్టునా ? వ్యథాపూర్ణములును—చింతాసమంచితములును—ఆనందమయములునగు బహువిధ భావనాతరంగ మాలికలచే [illegible] మనస్సరోవరము అల్లకల్లోలము కాకుండునా ? తొల్లింటిరీతి ప్రశాంతముగ నుండగలదా !

# అధ్యాయం—29

శిశిరు డెట్లో యారాత్రిని గడిపెను. మరునాటి ప్రాతఃకాలమునసే యొకపరిచారకుడు విద్యుత్తువ్రాసిన జాబును దెచ్చి శిశిరుని చేతి కిచ్చెను. శిశిరుడా జాబునుజూచి సంచలితహృదయు డయ్యెను . ఇంచుక యోచించి "అచటకేగినచో నిన్నటి విద్యుద్విపరీతఘటనా మూల కారణము దెలియనగును" అని నిశ్చయించుకొనెను. వడివడిగ స్నానాదులను నిర్వర్తించి క్షణప్రభామందిరమున కేగెను.

క్షణప్రభ శోచనీయావస్థలో నున్నది. ఆమెమోము రక్తహీనమై వివర్ణమై—విపరీతముగ నున్నది.

శిశిరు డామెనుజూచి "మీస్థితి యెట్లున్నది ?" అని ప్రశ్నించెను.

"మహాశయా ! నీరాకకెదురు చూచుచున్నాను. విద్యుత్తు నన్నువిడనాడి యెచటికి బోయినదో తెలియదు. ఇపుడు నేనీలోకమును వీడుటకు సంసిద్ధురాలనై యున్నాను. ఆ శుభసమయమునకే యెదురు చూచుచున్నాను. ఇంక విలంబము గూడలేదు. ఈసంచిలో గొన్ని

కాగితములున్నవి. దీనిని నీయొద్దనుంచుము! రేపు దీనిని విద్యుత్తునకిమ్ము" అని తనతలగడక్రిందనున్న యొక కాగితపు సంచిని క్షణప్రభ శిశిరునకు జూపెను.

శిశిరు డాసంచినిదీసెను. ఆసంచికి నాలుగుమూలలలును, అమె యంగుళీయ ముద్రాచిహ్నములయి యుండెను. పైభాగమున బెద్దయక్షరములతో శిశిరుని పేరును, విద్యున్నామమును వ్రాయబడి యున్నవి. "శనివారమువరకు దీనిని దెరువవలదు" అనికూడ వ్రాయబడి యుండెను.

శిశిరుడు క్షణప్రభ నుచితరీతి నోదార్చుచు "ఇది మాతాపుత్రికల జగడపువిషయము. ఈస్వల్పవిషయమునకై మీరిట్లధైర్యమొందరాదు. నిన్నటిరాత్రి విద్యుత్తు నాయొద్దకువచ్చెను. ఇప్పుడామె కళాశాలాప్రధానోపాధ్యాయిని యింటనున్నది. మీయాజ్ఞయైనచో నేనామెను వెంటనిడికొని వచ్చెదను" అని చెప్పెను.

"వలదు! వలదు! ఆమెను బిలువవలదు! పిలిచినను ఆమెరాదు. ఆమెను బిలువవలసిన యావశ్యకతయు లేదు. ఆమెకు మోముజూపు యోగ్యతయును నాయందులేదు. నేనామెను నీచేతులలో నుంచుచున్నాను. ఆమెబాధ్యతయు—సర్వరక్షణభారమును—నీయధీన మొనరించుచున్నాను, ఆమె చాలా సరళహృదయ—సాంసారిక కుటిల నటల నించుకయు నెరుంగనిది—ఇంక ఆమె నీయది" అని క్షణప్రభ క్షీణస్వరమున నుడివి యూరకుండెను.

"రోగతీవ్రతవలన మనోవేదనాకారణమున క్షణప్రభ యిట్లను చున్నది కాబోలును" అని శిశిరుడు తలంచి "మీరామెకై యిసుమంతయు వ్యథనొందవలదు. ఎట్టివిచారమును మనస్సున నుంచుకొన వలదు" అని చెప్పెను.

క్షణప్రభ మాటాడలేదు. కన్నులరమూసి శిశిరుని మోమును జూచుచుండెను. కొంతవడి కొక నిట్టూర్పువిడిచెను.

శిశిరుడు లేచి నిలిచి "నేబోవుట కాజ్ఞ నొసంగుడు !" అనెను.

క్షణప్రభ మారుపలుకలేదు.

# అధ్యాయం—30

నేడు శనివారము క్షణప్రభ తనచేతికిచ్చిన కాగితములను బట్టుకొని విద్యుత్తు నివసించుచున్న యుపాధ్యాయుని యింటికి శిశిరుడు వచ్చెను. అచటి పరిచారకునిచే దన యాగమనమును విద్యుత్తున కెరిం గించెను. విద్యుత్తు ఉపాధ్యాయుని యనుమతిగొని శిశిరుని లోపలికి రావించెను.

ఇరువురు నొకగదిలో గూరుచున్నారు. శిశిరుడు జరిగిన యుదంతమునంతయు విద్యుత్తున కెరిగించి కాగితపుసంచి నామె కందించుచు "దీనిని మీరు చదువుకొనుడు" అని చెప్పెను.

విద్యుత్తు భయకంపితస్వరమున "మీరే దీనిని దెరచి చదువుడు" అనెను.

"కాదు ! కాదు. ఇందు నేదెలియదగని రహస్యములేముండునో! మీరు చూచుకొనుటయే మేలు !" అని శిశిరుడు చెప్పి యాసంచి నామె చేతికిచ్చెను.

శిశిరనిర్బంధమున విద్యుత్తు కంపితహస్తములతో నాసంచినిజించి లోనున్న కాగితముల వెలువరించెను. అందొక మరణశాసనమును—గొన్ని ఋణపత్రములును—ఒక పెద్దజాబును ఉన్నవి ఆజాబు పైభాగ మున నిట్లు వ్రాయబడియున్నది.

# అధ్యాయము—30

"నేనీ లోకమును విడిచిపోవుచున్నాను. కావున నే హేయమును—నింద్యమును అగు నాయాత్మకథ మీకు దెలియునని లజ్జింపవలసిన యావశ్యకత యిసుమంతయు నాకులేదు. ఈనాడు నాపాపమయ—రహస్యమయ—నీచజీవితకథను వివరముగ నిందు వ్రాసియున్నాను" అని

దానిని జూచినంతనే విద్యుత్తుహృదయము హఠాత్తుగా వ్రేలినట్లయ్యెను. కాగితములు చేతినుండి క్రిందపడిపోయెను. వెక్కి వెక్కి యేడ్వసాగెను.

ఎట్టి నీచవృత్తిలో నున్నదైనను క్షణప్రభ విద్యుత్తునకు తల్లియే కదా! మాతృప్రేమాప్రవాహ మఖండమైనది కదా! "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అని కదా యార్యోక్తి! ప్రేమాస్వరూపిణియగు జననివలననే కదా జన్మభూమికిగూడ నింతటి యధిక ప్రతిష్ఠకలిగినది! విద్యుత్తునకు సర్వస్వమును తల్లియే! ఇంకెవ్వరునులేరు. తండ్రిసంగతియె యామెకు దెలియదు. విద్యుత్తు తలను మీదికెత్తక వెక్కి వెక్కి యేడ్చుచుచు "దాను నిరంతరకళంకమయ నీచాతినీచవృత్తి నవలంబించియు, దన ప్రియపుత్రిక నా భయంకర దావానలమధ్యమున బడవేయనిచ్ఛగింపక, సరళి సుభగ సన్మార్గమున జరింప వీలుగల్పించి, పుత్రిక కిరువదియేండ్లు యీడువచ్చువరకు, దన నడువడిని మరుగుబరచి సంచరించినతల్లి—అనురాగశీలయగుతల్లి—లోకజ్ఞాన నిపుణురాలగు తల్లి—తనపుత్రికయొద్ద సెలవుగైకొనుటయా!" అని మరింత వెక్కి వెక్కి యేడ్చుచుండెను. మాతృదేవతయెడగల మమత్వస్రోతస్సులు ఆమెహృదయ సీమను బొంగిపొరలసాగినవి. ప్రేమాకృతజ్ఞతలామె మనస్సరోవరమున దరంగితములు కాసాగినవి.

# అధ్యాయము—30

ఇపుడామె నెట్లూరడింపవలెనో తెలియనందున దోచకపోవుటచే నాతడు మూకీభావమున నామెమోమును రెప్పవేయక చూచుచు అట్లె నిలిచి యుండెను.

అపుడా పక్కగదిలో నుపాధ్యాయుని యడుగుల చప్పుడు విననయ్యెను. విద్యుత్తు చకితయై వడివడి గన్నీళ్ళు దుడిచికొని, క్రింద బడిన కాగితములను దీసి, అందున్న జాబునువిప్పి చదువనారంభించెను. అందిట్లున్నది.

"ప్రియకుమారీ!

నేనీ లోకమును వీడిపోవువరకును నా నింద్యప్రవృత్తిని నీ కెరుక బడకుండుట కెంతయు ప్రయత్నించితిని. నిన్ను మిక్కిలి చిన్నతనముననే క్రైస్తవమహిళాశాలకొప్పగించి నాగాలియేని సోకనీయకుండ జేయుట కిదియే కారణము. నీ కిరువదివత్సరముల ప్రాయము వచ్చువరకు మిక్కిలి జాగరూకతతో మెలంగి యీరహస్యమును దాచగల్గితిని. కాని, ఒక్కనాటి యజాగ్రత్తవలన నా చిరప్రయత్నపటము తటాలున జినిగిపోయినది. నీచము—హేయము—సకలజన గర్హితము— లజ్జాస్పదము నావేషము నాజీవితరంగమున నీకంటబడినది. ఇంక నా మొగమును నీకు జూపజాలను. కావుననే విషపానమొనర్చి నేనీ లోకమును విడుచుచున్నాను.

నేను పుట్టుకతో వేశ్యనుగాను. ఒక బ్రాహ్మణబాల వితంతువును. ధనవంతుని పుత్రికను. తల్లిదండ్రులచే గారాబమున బెంపబడు చుండెడి దానను. నేను వితంతువునైనను, వేషభూషలయందెట్టిలోపమును జెందియుండలేదు. నాకు పదునారు వత్సరముల ప్రాయము వచ్చువరకు బెద్దలనిరోధమున నుండగలిగితిని. కాని ప్రకృతివశమున బొంగిపొరలి

మహోద్రేకమున వచ్చు వాంఛాతరంగముల నెదుర్కొని నిలువజాలక సంచలిత హృదయనై పోయితిని.

ఆసమయమున నాసౌందర్యప్రదీపుల నాసింపని యువకుడు లేడు—నావాగమృతము నాస్వాదింపదలంపని వృద్ధుడును లేడు—వేయేల నా కటాక్షవీక్షణభాగ్య సంప్రాప్తికై పనిలేనిపని గల్పించుకొని యైనను మాయింటికిరాని పురుషు డా యూర లేడని ధైర్యముగ జెప్పగలను. అన్యాపదేశముగ దమభావములను నాయొద్ద వెల్లడించువారు కొందరు ఇతరులతో నేవో మాటలాడి సందర్భమున నవ్వునట్లు నావైపుజూచి నవ్వువారు కొందరు—తమ ప్రణయపూర్వగాథలను నాచెవిని బడునట్లు జెప్పువారు కొందరు—నగలను నాణెములను జూపువారు కొందరు—ప్రణయలేఖలను బంపువారు కొందరు—రాయబారుల దోలువారు కొందరునై యువకులు నాకృపాప్రసాదమున కెదురు చూచుచుండిరి.

సంపన్నుడును—సౌందర్యవంతుడును చతురుడును నగు నొక్క యువకునకు వశపడి యొక్కనాటిరేయి యిల్లుదాటి వచ్చితిని. అన్యోన్యానురాగములతో—ఆనంద విహారములతో—అనంతమోహ ప్రభావశక్తిచే ఆరువత్సరము లట్టి అనుపమాన సుఖసామ్రాజ్యమున కధీశ్వరినై యుంటిని. ఆసమయమున నాయువకుడు నాయందలి మోహంపు బెంపున సమర్థులగు నుపాధ్యాయులచే నాకు సంగీతసాహిత్యముల జక్కగా జెప్పించెను. ఆసమయముననే నీవును జన్మించితివి. నీవు పుట్టిన ఆరుమాసములనాడే యాతడు నన్నొంటిగవిడిచి పారిపోయెను.

"ఓహో! ఏమి వానిమధుర ప్రేమానుగుంఫిత వాక్యజాలములు! ఏమి ప్రణయధర్మోపన్యాసములు! ఏమి సంస్కరణ దీక్షాప్రగల్భములు! ఇవియన్నియు నన్ను మోసగించుటకా? నన్ను ధర్మభ్రష్టను

గావించుటకా! నన్నధఃపతన మొందించుటకా!'' అని నాలోనేనె వానినిగూర్చి దుఃఖించుచు మున్ముందీభయంకర కపట దుష్టలోకమున జరింపవలసిన నీకై పరితపించుచు, గర్తవ్యము నెరుంగజాలక, కష్టమున జిక్కి దినముల గడుపుచుంటిని.

కొంతకాలమునకు వంగమహిళా కళాశాలావృత్తాంతము నెరింగి నిన్ను దీసికొని యచ్చటకేగితిని. నిన్నాకళాశాలలో జేర్చికొని అచ్చటనే యుంచి పరిపాలించుటకు నా సాధ్వీత్వమును దెలుపు యోగ్యతాపత్రికను ఆ కళాశాలాధికారిణి కోరెను. ఆవిషమపరీక్షకు నేనెంతయు గుందవలసివచ్చెను. నిజముగా నేను బ్రయత్నించినచో నాకది యసాధ్యకార్యముకాదు. అప్పుడీయూరనున్న భద్రజనులలో నాకృపాకటాక్షవీక్షణములకు గురికానివా రెందరోలేరు. వందలకొలదిగా యోగ్యతాపత్రములను దెచ్చి కుప్పవేయగలిగి యుండెడిదాననే! కాని, ప్రపంచము నీరీతిగా మోసపుచ్చుట యనుచితమని దలచితిని.

వెంటనే నిన్ను దీసికొని క్రైస్తవమహిళాకళాశాల కేగితిని. అచ్చట నిట్టిభేదములేదు. జాతితో—జన్మముతో—కులముతో వారికక్కరలేదు. అచ్చట నిన్నుంచి, తగిన యేర్పాటు జేసితిని. కాని నేను మాత్రము నాహేయమార్గమును విడువజాలకుంటిని. ఎందువలన నందువా? నీజీవితము నిరంతరానందమయముగా జేయుటకు దగిన ధనము గడింపవలెననియే! నీకు వెనుకముందెవ్వరునులేరు. ఏనాడు నీజన్మవృత్తాంతము లోకమునకు దెలియునో, ఆనాటినుండియే నీవు లోకమునకు మిక్కిలి జులకనయైపోవుదువను భయమున నీవు నాపుత్రికవనికూడ లోకమునకు దెలియకుండుట కెంతయు బ్రయత్నించితిని. నావర్తనము నీకును, నీయుదంతము లోకమునకును దెలియకుండుటకే నీకొరకొక ప్రత్యేకమందిరమునుగొంటిని. నీవు సెలవుదినములలో నచటికి

వచ్చుటకు ముందుగ నేను వచ్చి యుండుంకి నీకనుమానము కలుగకుండ ప్రవర్తించుచుండెడి దానను. నీవు గురువారమునాడు హఠాత్తుగా వచ్చుటచేతనే యిట్టి విపరీతము ఘటిల్లెను. ఇందులకు నేనావంతయును విచారింపను.

ఇపుడు యోగ్యాతియోగ్యుడగు శిశిరబాబు సహాయము నీకు సంప్రాప్తించుటచే నేను కృతార్థురాలనైతిని. నిన్ను నామువసార శిశిర బాబుచేతులలో నుంచి నేను నిశ్చింతగా మీ యిరువురియొద్ద ననుజ్ఞ గొని ఈనీలోకమునుండి వెడలిపోవుచున్నాను. నన్ను నీవు క్షమింప కుండ నుండజాలవనియె సంపూర్ణముగ విశ్వసించుచున్నాను. ర
బాబు విజ్ఞారధను. కావున నన్ను దప్పక క్షమించుము. ఇక కనుజ్ఞ
నింపు సమయమైనది.

ము
హా
ప్రభ"

ముపుచున్న విద్యుత్తు
ఈజాబును వెక్కి-వెక్కి యేడ్చుచున్నే నిని శిశిరునిచేతికిచ్చెను.
జాబు ముగిసినపిదప మోము వ్రాల్చుకొని ద్యుత్తు మోమును జూడజాల
శిశిరుడును దానినందుకొనెను. కొముసు వ్రాల్చుకొనియే "ఒకసారి
కుండెను. కొంచెము సేపైనపిదప్లగ విద్యుత్తుతోననెను.
అచటికి వెడలవలదా ?" అన్నది ! నిన్ననే బంధుత్వపాశమును
"ఇంక నచ్చుటకినికదా ?" అని వ్యధాపూర్ణస్వరమున
దెగదెంచుకొని వ
విద్యుత్తు చెప్పిల్లికదా !" అని చెప్పదలచెను. కాని, ఈమాటచే
"అం తీవ్రాఘాతమునకు బాల్పడునేమో యనుకొని
ఆమెహ యించుకసేపైనపిదప "చేయదగిన కార్యములను జేయక
యా

గావించుటకా! నన్నధఃపతన మొందించుటకా!" అని నాలోనేను వానినిగూర్చి దుఃఖించుచు మున్ముందీభయంకర కపట దుష్టలోకమున జరింపవలసిన నీకై పరితపించుచు, కర్తవ్యము నెఱుంగజాలక, కష్టమున జిక్కి దినముల గడుపుచుంటిని.

కొంతకాలమునకు వంగమహిళా కళాశాలావృత్తాంతము నెరింగి నిన్ను దీసికొని యచ్చటకేగితిని. నిన్నాకళాశాలలో జేర్చికొని అచ్చటనే యుంచి పరిపాలించుటకు నా సాధ్వీత్వమును దెలుపు యోగ్యతా పత్రికను ఆ కళాశాలాధికారిణి కోరెను. ఆవిషమపరీక్షకు నేనెంతయు గుందవలసివచ్చెను. నిజముగా నేను ప్రయత్నించినచో నాకది యసాధ్య కార్యముకాదు. అప్పుడీయూరనున్న భద్రజనులలో నాకృపాకటాక్ష వీక్షణములకు గురికానివా రెందరోలేరు. వందలకొలదిగా యోగ్యతా పత్రములను దెచ్చి కుప్పవేయగలిగి యుండెడిదాననే! కాని, ప్రపంచము నీరీతిగా మోసపుచ్చుట యనుచితమని దలచితిని.

వెంటనే నిన్ను దీసికొని క్రైస్తవమహిళాకళాశాల కేగితిని. అచ్చట నిట్టిభేదములేదు. జాతితో—జన్మముతో—కులముతో వారి కక్కరలేదు. అచ్చట నిన్నుంచి, తగిన యేర్పాటు జేసితిని. కాని నేను మాత్రము నాహేయమార్గమును విడువజాలకుంటిని. ఎందువలన నందువా? నీజీవితము నిరంతరానందమయముగా జేయుటకు దగిన ధనము గడింపవలెననియే! నీకు వెనుకముందెవ్వరునులేరు. ఏనాడు నీజన్మవృత్తాంతము లోకమునకు దెలియునో, ఆనాటినుండియే నీవు లోకమునకు మిక్కిలి జులకనయైపోవుదువను భయమున నీవు నాపుత్రిక వనికూడ లోకమునకు దెలియకుండుట కెంతయు ప్రయత్నించితిని. నావర్తనము నీకును, నీయుదంతము లోకమునకును దెలియకుండుటకే నీకొరకొక ప్రత్యేకమందిరమునుగొంటిని. నీవు సెలవుదినములలో నచటికి

వచ్చుటకు ముందుగ నేను వచ్చి యుండుంకి నీకనుమానము కలుగకుండ ప్రవర్తించుచుండెడి దానను. నీవు గురువారమునాడు హఠాత్తుగా వచ్చుటచేతనే యిట్టి విపరీతము ఘటిల్లెను. ఇందులకు నేనావంతయును విచారింపను.

ఇపుడు యోగ్యాతియోగ్యుడగు శిశిరబాబు సహాయము నీకు సంప్రాప్తించుటచే నేను కృతార్థురాలనైతిని. నిన్ను నామనసార శిశిర బాబుచేతులలో నుంచి నేను నిశ్చింతగా మీా యిరువురియొద్ద ననుజ్ఞ గొని ఈనీలోకమునుండి వెడలిపోవుచున్నాను. నన్ను నీవు క్షమింప కుండ నుండజాలవనియె సంపూర్ణముగ విశ్వసించుచున్నాను. శిశిర బాబు విజ్ఞానధనుడు. కావున నన్ను దప్పక క్షమించును. ఇక నాకనుజ్ఞ నిండు సమయమైనది.

పాపమయి

క్షణప్రభ"

ఈజాబును వెక్కి వెక్కి యేడ్చుచునే చదువుచున్న విద్యుత్తు జాబు ముగిసినపిదప మోము ద్రిప్పుకొనియే దానిని శిశిరునిచేతికిచ్చెను. శిశిరుడును దానినందుకొనెను. కాని విద్యుత్తు మోమును జూడజాల కుండెను. కొంచెముసేపైనపిదప మోమును ద్రిప్పుకొనియే "ఒకసారి అచటికి వెడలవలదా ?" అని మెల్లగ విద్యుత్తుతోననెను.

"ఇంక నచ్చట నాకేమున్నది ! నిన్ననే బంధుత్వపాశమును దెగదెంచుకొని వచ్చియుంటినికదా ?" అని వ్యథాపూర్ణస్వరమున విద్యుత్తు చెప్పెను.

"అయినను దల్లికదా !" అని చెప్పదలచెను. కాని, ఈమాటచే ఆమెహృదయము తీవ్రాఘాతమునకు బాల్పడునేమో యనుకొని యూరకుండి, యించుకసేపైనపిదప "చేయదగిన కార్యములను జేయక

తీరదు ! మీరుకాక ఆమెకెవ్వరున్నారు ? మీరచటికేగక తప్పదు. నేనుగూడ మీతోవచ్చెదను. రండు !" అని చెప్పెను.

విద్యుత్తు మారాడకయే అటనుండి లోనికేగి, ఉపాధ్యాయినితో జెప్పి యించుకసేపటిలో మరలివచ్చెను. ఇరువురు నొకబండిలో గూర్చుండి వెడలిరి.

# అధ్యాయం—31

విద్యుత్తు తనతల్లికి జేయవలసిన యుత్తరక్రియలను నిర్వర్తించి తల్లి యార్జించిన ధనము "పాపార్జితవిత్త" మని కైకొననొల్లక వితంతు శరణాలయ సంస్థాపనకై యొసంగి, ఆకార్యభారమును శిశిరబాబుపై నుంచెను. తన యుపాధ్యాయినీ సహాయమున శీలాంగపురిలో నొక యుపాధ్యాయినీ పదవిని సంపాదించికొని యచటికి వెడలిపోయెను.

సుప్రసిద్ధ వంగసమాచార పత్రికలన్నియు, క్షణప్రభయొక్క ఆత్మహత్యా వృత్తాంతమును, విదుత్సుందరీ మహోదారదాన సమాచారమును మిక్కిలి ప్రశంసించుచు ప్రకటించినవి.

'నారద' మాత్రము ఆ ప్రశంసలను విడిచి "క్షణప్రభాభవనము విద్యుచ్ఛిశిరుల విలాసవిహారస్థానము. ఇపుడా భవనము మూయబడెను సుప్రసిద్ధలేఖకులగు శిశిరబాబుగారి కిది మిక్కిలి విచారకరమగు విషయము. ఆతనిప్రియురాలగు విద్యుత్తునకు గూడ నన్నివిధముల దుఃఖసమయమే. పాపము ! మొన్నటిగురువారమునాటి రాత్రియే శిశిరచక్రవర్తిగారు రజతబాబుగారియొద్ద నైదువందలరూప్యము లప్పు జేసి విద్యుత్తున కొసగినారు. ఇంక విద్యుత్తునకు ధనము నొసంగవలసిన

సంపూర్ణభారము శిశిరచక్రవర్తిగారిపై బడుటకు మిక్కిలి విచారించుచున్నాము” అని నిందాపూర్ణములును—అపహాసగుంఫితములును—అవమాన దాయకములునునగు వ్రాతలను బ్రకటించెను.

మలినాంబరముపై నున్నడాగు చప్పున గానిపింపదు. కాని శుభ్రవస్త్రమునందలి స్వల్పకలంకము దూరమునుండియే గోచరించుచుండును. వినిర్మల ప్రవర్తనుడును—సుప్రసిద్ధుడునునగు శిశిరునిపై నీనింద యతివేగముగ బ్రాకిపోయెను. ఈదుర్వార్త శిశిరునకు దుర్భరముగ నుండెను.

సరళహృదయయు—శిశిర వినిర్మలప్రవర్తనాను రక్తయునగు సంధ్యాదేవి హృదయముగూడ ‘నారద’ ప్రకటనముచే వ్యాకులితమై పోయెను. ఖిన్నవదనయై రజతునియొద్ద కామె వచ్చెను.

“ఏమియీ యకస్మాద్దర్శనము!”అనెను సహేళనముగ రజతుడు.

“మీమాటల చందమేకాక—మీచేష్టలుగూడ విపరీతముగ నున్నవని చెప్పుటకు వచ్చితిని” అన్నది నిర్భయముగ సంధ్య.

“ఔను! విపరీతదృష్టితో జూచువారికంతయు విపరీతముగనే గానిపించుచుండును” అనెను రజతుడు.

“మీరు శిశిరబాబుపై మిథ్యాకళంకములనేల ఆరోపించినారు!” అన్నది సంధ్య.

“నేనేమి మిథ్యాపవాదముల నారోపించితిని!” అనెను రజతుడు.

“శిశిరబాబు మీయొద్ద రూపాయలను బుచ్చుకొని విద్యుత్తున కిచ్చెనని మీరు ప్రకటించితిరే! అది నిజమేనా!!” అని సంధ్య యడిగెను.

రజతుడు వడివడిగ మేజాసొరుగులోనుండి శిశిరుడు వ్రాసి యిచ్చిన ఋణపత్రమును దీసి సంధ్యయెదుట బారవేసెను.

సంధ్య యాపత్రమునుజూచి "సరియే ! ఈధనము విద్యుత్తుకొరకే యని చెప్పుటకిది యెట్లు ప్రమాణమగును ?" అన్నది.

"తనతల్లియొక్క నిజరూప సందర్శనమున వ్యథితచిత్తయై తల్లిని విడిచి విద్యుత్తు వెడలిననాటిరాత్రియె శిశిరుడువచ్చి ధనమును గైకొని విద్యుత్తునకిచ్చెను. ఆసమయమున వనమాలి యింటికిబోవుచు, మన ద్వారమునొద్ద నిలిచియున్న బండిలో గూరుచుండిన విద్యుత్తునుజూచి దూరముననే నిలిచియుండెను. పిదప శిశిరుడువచ్చి యామెకు ధనము నిచ్చి యటనుండి వెడలిపోవుటయు జూచి మరలివచ్చి నాకెరిగించెను" అని రజతుడు చెప్పి పత్రమును మరల నెప్పటియట్లు భద్రపరచెను.

సంధ్య విస్మయచకితయై "ఆనాటిరాత్రియే క్షణప్రభా నిజ తత్వము విద్యుత్తున కెరుకవడెనని మీ కెట్లు తెలిసినది ?" అనెను.

రజతు డేమియు దోచక, నలుగడల బరికించుచు, గొంతుసవరించు కొనుచు. "ఆమరునాడే క్షణప్రభ ఆత్మహత్యగావించుకొనెను కదా ! ఈసమాచారము మాయమ్మకుగూడ దెలియును" అనెను.

"విద్యుత్తుతో శిశిరునకుగల సంబంధము సర్వదా దోషరహితమై యున్నదని మీ రెరింగియు దోషారోపణ మొనరించి ప్రకటించితి రేల ?" అన్నదిసంధ్య.

"వారిసంబంధము దోషరహితమైనదని చెప్పనవకాశములేదు. క్షణప్రభామందరమున కాతడూరక పోవుచుండెనా ?" అని రజతు డూరకుండెను

"కల్ల ! కల్ల ! వట్టికల్ల ! శిశిరునియందు మీకుగల యనురాగము విపరీతపరిణామ మొందుటచే గలిగినభావ మిది. శిశిరబాబు శిరస్సుపై నిపుడు మీరీకళంకభారమును మోపుచున్నారు. ఈనీచ కృత్యమునకు-

ఈపాపకార్యమునకు—మీహృదయమున నణుమాత్రమును వ్యథా భావము దయింపలేదా ?" అన్నది సంధ్య.

రజతుడు తిరస్కారసూచకహాస్య మొనరించి "శిశిరుని వెనుక వేసికొని యాత్మనాథునిపై దండెత్తివచ్చుట మిక్కిలి సమంజసమైన కార్యమని నీవు బాగుగా దెలిసికొనినందులకు నేను మిక్కిలి సంతసించు చున్నాను. నేనొక యపరిచితవ్యక్తిని, నాయింట ప్రవేశపెట్టిన యకార్యమునకు—అజ్ఞానకృత వ్యాపారమునకు—మిక్కిలి వ్యధ నొందుచున్నాను" అనెను రజతుడు.

"ఆనాడు మీరాతని చెల్మి నపేక్షింపనిచో, ఈనాడాతడిట్టి యవమానమునకు గురికాకుండనుండును" అన్నది సంధ్య

ఆమాటలకు రజతునిహృదయమున క్రోధప్రతిహింసాభావము లొక్కుమ్మడి నలముకొనెను. మారుమాటాడజాలక సంధ్యా వదనమును గోపవీక్షణములచే జూచుచుండెను. తటాలున సునయినీదేవి యాగది లోనికివచ్చెను రజతుడామెను జూడగనే తలవంచుకొనెను.

"రజతా ! ఏమి ఘనకార్య మొనరించితివి ? ఈవిధముగ శిశిరు నవమానింప దలచితివా ? ఇట్టి యకార్య మొనరించుటకు నీవు లజ్జవడ లేదా... ..." అని సునయనీదేవి గద్దించుచుండగనే రజతు డటనుండి లేచి మాఱాడక శిరస్సువంచుకొని యావలకేగెను.

సునయనీదేవి సంధ్యచేయిపట్టుకొని "రమ్మా ! అట్టివానితో నీకు వాదమెందులకు ?" అని యామెను దీసికొనిపోయెను. లజ్జాక్షోభ హృదయయై యత్తగారితో సంధ్య లోనికేగెను.

# అధ్యాయం—32

నారదపత్రికా ప్రకటనమున శిశిరుని హృదయమున లజ్జాభయ దుఃఖసంక్షోభము లావరించి యాతనినెంతయు వేధించుచున్నవి. లజ్జితుడై సునయనీసంధ్యల యొద్దకుగూడ వెడలుటమానుకొనెను. ఏరమణీ ముఖారవింద సందర్శనమున నాతడెల్ల దుఃఖముల మరచి యానంద మందుచుండెనో, ఆవిద్యుత్తుగూడ నిపుడు శిలాంగపురికేగినది. లోకమున దనజీవితము కళంకయుతముగ బ్రకటితమగుచున్నది. ఇన్ని విధములచే నాతడు మనోవేదనమును గుందుచుండెను.

సంధ్యాసునయనుల యొద్దనుండియు, విద్యుత్తునొద్దనుండియు, నూరడింపుజాబులు శిశిరున కాసమయమున వచ్చినవి. వానితో నాతడు కొంతయూరట జెందకపోలేదు. అయినను రజతునకీయవలసిన యైదు వందల రూప్యముల నిచ్చివేయుటెట్లు? ఈయకున్న నింకను అతడెట్టి యకార్య మొనరించునో ?" అని వ్యాకులుడగుచుండెను. తనకీయవలసిన వారలనెల్ల నడిగెను కాని వారు మిక్కిలి యెక్కువకాలపు వ్యవధుల జెప్పివేసిరి. చేయునదిలేక శిశిరుడు మిక్కిలి బరితపించుచుండెను.

ఎట్లైనను శిశిరుని ప్రతిభను—గౌరవమును—కీర్తిని భ్రష్ట మొనరింపవలయు ననియె రజతుడు సర్వదా ప్రయత్నించుచుండెను. హేముడు, ఖగేనుడు, వనమాలి, మొదలగు ననుచరులతో నిదియే యోచించుచుండెను. ధనలుబ్ధులగు వారు రజతునిహృదయమున కనుగుణ సమాధానములనే జెప్పుచుండిరి. మిత్రద్రోహియు, స్వామి ద్రోహియునగు వనమాలి, రజతుడిచ్చు లంచములకుబ్బి వానితోగలిసి శిశిరునిపై నేరములనుమోపి వ్యాసములను వ్రాయుచుండెను, శిశిరుని నిందించి వ్యాసములను వ్రాయువారలకు రజతుడు మిక్కుటముగ ధనము నిచ్చుచుండువాడు.

# అధ్యాయము—32

రజతు డొకనాటి ప్రాతఃకాలమున "నారద" పత్రికాకార్యాలయమున గూరుచుండి వచ్చియున్న జాబులను—వ్యాసములను—జూచుకొనుచుండెను అందొక వ్యాసము గానిపించెను. "శిశిరలేఖా ప్రసంగము" అని పెద్దయక్షరములతో నావ్యాసముపై వ్రాసియుండెను. రజతు డాతురతతో దానిని జదివెను.

అందు లేఖకుడు వ్యక్తిసంబంధములగు గుణదోషముల జోలి కేగకయె, మిక్కిలి నేర్పరితనమున శిశిరలేఖలను విమర్శించెను. విషయము—విధానము—ఆరంభము—ఉపసంహారము— అభ్యాసము—అపూర్వత—అర్థవాదము—ఉపపత్తియు నెట్లున్నవి? భావమున కనుగుణమగు భాషయున్నదా లేదా? శైలిరోచకముగ నున్నదా లేదా? భాష నిర్దుష్టముగ నున్నదా లేదా? భావములు స్వతంత్రములైనవా? చౌర్యమొనరించి తెచ్చినవా?—ఈలేఖవలన లోకమున కేమియుపకారమున్నది?—అభ్యాసములేవి!—ఏవిషయమును లేఖకు డభిరుచితో దీవ్రముగ వాయుచున్నాడు? ఎందులకట్లు వ్రాయవలెను! అను విషయములను మిక్కిలి విపులముగ—దీవ్రముగ—రజతుని కానందప్రదముగ వ్రాయబడి యుండెను. "శ్రీశచంద్రశర్మ—రాజధాని తపాలాధికారిద్వారా" అని వ్రాయబడియుండెను.

ఆలేఖను జదివినంతనే రజతుడు పొందిన యానందమునకు మేరయే లేదు. తానెవని కారణమున నారదను స్థాపించెనో—ఎవని కారణమున దనతల్లికిని భాగ్యకునుగూడ బగతుడయ్యెనో—ఎవని కారణమున నాతడహరహమును జింతాపూర్ణహృదయుడగు చుండెనో ఆశిశిరుని సాధించుటకు దగిన యనుపమానసాధనము నేడు రజతునకు లభించెను. ఈవిమర్శలతో శిశిరకీర్తియంతయు సంపూర్ణముగ మాసి పోవునని నిశ్చయించుకొనెను. శిశిరు డనతికాలముననే గౌరవరహితుడై

యదఃపతితుడగునని విశ్వసించెను. ఎట్టులనైన శ్రీశచంద్రశర్మను తన వశముచేసికొని శిశిరుని ధ్వంసమొనరింప నిర్ణయించుకొనెను. నూరు రూపాయిలను శ్రీశచంద్రశర్మగారికి మనియార్డరుగ బంపి,

"విమర్శక సార్వభౌమా!

మీరంపిన "శిశిరలేఖాప్రసంగము" అను వ్యాసరాజమును కృతజ్ఞతతో నందుకొంటిమి. నేను నూరురూపాయలు ఈవ్యాసమునకు బురస్కారమంపుకొంటిమి. మీరట్టివ్యాసములను విరివిగా వ్రాసి పంపుచుండుడు! మీరుకోరిన ధన మొసంగుచుందుము. నాకు మీదర్శన భాగ్య మలవడజేసినచో నేనెంతయు కృతార్థుడ నగుదును. మీకిటకురా నవకాశములేనిచో, మీరుండు చోటును వివరముగ వ్రాసినచో నేనేవచ్చి మిమ్ము దర్శింతును. మీజాబున కాతురతతో నెదురు సూచుచున్నాను.

భవద్విధేయుడు
రజతురాయులు"

అని యొకజాబును వ్రాసెను. శ్రీశచంద్రశర్మగారి విమర్శనమును ముద్రణమున కొసంగెను. ఖగేనుడు వనమాలి మొదలగువారీ యుదంతము నెరిగి మిక్కిలి యుత్సాహమొందిరి.

"నారదను" పక్షపత్రికగాజేసి శ్రీశచంద్రశర్మగారి వ్యాసములను మిక్కిలి వడివడిగా బ్రకటించుట యిప్పట్టున కర్తవ్య"మని ఖగేనుడు చెప్పెను. వనమాలి దానికామోదించెను. రజతుడు వారిని మిక్కిలి బ్రశంసించి యందుల కంగీకరించెను. మరల నొకజాబును

శ్రీశచంద్రశర్మగారి పేర నీ సమాచారమును వ్రాసి అయిదారు దినముల లోపలనే విమర్శనము నంప ప్రార్థించెను.

## అధ్యాయం—33

శ్రీశచంద్రశర్మగారు శిశిరలేఖలపై వ్రాసిన విమర్శలైదు మాసత్రిమే క్రమముగా నారదలో వెలువడినవి. ఈయైదువ్యాసములచే అఖిలవాంగదేశము నట్టుడికిపోయినట్లయ్యెను. సంధ్య హృదయమా విమర్శల జదివి విస్మయవిషణ్ణ సంక్షోభముల నొందెను. సునయనీదేవి పరితాపమునకు మేరయే లేదు. పాఠకులు శ్రీశచంద్రుని రచనా నైపుణ్యమును వేనోళ్ళ గొనియాడుచుండిరి. రజతుడు విజయమొందితి నని తలంచి గర్వమున మిన్నంది పోవుచుండెను. కాని శ్రీశచంద్ర శర్మగారి సందర్శనము మాత్రము రజతరాయునకు గలుగలేదు. రాజభానీ తపాలాధికారి తప్ప శ్రీశచంద్రు నెరింగినవా డొక్కడును ఆనగరమున లేడు. శర్మగారు తనజాబులను మనీయార్డరులను దానే తపాలాకార్యాలయమునకు వచ్చి యెప్పటికప్పుడు తీసికొనుచుండుటచే నాతని నివాసము తపాలాధికారికి గూడ దెలియదు.

అయిదవవిమర్శ ప్రకటితమైన పిదప శర్మగారియొద్దనుండి విమర్శ రాలేదు. రజతు డెన్నిజాబులను వ్రాసినను బ్రయోజనము లేకపోయెను. శిశిరు నవమానించుటకు దగిన యస్త్రసంపద తనయొద్ద నేమియు లేకపోవుటచే నెంతయు గుంది, మిత్రులతో యోచించి తన కీయవలసి యున్న అయిదువందల రూప్యములును అయిదుదినములలో నీయకున్న దగినచర్య జరుపబడునని శిశిరుని పేర నొకజాబు నంపెను.

ఆజాబు వ్రాసిన మూడవనాడే రజతునకు శ్రీశచంద్రశర్మయొద్ద నుండి యొకజాబు వచ్చెను. అందిట్లున్నది.

"మహాశయా !

నన్ను జూడగోరి మీరు వ్రాసిన జాబులన్నియు జేరినవి. నేనమందానందభరితుడనైతిని. రేపటి యుదయమున దొమ్మిదిగంటల సమయమున నేను నారద పత్రికా కార్యాలయమునకు వచ్చెదను.

భరద్వాజీయుడు
శ్రీశచంద్రశర్మ"

ఈజాబును జూచి రజతుడు సంతోషమున మిన్నంది ఖగేనుడు, వనమాలి, మొదలగువారికి వర్తమాన మంపెను. వారును అనతికాలముననే వచ్చిరి. ఆసమయముననే కాళిదా సచటికి వచ్చెను. రజతుడాతనిని గూరుచుండ జేసెను.

"రజతబాబూ ! నీవిట్టి నీచకార్య మొనరింతువని కలనైన ననుకొనలేదు. నీవు శిశిరుని కారాగారమున కంపప్రయత్నించుచుంటివా ? ఆతని కీలోకమున స్వజను లెవ్వరును లేరనియే యనుకొనుచుంటివా ? శిశిరబాబు వ్రాసిన ఋణపత్రమును నాకిచ్చివేయుము. నేను నీకు ఋణపత్రమును వ్రాసియిచ్చెదను" అని కఠోరస్వరమున జెప్పెను.

"అట్లు జరుగ నవకాశములేదు. నీ కాతనిపై ప్రేమయున్నచో రూపాయిలనే యిచ్చివేయరాదా ?" అనెను రజతుడు.

"సరియే ఆపని చేయక మానెద ననుకొనుచున్నావా ! రేపటి సాయంకాలములోపల నీరూపాయిలను దెచ్చి యిచ్చివేసెదను" అని కాళిదాసటనుండి వెడలనుండెను.

"ఎటులనో నా ఋణముదీర్చిన చాలును. శ్రీశచంద్రశర్మగారిచటికి రేపటియుదయమున రానున్నారు. నీవును రావలయును. మీకన్యోన్య పరిచయము గలిగించెదను" అని రజతుడనెను.

ఆమాటకు గాళిదాసు విరక్తుడై—"అన్యాయమున కింతకంటె గొప్ప యుదాహరణ మేముండును? వంగసాహిత్య సౌభాగ్య సిందూరము నుజ్జ్వల మొనరించుటకు శిశిరు డవతరించెను. కాని మీరు ద్వేషాగ్నిచే ప్రజ్వలితులై యతని గ్రసింపగోరుచున్నారు. మీ ప్రయత్నము సఫలము గానేరదని మాత్రము నేను దెలియజేయుచున్నాను. నారదలో ప్రకటితములైన శ్రీశచంద్రశర్మగారి విమర్శమూలమున శిశిరుని కెట్టి యపకీర్తియు గలుగలేదు సరికదా! సంగ్రహాముద్రిక మొదలగు సాహిత్య పత్రికలన్నియు శిశిర లేఖలలో సామాన్యులకు గాని పింపని సొగసులను వెలువరించుటచే నాతని కుత్కృష్టతయే కలిగినది. మరియు, ఈ విమర్శలచే శ్రీశచంద్రశర్మగారికే ప్రశంసవచ్చినది. కాని మీపేరైన నెవ్వరు నెత్తలేదుకదా? దేవపూజయందు పురోహిత స్థానమువంటిదే మీస్థానమైనది. ప్రతిమా ప్రాణప్రతిష్ఠ మీవలన జరిగినది. పూజాపురస్కారములు వారికే జెందినవి" అని కాళిదాసు చెప్పెను.

యుక్తిపూర్ణములగు కాళిదాసుమాటల నాలించి రజతుడు కొంతతడవు నీరవుడై పోయెను. ఆతడు స్వప్నమందైన నూహింపని విషయము—ఊహింపజాలని విషయమును గాళిదాసు చెప్పెను. రజతున కేమియు దోచుటలేదు. హఠాత్తుగ వాని హృదయమున శ్రీశచంద్రశర్మగారిపై గూడ అసూయాద్వేషభావము లంకురించినవి. ఒక్క వేడినిట్టూర్పు విడిచి అట్టె కాళిదాసునిముఖమును జూచుచుండెను. కాళిదాసటనుండి మరలి సునయనిచెంతకు బోయెను.

కాళిదాసు వెలుపలికి పోవగనే రజతుని ప్రోత్సహించుటకు ఖగేనుడు "శిశిరుని మనమనేక విధముల బరాస్తుని గావించితిమి. ఇది మన విజయమున కుత్కటమగు నుదాహరణము. మన మతని

గర్వమును బూర్తిగా భంగపరచితిమి. శ్రీశచంద్రశర్మగారతని లేఖినిని స్తంభింపచేసియున్నారు. రజతరాయలు మద్యపుబాత్రను గైకొని తృణప్రభభుజముపై జేయినైచి యూగులాడుచుండుటను శిశిరుని ప్రేయసియగు విద్యుత్తు తనకన్నులతో ప్రత్యక్షముగా జూచినది. ఇంకేమి కావలయును ?" అని రజతునితో ననెను.

ఆమాటలను విని రజతు డుత్సాహముతో "అయ్యయో ! విద్యుత్తు నాచేతినుండి తప్పిపోయినది. ఆమెతల్లి మనముసహాయులమై పారిపోవునట్లు గాజుసీసాలతో గొట్టినది. లేనిచో మనము విదుత్తును గూడ బట్టుకొన గలిగియే యుందుము. శిశిరు డింతకంటె నెక్కుడుగ లజ్జితుడు కావలసియుండును." అని సోత్కంఠుడై పలికెను.

కాళిదాసుని క్రోధపూర్ణ శబ్దములను విని సంధ్య యా సమావేశ స్థలమునకు ప్రక్కగాయున్న గదిలోనికి వచ్చియుండెను. రజతుని మాటల నామెచక్కగా విని నిశ్చేష్టితురాలయ్యెను. "ఇతడు మత్తు పదార్థముల గ్రోలదొడగెనా ? వేశ్యలకొంపలకు బోవసాగెనా ? ప్రస్తుతము జాలరాత్రియైన పిమ్మటనే గృహమునకు వచ్చుచుండుట కిదియా కారణము ?" అని తలపోయుచు దనగదలోనికిబోయి పరితాపముతో శయ్యపై బరుండి తలగడపై మోముంచి విలపించి విలపించి యేడ్వ సాగెను.

అకస్మాత్తుగా నొకానొక కోమలహస్తస్పర్శవలన నులికిపడెను కనులు తెరచి చూడగనే సునయనీదేవి నిలబడి యామెతల నిమురు చున్నది. ఆమెకనులనుండి అవిరళాశ్రుధారలు ప్రవహించు చున్నవి. సునయనీదేవిని జూచినంతనే సంధ్యాదుఃఖవేగము మరింత యధికమై పోయెను.

# అధ్యాయం—34

సూర్యోదయమాయెను. మెల్లమెల్లగా ప్రొద్దెక్కసాగెను. రజతుని హృదయమున శ్రీశచంద్రశర్మగార సందర్శనోత్కంఠ ప్రబల వేగమున పెరుగదొడగెను.

ఆతనిరాక నిరీక్షించుచు రజతుడు గదిలో గూరుచుండెను. దరహాసమొనరించుచు శిశిరు డాగదిలో ప్రవేశించెను. అకస్మాత్తుగా వచ్చిన శిశిరునిజూచి యందరును నిశ్చేష్టులైరి. "ఈతడు మరల నీయింటి కేలవచ్చెను ? నీని కిసుమంతయు లజ్జలేదా !" అని యనుకొనిరి.

అందరును మౌనభావమున నిశ్చేష్టులై యుండుటగాంచి శిశిరుడు మందహాస మొనరించి "ఇదువందల రూపాయిలను నోటులను దీసి రజతునిచేత నిడెను. ఇట్లు చులకనగా అప్పులదీర్చి శిశిరుడు రజతుని హతాశుని గావించెను. రజతు డింతదనుక "శిశిరుడు రూప్యముల నీయ జాలడు. నేను దప్పక ఆతనిని కారగారమునకు బంపెదను !" అనియే యూహించుకొనుచుండెను. కాని, యానోటులనుజూచి చకితుడై యప్పుపత్రమును దీసి శిశిరున కొప్పగించెను.

ఆ పత్రమును జేబులోనుంచుకొని శిశిరుడు కొన్ని కాగితములను మనీయార్డరురసీదులను దీసి "మీరు శ్రీశచంద్రశర్మగారి దర్శన మొనర్చుటకు మిగుల దహాతహపడుచున్నారు. అతడిపుడు మీసన్నిధికి వచ్చియున్నాడు. ఇందుకు ప్రమాణములివిగో మీజాబులును, మని ఆర్డరు రసీదులును, జూడుడు ! కల్పితనామమున నాలేఖలకు నేనే విమర్శలనువ్రాసి వానివలననే సులభముగా ధనమార్జించి మీ ఋణ మును దీర్చివేసితిని. దైవయోగమున భ్రమలోచనుబోలె నేను

నేను నాచేతులతోడనే నాలేఖలకు సమాలోచన గావింపవలసి వచ్చినది" అని చెప్పుచు శిశిరుడు మందహాస మొనరించెను.

ఆమాటల కందరును విభ్రమనొందిరి. "శిశిరుడు రజతబాబును మాటిమాటికి నోడించుచుండెనే! రజతునివలననే పురస్కారమును గైకొని ఆతని ఋణమును దీర్చెను. రజతుడు తాను దీసికొనిన గోతిలో దానే బడెను" అనుకొనిరి.

అందరును మౌనముద్ర వహించుట గాంచి శిశిరుడు నవ్వుచు అనుజ్ఞనడిగి అటనుండు వెడలిపోయెను.

శిశిరుడు వెడలిన పిమ్మట—"ఓహో! ఎంతగొప్ప ధూర్తుడు" అనెను ఖగేనుడు.

రజతుని నోటనుండి యొకమాటయేని వెలువడలేదు.

*　　*　　*　　*　　*

అటనుండి శిశిరు డింటికివచ్చినంతనే కాళిదాసాతనికి రెండు జాబులుగల పెద్దకాగితపు సంచులనిచ్చెను. శిశిరు డాతురతతో వానిలో నొక దానిని విప్పి చదివెను. అందిట్లున్నది.

"కుమారా! శిశిరా!

సోదరులలో విరోధభావ మంకురించినది. కాని మాతృదృష్టిలో నెల్లపుడు ఇర్వురును సమానులే. మరియు ఏపుత్రునియందు సహనశీలత్వ మధికముగా నుండునో వానిపై తల్లికి ప్రేమకూడ మెండుగానుండును. స్వార్థలోభమున బడి అన్నదమ్ములు అనేక విధములగు అత్యాచారముల గావించుకొను చుందురు. కాని ఆయా ఘాతము మాతృహృదయమున కధికముగా దగులును.

నీ కవసరమగునపు డెల్ల నన్నేల ధనమడుగవు?
నీవు నాయెడల జాల నన్యాయమొనర్చితివి సుమా! ఈ
యుత్తరముతో నూరేసి రూపాయిలనోటుల నైదింటిని
బంపితిని. నీవు వానిని గైకొనకున్నచో నాకత్యంత
దుఃఖమును గూర్చినవాడ వగుదువు. కావున నీవు నా
కోరికను దీర్పవలయును. ఇదే నా కత్యంత ప్రసన్నతా
విషయమగును.

ఇట్లు
నీ తల్లి"

ఈ యుత్తరమును జదివినపిమ్మట శిశిరుడు రెండవజాబును
దెరచెను. దానిలోగూడ నేనూరురూపాయల నోట్లును, ఒక జాబు
నున్నవి. ఆజాబునం దిట్లున్నది.

"మరదిగారూ!

మీయెడల భర్త యొనర్చిన యపరాధమున
నేనును భాగస్థురాలనై యున్నాను. మీయెదుటకు
వచ్చుటకు లజ్జ వొడముచున్నది. క్షమాప్రార్థనమునకు
గూడ నవకాశమును మీరు మిగిల్చియుండలేదు. భీష
ణాతి భీషణములగు దోషములను మీరు సహజోదార
స్వభావమున క్షమించుచున్నారు. మీ ఋణసంశోధన
కొరకు ధనము నంపించుకొంటిని. ఇది నా స్వీయధనము
అన్యుల ధనము నొసంగి మిమ్మవమానితులు గావించు
నంతటి క్రూరురాలను గాను.

మీవదినె
సంధ్య"

"అన్యుల" అనుమాట సంధ్య జాబులో నేల వ్రాయబడి యుండెనో గ్రహించుట శిశిరునకు గష్టముగుపని కాదు. పత్రమును జదివి దీర్ఘనిశ్వాసమును విడిచి శుష్కహాసమున శిశిరుడు "నేనిపుడే రజతుని యప్పు దీర్చివేసి యున్నాను" అనుచు దాను రజతునకు వ్రాసియిచ్చిన ఋణపత్రమును గాళిదాసునెదుట నుంచి, ఈ అయిదువందల రూప్యములను నేను రజతునియొద్దనుండియే సంగ్రహించితిని. శ్రీశచంద్ర శర్మగారిపేర నారదలో వెలువడియుండిన లేఖలు నేనే వ్రాసియుంటిని" అని చెప్పెను.

కాళిదాసు సంతోషమును బట్టజాలక "బాగు బాగు! ఇట్టి సిద్ధహస్తుడగు లేఖకుడెటనుండి యుత్పన్నమయ్యెనో! అని నేనును విభ్రాంతుడనయి యుంటిని. రజతుడు బాగుగా వంచితుడయ్యెను" అనెను.

సునయనీ సంధ్య లంపిన నోటులను శిశిరుడు దిరిగి కాళిదాసుచే బంపివేయుచు, "మీకృపకు నేనత్యంతకృతజ్ఞుడను, ఇపుడు నాకు రూపాయిల యవసరము లేదు. నా కుద్యోగముకూడ లభించినది. బాంకీపురమునుండి ప్రకటితమగుచున్న "స్టేట్స్‌మన్" పత్రికా సహాయ సంపాదకుడుగా బోవుచున్నానని చెప్పవలసినది" అని శిశిరుడు కాళిదాసుతో జెప్పెను.

అంతలో దపాలాపరిచారకు డొకడు శిశిరునిపేర నొకజాబును మనీయార్డరును గైకొనివచ్చెను.

"నాపేర మనీయార్డరెవరు పంపినారు!" అని శిశిరుడాశ్చర్యము నొంది మనీయార్డరుకాగితము నందుకొని చేవ్రాలు జేయుచు ప్రసన్నతతోడను, లజ్జతోడను "విద్యుత్తు రూపాయల నంపిన"దని కాళిదాసుతో జెప్పెను.

అయిదువందలరూప్యముల నోటులును, జాబును ఇచ్చి తపాలా పరచారకు డేగెను. శిశిరుడు జాబునువిప్పి చదివెను. అందిట్లున్నది.

"నా యానందాస్పదులకు

మహాశయా ! నారదలో వెలువడిన వ్యాసములను జూచి భయకంపితురాల నైతిని. అయిదువందల రూప్యముల నంపుకొంటిని. తుచ్ఛములగు రూప్యముల నంపుకొన గలిగితిని. కాని, మీ యఖండానురాగ ఋణమును మాత్ర మీజన్మమున దీర్పజాలను.

శ్రీశచంద్రశర్మగారి ధోరణియు—భాషయు—శైలియు—నాకు సంశయాస్పదములుగ నున్నవి. రజతుని మెప్పునకై మీరే యాపేరుతో వ్రాయుచున్నట్లున్నవి. అందెల్ల యెడల మీ యభ్యాసములే !—మీ వాక్యరచనా విధానమే ! నా యూహయే సత్యమగుచో మీరొనరించుచున్నది యకార్యమని విన్నవించుచున్నాను.

నేను మీకు దూరముగ నున్నను, మీరు నా కనులలో—హృదయములో—తలపులలో నున్నారు. నావలన మీరు లోకమునజెందిన నిందకు సర్వదా కుందుచున్నాను.

వ్యధితహృదయ

మీ విద్యుత్తు"

తటాలున గాళిదాసు లేచి "సోదరా ! నీవు ఋణవిముక్తుడవైన విచిత్రకథావిధానము నెల్లరకు వినిపింతును" అనెను.

"ఇదియేకాక ఇంకొక శుభవార్తనుగూడ వినిపింపవలయును. నేను విద్యుత్తును బత్నీరూపమున స్వీకారమొనర్చుచున్నాను. రేపే

# అధ్యాయము—34

నేను బాంకీపురమునకు బోవుదును. భవనమునలంకరించి నేను విద్యుత్తును గైకొనిపోవుటకు రాబోవుమాసపు మొదటిదినమున శీలాంగపురి కేగెదను" అనెను శిశిరుడు.

కాళిదాసత్యంతానందముతో ఈ శుభవార్తను సునయనీ సంధ్యలకు వినిపింప వెడలెను. శిశిరుడు విద్యుత్తునకు జాబునిట్లు వ్రాసెను.

"ప్రియతమా !

నీ "యానందాస్పదు" నకు నీ వంపిన యైదు వందల రూప్యములును అందినవి. కాని "అనురాగ ఋణమింకను మిగిలియున్నది" కదా ! ఆ ఋణమును దీర్పించుకొనుటకు నీ 'యానంధాస్పదుడే' రానున్న మాసపు మొదటిదినమున శీలాంగపురమునకు వచ్చును. ప్రణయ సామ్రాజ్యాధికారియొద్ద నీ యనురాగ ఋణ పత్రము విచారణమొనరింప నుంపబడును. ఋణవిముక్తికై నీకు ప్రణయాగార నిర్బంధ మొసంగబడును. అది బాంకీపురమున నున్నది. అచట నీ సుఖస్వాతంత్ర్య నిరీక్షణమునకును—నీ సేవా చరణమునకును—బీహార్ 'ప్రెటీయట్' పత్రికా సహాయసంపాదకుడగు శిశిర చక్రవర్తి నియుక్తుడగును. నీవిపుడు చేయుచున్న యుద్యోగపదవిని వదలుకొని అందులకు సిద్ధముగ నుండుము ! నీ 'యానందాస్పదు' డింక నొక్క నిముస మేని దాళలడుసుమా !

నీ పాణిప్రార్థి
శిశిరుడు"

ఈ యుత్తరము సకాలమున విద్యుత్తునకు జేరినది. కాని ఆమె దానిని తన చూపులలోగాని, మానసమునగాని, నమ్మజాలకుండెను. "నిజముగా నీలేఖయందిట్లే వ్రాయబడి యున్నదా! లేక ఇది నా దురాశాజన్య విభ్రాంతియా! ఇట్టి దురాశ మున్నొకనాడు సంధ్య నా మనస్సున గలిగించియుండెను. కాని ఏనాడు నాకు నాజన్మవృత్తాంతము తెలిసినదో, ఆనాడే దానిని బూర్తిగా దురాశయేయని తలంచియుంటిని. మరల నీదురాశ యకస్మాత్తుగా నేలగలిగినది ?" అనుకొనుచు విద్యుత్తు వెఱ్ఱిదానివలె నలుగడల దిలకింపదొడగెను. నలుగడల నుండియు సుఖ సుందర చిత్రపటములు గుంపుగుంపులుగా దృశ్యములగుచున్నది. ఆమె హృదయ మునాసుందరివలె వికసితమగుచున్నది. దుఃఖములన్నియు నే యంతరాళముననో మరుగువడినవి. ఆనందమున నామె యడుగుల గూడ సరిగా నేల మోపజాలకున్నది.

## అధ్యాయం—35

నేడు నెలమొదటిరోజు. నేడే శిశిరుడు శీలాంగపురి జేరును. కావున విద్యుత్తు ప్రాతఃకాలమునుండియే అవాఙ్మానసగోచరమగు ఒకానొక విచిత్రానందవాహినిలో నీదులాడుచున్నది. ఆమె ముఖమండలమున నూత్నరాగారుణకాంతులు విలసిల్లుచున్నవి. స్త్రీజనసహజమగు లజ్జ యామెనేత్రముల దాగుడుమూతలాడుచున్నది. చూచుచుండగనే సాయంకాల మయినది.

ఆనాడు పూర్ణిమ సుధాకరుడు తన శుభ్రజ్యోత్స్నోత్తరీయమును జక్కగా వల్లెవాటువేసికొనెను. అదిజూచి గగనకాంత ఆనంద విలసిత మయ్యెను. ఆధవళచంద్రికలలో జడజగత్తు ప్రకృతిక్రీడా రంగమున ద్విగుణితశోభను బొందియుండెను. విద్యుత్సుందరివాని సభవనో

ద్యానము బహువిధపరిమళ పుష్పవిలసితమై సుగంధమును నలుగడల వ్యాపింపజేయుచు, అత్యంత మనోహరముగా నుండెను. భవనోపరిభాగమున బడుచున్న చంద్రకిరణము లాశోభను మరింత యధికము సేయుచుండెను. ఒక వైపునుండి యుద్యానవనమునందలి గోరింతచెట్లు తమ కుసుమ సౌరభముల వెదజల్లుచు విద్యుత్సుందరిని మరింత వ్యాకుల పరుచుచుండెను.

రాత్రి యధికమగుచున్న కొలదియు, విద్యుత్సుందరీ హృదయోద్వేగముకూడ హెచ్చువెరుగుచుండెను. శిశిరునిరాక కనుక్షణము నిరీక్షించుచుండెను. ఏచప్పుడు వినబడినను దటాలున ఉలికిపడిలేచుచు శిశిరుడే వచ్చుచున్నాడనుకొని ఇటునటు దదేకదృష్టితో జూచుచుండెను. ఆభవనమువైపు ఏ గుఱ్ఱపుబండినిగాని, ఏమనుష్యుడుగాని, వచ్చుచుండుట జూచినంతనే దూరమునుండియే ఔగాము లరయక "తప్పక శిశిరుడే వచ్చుచున్నా"డని నిశ్చయించుకొనుచుండెను.

ఎనిమిదిగంటల రాత్రి గడచినది. చంద్రుని శీతలకిరణములు కిటికీలలోనుండి మధురామృతమును గదిలో గురియసాగినవి. ఆపండు వెన్నెలలో మైమరచిన వెన్నెలపులుగులు చెట్లకొమ్మలనుండి గావించుచున్న అవ్యక్తమధురగానములకు విద్యుత్తు తహతహపడుచుండెను. పడకకుర్చీ వసారాలోనికీడ్చుకొని దానిపై గూరుచుండెను. ఆ వినిర్మలాచ్చంద్రికలలో నామె సౌందర్యశోభా తరంగము లుప్పొంగి వెల్లివిరియుచుండెను. ఉండియుండి యామెమనస్సు భావిసుఖకల్పనాతరంగితము కాసాగెను. "శిశిరబాబుగారువచ్చి ఏమందురు ? నేనేమి ప్రత్యుత్తర మొసంగెదను ?" అని అనేకవిధముల దలంచుచుండెను. వెంటనే యామెహృదయమున నిట్టిసంశయము లుదయింపసాగినవి. "ఒకవేళ శిశిరబాబుగారు రారేమో ! ఉత్తరము వ్రాసినపిమ్మట నీతని హృదయ

భావములు మార్పుజెందినవేమో ! ఎవ్వరేని యాతనికి బోధించి యా యూహ మరలించిరేమో !" అనుకొనుచుండగనే అకస్మాత్తుగా నెవరో వచ్చుచున్న యడుగులచప్పుడామెకు వినబడి యులికిపడినది. కనులు తెరచిచూచుసరికి తన ప్రేమమూర్తి—తన మనోహరుడు—తన ప్రాణాధిక ప్రియుడు శిశిరబాబు దరహాసితవదనుడై వచ్చుచుండుట గాంచెను. ఇంకేమున్నది ! విద్యుత్తు తటాలున కుర్చీపైనుండి లేచి అట్టె స్వర్ణప్రతిమ వలె నిలబడిపోయినది.

వసారాలో నడుగిడినతోడనే శిశిరుడు విద్యుత్తునుగాంచి రెండు చేతులను జాచి సంపూర్ణముగ నామెశరీరమును దన బాహుపాశమున బంధింప ప్రయత్నించెను. కాని "మహాశయా ! ఇట గూరుచుండుడు" అని మందహాస మొనరించుచు తన సహజమధుర ముగ్ధభాషణముల విద్యుత్తు ఆతనిని వారించెను. ఇంతుల హృదయారాటము కాంతుడు చెంతకు రానంతకేకదా ?

శిశిరుడు నవ్వి "ఇంక కూర్చుండుట కవకాశము లేదు. లజ్జా వినయములకిది సమయముకాదు. నే నంతదూరమునుండి నా ఋణమును దీర్చించుకొనుటకేకదా వచ్చియున్నాను ? దానింగైకొనక రెండవపని యేదియు జేయజాలను" అనెను.

విద్యుత్తు తలవంచుకొని "నాసంపర్గచే మీ విశుద్ధచరిత్రమునెడల గొప్ప దోషారోపణము కలిగినది. దేశమందెల్లయెడల మీ నిందా నినాదములే వినవచ్చుచున్నవి. కావున మీరు నన్ను విడిచివేయుడు నేను నీచురాలను అపవిత్రురాలను" అన్నది.

శిశిరుడు తటాలున విద్యుత్తును దనబాహుపాశమున బంధించి "నీవు కమలినివి— నీవు హిమకరశుభ్రజ్యోత్స్నవు—నీవు లక్ష్మీ సమాన పరమపవిత్రురాలవు— నేనును ప్రపంచపరిత్యక్తుడనై యున్నాను. నీవును

నావలెనున్నావు. నీ హృదయమున నేనును నా హృదయమున నీవును చిరకాలమునుండి నివసించుచున్నాము. కావున మన సమ్మేళన మద్వితీయమైనది—ఆనందకారణమైనది. నే నిపుడు నీవు చెప్పెడి యాటంకములను వినుటకు వచ్చినవాడగాను. అదిగో ! బండిసిద్ధముగానున్నది. లెమ్మ !" అని చెప్పెను.

విద్యుత్తుహృదయమున ఆనందతరంగములు పొంగిపొంగి పొరల సాగెను. ప్రేమమయదృష్టుల నామె శిశిరునిపై బరపి "వంట సిద్ధమైనది. భోజనమునైన జేసెదరా !" అని లజ్జామధుర కంఠమున ననెను.

శిశిరుడు విద్యుత్సుందరీ ముఖారవిందమును ఎత్తి ముద్దిడుకొని "ప్రేయసీ ! ఈ యమృతమునెదుట తుచ్ఛమగు భోజనసామగ్రి యెవనికి గావలయును ?" అని అనెను.

లజ్జావినమితవదనయై విద్యుత్తు శిశిరుని విశాలవక్షమున దన ముఖమును దాచుకొనెను. ఆసమయముననే సిగ్గుమాలిన చంద్రుడు అడ్డువచ్చిన వృక్షశాఖలను దేమలించుకొనివచ్చి యా ప్రణయమూర్తుల జూడదొడగెను. వెన్నెలవులుగుల అస్పష్టమధురగానము ఆ ప్రదేశము నంతయును బ్రతిధ్వనింప జేయుచుండెను.

అంతలో వెలుపలనుండి "ఇచ్చట శిశిరబాబుగా రున్నారా ?" యని యెవ్వరో యడిగినధ్వని వినబడెను.

విద్యుత్తు తత్తరపాటున వసారాలోనికిబోయి నిలబడెను. శిశిరుడు చకితుడై "ఇది కాళిదాసుని కంఠధ్వనివలెనున్న"దని చెప్పెను.

"ప్రత్యుత్తరమైన నొసంగుటకు వీలుగానంతటి వ్యాపారాంతరమున శిశిరబాబుగారిపుడు నిమగ్నులై యున్నారు ?" అను ధ్వని మరల వినబడెను.

# అధ్యాయము—35

శిశిరుడచ్చోటనుండి లేచి, ముందునకు నడచి నవ్వుచు "ఎవరది! కాళిదాసా! ఇచ్చటికెట్లు వచ్చితివి! సోదరా! రమ్ము! లోనికిరమ్ము!" అని యనెను.

కాళిదాసు నవ్వుచు "ఓహో! కౌటుంబికపరిభాష యంతయు బట్టుపడిపోయెనే! నేను మీకు నిర్బంధపత్రము నొసంగుటకై నిన్నటి నుండియు నిట కుటీరమువేసికొనియుంటిని. మున్ముందు మీసహధర్మిణిని జూపింపుము!" అని యనెను.

శిశిరుడు నవ్వుచు గాళిదాసును వసారాలోనికి దీసికొనిపోయి విద్యుత్తువైపు జూపుచు—లబరపుచు, "ఈతడే నా పరమప్రియ బంధువగు కాళిదాసు—ఈమెయే నాప్రియతమ—సహధర్మిణి—విద్యుత్తు" అని నవ్వుచు బరస్పరపరిచయము గలిగించెను.

ఆనందలజ్జాభరావనతముఖియగు విద్యుత్తు పుష్పభరానతయగు మాలతీలలికవలె గాళిదాసునకు బ్రణామమొనర్చెను.

ఆమె నాశీర్వదించి కాళిదాసు సేవకునిబిలువగా వాడు మూడు పెట్టెలను దెచ్చెను. కాళిదాసు వానిని విద్యుత్తు ముందరనుంచి ఈ యానందోత్సవోపలక్ష్యమున నిదేయుపహారముగ నిటకు దీసికొని వచ్చితి"నని చెప్పెను.

విద్యుత్తు అత్యంతప్రసన్నభావముతో పెట్టెలను గైకొని దీపము దగ్గఱకుబోయి 'నాకొఱ కెవ్వరేమి పంపినారో' యని చూడదొడగెను.

శిశిరుడు కాళిదాసుని లోపలకు బిలుచుకొనిపోయి యుచితాసనమున గూర్చుండబెట్టి, యుపహారవస్తువుల జూచుటకొఱకు పరమోత్కంఠతో విద్యుత్సుందరీభుజముపై హస్తమునుంచి నిలబడెను.

అన్నిటికంటె మీద జందనతరునిర్మితమగు పేటిక యుండెను దానిపై సునయనీదేవిగారిపేరు వ్రాయబడియుండెను. దానిక్రింద ముఖమల్ చే గప్పబడిన యొక తోలుపెట్టె [Suit case] యున్నది దానిపై సంధ్యపేరు లిఖింపబడి యున్నది. దాని క్రింద సుందరమగు దంతపు బేటికయుండెను. దానిపై గాళిదాసుని నామ ముండెను. విద్యుత్తు ప్రసన్నచిత్తయై పెట్టెల గ్రమముగా దెరువదొడగెను.

"నీవు వివాహమాడ నంగీకరింపనే లేదుకదా ! నాని నేల దెరచు చున్నావు ? మూసివేయుము !" అని నవ్వుచు శిశిరుడు విద్యుత్తుతో ననెను.

విద్యుత్తు మాటాడక ఆనందముందుచు ఆ పేటికల దెరువ దొడగెను. అన్నింటికంటె ముందు సునయనీదేవిగారి నగలపెట్టెను దెరచెను. ఢక్కాలో చేయబడిన చిత్రపుబనిగల బంగారుకుంకుమ బరణియు, స్వర్ణాలంకార మొకటియు, గొంచెము లస్సుకయు, ఆశీర్వాద సూచకములగు రెండు మాటలును అందున్నవి.

"కల్యాణీ !

ఈ పాణిగ్రహణోత్సవోపహారము నీ సౌభాగ్య సింధూరమును జిరకాలము జ్యోతిఃపూర్ణముగ నొన రించుగాక ! నిన్ను భర్తృప్రియతమను గావించుగాక ! ఎల్లకాల మీ యానందము మీ దంపతుల కతయ మగుగాక !

మీ శ్రేయోభిలాషిణి

సునయని"

సంధ్య పంపినపెట్టె [Suit case] లో జక్కని బెనారస్ చీర యొకటియు, జరీపనులతో వెలయు నొక జత జాకెట్లును, ఒకజత వజ్రపు

దురాయీలును, ఒకజత ముత్యాలహారములును, ఒకజత వజ్రపు గమలములును, ఒకజత వజ్రనీలవిలసితములగు పైటపిన్నులును, ఒక జాబు నున్నవి.

"సఖీ ! విద్యుత్తూ !

నీముఖమునుజూడ నాకు మిక్కిలి లజ్జ వొడము చున్నది. లేనిచో నేనువచ్చి నాచేతులతో నిన్ను బెండ్లికూతుం గావించియే యుందును. ఈ నిరవధి కానందసమయమున నీవు నా యపరాధములనెల్ల నీ సహజోదార స్వభావమున మన్నింతు వను తలంపున నీ యల్పమగు ప్రేమోపహారమును నీకంపితిని. నాపక్షమున నీశృంగారమును మరదిగారు గావింపవలసినదని వారితో నామాటగా జెప్పుము.

భవదానందానందిత,
సంధ్య"

కాళిదాసుని పెట్టెలో సంపూర్ణముగ ముఖమల్ 'బైండు' చేసి స్వర్ణాక్షరములతో విద్యుత్తుపేరును, క్రింద శిశిరబాబుపేరును లిఖింప బడియున్న పుస్తకములున్నవి.

"తల్లీ, వదినె, కాళిదాసుల శుభకాంక్షాపూర్ణశీతల చంద్రికలు మా నలుగడల వ్యాపించియున్నవి. వీరి కారుణ్యమున మేము ప్రపంచ యాత్రను పరమసఫలతాపూర్వకముగ గమపగలుగుదుము" అని శిశిరు డానందోద్రేకమున ననెను.

విద్యుత్తు లేచి నిలబడి శిశిరకాళిదాసులపై జూమ్కుల సారాప దొడగెను. అపుడామె నయనములనుండి ఆనందప్రసన్నతా ముక్తా ఫలములు అశ్రుబిందురూపమున రాలుచుండెను.

వినిర్మలాకాశమునుండి కుముదబాంధవుడు నిజశుభ్రజ్యోత్స్నా కరముల నీ దంపతుల కాశీర్వాద మొనరించుచుండెను.

# అధ్యాయం—36

వేశ్యావివాహమును, అంతర్జాతీయ వివాహమును గలిసి ఆదర్శ ప్రాయమైన విద్యుచ్ఛిశిరుల కల్యాణవిధానమును వంగసమాచార పత్రికలన్నియు, వేనోళ్ల బ్రశంసించినవి. ఈ నూతన్న దంపతుల ఛాయా పటములను బ్రకటించినవి.

ఈ ప్రకటనములకు సంధ్యాసునయునులు మహానందభరితులైరి. రజతుడు తానొనరించిన యకార్యమునకు మిక్కిలి పశ్చాత్తాపమొంది, కుంది, శిశిరవిద్యుత్తులకు క్షమాపణపత్రము నంపుకొనెను. వనమాలి రజతునిచే దొలగింపబడి ఉభయభ్రష్టుడై తిరిగితిరిగి కొంతకాలమునకు మరల శిశిరునియొద్దకే చేరెనట.

సమాప్తము.